పదిహేడో జన్మదిన ప్రత్యేక సంచిక

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 17 సంచిక : 1 హైదరాబాద్ 210 జనవరి 2019 పేజీలు : 80 రూ. 25

- రాజ్యాంగ వ్యవస్థల విధ్వంసం
  - న్యాయ, దర్యాప్తు, ఆర్థిక, విద్యా వ్యవస్థలపై ఐదు ప్రత్యేక వ్యాసాలు
- తెలంగాణ ఎన్నికల ఫలితాల విశ్లేషణ
- ఢిల్లీలో కదంతొక్కిన రైతాంగం
- కశ్మీర్‌లో కాషాయ కుట్ర
- క్యూబన్ విప్లవ చరిత్రాత్మక గాథ
- మొక్కుబడి వాతావరణ ఒప్పందం

210 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

జనవరి 2019
సంపుటి : 17
సంచిక : 1

## పాఠకుల వీక్షణం

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ డిసెంబర్ సంచికలో వేసిన అప్పీల్‌కు స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థికసహాయం అందించినవారు సెక్రెటరీ, సత్యశోధక్ పాఠశాల, సిరికొండ, నిజామాబాద్ జిల్లా-రు. 1,000; గట్ల అశోక్, ఇన్సూరెన్స్ ప్రమోటర్, నిజామాబాద్-రు. 1,000; ఎం. రాఘవాచారి, మహబూబ్‌నగర్-రు. 1,000; తుర్లపాటి లక్ష్మి, విశ్రాంత ప్రధానోపాధ్యాయురాలు, నిజామాబాద్-రు. 1,000; శ్రేయోభిలాషి (ఉడుపి)-రు. 5,000, డి. సుబ్రహ్మణ్యం ఢిల్లీ - రు. 1,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

వీక్షణం గత సంచికలో కె. సజయ రాసిన 'ప్రజా ఉద్యమ గుండె చప్పుడు ధర్నా చౌక్' వ్యాసం బాగుంది. ఉద్యమాలతో సాధించిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్రంలో ఉద్యమ గొంతుక లేకుండా చేసేందుకు రాష్ట్ర తొలి సర్కారు తెరాస ప్రభుత్వం పూనుకుందన్న విషయం వివరంగా తెలిపారు. ఈ క్రమంలో ప్రజాస్వామ్య విలువలపై, భావవ్యక్తీకరణపై ప్రభుత్వం అవలంభిస్తున్న విధానాలనూ వివరించారు. ప్రభుత్వ వ్యతిరేకత పెరుగుతున్న క్రమంలో ధర్నా చౌక్‌ను ఎత్తివేయడంతో సర్కారు నిర్ణయానికి దీటుగా కార్యాచరణ రూపొందించి పోరాడటాన్ని స్ఫూర్తిగా తీసుకోవాల్సిందే. ధర్నా చౌక్ రద్దు తర్వాత కార్యాచరణ, పోలీసుల నిర్బంధం, ప్రభుత్వ కపట కుట్రలను చాలా వివరంగా తెలిపారు. అయితే వ్యాసం మొదటి పిట్టకథతోపాటు పలుచోట్ల అధిక వివరణ ఇస్తూ పొడిగించినట్టుగా అనిపించింది. ఎ నరసింహారెడ్డి రాసిన బ్రెజిల్ అధ్యక్షునిగా మితవాది బోల్సనారో వ్యాసం మంచి సమాచారాన్నందించింది.

**- మహేశ్**
కరీంనగర్

వీక్షణం డిసెంబర్ సంచికలో పటేల్ విగ్రహ రాజకీయాలు అనే వ్యాసాన్ని ప్రచురించారు. రచయితగాని, మీరుగాని ఈ కింద ప్రశ్నలకు జవాబు ప్రచురిస్తే కృతజ్ఞతలు. 1) కలకత్తాలో సిపిఎం ప్రభుత్వ సమయంలో కొన్ని శతాబ్దాల నుండి ధర్మతల స్ట్రీట్ అనే పేరును లెనిన్ సడక్‌గా ఎందుకు మార్చారు? 2) విజయవాడలో ప్రముఖమైన ఏలూరు రోడ్డు పేరును కారల్ మార్క్స్ రోడ్‌గా కమ్యూనిస్టుల అధీనంలో విజయవాడ కార్పొరేషన్ ఉన్నప్పుడు ఎందుకు మార్చారు? కారల్‌మార్క్స్ విగ్రహాన్ని ఎందుకు ప్రతిష్టించారు? 3) కమ్యూనిస్టులు పాలిస్తున్నప్పుడు సెయింట్ పీటర్స్‌బర్గ్‌ను లెనిన్‌గ్రాడ్‌గాను, ఓల్గాగ్రాడ్‌ను స్టాలిన్‌గ్రాడ్‌గాను పేర్లు పెట్టారు. కమ్యూనిస్టు ప్రభుత్వం పడిపోయిన తర్వాత రష్యన్ ప్రభుత్వం ఈ రెండు నగరాలకు తిరిగి పాత పేర్లను ఎందుకు పైకి తీసుకువచ్చారు? 4) కమ్యూనిస్టు చైనాలో రాజధాని బీజింగ్‌లో మావోసెటుంగ్ విగ్రహాన్ని ఎందుకు ప్రతిష్టించారు? 5) మొదటి కవరు పేజీలో లోపల కులనిర్మూలన పోరాట సమితి ప్రచురణలను ముద్రించారు. కులాలు పోతే ఏ ప్రాతిపతికన, ఏఏ సమూహాలకు ఏ పేర్లు పెట్టి రిజర్వేషన్లు కల్పిస్తారు? ఈ విషయాలను గురించి చదువరులకు జ్ఞానోదయం చేయిండి.

**- త్రిపురనేని హనుమాన్ చౌదరి**
సికిందరాబాద్

ఎన్నో సంవత్సరాలుగా వీక్షణం చదువుతున్న పాఠకుడిగా మీకు కొన్ని విషయాలు చెప్పాలనుకుంటున్నాను. అన్యథా భావించరని తలుస్తాను. గతంలో కంటె ఇప్పుడు వీక్షణంలో వస్తున్న వ్యాసాల స్థాయి బాగుంటున్నది. మా లాంటి పాఠకులు తెలుసుకోవలసిన ఎన్నో అంశాల మీద వ్యాసాలు వస్తున్నాయి. అయితే కొన్ని వ్యాసాల్లో చెప్పిందే చెప్పినట్టుగా కొన్ని వాక్యాలు, పేరాలు తీసేసినా అర్థం ఏమీ మారనట్టుగా ఉంటున్నాయి. రచయితలే అట్లా రాస్తున్నారో, మీరు సరిగ్గా ఎడిట్ చేయటం లేదో తెలియదు. అది అట్లా ఉంచి, దాదాపు ప్రతి వ్యాసంలోనూ అచ్చు తప్పులు చాలా ఉంటున్నాయి. పత్రిక స్థాయికి ఈ అచ్చుతప్పులు తగినవి కావు. దయచేసి శ్రద్ధగా చూడండి. ఇక డిసెంబర్ 2018 సంచికలో వచ్చిన ఒక వ్యాసం మీద నాకు అనిపించింది రాస్తున్నాను. అది ధర్నాచౌక్ గురించి వ్యాసం. అందులో ధర్నాచౌక్ పరిరక్షణ ఉద్యమానికి నాయకుల పేర్లు, సంఘీభావం తెలిపినవారి పేర్లు వరుసపెట్టి ఇరవై ముప్పై మంది పేర్లు రాసారు. ఆ పేర్లు లేకపోయినా వ్యాసానికి వచ్చిన లోపమేమీ ఉండేది కాదు. తప్పుగా రాస్తే క్షమించగలరు.

**- ఎ వీరస్వామి**
హుజురాబాద్

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*


**వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
**VEEKSHANAM**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411


**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

# ఫైనల్స్ మీద ఈ సెమీఫైనల్స్ ప్రభావం ఉంటుందా?

వీక్షణం

**2018** నవంబర్, డిసెంబర్‌లలో రాజస్థాన్, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్, మేఘాలయ, తెలంగాణలలో జరిగిన రాష్ట్ర శాసన సభ ఎన్నికలను పరిశీలకులందరూ 2019 మేలో జరగవలసిన లోకసభ సార్వత్రిక ఎన్నికలకు సన్నాహక ఎన్నికలుగా, జరగనున్న ఫైనల్ పోటీకి రంగం సిద్ధం చేసే సెమీఫైనల్ పోటీగా అభివర్ణిస్తున్నారు. ఆయా రాష్ట్రాల సమస్యలే ప్రధానంగా జరిగే రాష్ట్ర శాసనసభల ఎన్నికలు దేశవ్యాప్తంగా జరిగే లోకసభ ఎన్నికలకు సూచిక కాగలవా అనే విచికిత్స ఎలా ఉన్నా, కనీసం వోటర్ల మనోస్థితికి సంబంధించిన స్థూలమైన ధోరణులు ఈ ఎన్నికల్లో బైటపడే అవకాశం ఉంది. ఈ ఐదు రాష్ట్రాలలో అంతకు ముందు మూడు రాష్ట్రాల్లో అధికారంలో ఉండిన భారతీయ జనతా పార్టీ అన్ని స్థానాలనూ పోగొట్టుకుని తిరోగమన ధోరణిని చూపుతున్నది. అప్పటికి కేవలం మేఘాలయలో మాత్రమే అధికారంలో ఉండిన కాంగ్రెస్ దాన్ని పోగొట్టుకుంది గాని భాజపా నుంచి మూడు రాష్ట్రాల్లో అధికారాన్ని కైవసం చేసుకున్నది. మేఘాలయలో కాంగ్రెస్ ను ఓడించి మిజో నేషనల్ ఫ్రంట్ అధికారాన్ని చేపట్టినప్పటికీ అక్కడ లోకసభ నియోజకవర్గాలు రెండు (షిల్లాంగ్, తురా) మాత్రమే ఉండడం వల్ల 2019 ఫైనల్స్‌లో ఆ రాష్ట్రం పెద్దగా లెక్కలోకి రాకపోవచ్చు. తెలంగాణ శాసనసభను నిలుపుకున్న తెలంగాణ రాష్ట్ర సమితి కాంగ్రెసేతర, బిజెపియేతర ఫెడరల్ ఫ్రంట్ నిర్మించడం గురించి ఆలోచిస్తున్నది గనుక 16 స్థానాల తెలంగాణ 2019 ఫైనల్స్‌లో గణనీయమైన పాత్ర నిర్వహించవచ్చు.

అయితే దేశ రాజకీయ వాతావరణాన్ని, 2019 ఎన్నికల గెలుపు ఓటముల అవకాశాలను అంచనా వేసేటప్పుడు, మేఘాలయ, తెలంగాణ ఫలితాల కన్న ప్రాధాన్యత వహించేవి రాజస్థాన్, మధ్యప్రదేశ్, చత్తీస్ గడ్ ఫలితాలు. ఈ మూడు రాష్ట్రాలు కూడ భారతీయ జనతా పార్టీ కంచుకోటలుగా పేరుపడ్డవి. ఈ మూడు రాష్ట్రాలలో, రాజస్థాన్ లో 25, మధ్యప్రదేశ్‌లో 29, చత్తీస్‌గడ్‌లో 11 – మొత్తం 65 లోకసభ స్థానాలున్నాయి. వీటిలో 2014 ఎన్నికల్లో కేవలం మూడు – మధ్యప్రదేశ్ లో రెండు, చత్తీస్ గడ్ లో ఒకటి – మినహా 62 స్థానాలు భారతీయ జనతా పార్టీకే దక్కాయి. ఈ ధోరణే 2019లో కొనసాగితే భారతీయ జనతా పార్టీ ఈ మూడు రాష్ట్రాలలోనే 44 స్థానాలను పోగొట్టు కుంటుందని ఊహించవచ్చు.

2014 ఎన్నికల్లో 282 స్థానాలు సంపాదించి అఖండ విజయం సాధించిన భారతీయ జనతా పార్టీ ఐదు సంవత్సరాలు తిరగకుండానే తన కంచుకోటల్లోనే, తన ప్రభుత్వాలు కొనసాగుతున్న చోటనే ఇంత పరాజయాన్ని ఎందుకు చవి చూడవలసి వచ్చిందో, ఈ పరాజయం 2019కి సూచిక అవుతుందో కాదో పరిశీలించవలసి ఉంది. వీటిలో కూడ రాజస్థాన్ లో ప్రతి ఎన్నికల్లో అధికారపక్షాన్ని ఓడించి ప్రతిపక్షాన్ని గెలిపించే ఆనవాయితీ ఉంది గాని, మధ్యప్రదేశ్ లో రెండు పర్యాయాలు, చత్తీస్‌గడ్‌లో మూడు పర్యాయాలు గెలిచిన భారతీయ జనతా పార్టీ ఈసారి ఓటమి పాలు కావడం ఎందుకు జరిగిందో లోతుగా ఆలోచించ వలసి ఉంది. ఈ ఓటమికి స్థానిక కారణాల కన్న ఎక్కువగా భారతీయ జనతా పార్టీ విధానాల పట్ల దేశవ్యాప్తంగా పెల్లుబుకుతున్న వ్యతిరేకత, నిరసనలు కారణం కావచ్చు. గత ఎన్నికలకు ముందు ఇచ్చిన ఆకర్షణీయమైన నినాదాలు, విదేశీ అక్రమ నిలువలను దేశానికి రప్పించి ప్రతి పౌరుడి ఖాతాలో పదిహేను లక్షల రూపాయలు జమచేస్తాననే వాగ్దానం గాని, అభివృద్ధి నినాదం గాని, నిరుద్యోగాన్ని తగ్గిస్తాననే నినాదం గాని వాస్తవ రూపం ధరించలేదని దేశ ప్రజలందరికీ రుజువయింది. చేసిన వాగ్దానాలు అమలు కాకపోవడం ఒక ఎత్తయితే, ఈ నాలుగేళ్లలో కేంద్ర ప్రభుత్వం చేసిన పనులు మధ్యతరగతి బుద్ధిజీవులను మాత్రమే కాక సామాన్య ప్రజానీకాన్ని సైతం ఆలోచింపజేశాయి. స్వయంగా అనుభవించిన ఆర్థిక, సామాజిక ఇబ్బందుల ఫలితంగానే సామాన్య ప్రజానీకం భారతీయ జనతా పార్టీపై తమ కోపాన్ని వ్యక్తం చేశారు. పెద్ద నోట్ల రద్దు ప్రకటిత లక్ష్యమైన అవినీతి సొమ్మును వెనక్కి రప్పించలేదు సరిగదా సామాన్య ప్రజా జీవనం నడ్డి విరిచింది. రెండు సంవత్సరాలు గడిచిపోయినా ఆ దెబ్బ నుంచి తేరుకోని ప్రజానీకం అన్ని వర్గాలలోను ఉన్నారు. వారు బహుశా భారతీయ జనతా పార్టీకి పాఠం చెప్పగల అవకాశం వచ్చిందని అనుకుని ఉంటారు. ఆ పెద్దనోట్ల రద్దు దెబ్బ అలా ఉండగానే భారతీయ జనతాపార్టీ వడ్డించిన వస్తు, సేవల పన్ను (జిఎస్‌టి) అనే మరొక దెబ్బను ప్రజలు కాచుకోవలసి వచ్చింది. ఈ దెబ్బ ప్రభావం సామాన్య ప్రజానీకం మీద ధరల పెరుగుదల రూపంలో పడగా, చిన్న వ్యాపారస్తుల వర్గాన్ని కుదేలు చేసింది. సాధారణంగా భారతీయ జనతా పార్టీకి మద్దతు ఇచ్చే వర్గంగా ఉండిన ఈ వ్యాపార వర్గం తమ బతుకుతెరువు మీద దెబ్బతీసిన పార్టీని శిక్షించదలిచారు. ఈ రాష్ట్రాలలోని సామాన్య ప్రజానీకం ఎంతగా ఆలోచించారో తెలియదు గాని, ప్రచార సాధనాలలో వచ్చిన అవినీతి వార్తలు, కార్పొరేట్ అనుకూల విధానాల వార్తలు, దళితుల మీద, ముస్లింల మీద దాడుల వార్తలు, సంఘ్ పరివార్ అసహన హింస వార్తలు కనీసం అక్కడి బుద్ధిజీవుల మీద ప్రభావం వేసి ఉంటాయి. చత్తీస్ గడ్ లో అదనంగా అక్కడి ఆదివాసుల మీద భాజపా ప్రభుత్వం అమలు చేస్తున్న దమననీతి ప్రభావం చూపి ఉంటుంది.

భారతీయ జనతా పార్టీ ఓడిపోయి, కాంగ్రెస్ గెలిచినంతమాత్రాన ప్రజానుకూల పాలన వస్తుందని అనలేం. రెండు పాలకవర్గ కూటములలో ఏ కూటమికి అధికారం వచ్చినా ప్రజల స్థితి పెనం మీదనా, పొయ్యిలోనా అన్నట్టే ఉంటుంది. కాని హిందూ బ్రాహ్మణీయ ఫాసిస్టు పాలనను, అది కూడ నరేంద్ర మోడీ వంటి కరడుగట్టిన సంఘ్ నాయకుడి పాలనను, ఒక పర్యాయం చూసినతర్వాత ఎందరో పరిశీలకులు 'ఎవరు వచ్చినా సరే, వీళ్లు ఓడిపోతే చాలు' అని వ్యాఖ్యానిస్తున్నారు. అటువంటి వాళ్లు 2018 శాసనసభ ఎన్నికలు సెమీ ఫైనల్స్ అని, ఈ సెమీఫైనల్స్ ఫలితాలే ఫైనల్స్‌లో పునరావృతం అవుతాయని ఊహిస్తున్నారు, కావాలని ఆశిస్తున్నారు. రానున్న మూడు నాలుగు నెలల్లో దేశ వ్యాప్తంగా వేడెక్కనున్న ఎన్నికల వాతావరణం, ఇరు పక్షాల వ్యూహ ప్రతివ్యూహాలు ఆ ఫైనల్స్ ఫలితాలను ప్రభావితం చేస్తాయి. ప్రజా ప్రయోజనాలు, నిజమైన ప్రజాశక్తులు ఈ ఎన్నికల రాజకీయాలను ప్రభావితం చేయగలిగినంత బలంగా లేకపోవడమే విచారకరం. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# గెలిచినమంటె చేసిందంత మంచిదని కాదు!

అయ్యా కారు సార్లు, మళ్లొకసారి భారీ బహుమతి తోని గెల్చినమని పొంగిపోతండ్రా ఏంది, మురిసి ముక్కలైతండ్రా ఏంది? అట్ల గాదు నాయిన. అసలు గెలుస్తమా లేదా అనుకున్నది మీరే గద. వచ్చే ఏడు అయితే గెల్వమేమోనని ముందుగాల వోట్లు పెట్టిచ్చుకున్నది మీరేగద. ఇగ జూదు వంద, అగ జూదు నూట పది అనుకుంటనే, మీ పెగ్గెల మీద మీకే నమ్మిక లేనట్టు మళ్ల వేల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టింది మీరేగద. సారలు తాగబోయించింది మీరే గద. కొసాఖరికి సర్కారు నిలబెట్టనీకి సరిపోతయో లేదో అని చిన్న చిన్న పార్టీలను పిలిచి మాట ముచ్చట బెట్టింది మీరే గద. ఇప్పుడు ఏదో ఎటమటమై నాలుగు సీట్లు ఎక్కువ రాంగనే ఎగిరెగిరి పడుడు మంచిది గాదు. సరే, మాట కోసం జనమంత మీకే ఏసిండ్రనుకుందాం. మళ్ల మీకే సర్కారు ఒప్పజెప్పిండ్రనుకుందాం. దాని అర్థం ఏందన్నమాట? మీరు ఆ నాలుగేండ్లల్ల జేసిన తప్పుడు పనులన్ని బారా ఖూన్ మాఫ్ అన్నరని అనుకుంటాండ్రా ఏంది? ఇప్పుడు గెల్వంగనె మీరు ఆంధ్ర కాంట్రాక్టర్లకు దోచిపెట్టిందంత మాఫ్ అయిపోతాదయ్య? నేరెళ్లల ఉసికె లారీల కింద తొక్కి చంపిన మా అన్నదమ్ములు బతికి వస్తరానయ? మల్లన్నసాగర్ పేరు మీన మా బతుకులు ముంచిన కోపం చల్లార్తదానయ? మాలమాదిగోళ్లకు భూములు ఇస్తనని చెప్పి ఎగ్గొట్టింది మంచిదే అన్నట్టానయ? ఓపెన్ కాస్టులు తవ్వనే తవ్వ, బొందలగడ్డలు చెయ్యనే చెయ్య అని మాట మారిస్తిరి గద, ఇప్పుడు గెలిచిన్రంటె, రా బొందలగడ్డలు చెయ్యి అని మేం పిలిచి చెప్పినట్టా? వీపు మీద కొడితిరి, కడుపుమీద కొడితిరి, అయ్యో దెబ్బతగిలెరో అని ఏడుస్తనంటె, ఏడ్వటానికి గుడ కుదరదు అని ఏడ్చే జాగ, ధర్నా చౌకో, అదేందో మూసేస్తిరి. ఇప్పుడు గెలిచిన్రంటె అది మూసేసుడు మంచిదేనని మేం అన్నట్టా? అన్నేండ్లు మా పిల్లల కొలువుల కోసమె కొట్లాడ్తిమి. ఎక్కంగనె కొలువులు ఇస్తమంటిరి. నాలుగేండ్లాయె ఎక్కడి గొంగడి అక్కడ్నేనాయె. పిల్లగాండ్లు ఒర్లబట్టిరి. ఇప్పుడు గెల్చిన్రంటె, మేమే మాకు కొలువులేమొద్దు తియి, నువు నీ ఇష్టమొచ్చినప్పుడే ఇద్దువుగాని అని చెప్పినట్టా? చంద్రబాబు రాజ్జెంల, రాజశేఖర్రెడ్డి రాజ్జెంల కన్న ఎక్కువ నీ రాజ్జెంల పోలీసులు అరిగోస పెట్టబట్టిరి. గెలిపిచ్చినమంటె, మంచిది, మా పిల్లలను చంపు, మమ్ములను కొట్టిపిచ్చు అని నీకు ఇజాజత్ ఇచ్చినట్టా? ఆంధ్రోని మీద కొట్లాడెటప్పుడు ఎంత ముద్దుగ ఎన్ని మాటలు చెపితివి, ఒక్కటంటె ఒక్కటి చెయ్యకపోతివి. ఇప్పుడు గెలిపిచ్చినమంటె, మంచోనివి నాయిన, చెప్పిన మాట చెయ్యలె, నీ అంత అవ్వల్ దర్జ లేడు అని గొంగడి కప్పినట్టనుకుంటానవా, ఏంది? మారె, అది వేరు ఇది వేరు. అట్ల ఓట్లు పడంగనే చేసిందంత మంచేనని ఒప్పుకున్నట్టే అనుకుంటె ఆ యాభై ఎనిమిదేండ్లల్ల తెలంగాణను అరిగోస పెట్టినోళ్లే గెలిచిండ్రు గద, సర్కారు గట్టిండ్రు గద. మళ్ల అరిగోస పెట్టిండ్రు గద. మళ్ల గెలిచిండ్రు గద. దేశమంతట గుడ గంతే గద. అంటేందన్నమాట? ఓట్లల్ల గెలుసుడు, జనానికి మంచి జేసుడు ఒకటి కాదు. జనానికి చెడ్డ జేసినోడు గుడ ఓట్లల్ల గెలువొచ్చు. జనానికి మంచి జేసినోడు గుడ ఓట్లల్ల ఓడిపోవచ్చు. అందుకని, సారూ, గెలిచినమని ఉచ్చిలి పడకుండ్రి. ఇప్పటికైన మంది మీద గింతంత నెనరు చూపుండ్రి. ఆంధ్రోడి సర్కారు వద్దేవద్దు అని ఎందుకనుకున్నమో, మన తెలంగాణల మన రాజ్జెం అని ఎందుకన్నమో యాజ్జేసుకోండి. ఒక్కపారి తెలంగాణోళ్ల మన్సుల జొర్రి ఏమనుకుంటాండ్రో తెలుసుకోండి. చేయిదేమున్నది, ఓటు ఎట్లైన ఏస్తది, మన్సుల ఏమున్నదో తెల్వాలె గద... వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# కొత్త హైకోర్టు

రాష్ట్ర విభజన తర్వాత ఐదు సంవత్సరాలకు ఎట్టకేలకు హైకోర్టు విభజన జరిగి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఏర్పడుతున్నది. తమ రాష్ట్రంలోనే కొత్తగా హైకోర్టు ఏర్పడుతున్నందుకు, ప్రతి వ్యాజ్యం కోసమూ వందల కిలోమీటర్లు ప్రయాణించి హైదరాబాద్ రావలసిన అవసరం తప్పుతున్నందుకు ఆంధ్రప్రదేశ్ ప్రజలకు అభినందనలు చెపుతూనే ఈ నిర్ణయం అమలు తీరులోని అవకతవకలను ప్రశ్నించవలసి ఉంది. రాష్ట్రం వేరయినప్పుడు కొత్త హైకోర్టు రావడం అనివార్యమైన అవసరమే. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ చట్టం 2014లో హైకోర్టు విభజన గురించి ప్రస్తావన ఉన్నమాట నిజమే. ఈ పని ఎప్పుడో ఒకసారి జరుగుతుందని ప్రజలు, న్యాయవాదులు, న్యాయమూర్తులు ఊహిస్తున్న మాట నిజమే. కాని ఉరమని పిడుగులాగ ఈ నిర్ణయం ఇంత హఠాత్తుగా ఎందుకు జారీ అయిందని మాత్రం ప్రశ్నించక తప్పదు. ఐదు సంవత్సరాలుగా ఏ ఏర్పాట్లు జరిగాయని, భవనాలు, మౌలిక సౌకర్యాలు ఎంతవరకు పూర్తయ్యాయని ఇంత హఠాత్తు నిర్ణయం తీసుకున్నారు? ఈ వ్యవహారంలో అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కేవలం ప్రజల సెంటిమెంటు మీద ఆడుకోవడానికి చూపిన ఉత్సాహాన్ని, హైకోర్టు ఏర్పాటుకు సన్నాహక చర్యలు చేపట్టడంలో చూపెట్టలేదని చెప్పక తప్పదు. రాజధాని కోస్తాలో ఏర్పాటయింది గనుక, హైకోర్టు ఇటు రాయలసీమలో గాని, అటు ఉత్తరాంధ్రలో గాని ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం ప్రతిపాదించి ఉండవలసింది. శ్రీబాగ్ ఒడంబడిక స్ఫూర్తి గాని, 1953-56 ఆంధ్ర రాష్ట్ర స్ఫూర్తి గాని అదే. కాని మొదటి నుంచీ కృష్ణా గుంటూరు రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాలు మాత్రమే లక్ష్యంగా పనిచేస్తున్న చంద్రబాబు నాయుడు హైకోర్టును కూడ ఆ ప్రాంతంలోనే నెలకొల్పాలని నిర్ణయించారు. పోనీ, అక్కడయినా త్వరితగతిన మౌలిక సౌకర్యాలు, భవనాలు ఏర్పాటు చేశారా అంటే అదీ లేదు. ప్రస్తుతం ఉమ్మడి హైకోర్టులో కొనసాగుతున్న కేసుల్లో విభజన తర్వాత అక్కడికి వెళ్లేవెన్ని, ఇక్కడ ఉండేవెన్ని, ఆంధ్రప్రదేశ్ కు కేటాయించబడిన న్యాయమూర్తుల దగ్గర తెలంగాణ కేసులు ఉంటే, తెలంగాణకు కేటాయించబడిన న్యాయమూర్తుల దగ్గర ఆంధ్రప్రదేశ్ కేసులు ఉంటే వాటిని ఎలా పరిష్కరిస్తారు, ఉమ్మడి హైకోర్టు సిబ్బందిని ఎలా విభజిస్తారు వంటి కీలకమైన సమస్యల పరిష్కారం నాలుగైదు రోజుల్లో జరిగిపోయేది కాదు. నిజానికి ఇటువంటి సమస్యల పరిష్కారానికి ఒక నిపుణుల కమిటీని నియమించవలసి ఉండింది. అలాగే రెండు ప్రాంతాలకు సంబంధించిన కేసులు చేస్తున్న న్యాయవాదులు ఈ రెండు హైకోర్టుల మధ్య తమ కాలాన్ని విభజించుకోవడం తక్షణమే సాధ్యమయ్యేది కాదు. మరొక వైపు తెలంగాణ ప్రభుత్వం, తెలంగాణ వాదులు మాటిమాటికీ సెంటిమెంటు రెచ్చగొట్టడానికి హైకోర్టు విభజన అంశాన్ని లేవనెత్తుతూ వచ్చారు. ఈ వ్యవహారాన్ని పర్యవేక్షించవలసిన, సామరస్యపూర్వక పరిష్కారం సూచించవలసిన కేంద్ర ప్రభుత్వం ఇన్నాళ్లూ మౌనంగా ఉండి, ఇప్పుడు రాజకీయ ఎత్తుగడల్లో భాగంగా హఠాత్తుగా గెజిట్ ప్రకటన విడుదల చేసింది. మొత్తం మీద ఈ చర్య ఊహిస్తున్నదే, చట్టబద్ధమైనదే అయినా, న్యాయబద్ధంగా, సాలోచనతో మాత్రం జరగడం లేదు. వీ

# ఫ్రాన్స్‌లో ఎల్లో వెస్ట్ ఉద్యమం

- బి. ఎస్. రాజు

అభివృద్ధి చెందిన దేశాల పట్టికలో ఫ్రాన్స్ పైవరసలో ఉందనేది అందరికీ తెలిసిన విషయమే! అంత గొప్పగా అభివృద్ధి సాధించిన ఈ దేశంలోనే నవంబర్ 17 నుండి నెలరోజులుగా లక్షలాది ప్రజలు వీధుల్లోకి వచ్చారు. ఎల్లో వెస్ట్ ఉద్యమం పేరున నిరసన బాట పట్టారు. డీజిల్ ఇంధనంపై ఫ్రెంచ్ ప్రభుత్వం విధించిన పన్నుల భారానికి వ్యతిరేకంగా నవంబర్ మాసంలో మొదలైన ఈ ఉద్యమం క్రమేణా అన్ని వర్గాల ప్రజలను తాకింది. కార్మికులు, చిరు వ్యాపారులు, ఉద్యోగులు, నిరుద్యోగ, చిరుద్యోగ యువత, కాలేజీ విద్యార్థులు, ఆఖరికి బడిపిల్లలు కూడా ఈ 'ఎల్లో వెస్ట్' ఉద్యమంలో పెద్ద ఎత్తున పాల్గొన్నారు. ధనిక వర్గం కొమ్ముకాస్తున్న ఇమ్మానుయేల్ మెకరాన్ ప్రభుత్వ ప్రజావ్యతిరేక సరళీకరణ విధానాలతో ఆర్థిక ఇక్కట్లకు గురై విసుగు చెందిన ప్రజలు పాలక ప్రభుత్వంతో అమీ-తుమీ తేల్చుకోవాలనుకున్నారు.

పనిచేసే సమయాల్లో శ్రామికులు మెరిసే ఎల్లో వెస్ట్ ధరించడమనేది ఓ భద్రతా నియమం. పనిచేసేవారు పనిలో నిమగ్నమై ఉన్నారనే స్పష్టమైన హెచ్చరికను ఈ మెరుపు తొడుగులు తెలియ చేస్తాయి. ప్రభుత్వ విధానాలను మేము వ్యతిరేకిస్తున్నామనే హెచ్చరికను జారీచేస్తూ తమ ఉద్యమ ప్రతీకగా ఈ పసుపు మెరుపు తొడుగులను ఫ్రెంచ్ ప్రజలు ఎన్నుకున్నారు. ఫ్రాన్స్ ప్రభుత్వం బొగ్గు ఉద్గారాలను తగ్గించాలని, తద్వారా పర్యావరణ పరిరక్షణకు పెద్ద పీట వేయాలని నిర్ణయించి ఆ దిశగా పయనించాలంటే పెట్రోలియం ఉత్పత్తుల వినియోగం తగ్గాలని భావించింది. ఈ ఉత్పత్తుల వినియోగం తగ్గాలంటే వీటిపై అధిక పన్నులు విధించడం ఒక మార్గంగా ఎంచుకుని డీజిల్ ఇంధనంపై 20 శాతం పన్నులు పెంచింది. ఫ్రాన్స్‌లో గత ఏడాదిలో మోటారు వాహన ఇంధనాల ధరలు విపరీతంగా పెరిగి సాధారణ ప్రజలపై మోయలేని భారం పడింది. సహజంగానే ఈ ప్రభుత్వ చర్య ఇప్పటికే జీవన వ్యయం పెరిగిపోయి, ఆదాయాలు తగ్గుతూ సతమతమౌతున్న ప్రజల ఆగ్రహంపై ఆజ్యం పోసినట్లయింది.

ఫ్రాన్స్ ప్రజలు ఇప్పుడు తమకు ఉత్పన్నమౌతున్న సమస్యలకు మూల కారణాలపై దృష్టి సారించి ప్రశ్నలు లేవనెత్తడం ఎల్లో వెస్ట్ ఉద్యమంలో మనం గమనించవచ్చు. పర్యావరణ కాలుష్యానికి మూలాలేమిటి? ఇది ఎవరి సృష్టి? పర్యావరణాన్ని నాశనంచేస్తూ లబ్ధిపొందుతున్నదెవరు? జీవనమే దుర్భరమౌతున్న సాధారణ శ్రామిక ప్రజలే ఎప్పుడూ ఎందుకు భారం మొయ్యాలి? ఎవరికోసం, ఎవరి సుఖాల కొరకై తమ జీవితాలను, జీవనాలను బలిపెట్టాలి? అనే మౌలిక ప్రశ్నలు ఇపుడు ఫ్రాన్స్ ప్రజలు వేస్తున్నప్పటికీ, ఈ ప్రశ్నలు మళ్లీ మళ్లీ, తిరిగి తిరిగి, మరిగి మరిగి సకల ప్రపంచ దేశాల్లో, అన్ని సమాజాల్లో పెట్టుబడి దోపిడీ అంతమయ్యేవరకూ ఎగిసిపడక మానవు, వెల్లువెత్తక మానవు.

బహుశా ఈ ఎల్లో వెస్ట్ ఉద్యమం ప్రపంచమంతా మరో ప్యారిస్ కమ్యూన్ ఉద్యమానికి ఓ ముందు సూచిక కావచ్చు. పెట్టుబడికి ప్రమాద ఘంటిక కావచ్చు. ఈ ఎల్లో వెస్ట్ ఉద్యమం ఒక ప్రత్యేకమైన సైద్ధాంతిక గొడుగు కింద గాని, ఓ పటిష్ట నాయకత్వం కింద గాని జరగనప్పటికీ అది సంపన్నులకు వ్యతిరేకంగా, వారి కొమ్ముకాసే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఫ్రాన్స్ సకల శ్రామిక, బుద్ధిజీవి వర్గాల ప్రజలను ఆకట్టుకుంది.

21వ శతాబ్దపు ప్రత్యేకతగా ఇటువంటి ఉద్యమాల మాల మనకు దర్శన మిస్తున్నది. ప్రపంచ శ్రామికులు, బుద్ధిజీవులు తమ చేజారిన 20వ శతాబ్దపు ఫలాల నుండి, ఆ ఫలాలను పోగొట్టుకున్న చారిత్రిక వైఫల్యాల నుండి ఏమి నేర్చుకుంటారో ముందుముందు కాలమే చెబుతుంది. కొత్త తరాలే చరిత్రను మేలు మలుపు తిప్పుతాయి. వీ





❖ **లోక మలహరి నవలలు** – జెగ్గని యిద్దె, సంఘము – సంపాదకురాలు డా. సరోజ వింజామర – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 114 పేజీలు, 1/8 డెమీ, రు. 45



❖ **మాదిరెడ్డి సులోచన కథలు** – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 290 పేజీలు, 1/8 డెమీ, రు. 120



❖ **గంగాపుర మాహాత్మ్యము** – గ్రంథకర్త శ్రీ రెడ్రెడ్డి మల్లారెడ్డి దేశాయి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 174 పేజీలు, 1/8 డెమీ, రు. 60

పై మూడు ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాడమి, కళాభవన్, రవీంద్ర భారతి ప్రాంగణం, హైదరాబాద్ – 500 004



❖ **ప్రశ్నలు అలాగే ఉన్నాయి** – వ్యాసాలు – ఎం. రాఘవాచారి – పాలమూరు అధ్యయన వేదిక ప్రచురణలు – 184 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: ఎం. రాఘవాచారి, ఫ్లాట్ నెం. 41, శాంతి చంద్రిక, ఇ. నెం. 3-148, బాలాజీ నగర్, మహబూబ్‌నగర్ – 509001, ఫోన్: 9490703857



❖ **బందీ** – గుగి వా థియాంగో – స్వేచ్ఛా సాహితి ప్రచురణ – 288 పేజీలు, 1/8 డెమీ, రు. 200



❖ **మట్టికాళ్ల మహారాక్షసి** – గుగి వా థియాంగో – స్వేచ్ఛా సాహితి ప్రచురణ – 324 పేజీలు, 1/8 డెమీ, రు. 200



❖ **మాటిగరి** – గుగి వా థియాంగో – స్వేచ్ఛా సాహితి ప్రచురణ – 154 పేజీలు, 1/8 డెమీ, రు. 120



❖ **చీకటి లోకంలో తొంబై రోజులు** – నగరి బాబయ్య – స్వేచ్ఛా సాహితి ప్రచురణ – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 60

పై నాలుగు ప్రతులకు: వీక్షణం, జి1, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029. ఫోన్: 040-6684349 అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **మూగవాని పిల్లనగ్రోవి** – డా. కేశవరెడ్డి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 118 పేజీలు, 1/8 డెమీ, రు. 75



❖ **ఝాన్సీ రాణి లక్ష్మీబాయి** – తల్లాప్రగడ సత్యనారాయణ మూర్తి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 60



❖ **సిలికాన్ లోయ సాక్షిగా** – కథలు – డా. కె. గీత – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 130 పేజీలు, 1/8 డెమీ, రు. 90



❖ **దళిత బ్రాహ్మణుడు** – కథలు – మరాఠీ మూలం డా. శరణకుమార్ లింబాళె – తెలుగు అనువాదం రంగనాథ రామచంద్రరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 130 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **రష్యన్ విప్లవం ప్రజల చరిత్ర** – నీల్ ఫాక్నర్ – తెలుగు ముక్తవరం పార్థసారధి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 166 పేజీలు, 1/8 డెమీ, రు. 120,

పై ఐదు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జిఎస్ఐ పోస్ట్, హైదరాబాద్-500068, ఫోన్స్ – 29884453/54



❖ **ఒక సాయంత్రం త్వరగా ఇల్లు చేరినప్పుడు** – కథలు – పలమనేరు బాలాజి – స్వచ్ఛత ప్రచురణలు – 158 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: శ్రీమతి గండికోట వారిజ, ఇ. నెం. 6-219, గుడియాత్తం రోడ్డు, పలమనేరు, చిత్తూరు జిల్లా – 518 408
ఫోన్ : 9440995010



❖ **మట్టిరంగు బొమ్మలు** – కవిత్వం – సిరికి స్వామినాయుడు – స్నేహకళా సాహితి ప్రచురణ – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: సిరికి స్వామినాయుడు, ఈస్ట్ రోడ్, 3వ లైన్, బంగారమ్మ కాలనీ, బెలగాం, పార్వతీపురం, విజయనగరం – 535501, ఆంధ్రప్రదేశ్



❖ **దావత్** – తెలంగాణ కథ – 2017 – సంపాదకులు సంగిశెట్టి శ్రీనివాస్, డా. వెల్దండి శ్రీధర్ – తెలంగాణ రచయితల సంఘం ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: సంగిశెట్టి శ్రీనివాస్, ఫ్లాట్ నెం. 212, నందనవనం అపార్ట్‌మెంట్, అత్తాపూర్, మెహదిపట్నం, హైదరాబాద్-500048
ఫోన్: 9849220321

# తెలంగాణ ఫలితాలను ఎలా అర్థం చేసుకోవాలి?

***తెలంగాణ రాష్ట్ర సమితి అఖండ విజయం పూర్తిగా ప్రజాభిమతమే అనడానికి వీలు లేదనీ, కొంత ప్రజానుకూలతతో పాటు ఇతర కారణాలు కూడ ఉన్నాయనీ విశ్లేషిస్తున్నారు* రాజవరం పార్థసారథి**

తెలంగాణ ఎన్నికల ఫలితాలు – గట్టెక్కగలదా అనుకున్న తెలంగాణ రాష్ట్ర సమితి 119 స్థానాలకు 88 స్థానాలు సాధించిన భారీ విజయం, విజయానికి చేరువలో ఉన్నదనిపించిన మహాకూటమి 21 స్థానాలతో సరిపెట్టుకోవలసి రావడం – పరిశీలకులనూ, ప్రతిపక్ష పార్టీలనూ మాత్రమే కాక అధికారపక్షాన్ని కూడ ఆశ్చర్యపరిచాయి. తనకు ఇంత విజయం చేకూరుతుందని అధికారపక్షమూ అనుకోలేదు, తమకు ఇంత ఘోరపరాజయం సంభవిస్తుందని ప్రతిపక్ష కూటమీ అనుకోలేదు. ప్రతిపక్ష కూటమిలో విడిగా చూస్తే గత ఎన్నికలలో 21 స్థానాలు సాధించిన కాంగ్రెస్ ఈసారి 19కి దిగజారింది, గత ఎన్నికల్లో 15 స్థానాలు సాధించిన తెలుగుదేశం పార్టీ ఈసారి 2 స్థానాలకు పడిపోయింది. గత ఎన్నికల్లో చెరి ఒక స్థానం సాధించిన సిపిఐ, సిపిఐ(ఎం)లు ఒక్కస్థానాన్నీ గెల్చుకోలేక పోయాయి. మరొకవైపు గతంలో ఐదు స్థానాలు సాధించిన భారతీయ జనతా పార్టీ ఈసారి ఒక్క స్థానంతో ఆగిపోయింది. ఒక్క ఎంఐఎంకి తప్ప మిగిలిన ఏ ఒక్క పార్టీకీ ఆశించిన, ఊహించిన కనీస ఫలితాలు కూడ రాలేదు. తెరాస మాత్రమే 2014లో సాధించిన 63 స్థానాలకు ఈసారి అదనంగా మరొక 25 స్థానాలు కలుపుకున్నది.

సాధారణంగా ఈ సందర్భంలో వోట్‌షేర్ (మొత్తం వోట్లలో ఆ పార్టీ సాధించిన వాటా) అనే గణాంకం గురించి మాట్లాడుతుంటారు గాని వాస్తవంగా అది అంత విశ్వసనీయమైన ప్రమాణం కాదు. ఒక పార్టీ అన్ని స్థానాలకూ పోటీ చేసినప్పుడు, అన్ని స్థానాలలోనూ గెలుచుకున్న వోట్లను లెక్కించి, మొత్తం వోట్లలో ఆ నిష్పత్తిని లెక్కించినప్పుడే ఈ వోట్‌షేర్‌కు అర్థం ఉంటుంది. అలా కాక, అన్ని స్థానాలకూ పోటీ చేయని పార్టీకి పోటీ చేసిన స్థానాలలో మాత్రమే వచ్చిన వోట్లను మొత్తం రాష్ట్రపు వోట్లలో నిష్పత్తిగా లెక్కించడం అర్థరహితం. కాని ఈ అర్థరహిత గణాంకంతోనే ఎన్నికల విశ్లేషకులందరూ కొన్ని పార్టీల వోట్‌షేర్ ఒక్క శాతం అనో, రెండు శాతం అనో విశ్లేషిస్తుంటారు.

ఈ గణాంకానికి ఉన్న ఈ ప్రధాన పరిమితిని గుర్తిస్తూనే, ఎన్నికల్లో ఒక పార్టీ మొత్తంగా ఎన్ని వోట్లు, ఎంత ప్రజాభిమానం చూరగొన్నదన డానికి మరొక నమ్మదగిన సూచిక ఏదీ లేదు గనుక దాన్ని పరిగణనలోకి తీసుకోక తప్పదు. అలా చూసినప్పుడు 2014 ఎన్నికల్లో వోట్‌షేర్ తెలంగాణ రాష్ట్ర సమితికి 34.3 శాతం, కాంగ్రెస్ కు 25.2 శాతం, తెలుగుదేశం 14.7 శాతం, భారతీయ జనతాపార్టీ 7.1 శాతం, ఎంఐఎంకు 3.8 శాతం, సిపిఐ(ఎం)కు 1.6 శాతం, సిపిఐకి 0.9 శాతం ఉండిందని, అది 2018 ఎన్నికల్లో తెరాసకు 46.9 శాతం, కాంగ్రెస్‌కు 28.4 శాతం, తెలుగుదేశం పార్టీకి 3.5 శాతం, భాజపాకు 7.1 శాతం, ఎంఐఎంకు 2.7 శాతం, సిపిఐ(ఎం)కు 0.4 శాతం, సిపిఐకి 0.4 శాతంగా నమోదయిందని గణాంకాలు చెపుతున్నాయి. ఈ లెక్కన తెరాస వోట్‌షేర్ 12.6 శాతం పెరిగింది. కాంగ్రెస్ వోట్‌షేర్ 3.2 శాతం పెరిగింది. తెలుగుదేశం పార్టీ వోట్‌షేర్ గణనీయంగా 11.2 శాతం తగ్గింది. భారతీయ జనతాపార్టీ ఒక్కటే తన వోట్‌షేర్‌ను యథాతథంగా నిలబెట్టుకోగా, ఎంఐఎం, సిపిఐ, సిపిఐ (ఎం)లు తమ వోట్‌షేర్‌లో చెప్పుకోదగిన తరుగుదలను చూపాయి.

ఈ ఫలితాలకు కారణాలేమిటనే విశ్లేషణలు ఆయా పార్టీలలోను, పరిశీలకులలోను పెద్ద ఎత్తునే జరుగుతున్నాయి. ఈ పార్లమెంటరీ ఎన్నికలలో ఎవరు గెలిచి, ఎవరు ఓడినా ప్రజలకు ఒరగబోయేది ఏమీ లేదు. ఎవరు గెలిచినా అమలు జరపబోయేది కార్పొరేట్లకు అనుకూలమైన, సంపన్నులకు అనుకూలమైన ప్రజా వ్యతిరేక పాలన మాత్రమే. కాని ఎవరు ఎందుకు ఎట్లా గెలిచారో, ఆ గెలుపుకూ, ప్రత్యర్థుల ఓటమికీ దారితీసిన ప్రత్యక్ష, పరోక్ష కారణాలేమిటో అన్వేషించడం, మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యపు బోలుతనాన్ని అర్థం చేసుకోవడానికి అవసరం.

నాలుగున్నరేళ్ల తెలంగాణ రాష్ట్ర సమితి పాలన తర్వాత కూడ తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ లక్ష్యాలలో అత్యధికం అందరాని దూరంలో ఉండిపోయాయని, ఆ పాలన పట్ల ప్రజలలో అసంతృప్తి పెరుగుతున్నదని, సాధారణ పరిశీలకులకు మాత్రమే కాక, తెరాస అధినాయకులకూ, స్థానిక నాయకులకూ కూడ కొంతకాలం కిందనే తెలిసి వచ్చింది. ఆ అసంతృప్తిని ఇంకా ఎక్కువకాలం కొనసాగనిస్తే, పెరగనిస్తే, శాసనసభ ఎన్నికలు కూడ లోకసభ ఎన్నికలతో పాటు కలిసివస్తే, ఓటమి అవకాశాలు మరింతగా పెరుగుతాయనే భయ సందేహాలతోనే తెరాస శాసనసభను రద్దు చేసి, ముందస్తు ఎన్నికలకు వెళ్లింది. అంటే, తెలంగాణ రాష్ట్ర సమితికి తన గెలుపు గురించి మొదటి నుంచీ కూడ అనుమానం ఉంది. తాము వంద స్థానాలో, నూట ఐదు స్థానాలో గెలవబోతున్నామని సర్వేలు చెప్పాయని ఊదర కొడుతూ ప్రత్యర్థులను భయపెట్టడానికి ప్రగల్భాలు పలికినప్పటికీ, క్రమక్రమంగా ఆ అంకెను 80కీ, 70కీ తగ్గిస్తూ వచ్చారంటేనే తాము చెపుతున్న మాట మీద తమకే నమ్మకం కుదరలేదని అర్థమవుతుంది. తెలంగాణ భావోద్వేగాలు, ఉద్యమ ఉధృతి బలంగా ఉండిన 2014లోనే 63 స్థానాలు మాత్రమే గెలుచుకోగలిగిన తెరాస, ఆ భావోద్వేగాలు బలహీనపడిన, వివిధ వర్గాలలో అసంతృప్తి పెరిగిన ప్రస్తుత ఎన్నికల్లో ఆ మాత్రమైనా సాధించగలదా అని లోపలా బయటా ఎన్నో సందేహాలు చెలరేగాయి. చివరికి ప్రభుత్వం స్థాపించడానికి కావలసిన కనీస ఆధిక్యత 60 స్థానాలైనా వస్తాయా రావా అనే సందేహంతోనే, తెరాస అగ్రనాయకులు

అవసరమైతే సహాయపడమని ఎంఐఎంను అడుగుతూ వచ్చారు. భాజపాతో లోపాయకారీ ఒప్పందాలకు దిగారు. ఇంకా లెక్కింపు ప్రక్రియ ప్రారంభం కాకముందే ఎంఐఎం నాయకుడు అసదుద్దీన్ ఒవైసీతో మంతనాలు జరిపేదాకా ఈ అనుమానాలు, ప్రయత్నాలు సాగుతూనే వచ్చాయి. ఇలా ఒకవైపు రాజకీయ ఎత్తుగడల ప్రయత్నాలు చేస్తూనే, మరొకవైపు ప్రజా అసంతృప్తినీ, ప్రతికూల ప్రభావాలన్నిటినీ అధిగమించి ఎన్నికలలో గెలుపు సాధించడానికి, మళ్లీ ఒకసారి భావోద్వేగాలను రెచ్చగొట్టడానికి అన్ని రకాల అక్రమ ప్రయత్నాలు కూడ చేస్తూ వచ్చారు. ప్రస్తుత గెలుపుకు కారణాలలో కొంత భాగం ప్రజల్లో తెరాస పట్ల ఉన్న భ్రమలు, అనుకూలత కాగా, అధికభాగం ఆ అక్రమ ప్రయత్నాల ఫలితమే.

అందువల్ల ఈ ఎన్నికల గెలుపుకు ప్రజాభిమతమనో, ప్రజల ఇష్టపూర్వక, స్వేచ్ఛాయుత ఎంపిక అనో, తెలంగాణ రాష్ట్ర సమితి పాలనా విధానాలకు ప్రజల ఆమోదమనో అర్థం చెప్పడం పూర్తి వాస్తవం కాజాలదు. ఈ గెలుపుకు దారితీసిన పరిణామాలన్నిటినీ నిశితంగా, విమర్శనాత్మకంగా పరిశీలించినప్పుడు మాత్రమే దాని కారణాలు తెలుతాయి.

ప్రస్తుతం వచ్చినంతటి భారీ స్థాయి విజయానికి తగినంతగా కాకపోయినా కొంతవరకైనా తెరాస పట్ల ప్రజల్లో అనుకూల భావనలు, భ్రమలు ఉన్నాయి. నీటిపారుదల పథకాల గురించి, నిరంతర విద్యుత్తు సరఫరా గురించి ప్రభుత్వం చేసిన ప్రచారాన్ని ప్రజల్లో కొన్ని సమూహాలైనా యథాతథంగా నమ్మాయి, ఆమోదించాయి. అలాగే రైతుబంధు, రైతుబీమా వంటి పథకాల మీద ప్రజల్లో కొన్ని సమూహాల్లో ఉండిన ప్రతికూలత కన్న ఎక్కువగానో, సమానంగానో మరికొన్ని సమూహాల్లో అనుకూలత ఉండింది. పెన్షన్లు, కళ్యాణలక్ష్మి, షాదీ ముబారక్, బతుకమ్మ చీరలు, కెసిఆర్ కిట్, గొర్రెల పంపిణీ, చేపల పంపిణీ వంటి పథకాలు ఆయా సమూహాల ప్రజల్లో తప్పనిసరిగా ఆకర్షణ కలిగించాయి. తెలంగాణ ఆత్మాభిమానాన్ని, సంస్కృతీ సాహిత్యాలను నిలబెట్టడానికి అవసరమైనంతగా కాకపోయినా తొలిప్రయత్నాలైనా కొన్ని జరిగాయని బుద్ధిజీవులలో ఒక అభిప్రాయం ఏర్పడింది. తెలంగాణ ఉద్యమ చైతన్య వ్యాప్తిలో కీలకవ్యక్తులుగా నిలిచినవారిలో అత్యధికులు ఈ ప్రభుత్వ విధానాలను సమర్థిస్తూ ప్రజల్లో తెరాస పట్ల అనుకూలతను వ్యాపింపజేశారు. ఈ అంశాలన్నీ తెరాస గెలుపుకు సానుకూలంగా సహకరించాయి.

అయితే ఇటువంటి సానుకూల వోట్ మాత్రమే ఇంతటి విజయాన్ని సాధించి ఉండగలదా అనేది అనుమానమే. ఈ సానుకూల వోటుకు ఇతర అంశాలు కూడ తోడు కావడం వల్లనే మొత్తంగా తెరాస సాధించిన వోట్ల సంఖ్య, స్థానాల సంఖ్య పెరిగింది.

చట్టబద్ధంగా తటస్థంగా వ్యవహరించవలసిన ఎన్నికల సంఘం, పోలీసు వ్యవస్థ చట్టవ్యతిరేకంగా తెరాసకు అనుకూలంగా వ్యవహరించడం ఆ ఇతర అంశాలలో ప్రధానమైనది. అలాగే ఈ ఎన్నికల్లో అధికారపక్షం విపరీతంగా వెదజల్లిన డబ్బు, మద్యం ప్రధాన పాత్ర వహించాయి. ప్రత్యేకంగా చంద్రబాబు నాయుడు ఎన్నికల ప్రచారానికి వచ్చిన తర్వాత మళ్లీ ఒకసారి రెచ్చగొట్టిన తెలంగాణ సెంటిమెంట్ కూడ ఈ ఎన్నికల్లో తెరాసకు అనుకూలంగా ఎక్కువగానే పని చేసింది. ప్రభుత్వ వ్యతిరేక వోటును, ఆయా సామాజిక వర్గాల వోటును తన ప్రయోజనాలకు అనుగుణంగా చీల్చడానికి తెరాస చేసిన ప్రయత్నం కూడ కీలకపాత్ర వహించింది. సూక్ష్మస్థాయిలో బూత్ మేనేజిమెంట్, పోలింగ్ మేనేజిమెంట్ ద్వారా అనుకూల, ప్రతికూల వోట్లపై తెరాస జరిపిన లావాదేవీలు కొంతమేరకు పనిచేశాయి. ప్రతిపక్షాల వైపు నుంచి చూస్తే ప్రజల్లో ఉన్న ప్రభుత్వ వ్యతిరేకతను పూర్తిగా వాడుకోలేకపోయిన, వోటుగా మార్చుకోలేకపోయిన అసమర్థత, అశక్తత, అభ్యర్థులను నిర్ణయించడంలో తాత్సారం, నాయకత్వ లేమి, అవసరమైన ఆర్థిక వనరుల లేమి వంటి కారణాలు కూడ తెరాస గెలుపుకు దోహదపడ్డాయి. ఇవి కాకుండా ఇతర రహస్య, లోపాయకారీ ఒప్పందాలు, బెదిరింపులు, డబ్బుల లావాదేవీలు కూడ ఉండవచ్చు.

ఈ ఎన్నికలలో ప్రధానంగా ఎన్నికల సంఘం, రాష్ట్ర పోలీసు వ్యవస్థ మొదటినుంచి చివరివరకూ తెలంగాణ రాష్ట్ర సమితికి అనుకూలంగా పనిచేశాయి. రాజ్యాంగ వ్యవస్థల తటస్థత అనేది సాధారణంగా ప్రజల ప్రయోజనాలను కాపాడడంగా ఏమీ ఉండదు, పాలకవర్గ ముఠాల మధ్య సమానదూరం పాటించడంగా మాత్రమే ఉంటుంది. కాని ఆ పాలకవర్గ ముఠాల మధ్య తటస్థత, సమానదూరం అనే కనీస ప్రజాస్వామిక విలువలను కూడ పక్కనపెట్టి ఈ ఎన్నికల్లో ఎన్నికల సంఘం, పోలీసులు బహిరంగంగా తెలంగాణ రాష్ట్ర సమితికి అనుకూల వైఖరి, సహకరించే వైఖరి తీసుకున్నారు. ఎన్నికల జాబితా తయారీలో జరిగిన లొసుగులతో, లక్షలాది వోటర్ల పేర్లు తొలగించడంతో, అర్హులైన లక్షలాది మంది కొత్త వోటర్ల పేర్లు నమోదు చేయకుండానే ఎన్నికలకు వెళ్లడంతో ఈ కార్యక్రమం ప్రారంభమయింది. ఈ అవకతవకలను సరిదిద్దడానికి అవకాశం ఉండిన న్యాయవ్యవస్థ కూడ తన బాధ్యతను నిర్వర్తించలేదు. చివరికి పోలింగ్ జరిగిన రోజున ఎందరో అర్హులైన వోటర్లు వోటు వేయకుండానే వెనక్కి తిరగవలసి వచ్చింది. అధికారుల దగ్గర ఉన్న వోటర్ లిస్టుకూ వోటర్ల దగ్గర ఉన్న వోటర్ ఐడెంటిటీ కార్డుకూ పొంతన కుదరలేదు. ఇది కేవలం సాంకేతిక సమస్య మాత్రమే కాదని, వోటర్ల తొలగింపు, వోటర్ల నమోదు తిరస్కరణ ఉద్దేశపూర్వకంగా, కొన్ని సమూహాలకు వోటు హక్కు తిరస్కరించడానికే జరిగిందని వచ్చిన ఆరోపణలను పూర్తిగా కొట్టివేయడానికి వీలు లేదు.

ఎన్నికల సంఘం అధికారులు పక్షపాత వైఖరి తీసుకున్నారనడానికి నిదర్శనంగా ఒక చట్టవ్యతిరేక పనిని ప్రతిపక్ష నాయకులూ కార్యకర్తలూ చేస్తే అభ్యంతరం చెపుతూ, ఆంక్షలు విధిస్తూ, కేసు నమోదు చేస్తూ, అదే పని తెరాస నాయకులూ కార్యకర్తలూ చేస్తే చూసీ చూడనట్టు ఊరుకున్నారు. డబ్బు సరఫరా చేస్తున్న వాహనాలను అడ్డుకోవడం, డబ్బు స్వాధీనం చేసుకుని, కేసు నమోదు చేయడం ప్రతిపక్షాల విషయంలో వర్తింపజేసినట్టుగా పాలకపక్షానికి వర్తింపజేయలేదు. చట్టాన్ని అమలు చేయడంలో సమన్యాయం పాటించలేదు. అధికారపక్షం, ఆపద్ధర్మ ప్రభుత్వంగా, పరిమిత అధికారాలతో ఉండవలసినప్పటికీ, పూర్తి అధికారం చలాయించింది. అలా చలాయించడానికి ఎన్నికల సంఘం అధికారులు, పోలీసు అధికారులు సహకరించారు. తన అభ్యర్థులకు, వోటర్లకు పంచడానికి తెరాస అధినాయకత్వం లేదా కాంట్రాక్టర్లు సరఫరా చేస్తున్న డబ్బు ప్రెస్ స్టిక్కర్లు ఉన్న వాహనాల్లో, పోలీసు వాహనాల్లో కూడ వెళ్లిందని, ఆ సమాచారం ఇచ్చినప్పటికీ ఎన్నికల సంఘం ఎటువంటి చర్యా తీసుకోలేదని ఆరోపణలు వచ్చాయి. ప్రతిపక్ష నాయకులకూ అభ్యర్థులకూ సంబంధించిన డబ్బునేమో ఎక్కడ పడితే

అక్కడ పట్టుకుని, జప్తు చేసిన ఎన్నికల సంఘం అధికారులు, ఎక్కడైనా ఒకచోట పొరపాటున తెలంగాణ రాష్ట్ర సమితి నాయకుల, అభ్యర్థుల డబ్బు పట్టుకున్నప్పుడు మాత్రం దాన్ని వెంటనే సక్రమమైన ధనమే అని ధ్రువీకరించి వెనక్కి ఇచ్చేశారని కూడ ఆరోపణలున్నాయి.

ఇక పోలింగ్ జరిగిన డిసెంబర్ 7న ఎన్నికల సంఘం ప్రకటనలు అత్యంత అవిశ్వసనీయంగా, అనుమానాస్పదంగా ఉన్నాయి. మధ్యాహ్నం మూడు, నాలుగు గంటలవరకూ పోలింగ్ మందకొడిగా జరిగిందని, ఎక్కడా 50 శాతం వోట్లు కూడ పోల్ కాలేదని స్వతంత్ర పరిశీలకులు, ప్రచారసాధనాలు చెపుతూ వచ్చిన సమాచారాన్ని ఎన్నికల సంఘం అధికారులు కూడ ధ్రువీకరించారు. చివరి గంటలో మరొక ఐదారు శాతం వోట్లు పోలయ్యాయని పోలింగ్ ముగియగానే ప్రకటించారు. కాని చివరి ప్రకటనల్లో హఠాత్తుగా పదిహేను, ఇరవై శాతం వోట్లు అదనంగా చేరాయి. వేరువేరు పోలింగ్ స్టేషన్ల నుంచి సమాచారం అందడంలో జాప్యం వల్ల ఎప్పుడైనా ఈ అంకెల్లో నాలుగైదు శాతం తేడా ఉంటుంది. కాని ఏకంగా ఇరవై శాతం తేడా ఉన్నదంటే అది అనుమానాస్పదమే. రెండు ఉదాహరణలు చెప్పాలంటే, కొడంగల్ నియోజకవర్గంలో మధ్యాహ్నం మూడింటికి 56.3 శాతం వోట్లు పోలయ్యాయి. తర్వాత రెండు గంటల్లో, పోలింగ్ ముగిసే సమయానికి అది మరొక 5 శాతం పోలై, 61 శాతానికి చేరింది. కాని చివరికి ఆ నియోజకవర్గంలో 81 శాతం వోట్లు పోలయ్యాయని ఎన్నికల సంఘం ప్రకటించింది. అలాగే మంచిర్యాల నియోజకవర్గంలో మధ్యాహ్నం నాలుగింటికి 54.7 శాతం పోలయ్యాయి, ఐదింటికి 65 శాతం పోలయ్యాయి. చివరికి 73 శాతం పోలయ్యాయని ఎన్నికల సంఘం ప్రకటించింది.

ఇక ఎలక్ట్రానిక్ వోటింగ్ మెషిన్ (ఇవిఎం) లలో నమోదయ్యే వోట్లను తారుమారు చేసే అవకాశం ఉందని ఎందరు ఎన్ని అనుమానాలు వ్యక్తం చేసినా, ఎన్నికల సంఘం ఆ అనుమానాలన్నిటినీ కొట్టివేసింది. కాని చివరికి చూస్తే, ఆ అనుమానాలను బలపరిచే విధంగా ఎన్నోచోట్ల ఇవిఎంలలో పోలయిన వోట్ల సంఖ్యకూ, లెక్కింపులో తేలిన వోట్ల సంఖ్యకూ తేడా కనబడింది. ఇవిఎంలలో పోలయిన వోట్లకూ, వీవీపాట్ లో పడిన చీటీలకూ పొంతన ఉండాలి. కాని ఎన్నోచోట్ల ఆ రెంటి మధ్య గణనీయమైన తేడా ఉంది. చట్టప్రకారం వీవీపాట్ లను సురక్షితంగా భద్రపరచవలసి ఉండగా ఎన్నో చోట్ల వీవీపాట్ ల సీళ్లు ఊడిపోయి ఉండడం, వీవీపాట్ లోపల ఉండవలసిన చీటీలు బైట ఉండడం జరిగింది. ఇవిఎంల తారుమారు మీద వచ్చిన అనుమానాలనూ ఆరోపణలనూ నివృత్తి చేయడానికి కనీస ప్రయత్నం కూడ అధికారులవైపు నుంచి జరగలేదు.

ఇవిఎంలలో ఒకరికి వోటు వేస్తే, మరొకరికి వోటు వేసినట్టు నమోదు చేయవచ్చునని 2009లో ఒక టివి చానల్‌లో ఐటి నిపుణులు ప్రయోగాత్మకంగా చూపితే, దాని మీద వ్యాఖ్యానిస్తూ అప్పుడు ప్రతిపక్ష నాయకుడుగా ఉండిన కె చంద్రశేఖరరావు, అది చాల చిన్నపని అని, అంతకన్న పెద్ద ఎత్తున, ఉపగ్రహాల కదలికలను భూమి మీది నుంచి శాసిస్తున్నట్టుగా, ఇవిఎంలను మార్చవచ్చునని అన్నారు. ఇప్పుడు అటువంటిది ఏమైనా జరిగిందా అని అనుమానాలు వ్యక్తమైనప్పుడు, జరగలేదని, జరగడానికి అవకాశం లేదని పారదర్శకంగా, నిష్పాక్షికంగా రుజువు చేయడం ఎన్నికల సంఘం వంటి రాజ్యాంగ వ్యవస్థ బాధ్యత. కాని వారు ఆ బాధ్యతను నెరవేర్చడంలో విఫలమయ్యారు. ఏయే పోలింగ్ కేంద్రాలలో, ఏయే బూత్‌లలో ఇవిఎంలు ఇలా పోలయిన వోట్ల సంఖ్య కన్న ఎక్కువ వోట్లు లెక్కించాయో ప్రతిపక్ష అభ్యర్థులు, నాయకులు నిర్దిష్టంగా, సోదాహరణంగా చూపినప్పుడు కూడ ఎన్నికల సంఘం నిర్లక్ష్యపూరితమైన సమాధానాలే ఇచ్చింది.

ఇక ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో గాని, గత నాలుగున్నర సంవత్సరాల తెలంగాణలో గాని పోలీసులు రాజ్యాంగాతీత, చట్టాతీత శక్తిగా మారిపోయారని అందరికీ తెలిసిందే. ప్రజలు స్వేచ్ఛగా, ఇష్టపూర్వకంగా వోట్ల ద్వారా తమ అభిమతం తెలిపితే, ఆ అభిమతంలో ఆధిక్యతను బట్టి ఒక రాజకీయ పార్టీ అధికారానికి వచ్చి ప్రభుత్వాన్ని ఏర్పరుస్తుందనీ, అలా ఏర్పడిన ప్రభుత్వపు చట్టబద్ధ పాలనను, రాజ్యాంగబద్ధంగా అమలు చేసే అనేకానేక అంగాలలో తమ వ్యవస్థ ఒకానొకటి మాత్రమే అనీ పోలీసులు ఎప్పుడో మరచిపోయారు. ప్రభుత్వమంటే తామేననే అభిప్రాయంలో ఉన్నారు. ఎన్నికలను తామే శాసించవచ్చునని, రాజకీయ నాయకులను తమ అదుపులో పెట్టుకోవచ్చునని, భద్రత భయమూ బూచీ చూపి అధికార రాజకీయ నాయకులకూ ప్రజలకూ మధ్య దడి కట్టి, ప్రజలనుంచి వారిని దూరం చేయవచ్చునని, మొత్తం మీద ప్రజాస్వామిక రాజ్యంగా సాగవలసిన రాజ్యాన్ని పోలీసు రాజ్యంగా మార్చవచ్చునని పోలీసులు కనీసం ఐదు దశాబ్దాలుగా అనుకుంటున్నారు. ఆ చారిత్రక అనుభవం ఉన్న పోలీసులు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఎంతటి పోలీసు రాజ్యంలోనైనా అనుభవించినదానికన్న ఎక్కువ అధికారాన్ని, నిధులను గత నాలుగున్నరేళ్ల తెలంగాణలో అనుభవించారు. అందువల్ల తెరాస తిరిగి అధికారానికి రావడం అందరికన్న ఎక్కువగా తమకే, పోలీసు ప్రయోజనాలను నెరవేర్చడానికే అవసరమని వారనుకున్నారు. అందువల్ల తెరాస గెలుపుకోసం తమ శాయశక్తులా ప్రయత్నించారు. తెరాస ప్రచారంపై అమలు చేయని ఆంక్షలను, ఆటంకాలను ప్రతిపక్ష కార్యకర్తల ప్రచారంపై అమలు చేశారు. ఎన్నికల్లో అందరినీ నిలదీయమని ప్రచారం చేసిన ప్రజాసంఘాల కార్యకర్తలను అడ్డుకుని, వేధించారు. తెరాసకు వ్యతిరేకమైన, భిన్నమైన ప్రచారం జరగకుండా చూడడానికి ప్రయత్నించారు. ఎన్నికల ప్రచారంలో, ప్రక్రియలో తెరాసకోసం పనిచేశారని కూడ ఆరోపణలున్నాయి.

తమ అభివృద్ధి, సంక్షేమ విధానాలే తమ అఖండ విజయానికి కారణమని తెరాస నాయకులు పదేపదే చెప్పుకుంటున్నారు. ఆ మాటను వారు అక్షరాలా నిజమని నమ్మితే ఎన్నికల ప్రచారంలో భాగంగా కనీవినీ ఎరగని డబ్బు ఎందుకు పంపిణీ చేయవలసి వచ్చిందో వారే సంజాయిషీ ఇవ్వాలి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ చరిత్రలో, భారీ ఖర్చు జరిగిందని పేరు పడిన చీమకుర్తి వంటి నియోజకవర్గాలలో కూడ, పంపిణీ అయిన డబ్బు కంటె ఎక్కువ డబ్బును దాదాపు ప్రతి నియోజకవర్గంలోనూ తెరాస పంపిణీ చేసింది. వోటుకు వెయ్యి రూపాయల నుంచి ఐదు వేల రూపాయల వరకూ ముట్టజెప్పారని, ఒక్కొక్క అభ్యర్థికి పది కోట్ల నుంచి ఇరవై కోట్ల రూపాయల వరకూ ఇచ్చారని ప్రజల్లో వదంతులు చెలరేగుతున్నాయి. ఒక్క అధికార పక్షమే ఈ ఎన్నికల్లో పంచడానికి దాదాపు రెండువేల కోట్లు వెచ్చించిందని అనుమానాలున్నాయి. ఇటువంటి విషయాల్లో వాస్తవాలను రుజువు చేయడం సాధ్యం కాదు

గనుక జరిగినదానికీ వదంతికీ ఎంత తేడా ఉన్నదో చెప్పలేం. కాని విపరీతమైన డబ్బు పంపిణీ, మద్యం పంపిణీ జరిగాయనేది ప్రతి ఒక్కరికీ తెలిసిన, అనుభవంలోకి వచ్చిన విషయమే.

నిజానికి ఎన్నికల సమయంలో డబ్బుల పంపిణీ, మద్యం పంపిణీ, ఇతరేతర ప్రలోభాలు కల్పించడం గతంలో అన్ని ఎన్నికలలోను ఉన్నదే. దానికి తోడుగా, తెరాస ప్రభుత్వం నాలుగున్నర సంవత్సరాలలో, ప్రజాధనాన్ని, బడ్జెట్ కేటాయింపులను కూడ వాడుకుని సంక్షేమ పథకాల పేరుతో వోటర్లను ఆకర్షించే ప్రయత్నాలెన్నో చేసింది. అలా సంక్షేమ పథకాల పేరుతో నాలుగు సంవత్సరాలుగా ప్రజల వోట్లకు వేసిన ఆకర్షణల గాలాలకు ఇప్పుడు వోట్లు చిక్కాయి.

వాస్తవానికి ఆ పథకాలలో ప్రతి ఒక్కదానికీ ప్రజల్లో అనుకూలత ఎంత ఉండిందో ప్రతికూలత కూడ అంత ఉండింది. ఉదాహరణకు, పంట పెట్టుబడికి సాయం పేరుతో, దేశంలో ఎక్కడా లేని పథకం అనే ప్రగల్భాలతో ప్రవేశపెట్టిన రైతుబంధు నిజంగా పంటకు, పంట వేసేవారికి పెట్టుబడి ఇవ్వడంగా కాకుండా, వ్యవసాయంతో సంబంధం ఉన్నా లేకపోయినా, దూరప్రాంతాల్లో, విదేశాల్లో ఉన్నా, అసలు పంట వేయకపోయినా ఆ భూమి పట్టాదార్లకు అప్పనంగా అందించిన ప్రజాధన పథకంగా తయారయింది. అందువల్ల వాస్తవంగా పంటవేసిన కౌలుదార్లు, రాష్ట్ర రైతాంగ జనాభాలో కనీసం 30 శాతంగా ఉన్నవారు, ఈ పథకం పట్ల అసంతృప్తితో ఉన్నారు. అలాగే, ఒకటి రెండు ఎకరాలు ఉన్న చిన్న రైతులు కూడ స్వయంగా సాగుదార్లయినప్పటికీ, ఇది వేడినీళ్లకు చన్నీళ్లుగా ఉపయోగపడుతుందని భావించినప్పటికీ, ఈ పథకం పట్ల అసంతృప్తి వ్యక్తం చేశారు. తమ గ్రామాల్లో ఇటీవలి కాలంలో వందల ఎకరాలు కొని, వ్యవసాయం కూడ చేయకుండా, చుట్టూ కంచెవేసి పెట్టుకున్న భూస్వాములకు, రాజకీయ నాయకులకు, ఐఎఎస్, ఐపిఎస్ అధికారులకు ఈ పథకం కింద లక్షలాది రూపాయలు ముట్టాయని, ఆరుగాలం కష్టపడుతున్న తమకు దక్కినది పెరుగుతున్న ఉత్పత్తి కారకాల ఖర్చులో అతి చిన్న భాగాన్ని కూడ తీర్చలేదని వారన్నారు. ఇటువంటి తాము అడగని ఉచిత సహాయం బదులు తాము పండించిన పంటకు గిట్టుబాటు ధర ఇస్తే సరిపోతుందని వారన్నారు.

అలాగే డబుల్ బెడ్‌రూం ఇళ్లు, దళితులకు భూపంపిణీ, గొర్రెల పంపిణీ, చేపల పంపిణీ, బతుకమ్మ చీరలు వంటి అన్ని పథకాల వల్ల ఎంతో కొంత లబ్ధి చేకూరినప్పటికీ, గ్రామాల్లో గణనీయమైన లబ్ధిదారులు ఉన్నప్పటికీ, ఆ అన్ని పథకాల మీద కూడ అసంతృప్తులు, ఫిర్యాదులు, అవినీతి ఆరోపణలు ఉన్నాయి. బహుశా ఎటువంటి అసంతృప్తి లేని పథకాలు పెన్షన్లు, కళ్యాణలక్ష్మి, షాదీ ముబారక్ మాత్రమే కావచ్చు. ఏది ఏమైనా సామూహిక, సామాజిక అభివృద్ధి పథకాల స్థానంలో వ్యక్తిగత లబ్ధి చేకూర్చే పథకాలను, భవిష్యత్తు ఆదాయ వనరులను సృష్టించే పథకాల స్థానంలో వర్తమాన వినియోగపు ఖర్చులను ఇచ్చే పథకాలను తయారు చేసిన ఘనత, పాత తెలుగుదేశం, కాంగ్రెస్ విధానాలను కొనసాగించిన ఘనత తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వానిది. అంటే స్వతంత్ర పౌరులుగా ఉండవలసిన ప్రజలను ఆశ్రితులుగా, లబ్ధిదార్లుగా, తద్వారా అధికారపార్టీ అనుకూల వోటర్లుగా మార్చడంలో తెరాస ఘన విజయం సాధించింది.

అలా గణనీయమైన సంఖ్యలో లబ్ధిదారులు, వారిలో చెప్పుకోదగిన స్థాయిలో అసంతృప్తి ఉన్నప్పుడు అటు అధికారపక్షానికీ, ఇటు ప్రతిపక్షానికీ కూడ తమ వ్యూహాలను అమలు చేయడానికి అవకాశం పుష్కలంగా ఉన్నట్టే. ఇక్కడ అధికారపక్షం తన అవకాశాలను వాడుకున్నంత సమర్థంగా ప్రతిపక్షాలు తమ అవకాశాలను వాడుకోలేక పోయాయి. తన అవకాశాలను బలోపేతం చేసుకోవడానికి, అదనపు లాభాలు సంపాదించడానికి అధికారపక్షం చేతిలో ఎప్పుడైనా భావోద్వేగాలను, తెలంగాణ సెంటిమెంట్ ను రెచ్చగొట్టడమనే శక్తిమంతమైన అస్త్రం కూడ ఉంది. ముందస్తు ఎన్నికలకు సిద్ధపడినప్పటి నుంచీ ఆ అస్త్రాన్ని సానపెడుతూ వచ్చిన తెరాసకు ఒక అనుకోని అవకాశాన్ని అయాచితంగా ప్రతిపక్షాలే అందించాయి. వోట్‌షేర్ లెక్కలను బట్టి కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల వోట్ షేర్లు కలిస్తే తెరాసను ఓడించగలమని వ్యూహరచన చేయడం దానికదిగా ఒక ఎన్నికల ఎత్తుగడే కావచ్చు.

తెలుగుదేశం పార్టీ పట్ల తెలంగాణవాదుల్లో వ్యతిరేకత ఉన్నప్పటికీ, 2014 గాలిలోనే ఆ పార్టీ 14.7 శాతం వోట్లను సాధించగలిగిందంటే ఆ మేరకు దానికి తెలంగాణలో స్థానం ఉన్నట్టే. అయితే రెండు పార్టీలకు విడివిడిగా వచ్చిన వోట్లు, ఆ రెండు పార్టీల కలయికకు యథాతథంగా పడకపోవచ్చుననే అంచనాను అంగీకరించినప్పటికీ, ఆ రెండు పార్టీల కలయికను తప్పు పట్టవలసినది లేదు. కాని ఆ కూటమి తరఫున చంద్రబాబు నాయుడును ప్రచారానికి తీసుకురావడం తెరాసకు అయాచిత వరంగా మారింది. అది చూపి తెరాస మరొకసారి తెలంగాణ సెంటిమెంట్ రెచ్చగొట్టడానికి అవకాశం వచ్చింది. అప్పటివరకూ తెరాస పట్ల అసంతృప్తితో ఉన్నవారు కూడ చంద్రబాబు నాయుడు రాకతో తెరాస సమర్థకులయ్యారు. చంద్రబాబు రాకపోయి ఉంటే కాంగ్రెస్ కు, కూటమికి పడగలిగి ఉండిన వోట్లలో ఐదారు శాతమైనా వారికి దూరమయ్యాయి.

ఇలా తమను ఓడించే ఆయుధం, అయాచిత అవకాశం తామే తెరాస చేతికి అందించడం మాత్రమే కాక, ప్రతిపక్షాలు ఇతరంగా కూడ తమ అశక్తతను, అసమర్థతను చూపుకున్నాయి. ప్రభుత్వ విధానాలలోని ప్రజావ్యతిరేకమైన అంశాల పట్ల నాలుగున్నర సంవత్సరాలలో అత్యధికభాగం మాట్లాడకుండా ఉండి, హఠాత్తుగా ఎన్నికల ముందరే కళ్లు తెరిచినట్టు మాట్లాడడం వల్ల వారి విశ్వసనీయత దెబ్బతిన్నది. వారి పాలనలలో కూడ ఇటువంటి అక్రమాలే జరిగాయి గదా అనే ప్రశ్నకు వారి దగ్గర జవాబు, సంజాయిషీ లేకపోవడం తెరాసకు కలిసివచ్చింది. తెరాస ఉద్యమ ఆకాంక్షలను గాని, ఎన్నికల వాగ్దానాలను గాని అమలు చేయలేదనే విమర్శను ప్రతిపక్షాలు ఎక్కుపెట్టినప్పుడు, అవి అమలు చేయకపోవడానికి ఎదురైన అడ్డంకులుగా అధికారపక్షం చూపిన వాటిని ప్రజలు నమ్మే స్థితి ఉండింది.

అనివార్యమైన కారణాల వల్లనే అధికారపక్షం ఆ హామీలు అమలు చేయలేదని ప్రజలు భావించి నప్పుడు, ఆ ఉల్లంఘన అనివార్యమైనదేమీ కాదని, ఉద్దేశపూర్వకమైనదనీ ప్రతిపక్షాలు గట్టిగా చెప్పి నిరూపించలేక పోయాయి. సెప్టెంబర్ లో అధికారపక్షం తన అభ్యర్థులను ప్రకటించగా, ఆ అభ్యర్థులలో అత్యధికుల మీద ప్రజల్లో వ్యతిరేకత ఉండగా, ఆ వ్యతిరేకతను సంఘటితం చేసి వోట్లుగా మార్చుకునే ప్రత్యర్థిని, తమ అభ్యర్థిని ఖరారు చేయడానికి ప్రతిపక్షాలు రెండున్నర నెలలు, నవంబర్ మూడో వారం దాకా తాత్సారం చేశాయి. అప్పటి శాసనసభ్యుల మీద,

# ఎన్నికల ఫలితాల్లో ప్రజామోదమెంత?

***ఎన్నికల్లో ప్రతిసారీ పేదరికాన్ని, భావోద్వేగాలను రెచ్చగొట్టి మెజారిటీ ప్రజల ఆమోదం లేకుండానే పాలిస్తున్న తీరు ప్రజాస్వామ్యానికి సూచికేనా అని ప్రశ్నిస్తున్నారు* వై. రామచంద్రం**

ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 11న వచ్చాయి. ఇవి వచ్చే ఏడాది జరగబోయే పార్లమెంట్ ఎన్నికలను ప్రభావితం చేస్తాయన్నది చూడాల్సి ఉంది. ఈ ఎన్నికలకు ముందు పార్టీలు, ప్రైవేట్ సంస్థలు నిర్వహించిన సర్వేలు వెల్లడించిన అంచనాకు ఒకటి రెండు రాష్ట్రాల్లో కొంత తేడా వచ్చినా మొత్తంగా ఊహించిన ఫలితాలే వచ్చాయి. ఒక్క తెలంగాణలో అధికారంలో ఉన్న పార్టీ మళ్లీ అధికారంలోకి వచ్చింది. బి.జె.పి. పాలిత రాష్ట్రాలైన ఛత్తీస్‌గఢ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లో అధికారం కోల్పోయి కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. మిజోరంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ ఓడిపోయి మిజో నేషనల్ ఫ్రంట్ అధికారం లోకి వచ్చింది. ఈ ఐదు రాష్ట్రాల్లో కూడా అన్ని పార్టీలు పూర్తిస్థాయి (ఎన్నికల సంఘం లెక్కల ప్రకారం) మెజారిటీ సాధించాయి.

**మిజోరం**

40 అసెంబ్లీ స్థానాలున్న మిజోరంలో మిజో నేషనల్ ఫ్రంట్ (ఎంఎన్ఎఫ్) 26 స్థానాలు గెలుచుకోగా కాంగ్రెస్ 5 స్థానాలకే పరిమిత మైంది. పది సంవత్సరాలుగా అధికారంలో ఉన్న కాంగ్రెస్‌ను ఓడించి ఎంఎన్ఎఫ్ అధికారంలోకి వచ్చింది. దీంతో కాంగ్రెస్ అధికారంలో ఉన్న ఒకే ఒక్క రాష్ట్రాన్ని కూడా కోల్పోయింది. 1987లో ప్రత్యేక రాష్ట్రంగా మిజోరం ఏర్పడినప్పటి నుండి ఒకసారి అధికారంలోకి వచ్చిన పార్టీ తిరిగి అధికారంలోకి వస్తున్న చరిత్ర ఉంది. గత పది సంవత్సరా లుగా అధికారంలో ఉన్న కాంగ్రెస్ విధానాల పట్ల ప్రజల్లో వ్యతిరేకత ఉంది. మిజోరం స్థానిక తెగల ప్రత్యేక డిమాండ్లను నెరవేర్చడంలో వైఫల్యం, కాంగ్రెస్ పాలనాకాలంలో ముఖ్యమంత్రే అవినీతికి పాల్పడడం, ఇప్పుడు వీస్తున్న ప్రాంతీయ పార్టీల గాలి, అధికార యంత్రాంగం కూడా సహకరించకపోయేంత ఊబిలో కూరుకుపోవడంతో కాంగ్రెస్ ఓటమికి దారితీసింది.

**రాజస్థాన్**

రాజస్థాన్‌లో 200 అసెంబ్లీ స్థానాలుండగా 199 స్థానాల్లో ఎన్నికలు జరిగాయి. అందులో కాంగ్రెస్-99 స్థానాల్లో, బిజెపి-73 స్థానాల్లో గెలుపొందాయి. ఇండిపెండెంట్లు 13 స్థానాల్లో గెలుపొందారు. ఇతరులు మిగతా స్థానాల్లో గెలుపొందారు. అత్యధిక స్థానాలున్న కాంగ్రెస్ ఇండిపెండెంట్ల మద్దతుతో కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. ప్రతీసారి ఇక్కడి ప్రజలు ఇతర పార్టీలు లేకపోవడంతో అధికారంలో ఉన్న పార్టీని మార్చి మరో పార్టీకి అధికారం కట్టబెడుతున్నారు. దీనికి తోడు రాష్ట్రంలో, కేంద్రంలో ఒకే పార్టీ అధికారంలో ఉండి అవలంభించిన విధానాల వల్ల కూడా ఇక్కడ బిజెపి ఓడిపోయింది.

**ఛత్తీస్‌గఢ్**

ఛత్తీస్‌గఢ్‌లో మొత్తం 90 స్థానాలకు జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ 68 స్థానాలు గెలుచుకోగా బిజెపి 15 స్థానాలకే పరిమితమైంది. అజిత్‌జోగి, మాయవతి కూటమికి 6 స్థానాలు వచ్చాయి. కాంగ్రెస్ స్పష్టమైన మెజారిటీ సాధించి అధికారంలోకి వచ్చింది. మధ్యప్రదేశ్ నుంచి విడిపోయి ఆవిర్భవించిన ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలో 15 ఏళ్లుగా బిజెపి అధికారంలో ఉంది. ప్రభుత్వ వ్యతిరేకత వల్ల మరో బలమైన ప్రత్యర్థి పార్టీలు లేకపోవడంతో ఇక్కడ బలంగా ఉన్న కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది.

**మధ్యప్రదేశ్**

మధ్యప్రదేశ్‌లో మొత్తం 230 స్థానాలుండగా కాంగ్రెస్ 114 స్థానాలు, బిజెపి 109 స్థానాలు, బిఎస్‌పి 2 స్థానాలు, ఇతరులు 5 స్థానాల్లో గెలుపొందారు. కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి ఒక స్థానం తక్కువవడంతో ఆ స్థానాన్ని కాంగ్రెస్ పార్టీకే చెంది ఇండిపెండెట్ల

అధికారపక్షం మీద, మొత్తంగా ప్రభుత్వం మీద ఉన్న అసంతృప్తిని సంఘటితం చేసుకోవడానికి ఉన్న అవకాశాన్ని చేజేతులా వదులు కున్నాయి. ఈ కారణాలకు తోడు చివరివరకూ కూడ ప్రతిపక్ష కూటమి ఒక విశ్వసనీయమైన నాయకుడి పేరును ప్రతిపాదించి వోటర్ల దగ్గరికి పోలేకపోయింది.

ఇలా కలిసి వచ్చిన అవకాశాన్ని వాడుకోవడం, ప్రతిపక్షాలు ఇచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవడం మాత్రమే గాక, తన విజయావకాశాలను మెరుగుపరచుకోవడానికి తెరాస మరికొన్ని ప్రయత్నాలు కూడ చేసింది. ప్రభుత్వ వ్యతిరేక వోట్లను చీల్చడానికి కొన్ని రాజకీయ పార్టీలతో, కొందరు అభ్యర్థులతో, కొన్ని కుల సమూహాలతో ప్రత్యక్ష, పరోక్ష ఒప్పందాలు చేసుకుంది. పట్టణం, గ్రామం, పోలింగ్ కేంద్రం ప్రాతిపదికగా బూత్ మేనేజి మెంట్, పోల్ మేనేజిమెంట్ చేసే యంత్రాంగాన్ని సిద్ధం చేసుకుంది.

మొత్తం మీద చెప్పాలంటే, తెలంగాణ రాష్ట్ర సమితి ఎన్నిక గత నాలుగున్నర సంవత్సరాల్లో అమలైన విధానాలకు ఆమోదమూ కాదు, ఆ పార్టీ పట్ల ప్రజల్లో అపారమైన ఆదరణ ఉన్నదనడానికి సూచికా కాదు, ప్రస్తుతం చేసిన వాగ్దానాల పట్ల ఆశావహ దృష్టీ కాదు. అధికార యంత్రాంగపు మద్దతు, డబ్బు, మద్యం వంటి ప్రలోభాలు, భావోద్వేగాల ద్వారా ప్రజల్లో కల్పించిన భ్రమలు, ఆకర్షణలు, సమర్థమైన ఎన్నికల వ్యూహ నిర్వహణ, ప్రతిపక్షాల అసమర్థత వంటి అనేక కారణాల సమ్మిళితమైన విజయం ఇది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

సహకారంతో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసింది. మధ్యప్రదేశ్‌లో గత 13 సంవత్సరాలుగా అధికారంలో ఉన్న బిజెపి ఓటమిపాలయింది.

మూడు రాష్ట్రాల్లో బిజెపి అధికారం కోల్పోయి కాంగ్రెస్ అధికారంలోకి రావడం వెనక చాలా కారణాలు ఉన్నాయి. ఇక్కడ రాష్ట్రంలో, కేంద్రంలో బిజెపి అధికారంలో ఉండడం, ఆ ప్రభుత్వాలు అవలంభించిన విధానాల వల్ల రైతాంగం ఆత్మహత్యలకు గురయ్యారు. రైతాంగ సమస్యలను పరిష్కరించడంలో పాలకులు విఫలమయ్యారు. కొత్తగా ఏర్పడిన తెలంగాణలో అధికారం చేపట్టిన తెలంగాణ రాష్ట్ర సమితి తిరిగి అధికారాన్ని నిలబెట్టుకుంది. ఇప్పుడు గెలిచిన పార్టీలు కాకుండా ప్రజలకు అనుకూలమైన విధానాలను అమలుచేసే పార్టీలు ఉండి ఉంటే ఆ పార్టీలనే జనం ఎన్నుకునేవారు. వేరే ప్రత్యర్థి పార్టీలు లేకపోవడం వల్లే ఈ పార్టీలను ఎన్నుకోవాల్సిన పరిస్థితికి ప్రజలు నెట్టబడ్డారు.

ఈ ఎన్నికల్లో బిజెపి కేంద్రంలో, మూడు రాష్ట్రాల్లో అధికారంలో ఉండి ఛత్తీస్‌గఢ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్ రాష్ట్రాల్లో అధికారాన్ని కోల్పోయింది. బిజెపి పూర్తి స్థాయి మెజారిటీతో కేంద్రంలో అధికారంలోకి వచ్చి తన స్వంత ఎజెండాను ఐదు సంవత్సరాలు అమలు చేసింది. బిజెపి గతంలో అధికారంలోకి వచ్చినా పూర్తిస్థాయి మెజారిటీ లేకపోవడంతో తన ఎజెండాను పూర్తి స్థాయిలో అమలు చేయలేక పోయింది. బిజెపి అధికారంలోకి రావడమే గుత్త పెట్టుబడిదారుల మద్ధతుతో అధికారంలోకి వచ్చింది. అధికారంలోకి వచ్చినప్పటి నుండి గుత్తపెట్టుబడిదారుల ప్రయోజనాలను నెరవేర్చే ప్రాధాన్యతతో వ్యవహరిస్తోంది. అందులో భాగంగానే దేశ ప్రజలందరిని తీవ్ర ఇబ్బందులకు గురిచేసిన పెద్దనోట్ల రద్దు, వస్తు సేవల పన్ను వల్ల సూక్ష్మ, చిన్న తరహా పరిశ్రమలు, ఉపాధి అవకాశాలు తగ్గిపోయాయని, వ్యాపార వర్గాలు నష్టాలను ఎదుర్కొంటున్నాయని అఖిల భారత ఉత్పత్తి దారుల సంఘం నిర్వహించిన పరిశోధనలో వెల్లడించింది. పెద్దనోట్ల రద్దుకు మొదట్లో బిజెపి ప్రభుత్వం చెప్పిన కారణాలు అబద్దాలని పాతనోట్లు దాదాపు పూర్తిస్థాయిలో రిజర్వు బ్యాంకుకు చేరడంతో తేలిపోయింది. నోట్ల రద్దు వల్ల క్రెడిట్, డెబిట్, పేటిఎంల ద్వారా వస్తువులను కొనుగోలు చేయడం వల్ల కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలు నెరవేరుతాయి. ఆక్స్ ఫాం పరిశోధనలో వెల్లడైన వివరాల ప్రకారం దేశ సంపదలో 73 శాతం ఒక్క శాతం మంది దగ్గరికి చేరుకుందని తేలింది. ఇలాంటి విధానాల అమలు కోసమే కార్పొరేట్ సంస్థలు కోరుకొని బిజెపిని అధికారంలోకి తెచ్చింది. ఆ బాధ్యతను బిజెపి నెరవేర్చింది. అలా అని ఇంకో పార్టీ ఈ పని చేయదని కాదు. ఇప్పుడున్న పరిస్థితుల్లో బిజెపినే త్వరగా చేయగలిగే అవకాశం ఉంది కాబట్టే అధికారంలోకి తెచ్చాయి. ఇంత తీవ్ర అసమానతలకు లోనవుతున్న దేశంలో ప్రజాస్వామ్య బూచిని చూపి ఏ పార్టీలు మనుగడ సాగించలేవు.

ఎన్నికల సమయంలో భావోద్వేగాలను రెచ్చగొట్టి అధికారంలోకి రావాలనే ఉద్దేశ్యంతో రామమందిరం నిర్మించాలనే డిమాండ్‌ను ఆర్ఎస్ఎస్ ముందుకు తెచ్చింది. జమ్మూకశ్మీర్‌లో నిత్యం ఎన్‌కౌంటర్ల పేరుతో వందల మంది యువకుల్ని కాల్చిచంపుతోంది. పాకిస్థాన్ పట్ల ప్రజల్లో విద్వేశాన్ని రెచ్చగొట్టే ప్రకటనలు గుప్పిస్తోంది.

అవినీతిలో కూరుకుపోయిన కాంగ్రెస్‌ను ఓడించి బిజెపిని గెలిపించండని 2014 ఎన్నికల్లో ప్రచారంచేసి అధికారంలోకి వచ్చింది. మధ్యప్రదేశ్‌లో జరిగిన వ్యాపం కుంభకోణం, యుద్ధ విమాలకు సంబంధించిన రాఫెల్ కుంభకోణాలు బిజెపి పాలనలోనే జరిగాయి. రాఫెల్ కుంభకోణాన్ని పర్యవేక్షిస్తున్న సిబిఐ డెరెక్టర్‌ను రాత్రికి రాత్రే పదవి నుంచి తప్పించారు. రిజర్వు బ్యాంక్ గవర్నర్ తన విధినిర్వాహణలో స్వేచ్ఛ లేక పదవికాలానికి ముందే రాజీనామా చేసి వెళ్లిపోయాడు. అవినీతి చరిత్ర కలిగిన వ్యక్తిని సిబిఐలోకి తేవడమంటే ప్రభుత్వం తన వైఫల్యాలను, అవినీతిని కప్పుపుచ్చుకోవడమేననేది తేటతెల్లం. తాము చెప్పినట్లుగా వినే వ్యక్తిని నియమించుకోవడం ప్రభుత్వ అవకాశవాదం, నియంతృత్వాన్ని తెలియజేస్తుంది. నిత్యం ఏదో ఒక ప్రాంతంలో గోరక్షణ పేరుతో మతోన్మాద మూకలు చేస్తున్న దాడులతో దళితుల, ముస్లీంల, ఆదివాసుల జీవితాలనే అభద్రతలోకి నెట్టివేశారు.

'అభివృద్ధి' పేరుతో తెస్తున్న ప్రాజెక్టుల వల్ల లక్షలాది మంది ఆదివాసులు, దళితులు నిరాశ్రయులయ్యారు. ఈ ప్రాజెక్టులను వ్యతిరేకిస్తూ దేశ వ్యాప్తంగా పోరాటాలు జరుగుతున్నాయి. నిరాశ్రయుల తరపున గొంతువిప్పిన ప్రజాస్వామికవాదుల్ని ప్రభుత్వం నిర్బంధిస్తోంది. దేశ ఖనిజ సంపదను విదేశీ కార్పొరేట్ సంస్థలకు చేరకుండా ఈ దేశ ప్రజలకు చెందాలని పోరాడుతున్న ఆదివాసి ప్రజలను పాలకులు జైల్లల్లో నిర్బంధించారు. ప్రపంచంలో అత్యధిక సంపన్నమైన పది దేశాల్లోని వ్యక్తుల్లో నలుగురు ఈ దేశంలోనే ఉన్నారు.

రాజ్యాంగానికి లోబడి స్వతంత్రంగా పనిచేస్తున్న వ్యవస్థలను ప్రణాళికాబద్ధంగా ధ్వంసం చేస్తూ వస్తోంది. అందులో భాగంగానే మొదట ప్రణాళిక వ్యవస్థను రద్దు చేసి నీతి అయోగ్‌ను తెచ్చింది. ఆ తరువాత న్యాయ సంఘాన్ని, విశ్వవిద్యాలయాలను, సిబిఐ, ఆర్‌బిఐ, ఐడి, ఇడి లాంటి సంస్థల విధ్వంసాన్ని కొనసాగిస్తోంది.

నోటాకు పెరుగుతున్న ఓట్ల శాతాన్ని గమనిస్తే ఈ రాజకీయ పార్టీల పట్ల నమ్మకం లేక అట్లాగే ఓటు వేయకపోతే స్థానిక నాయకులు తమపై కక్ష సాధింపు చర్యలకు దిగుతారేమోననే అభద్రతతో, ప్రభుత్వ పథకాలు అందవేమో అనే భయంతో కూడా ఓటును నోటాకు వేస్తున్నారు. నోటాకు పెరుగుతున్న ఓట్ల శాతాన్ని ప్రజలు పాలకుల పట్ల వ్యక్తపరుస్తున్న నిరసనగా భావించాలి. ఓడిన పార్టీలు, అధికారంలోకి వచ్చిన పార్టీలు అధికారం కోసం చేయని ప్రయత్నమంటూ లేదు. ప్రజల్ని డబ్బు, మద్యంతో పాటు వివిద రకాల ప్రలోభాలకు గురిచేశారు. ప్రజల విశ్వాసాలను ఓట్లుగా మలుచుకోవడానికి ప్రతి పార్టీ తమ వంతు ప్రయత్నం చేశాయి. రాజకీయ పార్టీలు ప్రజల్ని ప్రలోభాలకు గురిచేసినా కొన్ని ప్రాంతాల్లోని ప్రజలు ఓట్ల కోసం వచ్చిన నాయకులను తీవ్రంగా నిలదీశారు. ఇంతకాలం రాకుండా మా కనీస అవసరాలు తీర్చకుండా మా ఓట్లకోసం వచ్చారా అని వెనక్కు తిప్పి పంపిన సంఘటనలు ఉన్నాయి. కొన్ని గ్రామాల్లోని ప్రజలు పాలకులు తమ కనీస అవసరాలు కూడా తీర్చలేదని కాబట్టి ఈసారి ఎన్నికలను బహిష్కరిస్తామన్న గ్రామాలు కూడా ఉన్నాయి.

రాజకీయ పార్టీల గెలుపు ఓటములను పరిశీలిస్తే మొత్తం ఓట్లలో పోలయిన ఓట్లు 80 శాతం అనుకున్నా గెలిచిన పార్టీకి వచ్చిన ఓట్ల శాతం మొత్తం ఓట్లలో దాదాపు 40 శాతం ఉండవచ్చు. ఈ 40 శాతం ఓట్లతో 60 శాతంలో అధికారంలోకి వచ్చిన పార్టీని తిరస్కరించిన, అసలు ఓటువేయని, ఓటు హక్కు పరిధిలోకి రాని పిల్లలపై గెలిచామనుకునే వారు పాలనచేస్తున్నారు. ఇది ప్రజాస్వామ్యం. ఒక రకంగా చెప్పాలంటే జాతీయ స్థూల ఉత్పత్తి విధానాన్ని లెక్కించడంలో ఉండే విధానం కూడా ఇంచు మించు ఇలాగే ఉంటుంది. వారి ప్రమేయం లేకుండానే ఒక్కొక్కరికి తినడానికి తిండి లేకున్నా వారి పేర ఆస్తులు ఉండవచ్చు, అప్పులు ఉండవచ్చు మన జాతీయ స్థూల ఉత్పత్తి లెక్కిస్తున్న విధానం తీరు ఇది. మెజారిటీ ప్రజల ఆమోదం లేకుండానే ప్రజాస్వామ్యం పేరుతో అధికారంలోకి వచ్చిన పార్టీల పాలన ప్రజామోదానికి సూచికేనా?

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

# ఢిల్లీలో కదం తొక్కిన రైతాంగం

***ఒకవైపు నకిలీ విత్తనాలు, పురుగుల మందులు, ఎరువుల వల్ల పంట కోల్పోయి, మరోవైపు ఆరుగాలం కష్టపడి పండించిన పంటకు సరైన గిట్టుబాటు రాని పరిస్థితిలో రైతులు సంఘటితమై దేశరాజధాని వీధుల్లో తమ డిమాండ్లను తీర్చాలని ఉద్యమించారని అంటున్నారు ఆశాలత***

ఢిల్లీ వీధులలో, పార్లమెంట్ రోడ్డులో భారత రైతాంగం నిర్వహించిన బ్రహ్మాండమైన ర్యాలీ పాలకుల, మధ్యతరగతి ప్రజల, పట్టణ వాసుల అందరి దృష్టినీ రైతాంగ సమస్యల వైపు మళ్లించింది. అఖిల భారత రైతాంగ పోరాట సమన్వయ కమిటీ ఆధ్వర్యంలో నవంబర్ 30న రెండు వందలకు పైగా రైతుసంఘాల భాగస్వామ్యంతో నిర్వహించిన చారిత్రాత్మక ర్యాలీ రైతులలో పెరుగుతున్న అలజడి, సంక్షోభాలకు ప్రతీకగా నిలిచింది. పంట భూములలో రాత్రనక పగలనక పనిచేసే రైతులు తమ పనులు వదులుకుని ఢిల్లీ రోడ్ల మీదకు వచ్చి గొంతు విప్పితే తప్ప వారి గోడును వినే వాళ్లు లేకపోవడం నిజంగా వ్యవసాయ సంక్షోభం పట్ల వ్యక్తమవుతున్న తీవ్ర నిర్లక్ష్యాన్ని తెలియజేస్తుంది.

ఇరవై రాష్ట్రాల నుండి దాదాపు లక్ష మంది రైతులు తమ గ్రామాల నుండి రాజధానికి 40 గంటలకు పైగా రైళ్లలో, బస్సులలో, లారీలలో ప్రయాణం చేసి పాయలు పాయలుగా కదలి వచ్చి నవంబర్ 30న ఢిల్లీ రామ్‌లీలా మైదానంలో కలసి ఒక ప్రవాహంలాగా పార్లమెంట్ స్ట్రీట్ వైపు కదిలారు. వారిలో చాలామంది నవంబర్ 29 ఉదయానికే ఢిల్లీ చేరుకొని ఐదు చోట్ల గుమికూడి రామ్‌లీలా మైదాన్ వైపు ఊరేగింపులుగా సాగారు. ఆ రాత్రంతా అక్కడ చలిలో, దుమ్ములో 'ఏక రాత్ కిసాన్‌కే నామ' పేరుతో సాస్కృతిక కార్యక్రమాలు నిర్వహించారు. సిక్కు గురుద్వారాలు, విద్యార్థులు అందించిన కిచిడీ, రొట్టెలతో (అవి కూడా అందరికీ అందలేదు) కడుపు నింపుకుని మరుసటి రోజు పార్లమెంట్ ముట్టడికి కదం తొక్కారు. అక్కడ తిండి, నిద్ర, కాలకృత్యాలు తీర్చుకోవడానికి సరైన వసతులు లేకపోయినా ఎవరూ లక్ష్యపెట్టకుండా పార్లమెంట్ స్ట్రీట్ వైపు వెళ్లడమే ధ్యేయంగా పెట్టుకున్నారు.

రంగు రంగుల బ్యానర్లు, జెండాలు, ప్లకార్డులు, టోపీలు ధరించి నినాదాలు, పాటలు, వీధి నాటకాలతో హోరెత్తిస్తూ రామ్‌లీలా మైదానం నుండి పార్లమెంట్ స్ట్రీట్‌కు 5 కిలోమీటర్లు కదం తొక్కారు. ఆలస్యంగా ఢిల్లీ చేరుకున్న వారు ఎక్కడికక్కడ ర్యాలీలో కలిసారు. మహిళలు, యువకులు, వృద్ధులు, పిల్లలు తమ సామాన్ల బ్యాగులు భుజాలకు తగిలించుకుని బరువు మోస్తూ అలసిపోతూ కూడా ఉత్సాహం ఏమాత్రం తగ్గకుండా నడిచారు. దారి పొడవునా వివిధ విద్యార్థి, ఉద్యోగ సంఘాలు, యూనివర్సిటీ ప్రొఫెసర్లు రైతులకు సంఘీభావం తెలుపుతూ బ్యానర్లు పట్టుకుని నిలబడి తర్వాత ఊరేగింపులో రైతులతో కలసి నడిచారు. వివిధ ప్రాంతాల నుంచి హాజరైన వేలాది మంది రైతులు రైతుల సమస్యలపై రూపొందించిన మేనిఫెస్టోను ఆమోదించారు.

అఖిల భారత రైతాంగ పోరాట సమన్వయ కమిటీ రూపొందించిన రుణ విముక్తి బిల్లు, మద్దతు ధరల బిల్లులను చర్చించి ఆమోదించడానికి ప్రత్యేక పార్లమెంటు సెషన్‌ను నిర్వహించాలనే ప్రధాన డిమాండ్‌తో ఈ ర్యాలీ జరిగినప్పటికీ రైతులు ఎదుర్కుంటున్న అనేక ఇతర సమస్యలనూ ఈ ర్యాలీ ముందుకు తెచ్చింది.

ముఖ్యంగా మహిళలు, ఆదివాసీలు, వ్యవసాయ కూలీలు ఎక్కువ సంఖ్యలో పాల్గొని వ్యవసాయం మీదే ఆధారపడిన తమకు భూములు కావాలని, సాగు చేసుకుంటున్న అటవీ భూములకు పట్టాలు కావాలని, కరువు, ప్రకృతి వైపరీత్యాలు, వన్యమృగాల వల్ల నష్టపోయిన పంటలకు పరిహాం చెల్లించాలని, ఉండడానికి ఇళ్లు, తాగడానికి నీరు, తమ ఊరికి రోడ్లు కావాలనీ కూడా డిమాండ్ చేసారు. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాల నుండి పెద్ద సంఖ్యలో హాజరైన రైతు ఆత్మహత్య కుటుంబాల మహిళలు తమకు న్యాయంగా అందవలసిన నష్టపరిహారంతో పాటు వ్యవసాయాన్ని కొనసాగిస్తూ ఇంటి బాధ్యతలనూ మోస్తున్న తమను రైతులుగా గుర్తించాలని డిమాండ్ చేసారు. తమను ఒంటరి మహిళల కెటగిరిగా గుర్తించి, భూమి పట్టాలను తమ పేర్ల మీద బదిలీ చేసుకోవడానికి ప్రభుత్వం చొరవ తీసుకుని తమకు వ్యవసాయ పథకాలన్నిటిలో ప్రాధాన్యత ఇవ్వాలని అడిగారు.

గత సంవత్సరన్నర కాలంగా దేశంలోని వివిధ ప్రాంతాలలో రైతుల ఆందోళనలు జరుగుతున్నప్పటికీ కేంద్ర ప్రభుత్వం వారి సమస్యలను పట్టించుకోకుండా నిర్లక్ష్యం వహిస్తూ వచ్చింది. ఎన్‌డిఎ కూటమి 2014 సార్వత్రిక ఎన్నికలకు ముందు రైతులకు అనేక వాగ్దానాలు చేసింది. స్వామినాథన్ కమిషన్ సిఫార్సు ప్రకారం సాగుఖర్చుకు 50 శాతం కలిపి మద్దతు ధర ప్రకటిస్తామన్నది వాటిలో ప్రధాన వాగ్దానం. కానీ ఎన్‌డిఎ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత ఆ వాగ్దానం నెరవేర్చ లేదు సరికదా దానిని వక్రీకరించి దాని సారాన్ని మార్చి మద్దతు ధరలు ప్రకటించింది. ఆ విధంగా ప్రకటించిన ధరలు నిజానికి కొన్ని పంటల సాగుకు అయ్యే ఖర్చు కంటే కూడా తక్కువగా ఉన్నాయి.

వ్యవసాయ ఖర్చులు ధరల కమిషన్ (సిఎసిపి) ప్రతి పంటకూ వ్యవసాయ ఖర్చులను అంచనావేసి మద్దతు ధరలను సిఫార్సు చేసింది. అయినా కూడా కేంద్ర ప్రభుత్వం 19 పంటలకు ప్రకటించిన మద్దతు ధరలలో 9 పంటల మద్దతు ధర సిఎసిపి అంచనా వేసిన ఉత్పత్తి ఖర్చు కంటే కూడా చాలా తక్కువగా ఉన్నాయి. అదలా ఉండగా ఎన్‌డిఎ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత రైతులకు ప్రధానమంత్రి ఫసల్ బీమా యోజనా అనే ఇన్సురెన్సు పథకాన్ని ప్రవేశపెట్టింది. ఇది రెండు సంవత్సరాల క్రితం అమలులోకి వచ్చింది. ఇంకా నీతి అయోగ్ ఆధ్వర్యంలో 2022 నాటికి రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేసే విధానాన్ని ప్రకటించింది. అయితే పెద్ద ఆర్భాటంతో రైతుల ప్రయోజనం కలిగించే ప్రభుత్వంగా ముద్ర వేసుకోవడానికి ప్రకటించిన ఈ రెండు పథకాలూ కూడా దేశవ్యాప్తంగా సంక్షోభంలో ఉన్న రైతులకు ఏ విధంగానూ ప్రోయోజనం కలిగించలేదు.

ప్రధానమంత్రి ఫసల్ బీమా యోజనా రైతుల కంటే ఇన్సూరెన్స్ కంపెనీలకే ఎక్కువ లాభం చేకూర్చింది. ఈ పథకం ప్రకారం బ్యాంకుల నుండి పంట రుణాలు తీసుకుంటున్న ప్రతి రైతు అకౌంట్ నుండి వారికి సమాచారం, అనుమతి లేకుండానే ఎకరానికి 300 నుండి 500 రూపాయల వరకు బీమా ప్రీమియం మినహాయించ బడుతున్నది. కానీ పంట నష్టం జరిగినప్పుడు మాత్రం ఆ నష్టాన్ని అంచనా వేసి బీమా చెల్లించడం జరగడం లేదు. ఈ విధంగా పంట రుణాలు తీసుకున్న ప్రతి ఎకరానికీ 500 రూపాయల చొప్పున ఇన్సూరెన్స్ కంపెనీకి కొన్ని కోట్ల ప్రీమియం అందుతున్నది, కానీ రైతులకు పంట నష్టపరిహారం అందడం లేదు. 2022 నాటికి రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేయాలనే ఉద్దేశాన్ని ప్రకటించి రెండు సంవత్సరాలు గడుస్తున్నది కానీ అది ఏ విధంగా సాధిస్తారో ఇప్పటివరకు తర్జన భర్జనలే తప్ప ఒక నిర్దిష్టమైన ప్రతిపాదన ఇంతవరకు రాలేదు.

ఈ నేపథ్యంలోనే రైతులు కేంద్ర ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరితో కోపోద్రిక్తులై దేశావ్యాప్తంగా అనేక రాష్ట్రాలలో ఉద్యమాలు చేపట్టారు. అఖిల భారత రైతాంగ పోరాట సమన్వయ కమిటీగా సంఘటితపడి తమ డిమాండ్లను ముందుకు తెచ్చారు.

ఢిల్లీ కిసాన్ ర్యాలీ సందర్భంగా రాహుల్ గాంధీతో సహా కాంగ్రెస్ అగ్రనాయకులు, ఇతర ప్రతిపక్ష నాయకులు రైతుల డిమాండ్లకు మద్దతు ప్రకటించారు. అయితే ఇదంతా ఎన్నికల ముందు మోడీ ప్రభుత్వం మీద వ్యతిరేకతను వెళ్లగక్కే రాజకీయ చదరంగంలో ఎత్తుగానే మిగులు తుందా లేక వివిధ రాష్ట్రాలలో అధికారంలోకి వచ్చిన చోటైనా ఆచరణలో రైతుల సమస్యలు పరిష్కరించడానికి కృషి చేస్తారా అనేది వేచి చూడవలసే ఉంది.

ఇక కిసాన్ ర్యాలీ మీద పూర్తిగా వాలిపోయిన జాతీయ మీడియా (ప్రింట్, ఎలెక్ట్రానిక్) లైవ్ టెలికాస్ట్‌లు చేసి, మరుసటి రోజు పతాక శీర్షికలు ముద్రించి, రైతుల ఇంటర్వ్యూలు తీసుకుని హడావిడి చేసింది. అయితే వీటన్నిటితో మీడియా టిఆర్‌పిలు పెంచుకోవడానికే గాక వ్యవసాయ సంక్షోభం గురించి చిత్తశుద్ధితో నిరంతరం కథనాలు రాస్తూ సమస్యను సజీవంగా వుంచి, పాలకులపై ఒత్తిడి తెచ్చినప్పుడే రైతాంగానికి ఎంతో కొంత ప్రయోజనం కలుగుతుంది.

### భారతదేశ రైతుల మానిఫెస్టో

ఢిల్లీలో 2018 నవంబరు 30న అఖిల భారత కిసాన్ సంఘర్ష్ సమన్వయ సమితి నిర్వహించిన చారిత్రాత్మకమైన కిసాన్ ముక్తి ర్యాలీ సందర్భంగా భారతదేశ రైతుల అసెంబ్లీ ఆమోదించిన మానిఫెస్టో ఇది.

భారత దేశ రైతులమైన మేము,

ప్రాథమిక వ్యవసాయ సరుకుల ఉత్పత్తిదారులం. మహిళలు, దళితులు, సంచార, ఆదివాసీ రైతులు, భూ యజమానులు, కౌలురైతులు, వ్యవసాయ కూలీలు, తోటలలో పనిచేసే శ్రామికులు, మత్స్యకారులు, పాల ఉత్పత్తిదారులు, పశు పెంపకదారులు, సంచార పశుపోషకులు, చిన్నతరహా అటవీ ఉత్పత్తులను సేకరించేవారితో సహా పంటల సాగు, పోడు వ్యవసాయం, తేనెటీగల పెంపకం, వర్మికల్చర్, చెట్లు, పొదలు కలగలసిన పంటల సాగు చేసే వారందరం ఈ కింది విషయాలపై దృఢ విశ్వాసంతో ఉన్నాం.

రైతుల సంక్షేమం అంటే కేవలం దేశంలోని అత్యధిక కుటుంబాలు ఆర్థికంగా మనగలగడమే కాదు, అది జాతీయ స్వాభిమానం. సాంస్కృతిక వారసత్వాలను నిలబెట్టుకోవడానికి సంబంధించిన విషయం కూడా.

రైతులు అనే వారు గతం అవశేషాలు మాత్రమే కాదు. రైతులు, వ్యవసాయం, గ్రామీణ సమూహం భారతదేశ, ప్రపంచ భవిష్యత్తులో సమగ్ర భాగం.

రైతాంగ ఉద్యమాల డిమాండ్లు మన రాజ్యాంగం, ప్రాథమిక హక్కులు, ప్రభుత్వ విధానాల ఆదేశిక సూత్రాలతో పూర్తిగా పొందిక కలిగి ఉన్నాయి.

మేము మా బాధ్యతలను గుర్తిస్తున్నాం.

అనేక అసమానతలు, ఇబ్బందులను ఎదుర్కునే నిజాయితీ కలిగిన కష్టజీవులుగా, చారిత్రక జ్ఞానం, నైపుణ్యం, సంస్కృతులను నిలబెట్టే వారుగా, ఆహార రక్షణ, భద్రత, సార్వభౌమత్వం కల్పించే సాధనాలుగా, జీవ వైవిధ్యం, జీవావరణ సుస్థిరతలను కాపాడేవారంగా మా బాధ్యతలను గుర్తిస్తున్నాం.

**ఈ కింది సిద్ధాంతాలను గుర్తు తెచ్చుకుంటున్నాం**

ఆర్థికంగా మనగలగడం, జీవారణ సుస్థిరత, సామాజిక, ఆర్థిక న్యాయంతో కూడిన సమానత్వం.

అయినప్పటికీ ఈ కింది స్థితిగతుల పట్ల ఆందోళన చెందుతున్నాం.

భారతీయ వ్యవసాయంలో నెలకొన్న ఆర్థిక, జీవారణ, సామాజిక, అస్తిత్వ సంక్షోభం, రైతులను, వారి జీవనోపాధులను ప్రతికూలంగా ప్రభావితం చేస్తున్న పర్యావరణ వినాశనం, ఇంతకుముందెన్నడూ లేని విధంగా వ్యవసాయ భూముల మళ్లింపు, వినాశనంబీ నీటి వనరుల ప్రైవేటీకరణ, బలవంతపు నిర్వాసితం, ఆహార భద్రతను, జీవనోపాధులను ప్రభావితం చేసే ఆహార కొరత, వ్యవసాయం పట్ల నిరంతర నిర్లక్ష్యం, రైతాంగ కుటుంబాలకు వ్యతిరేకంగా వున్నవివక్ష, గ్రామ పెత్తందారులు, ప్రభుత్వ అధికారుల చేతిలో దోపిడీకి గురయ్యే రైతుల దుస్థితి పెరగడం, ఇప్పటికే దేశ వ్యవసాయరంగాన్ని అదుపుచేస్తున్న, లాభాల వేటలో ఉన్న పెద్ద కార్పొరేట్ కంపెనీలు మరింతగా చొచ్చుకురావడం, దేశవ్యాప్తంగా కొనసాగుతున్న రైతుల ఆత్మహత్యల పర్వం, భరింపరాని రుణభారం, రైతులకూ, సమాజంలోని ఇతర రంగాల వారికీ మధ్య పెరుగుతున్న అసమానత, రైతుల ఉద్యమాలపై పెరుగుతున్న ప్రభుత్వ దాడులు మా ఈ కింది రాజ్యాంగ హక్కులను దృఢ నిశ్చయంతో నొక్కి ప్రకటిస్తున్నాం.

జీవించే హక్కు, గౌరవప్రదమైన జీవనోపాధి హక్కు, సామాజిక భద్రత, ప్రకృతి విపత్తులు ఇతర విపత్తుల నుండి రక్షణ, భూమి, నీరు, అడవి, ఇంకా ఉమ్మడి వనరులతో సహా అన్ని సహజ వనరులపై హక్కులు, విత్తనాలు, ఆహార వ్యవస్థల వైవిధ్యం, సుస్థిరమైన సాంకేతిక పరిజ్ఞానాలను ఎంపిక చేసుకునే హక్కులు, భావ ప్రకటన స్వాతంత్ర్యం, సంఘటితపడే హక్కు, మా డిమాండ్లను సాధించుకోవడానికి రాజ్యాంగపరమైన పద్ధతుల ద్వారా ప్రాతినిధ్యం వహించి పోరాడే హక్కు, మా భవిష్యత్తును తీర్చిదిద్దుకునే హక్కు.

**పార్లమెంట్ వెంటనే ఈ డిమాండ్లు అంగీకరించాలి**

వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించడానికి ప్రత్యేక పార్లమెంటు సెషన్‌ను నిర్వహించి రైతులు తయారు చేసిన రెండు కిసాన్ ముక్తి బిల్లులను ఆమోదించాలి, అవి:

1. రైతుల రుణ విముక్తి బిల్లు, 2018
2. వ్యవసాయ ఉత్పత్తులకు గిట్టుబాటు కల్పించే కనీస మద్దతు ధరకు హామీ కల్పించే బిల్లు, 2018

**భారత ప్రభుత్వం ఈ కింది డిమాండ్లను అమలు చేయాలని కూడా కోరుతున్నాం**

1. జాతీయ ఉపాధి హామీ హామీ పథకం కింద ప్రతి కుటుంబానికీ ఉపాధి కల్పించే రోజుల సంఖ్యను 200కు పెంచాలి. చట్ట ప్రకారం హామీ కల్పించిన విధంగా కాలపరిమితి లోపు వేతన చెల్లింపు జరిగేటట్లు చర్యలు తీసుకోవాలి. ఈ వేతనాలు నైపుణ్యం లేని వ్యవసాయ కూలీల కనీస వేతనాలకు సమానంగా ఉండాలి.

2. పారిశ్రామిక ఉత్పత్తుల ధరలను నియంత్రించడం ద్వారా కానీ లేక రైతులకు నేరుగా సబ్సిడీలు అందించడం ద్వారా కానీ సాగుఖర్చును తగ్గించాలి.

3. వ్యవసాయ కుటుంబాలన్నిటికీ సమగ్ర సామాజిక భద్రత కల్పించాలి. 60 ఏళ్లు నిండిన ప్రతి రైతుకూ నెలకు రు. 5000 కనీస పెన్షన్ ఇవ్వాలి.

4. ప్రజాపంపిణీ వ్యవస్థను అందరికీ అందుబాటులోకి తేవాలి. దాని ద్వారా ధాన్యం, చిరుధాన్యాలు, పప్పులు, పంచదార, నూనె వంటివి అందించాలి. దానిని ఆధార్ కార్డుతో కానీ బయోమెట్రిక్ గుర్తింపుతో కానీ జోడించకూడదు. నేరుగా నగదు బదిలీకి మార్చకూడదు.

5. పశువుల వ్యాపారంపై విధించిన అన్ని రకాల చట్టపరమైన పరిమితులను, గోరక్షకుల బెదిరింపులను తొలగించి అనాథ పశువుల బెడదను పరిష్కరించాలి. వన్యమృగాలు, అనాథ జంతువులు వల్ల జరిగే పంట నష్టానికి నష్టపరిహారం అందించాలి. అనాథ పశువులకు జంతుశాలల వసతి కల్పించాలి.

6. రైతులకు సమాచారం అందించకుండా, వారి అనుమతి తీసుకోకుండా భూసేకరణ చేయకూడదు. వ్యవసాయ భూములను వాణిజ్యపరమైన భూ అభివృద్ధి అవసరాల కోసం, భూమీ బ్యాంకుల ఏర్పాటు కోసం మళ్లించకూడదు. భూసేకరణలో న్యాయమైన నష్టపరిహారం, పారదర్శకతకు హక్కు, పునరావాసం, పునస్థాపన చట్టం, 2013ను రాష్ట్ర స్థాయిలో సవరించడాన్ని నిరోధించాలి. భూ వినియోగ, భూ సరక్షణ విధానాలను రూపకల్పన చెయ్యాలి.

7. చెరుకు రైతులకు వారి ఉత్పత్తిని సేకరించిన 14 రోజులలోపు ధర చెల్లించనట్లయితే పంచదార మిల్లులు 15 శాతం వడ్డీతో సహా బకాయిలు చెల్లించాలి. చెరకు గిట్టుబాటు ధరలను 9.5 శాతం పంచదార తయారీకి అనుసంధానించి నిర్ణయించాలి.

8. ఇతర దేశాలలో నిషేధించిన పురుగు మందులను మనదేశంలో ప్రభుత్వం ఉపసంహరించాలి. సమగ్రమైన, అవసరం, ప్రత్యామ్నాయాలు, అంచనాలు చేయకుండా జన్యుమార్పిడి విత్తనాలను ఆమోదించకూడదు.

9. వ్యవసాయం, ఆహారశుద్ధి, పాకేజింగ్‌లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను అనుమతించకూడదు. ప్రాంతీయ సమగ్ర ఆర్థిక ఒప్పందం (ఆర్‌సిఇపి)తో సహా అన్ని రకాల స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందాల పరిధి నుండి వ్యవసాయాన్ని తొలగించాలి.

10. కౌలు రైతులు, పాలదారులు, మహిళా రైతులు వంటి వాస్తవ సాగుదారులను, గ్రామీణ శ్రామికులను అందరినీ గుర్తించి రిజిస్టర్ చెయ్యాలి. దీని ద్వారా వారు ప్రభుత్వం పథకాలన్నిటినీ అందుకునే అవకాశం కల్పించాలి.

11. అడవుల పెంపకం పేరుతో ఆదివాసీ రైతులను అడవుల నుండి నిర్వాసితులను చేయటాన్ని ఆపివేయాలి. పంచాయతీరాజ్ విస్తరణ చట్టం, అటవీ హక్కుల చట్టం 2006ను నీరు గార్చకుండా కచ్చితంగా అమలు చేయాలి.

**ప్రభుత్వం ఈ కింది అంశాలపై విధానాలను రూపొందించాలి**

12. భూమిలేనివారికి ఇళ్లస్థలాలు, వ్యవసాయ భూములు, మత్స్యకారులకు నీటి వనరులు, చిన్న తరహా ఖనిజాల తవ్వకానికి స్థలాలు అందించాలి.

13. ప్రకృతి వైపరీత్యాల వల్ల జరిగే పంట నష్టానికి సత్వరం, సమర్థవంతమైన సరిపడినంత నష్టపరిహారం కల్పించాలి. బీమా కంపెనీలకు కాక రైతులకు ప్రయోజనం కలిగించే సమగ్ర పంట బీమా పథకాన్ని అమలుచేయాలి. దానిలో నష్టాన్ని అంచనా వేయడానికి వ్యక్తిగత రైతును యూనిట్‌గా తీసుకుని అన్నిరకాల రైతులకు అన్ని పంటలకూ వర్తింపచేయాలి. కరువు నిర్వహణ మాన్యుయల్‌లో చేసిన రైతు వ్యతిరేక మార్పులను తొలగించాలి.

14. హామీ కల్పించిన రక్షిత సాగునీటి వసతిని, ప్రత్యేకించి వర్షాధారిత ప్రాంతాలలో రైతులకు సుస్థిరంగా ఉండే సాధనాల ద్వారా నిర్మించాలి.

15. పాడి రైతులకు గిట్టుబాటుగా వుండే పాలధరలను నిర్ణయించాలి. మధ్యాహ్న భోజన పథకం, సమగ్ర శిశుఅభివృద్ధి పథకాల ద్వారా పోషకాహారాన్ని అందించడానికి పాలను సరఫరా చేయాలి.

16. రైతు ఆత్మహత్య కుటుంబాల రైతులకు ఉన్న రుణాలను రద్దు చేయాలి. అటువంటి కుటుంబాల పిల్లలకు ప్రత్యేక అవకాశాలను కల్పించాలి.

17. కాంట్రాక్టు వ్యవసాయ చట్టం 2018ను సమీక్షించి, రైతులను కాంట్రాక్టు వ్యవసాయం పేరుతో కార్పొరేటు కంపెనీలు చేసే దోపిడీనుండి రక్షించాలి.

18. వ్యవసాయ రంగాన్ని కర్పొరేటీకరించి బహుళ జాతీయ కంపెనీల హస్తగతం చేయడం కాకుండా వ్యవసాయ ఉత్పత్తులను రైతు ఉత్పత్తిదారుల సంఘాలు, సహకార సంఘాల ద్వారా సేకరించి, శుద్ధి చేసే మార్కెటింగ్ చేయడాన్ని ప్రోత్సహించాలి.

19. సుస్థిరమైన పంటల సాగు విధానం, స్థానిక విత్తనాల వైవిధ్యాన్ని పునరుద్ధరించడం పైన ఆధారపడిన వ్యవసాయ జీవావరణ వ్యవస్థను ప్రోత్సహించాలి, తద్వారా ఆర్థికంగా మనగలిగిన, పర్యావరణ పరంగా సుస్థిరంగా ఉండే, వాతావరణ మార్పులను తట్టుకునే వ్యవసాయాన్ని నిర్మించడం సాధ్యమవుతుంది.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# కల్లోల కశ్మీరంలో కాషాయం కుట్ర

***కేంద్రంలో బిజెపి అధికారాన్ని చేపట్టిన తరువాత కశ్మీర్ విషయంలో అతిగా జోక్యం చేసుకుందనీ, రాజ్యాంగ వ్యవస్థను కాపాడాల్సిన గవర్నర్ కూడా ఆ పార్టీకే మద్దతుదారుగా నిలవడం ప్రజాస్వామ్యానికి ఎంతో ప్రమాదకరమనీ అంటున్నారు*** **రాజేంద్రబాబు అర్విణి**

కశ్మీర్‌లో భారత రాజ్యాంగం మరోసారి పరిహసించబడ్డది. మనదేశంలో చట్టాలను, రాజ్యాంగ స్ఫూర్తిని పరిరక్షించడానికి ఏర్పడ్డ గవర్నర్ల వ్యవస్థ, న్యాయవ్యవస్థ ఇటీవలి కాలంలో లెక్కలేనన్నిసార్లు రాజ్యాంగ స్ఫూర్తికి భిన్నంగా వ్యవహరించాయి. రాజ్యాంగ రచనలో ప్రధానపాత్ర వహించిన డా. అంబేద్కర్ రాజ్యాంగంలోని అధికరణలు, నిబంధనల కంటె ముఖ్యం రాజ్యాంగ స్ఫూర్తి. ఆ స్ఫూర్తిని కాపాడే వ్యవస్థలు రాజ్యాంగ నైతికత కలిగి ఉండాలని పేర్కొన్నారు. ఆ నైతికత బిజెపి నియమించిన కశ్మీర్ గవర్నర్ సత్యపాల్ మాలిక్‌లో లోపించింది. ఈ మధ్య ఒక జడ్జి భారతదేశాన్ని హిందూ రాజ్యంగా ప్రకటించాలని ఒక తీర్పులో తన అభిప్రాయంగా ప్రకటించాడు. తన రిటైర్‌మెంట్ తర్వాత మోడీ కరుణించి తనకు ఏదైనా పదవి కట్టబెట్టాలని అలా ముందే దరఖాస్తు పెట్టుకున్నాడని ఓ వ్యాసంలో వ్యాసకర్త ఎద్దేవా చేశాడు. ఓ కవి పేర్కొన్నట్టుగా, ఇలాంటి జడ్జీలను, గవర్నర్‌లను బోనులో నిలబెట్టి కఠినమైన శిక్షకు గురిచేసే అవకాశం ఉంటే ఎంత బాగుండేది!

కశ్మీర్ గవర్నర్ సత్యపాల్ మాలిక్ గతంలో బిహార్ గవర్నర్‌గా పనిచేసి, ఆ రాష్ట్రంలో ప్రజాతీర్పుకు వ్యతిరేకంగా ముఖ్యమంత్రి నితీష్ కుమార్‌ను బిజెపికి మిత్రునిగా మలచడంలో మధ్యవర్తిత్వం నెరపిన వ్యక్తిగా రాజకీయ వర్గాలచే గుర్తింపబడ్డారు. మూడునెలల క్రితమే కశ్మీర్ గవర్నర్‌గా నియమింతులయ్యాడు. అప్పటికే పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ, భారతీయ జనతా పార్టీల సంకీర్ణ ప్రభుత్వం విచ్ఛిన్నమై ముఖ్యమంత్రి మహబూబా ముఫ్తీ రాజీనామా చేశారు. పౌర ప్రభుత్వం లేని సమయంలో సత్యపాల్ మాలిక్ గవర్నర్‌గా కశ్మీర్ పీఠం అధిష్ఠించాడు. మోడీ పాలనలో కశ్మీర్ కకావికలం అయ్యింది. నిత్యం అల్లకల్లోలమే! సత్యపాల్ మాలిక్ కూడా తనవంతుగా గవర్నర్‌గా వచ్చిన మూడు నెలలకే జమ్ముకశ్మీర్ అసెంబ్లీని రద్దు చేశాడు. అసలే అతలాకుతలంగా ఉన్న కశ్మీర్‌లో రాజకీయ అనిశ్చిత పరిస్థితిని తీవ్రతరం చేస్తూ అసెంబ్లీ నిర్ణయం తీసుకున్నాడు.

ఈ నిర్ణయానికి ముందు పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ నాయకురాలు మెహబూబా ముఫ్తీ ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి కావలసినంత మెజారిటీ తనకు ఉందని, తన పార్టీకి చెందిన శాసనసభ్యులే కాక నేషనల్ కాన్ఫరెన్స్‌కు చెందిన ఎంఎల్ఏలు 15 మంది, కాంగ్రెసు ఎంఎల్ఏలు 12 మంది తనను సమర్థిస్తున్నారని, 87 మంది శాసన సభ్యులు గల అసెంబ్లీలో 56 మంది మద్దతుతో తాను సుస్థిర ప్రభుత్వం ఏర్పాటు చేయగలనని గవర్నర్‌ను కలిశారు. ఆ తర్వాత ఇద్దరు ఎంఎల్ఏల ప్రాతినిధ్యం గల పీపుల్స్ కాన్ఫరెన్స్ నాయకుడు సజ్జద్ గాని లోనె తాను కూడా ప్రభుత్వం ఏర్పాటు చేయగలనని, బిజెపికి చెందిన 25 మంది ఎంఎల్ఏల మద్దతు ఉన్నట్టుగా అసెంబ్లీలోని వారి పార్టీ నాయకుని లేఖను సమర్పించగలనని గవర్నర్‌కు విన్నవించాడు. విభిన్నమైన సిద్ధాంతాలు కలిగిన రాజకీయ పార్టీలు అధికారం కోసం ఒకరికొకరు మద్దతు ప్రకటించుకొని ప్రభుత్వం ఏర్పాటు చేసినా, అది సుస్థిరంగా మనుగడ సాధించలేదన్న నెపంతో గవర్నర్ సత్యపాల్ మాలిక్ ఎవరికీ అవకాశం ఇవ్వకుండా అసెంబ్లీని రద్దు చేసే నిర్ణయం తీసుకున్నాడు. గమ్మత్తేమిటంటే, ఉత్తర దక్షిణ ధృవాలయిన పిడిపి, బిజెపి లు కలిసి ఇన్నాళ్లూ ప్రభుత్వం నడిపాయి. ఆ రెండు పార్టీలు కలియడానికి ప్రజల మద్దతు కూడా లేదు. అయినా, ప్రజలు ఎన్నుకున్న ఎంఎల్ఏల మద్దతుతో కూడిన పౌర ప్రభుత్వం ఒకటి పాలించేది. ఆ ప్రభుత్వం అకస్మాత్తుగా బిజెపి మద్దతు ఉపసంహరించుకోవడంతో కూలిపోయింది.

ఈ పరిస్థితులలో గవర్నర్ ప్రజాస్వామికంగా వ్యవహరించాలి. 56 మంది శాసనసభ్యుల మద్దతు గలిగిన పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీకి ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశం కల్పించి, ఓ వారం రోజుల్లో మెజారిటీ నిరూపించుకొమ్మనాలి. కాని, గవర్నర్ ఏకపక్షంగా వ్యవహరించి, రాజ్యాంగ స్ఫూర్తిని కాలరాసి, మోడీ ఆలోచనను బిజెపి ప్రయోజనాల కనుకూలంగా వ్యవహరించాడు. పిడిపి, నేషనల్ కాన్ఫరెన్సులు రెండూ బద్ధవైరులైనా 'కశ్మీర్ ప్రయోజనం' కోసం బిజెపిని దూరంగా ఉంచాలన్న ఉద్దేశంతో ఒకరికొకరు సహకరించుకోవాలని సిద్ధపడ్డాయి. గవర్నర్ తన నిరంకుశ చర్యతో భారత్ నుండి విడిపోవాలని కోరుకుంటున్న వేర్పాటువాదులు ప్రజలలోకి చొచ్చుకు పోవడానికి ఆజ్యం పోశాడు.

మన్‌మోహన్ సింగ్ ప్రధానమంత్రిగా ఉన్న పదేళ్ల కాలంలో కశ్మీర్ సమాజంలో ఇంత అశాంతి లేదు. అంతకుముందు అటల్ బిహారీ వాజ్‌పేయి కశ్మీర్‌లో శాంతి నెలకొనడానికి తనవంతు కృషి చేశాడు. ప్రజాస్వామ్య ప్రక్రియలో భాగమయిన ఎన్నికలపై నమ్మకం కలిగించేలా కొన్ని చర్యలు చేపట్టాడు. 2002లో జరిగిన ఎన్నికలు స్వేచ్ఛాయుత వాతావరణంలో సజావుగా జరుగుతాయని వాగ్దానం చేసి, నిజంగానే కేంద్రం 'గౌరవప్రదం'గా ప్రేక్షకునిలాగనే వ్యవహరించింది. జమ్ముకశ్మీర్ రాజకీయాలలో కలగజేసుకోలేదు. గతంలోని ఆ ఇద్దరు ప్రధానమంత్రులతో పోల్చినపుడు ప్రస్తుత ప్రధాని మోడీ కశ్మీర్‌లో శాంతి నెలకొల్పడం కంటె ఆ రాష్ట్రాన్ని బిజెపి పాదాక్రాంతం చెయ్యడానికే ప్రాధాన్యత ఇస్తున్నట్టు అర్థమవుతున్నది. ఈ విషప్రణాళికకు దోహద పడేట్టుగా సత్యపాల్ మాలిక్‌ను గవర్నర్‌గా నియమించుకున్నాడు. గవర్నర్ చర్య కశ్మీర్‌లో ప్రజాస్వామ్య పునరుద్ధరణకు ఎంతమాత్రము తోడ్పడదు. కశ్మీర్‌కు ఉన్న ప్రత్యేకతల దృష్ట్యా, స్థానిక రాజకీయాలలో తలదూర్చడం

బిజెపికి తగదు. అక్కడ ప్రజాస్వామ్య వాతావరణం పటిష్ఠంగా ఉంటేనే ప్రజలు భారతదేశం వైపు మొగ్గు చూపుతారన్నది నిర్వివాదాంశం.

కశ్మీరు లోయలో ప్రజాస్వామ్యం రోజురోజుకు ఎంత బలహీన పడుతుందో ఈ మధ్యనే జరిగిన స్థానిక సంస్థల ఎన్నికలు పరిశీలిస్తే బోధ పడుతుంది. జమ్ముకశ్మీర్‌లో ఉన్న అన్ని మున్సిపల్ కార్పొరేషన్లు, పురపాలక మండళ్లు, పురపాలక సంఘాల ఎన్నికలలో రాష్ట్రం మొత్తం మీద ఓటింగ్ శాతం 35కు మించలేదు. అది కూడా జమ్ము, లధక్ ప్రాంతాలలో ముమ్మరంగా పోలింగ్ జరిగినందువల్ల. కశ్మీర్ లోయలో ఓటర్లు ఎన్నికలను పెద్దఎత్తున బహిష్కరించారు. లోయలో మొదటి దఫాలో జరిగిన ఎన్నికలలో ఓటు హక్కు వినియోగించుకున్న వారు 8.3 శాతం మాత్రమే. రెండవ, మూడవ దఫాలలో మరీ తక్కువ. రెండవ దశలో 3.4 శాతం, మూడవ దశలో 3.49 శాతం, నాలుగవ దశలో 4 శాతం పౌరులు మాత్రమే ఓటు వేయడానికి పోలింగ్ స్టేషన్‌లకు వచ్చారు. చాలా చోట్ల నామినేషన్ వేయడానికి అభ్యర్థులు ముందుకు రాలేదు. చాలా వార్డులలో ఎన్నికలలో నిలుచున్న అభ్యర్థులే లేరు. కొన్ని వార్డులలో ఒక్కొక్కరు మాత్రమే పోటీలో ఉన్నారు. కశ్మీర్ లోయలో ఉన్న 598 వార్డులలో 186 వార్డులలో మాత్రమే పోలింగ్ జరిగింది. 181 వార్డులలో పోటీదారులే లేరు. 231 వార్డులలో వార్డుకు ఒకటి చొప్పున నామినేషన్ దాఖల్ కాగా, వాటిల్లో అభ్యర్థులు ఏకగ్రీవంగా ఎన్నికయినట్టు ప్రకటించారు. కశ్మీర్ లోయ మొత్తంలో ఎన్నికల ప్రచారమే జరగలేదు. చాలా చోట్ల ఎన్నికలలో పోటీ చేస్తున్న అభ్యర్థుల పేర్లు భద్రతా కారణాల రీత్యా బహిరంగంగా ప్రకటించ లేదు.

2002లో అటల్ బిహారి వాజపేయి తీసుకున్న చర్యల వల్ల కశ్మీర్ లోయలో ప్రజలు ఓటింగ్‌లో పాల్గొనడంలో పురోగతి ప్రారంభమయింది. 1989లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో కేవలం 51 శాతం ఓటింగ్ నమోదయ్యింది. 2001లో జరిగిన పంచాయితీ ఎన్నికలలో గ్రామ పంచాయితీలలో ఓటర్లు పెద్దసంఖ్యలో ఎన్నికలలో పాల్గొనలేదు. పంచాయితీ వార్డులలో నామినేషన్ వేసే అభ్యర్థులే కరువయి చాలా వరకు ఖాళీగానే ఉండిపోయాయి. అయితే, 2002 అసెంబ్లీ ఎన్నికల నుండి వాజపేయి ప్రభుత్వం తీసుకొన్న చొరవ వల్ల ఎన్నికల ప్రక్రియలో ప్రజలు బహుళంగా పాల్గొనడం ప్రారంభమయింది. కశ్మీర్‌లోని ప్రధాన రాజకీయ పక్షాలయిన నేషనల్ కాన్ఫరెన్సు, పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీ చురుకుగా ఎన్నికలలో పాల్గొంటూ వచ్చాయి. ఒకపక్క వేర్పాటువాదం పూర్తిగా సమసిపోనప్పటికీ, కశ్మీర్ భారతదేశంలో అంతర్భాగమే అన్న భావం బలపడింది. ఆ తర్వాత జరిగిన ప్రతి ఎన్నికలలో ఓటింగ్ శాతం పెరుగుతూ వచ్చింది. పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికలలో కంటే స్థానిక సంస్థల ఎన్నికలలో, అసెంబ్లీ ఎన్నికలలో ప్రజలు ఎక్కువ ఆసక్తి కనబరచారు. 2011లో జరిగిన పంచాయితీ ఎన్నికలలో 80 శాతం ఓటింగ్ నమోదయ్యింది. ఆ సమయంలో వేర్పాటువాదులు, మిలిటెంట్లు ఇచ్చిన ఎన్నికల బహిష్కరణ పిలుపును ప్రజలు తిరస్కరించారు. 2008లో జరిగిన అమర్‌నాథ్ భూమి తగాదా తరువాత కూడా 52 శాతం (కొన్ని జిల్లాలలో 60 శాతం కూడా నమోదయ్యింది) ప్రజలు ఓటింగ్‌లో పాల్గొన్నారు.

2014 అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా రాజకీయ పార్టీలు అత్యంత క్రియాశీలకంగా ఎన్నికల ప్రక్రియలో నిమగ్నమయ్యాయి. ప్రజలు ఎంతో ఆసక్తి కనబరచారు. పరిపాలన కోసం రాజకీయాలు, వేర్పాటువాద రాజకీయాల మధ్య బలమైన గీత ఒకటి గీయబడింది. వేర్పాటువాద రాజకీయాలు ఉనికిలో ఉన్న, ప్రజాస్వామ్య వాతావరణం సర్వత్రా కనిపించలేదు. జమ్ము కశ్మీర్ రాజకీయాలపై ప్రత్యేక అధ్యయనం చేసిన రేఖా చౌదరి అభిప్రాయం ప్రకారం రోజువారీ అవసరాలయిన నీరు, విద్యుచ్ఛక్తి, రోడ్లు వంటి వాటి కోసం ఎన్నికల రాజకీయాలు తప్పనిసరి అవసరమని ప్రజలు గుర్తించారు.

అయితే, కేంద్రంలో భారతీయ జనతా పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత సమాంతరంగా నడుస్తూ ఉన్న వేర్పాటువాద రాజకీయాలు, పరిపాలన కోసం రాజకీయాలు రెండూ ముగిసిపోయే పరిస్థితి వచ్చింది. మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన రెండు సంవత్సరాల తర్వాత 2016 నుండి వేర్పాటువాద రాజకీయాలు పురివిప్పి నాట్యం చేస్తున్నాయి. 2017లో శ్రీనగర్ పార్లమెంటు స్థానానికి జరిగిన ఉపఎన్నికలో కేవలం 8 శాతం ఓట్లు మాత్రమే పోలవడం దీనికి నిదర్శనం. ఆ ఎన్నికలలో పెద్ద ఎత్తున హింస చోటు చేసుకుంది. ప్రజల నుండి ఒత్తిడి తట్టుకోలేక ప్రధాన రాజకీయ పార్టీలయిన నేషనల్ కాన్ఫరెన్స్, పీపుల్స్ డెమొక్రటిక్ పార్టీలు స్థానిక సంస్థల ఎన్నికలను బహిష్కరించమని పిలుపునిచ్చాయి. ఆర్టికల్ 35ఎ ను సుప్రీంకోర్టులో సవాల్ చేసిన కారణాన్ని చూపుతూ, దానికి నిరసనగా తాము ఎన్నికల బహిష్కరణకు పిలుపునిచ్చామని బయటికి చెపుతున్నా, అసలు కారణం క్షేత్రస్థాయిలో ఎన్నికల రాజకీయాలకు తీవ్ర వ్యతిరేకత నెలకొనడమే.

ఈ పరిస్థితిలో శాసనసభను రద్దు చేస్తూ గవర్నర్ తీసుకున్న నిర్ణయం కశ్మీర్ సమస్య పరిష్కారానికి ఎంత మాత్రం తోడ్పడదు. గవర్నర్ లాంటి రాజ్యాంగ వ్యవస్థను ఒక రాజకీయ పార్టీ ప్రయోజనాల కోసం కశ్మీర్ గవర్నర్ సత్యపాల్ మాలిక్ తీసుకున్న నిర్ణయం ఎంత మాత్రం సమర్థనీయం కాదు.

*(రచయిత జూనియర్ కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపల్)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# మళ్లీ అధికారం కోసమే అయోధ్య చిచ్చు

***బిజెపి, సంఘ్‌పరివార్ శక్తులు మళ్లీ అయోధ్య నినాదంతో ప్రజల మనోభావాలను రెచ్చగొట్టే ప్రయత్నం చేస్తున్నాయనీ, వచ్చే ఎన్నికల్లో మళ్లీ అధికారం సాధించేందుకు చేసే ఈ కుట్రలను ప్రజలు సంఘటితంగా తిప్పికొట్టాల్సిన అవసరముందనీ అంటున్నారు బైరెడ్డి సతీష్***

**భా**రతదేశంలో ఎన్నికలు ప్రజల జీవన్మరణ అంశాల ప్రాతిపదిక కాకుండా భావోద్వేగాలు, మనోభావాలు ప్రధానంగా జరుగుతూ ఉన్నాయి. అఖండ హిందూ భారత్ నిర్మాణమే అంతిమ లక్ష్యంగా కొనసాగుతున్న సంఘ్ పరివార్ బిజెపి రాజకీయాలు ప్రజల సమగ్రాభివృద్ధి, పురోగతి కంటే మనోభావాలను కేంద్రంగా చేసుకొని రాజకీయ అధికారాన్ని చేపట్టి అనుకున్నది దౌర్జన్యంగానైనా సాధించడం, అన్ని ప్రజాస్వామిక విలువలకు పాతరేయడం ఆ శక్తులు అధికారాన్ని చేపట్టిన ప్రతి సందర్భంలోనూ చూస్తున్నాం. ఏ సమూహపు సమస్యలను చేపట్టకుండా, ఉద్యమించకుండా ప్రజల తరఫున నిలబడకుండానే ఈ దేశంలో రెండు సీట్ల నుండి రెండు వందల సీట్లకు ఎకబాకటం కేవలం ప్రజల సున్నిత భావోద్వేగాలను రెచ్చగొట్టడం ద్వారానే సాధ్యమయింది.

పరివార్ శక్తులకు జాతీయోద్యమంలోనూ ఏ పాత్రలేదు! బ్రిటిష్‌వారు దేశం విడిచి వెళ్లిన అనంతరం ఈ దేశపు ఏ అట్టడుగు జన సమూహం కోసం పోరాడిందీ లేదు! కాని ఇవాళ అధికార పీఠంమీద కూర్చోవడం అన్ని ప్రజాస్వామిక వ్యవస్థలను, లౌకిక విలువలను రాజ్యాంగ స్ఫూర్తిని ధ్వంసంచేసే పాత్రను పోషిస్తున్నాయంటే అవి కేవలం అత్యంత సున్నితమైన, విశ్వాసపరమైన మనోభావాల పేరుతో భావోద్వేగాలను రెచ్చగొట్టడం ద్వారానే జరిగింది. ఎంతోకొంత సామాజిక న్యాయం జరిగే రిజర్వేషన్లను వ్యతిరేకిస్తూ, బ్రాహ్మణీయ తాత్విక దృక్పథంతో కుల వ్యవస్థను సమర్థిస్తూ మరోవైపు ఈ దేశ ముస్లింలను పరాయివారుగా చిత్రిస్తూ, సనాతన చాదస్తంతో వ్యవహరిస్తూ రాజకీయ అధికారాన్ని అందిపుచ్చుకోవడంలో శతాబ్దాలుగా ఈ దేశ సామాజిక పునాదిగా ఏర్పడ్డ ఒక విశ్వాస వ్యవస్థను ప్రధాన ఆయుధంగా పట్టుకొని రాజకీయ ప్రయోజనాలకనుగుణంగా మలుచుకుంటున్నవి.

1992 డిసెంబర్‌లో బాబ్రీ మసీదు కూల్చివేతతో దేశంలో మతోన్మాదాన్ని తారాస్థాయికి తీసుకెళ్లింది సంఘ్‌పరివార్. ఈ నేరపూరిత చర్య తర్వాత దేశమెంత రక్తసిక్తమయ్యిందో, ఎన్ని వేలమంది అమాయకులు బలయ్యారో చరిత్రలో నిక్షిప్తమైంది. ఆ చర్యకు కొనసాగింపుగా జరిగిందే గోద్రా అల్లర్ల దరిమిలా జరిగిన గుజరాత్ ముస్లింలపై ఊచకోత. పరివార్ ప్రవచిత హిందుత్వమే దేశభక్తి అని, జాతీయవాదమని బలంగా ప్రచారం చేస్తూ ఈ దేశ బహుళత్వాన్ని, ప్రజా సమూహపు భిన్నమైన అభిప్రాయాల మీద తీవ్రమైన దాడిని కొనసాగిస్తూ తమ భావజాలాన్ని విమర్శించే, వ్యతిరేకించే వ్యక్తులను, సంస్థలను భయకంపితులను చేస్తూ దేశమంతా ఒకే భావజాలం ఉండాలనే దుర్మార్గపు కార్యాచరణకు ఒడిగడుతున్నది. చరిత్రలో ఏనాడు ఏ ప్రజా సమూహపు హక్కులకై నినదించకపోగా అలాంటి గొంతుల్ని అణిచివేసే చర్యలకే పూనుకుంటున్నది. తన హిందుత్వ ఎజెండాకు ఎన్నికల్లో ఓటమి రూపంలో ఎదురుదెబ్బ తగిలినప్పుడల్లా దేశ వికాసం, ఆత్మగౌరం వంటివి గుర్తుకు వస్తాయి. సరిగ్గా 2014లో జరిగింది అదే.

గత ప్రభుత్వాలు అంతులేని అవినీతికి పాల్పడ్డాయని, అభివృద్ధి శూన్యమని, అంతర్జాతీయంగా దేశ గౌరవం అడుగంటిందని, సుపరిపాలన, అభివృద్ధి, అవినీతిలేని పాలనకు మోడీకి పట్టం కట్టాలని దేశీయ, విదేశీ కార్పొరేట్ శక్తులతో చేతులు కలిపి అధికారంలోకి వచ్చింది బిజెపి. గత మూడు దశాబ్దాలుగా అయోధ్యలోని రామమందిరం అంశం ప్రధానం చేసుకొని ఎన్నికల్లో లబ్ధిపొందినప్పటికీ ప్రజల్లో ఆ అంశానికి అంత ప్రాధాన్యత లేదని గుర్తించిన సందర్భంలో సుపరిపాలన, మోడీ మోడల్, గుజరాత్ తరహా అభివృద్ధి పేరుతో ప్రచారార్భాటాన్ని నిర్వహించినవి సంఘ్, బిజెపి శక్తులు.

గత నాలుగున్నరేళ్ల పాలనలో గంభీరోపన్యాసాలు, హామీల ప్రవాహాలు తప్ప ప్రజాజీవిత అనుభవంలోకి ఏదీ కూడా ఆచరణ రూపం తీసుకోలేదు. సంవత్సరానికి రెండు కోట్ల ఉద్యోగాల కల్పన, అక్రమంగా సంపాదించి విదేశీ బ్యాంకుల్లో దాచుకున్న సంపదను స్వదేశానికి తరలించి ప్రతి పౌరుని ఖాతాలో జమ చేస్తామన్న మోడీగారి ఆకర్షణీయమైన హామీ, గుజరాత్ అభివృద్ధి నమూనా అంటూ అదేదో అల్లావుద్దీన్ అద్భుత దీపం అన్నట్టు సంపన్నులను మరింత సంపన్నులుగా మార్చిన నమూనానే మరింత ముందుకు తేవడం, అవినీతిని ప్రక్షాళన చేసి నీతివంతమైన పాలనను అందిస్తామన్న హామీని తుంగలోతొక్కి, రాఫెల్ యుద్ధ విమానాల కొలుగోలు వ్యవహారాల్లో రహస్య ఒప్పందాలు కుదుర్చుకొని అయినవాళ్లకు ఆర్థిక ప్రయోజనాలు కలిగించడం, పెద్దనోట్ల రద్దు పేరుతో పెను ప్రమాదాన్నే సృష్టించి అసంఘటిత రంగాల్లో పనిచేసే బడుగుజీవుల ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేయడం, ఒకే దేశం ఒకే పన్ను పేరుతో జిఎస్‌టిని ప్రజలపై రుద్దడం, విదేశీ పర్యటనలే తప్ప స్వదేశంలో అన్ని ప్రాంతాల, అన్ని సమూహాల సమస్యలపై దృష్టి సారించకపోవడం, స్వతంత్ర సంస్థలుగా వ్యవహరించేవాటి రాజ్యాంగ స్వతంత్ర ప్రతిపత్తిని దెబ్బతీసి తమ చెప్పుచేతల్లో పెట్టుకోవడమే కాకుండా వాటిని తమ మనుషులతో నింపివేయడమో చేస్తూ అన్ని వ్యవస్థలను తమ భావజాలానికి అనుగుణంగా మార్చుకునే ప్రక్రియను బలవంతంగా అమలు చేస్తున్నారు. చివరికి న్యాయ వ్యవస్థను సహితం ప్రభావానికి గురిచేస్తూ తమకు అనుకూలమైన తీర్పులను ఇప్పించుకునే స్థాయికి సంఘ్‌పరివార్, బిజెపి రాజకీయాలు వెళ్లినవి.

న్యాయమూర్తుల నియామకాలు, కొలీజియం పద్ధతిని వ్యతిరేకిస్తూ తన పట్టును, ప్రభావాన్ని పెంచుకునేందుకు మొత్తంగా న్యాయమూర్తుల

నియామకపు ప్రక్రియనే తన చెప్పుచేతుల్లో పెట్టుకునేలా సుప్రీంకోర్టుతో ఘర్షణాయుత ధోరణితో వ్యవహరించాయి.

అభివృద్ధి నినాద గాంభీర్యతను ప్రదర్శించి తామే దేశ భక్తులమని, రక్షకులమని అధికారంలోకి వచ్చిన ఈ శక్తులు తమ ఘోర వైఫల్యాలను కప్పిపుచ్చుకునేందుకు ప్రజల దృష్టిని అసలైన అంశాల నుండి మరల్చేందుకు దేశంలో భయానక పరిస్థితిని సృష్టిస్తూ అసహనపూరితమైన, విద్వేష పూరితమైన సంస్కృతిని వ్యాపింపజేసాయి. కుల పరంగా, మత పరంగా విద్వేషాన్ని రెచ్చగొట్టేలా గో రాజకీయాలను ముందుకు తెచ్చి దళితులు, ముస్లింపైన హింసా దౌర్జన్యాలకు పాల్పడ్డారు.

ఆవు మాంసాన్ని కలిగి ఉన్నాడనే నెపంతో ఉత్తర ప్రదేశ్‌లో అఖ్లాక్ హత్య మొదలుకొంటే గుజరాత్ ఊనాలో దళితులపై హింసా ప్రయోగం, ఆగస్ట్ 15, జనవరి 26న మైనారిటీలు ముఖ్యంగా ముస్లీంలు జెండా ఎగరేసి దేశభక్తిని చాటడం లేదని వారి వాడల్లో దౌర్జన్యంగా ప్రవేశించి దాడులు చేయడం, ప్రజాస్వామిక వ్యవస్థ ప్రాణాధారమైన భిన్నాభిప్రాయాలని కలిగి ఉండే హక్కులను, విమర్శించే, వ్యతిరేకించే, అసమ్మతిని తెలియపరిచే రాజ్యాంగ ప్రాథమిక హక్కైన భావప్రకటన స్వేచ్ఛను హరించేలా అర్బన్ నక్సల్స్ పేరుతో బుద్ధిజీవుల్ని తప్పుడు కేసులు పెట్టి జైళ్లల్లో వేయడం, కల్బుర్గి, గౌరీ లంకేష్ లాంటి వారిని పాశవికంగా హత్య చేయడం ద్వారా వీరి అసలు ఎజెండాను నగ్నంగా అమలు పరుస్తున్నారు.

ఒకే దేశం, ఒకే చట్టం, ఒకే పన్ను, ఐక్యతా విగ్రహం, బడుల్లో సూర్య నమస్కారాలు, పుక్కిటి పురాణాలను చరిత్రగా చెప్పే బలవంతపు ప్రయత్నాలు, భగవద్గీతను జాతీయ గ్రంథంగా మార్చే యత్నాల వెనుక ఉన్న, భిన్నత్వాన్ని ఏ మాత్రం గుర్తించకుండా, గౌరవించకుండా ఈ దేశం ఏకశిలా సదృశ్యమైనదని అఖండ హైందవ దేశ నిర్మాణం చేసే ఎజెండా తప్ప మరొకటేమి కాదు. మోడీ అధికారం చేపట్టాక గత ప్రభుత్వాల వైఫల్యంతో ఆయా రాష్ట్రాల్లో బిజెపి అధికారంలోకి రావడాన్ని తమ హిందూ ఎజెండాకు ఆమోదనీయత ప్రజల్లో ఉందని చెప్పే సనాతన సైన్యం రెట్టించిన ఉత్సాహంతో సామాజిక మాధ్యమాల్లో నిరంతరం ప్రయత్నం చేస్తూనే ఉన్నాయి.

గత ఆరు నెలలుగా ప్రత్యేకించి మధ్య భారతంలో మూడు రాష్ట్రాల్లో ఓడిపోతామని తెలిసాక, అమలు చేస్తామని చెప్పిన అభివృద్ధి ఎజెండా డొల్ల అని ప్రజలు తెలుసుకుంటున్నారని, మోడీ జపం జనం నోళ్లలోంచి జారిపోతుందని మూడు రాష్ట్రాల్లో అధికారం కోల్పోయాక అమ్ములపొదిలో దాచుకున్న విచ్ఛిన్నకర ఆయుధమైన అయోధ్యను మళ్లీ ప్రయోగించే పనిలో పడింది పరివార్. అలా అని ఈ కాలమంతా ఆ అంశాన్ని లేవనెత్తలేదని కాదుగాని ప్రధాన ఎన్నికల ఎజెండాగా దేశ ప్రజలందరి ఆకాంక్ష అన్నట్టు తమ ఆధిపత్యాన్ని దేశంమీద రుద్దేందుకు, మళ్లీ మనోభావాల పేరుతో భావోద్వేగాలను రెచ్చగొట్టేందుకు సాధులు, సంతులు పరాన్నభుక్కుల్ని వెంటేసుకుని అయోధ్య వీధుల్లో, ఢిల్లీ గల్లీల్లో ధర్మసభల పేరుతో విహెచ్‌పి వీరంగం చేస్తున్నది. మరోవైపు సుప్రీం కోర్టు 2010లో అలహాబాద్ హైకోర్టు 2.77 ఎకరాల వివాదస్పద భూమిని మూడు భాగాలుగా నిర్మోహి అఖారా, సున్నీ వక్ఫ్‌బోర్డు, రాంలల్లాలకు పంచుతూ ఇచ్చిన తీర్పుపై విచారణను 2019 జనవరికి వాయిదా వెయ్యడాన్ని సంఘ్ పరివార్ శక్తులు సహించలేకపోతున్నాయి. అదేదో యుద్ధప్రాతిపదికన పరిష్కరించాల్సిన అత్యవసర అంశమన్నట్లు, వాయిదా వేయడాన్నే మొత్తం హిందువుల మనోభావాలను గాయపర్చినట్లు అంత కంటే తక్షణ ప్రజాప్రయోజన సమస్యలేవి సుప్రీంకోర్టులో లేవన్నట్లు వ్యవహరిస్తున్నది. మరొక అడుగు ముందుకేసి ఏకంగా కేంద్ర ప్రభుత్వం ఆలయ నిర్మాణానికై ఆర్డినెన్స్ రూపంలో చట్టం తేవాలని సంఘ్ సర్‌సంఘ్ చాలక్ మోహన్ భగవతీ న్యాయసూత్రాలకు వ్యతిరేకమైన సలహా ఇస్తున్నాడు.

అసలు విశ్వాసాలకు సంబంధించిన అంశంలో కోర్టు ఎలా జోక్యం చేసుకుంటుందన్న ప్రశ్నతో ఏకంగా ఈ వ్యవహారాన్ని తేల్చాల్సింది హిందూ మత 'పెద్దలు' మాత్రమే అనే వాదాన్ని బలంగా వినిపిస్తూ ఆ మత పెద్దలు సంఘ్ పరివార్ నాయకత్వంలో ఉన్న సాధులు, సంతులు అని అదేదో మొత్తం హిందువులకు సంఘ్‌పరివార్ మాత్రమే ఏకైక ప్రతినిధి అన్నట్టు బాహాటంగా మాట్లాడుతున్నారు. నిజానికి ఇలా వాదించడం ద్వారా విశ్వాసపరమైన అంశాలేమో గాని మెజారిటీ అధిపత్యాన్ని ఈ దేశంపై రుద్దడం ద్వారా మైనార్టీలను లొంగదీసుకోవడం, రాజ్యాంగ విలువల్ని సమాధిచేయాలనే కుయుక్తి మాత్రమే కనిపిస్తుంది. రాజ్యాంగాన్ని మార్చడం కోసమే అధికారంలోకి వచ్చాం అనే వాళ్లు కోర్టు తీర్పులను గౌరవిస్తారని ఎలా విశ్వసించగలం? పైగా ఈ అంశంపై హిందువుల్లో సహనం నశించిపోతున్నదని తదుపరి ఏ పరిణామాలకు తాము బాధ్యులం కామని వారు చేయబోయే దుర్మార్గపు చర్యలకు సంకేతంగా మాట్లాడుతున్నారు.

ఇప్పటికే శబరిమలై తీర్పులో మహిళలకు పురుషులతో సమానంగా సందర్శించే హక్కులుంటాయన్న తీర్పును బాహాటంగా వ్యతిరేకిస్తూ కేరళలో బిజెపి ప్రత్యక్ష కార్యాచరణకు దిగింది. తమ సంఘాల ద్వారా అక్కడి మహిళలను రెచ్చగొట్టి కోర్టు తీర్పుతో తమ ధర్మం మంట గలిసిందని, అయోధ్య విషయంలో కూడా హిందువులకు వ్యతిరేకంగా తీర్పు ఉండబోతున్నదన్నట్లు ప్రజల్ని రెచ్చగొట్టే ప్రయత్నాలు ఓవైపు తీవ్రం చేస్తూ, మరోవైపు తమ ప్రభుత్వం ద్వారా ప్రత్యేకంగా ఆలయ నిర్మాణ చట్టం ఒకటి న్యాయవ్యవస్థ పాత్రను తప్పిస్తూ తీసుకురావాలనే యత్నాలను చేస్తున్నది.

దక్షిణాదిన తన ఉనికిని మరింత పెంచుకోవాలంటే తను చెప్పిన అభివృద్ధి ఎజెండా నాలుగున్నరేళ్లలో వట్టిదే అని తేలిపోవడంతో మతోన్మాదాన్ని రెచ్చగొట్టి ఉత్తరాదిన కోల్పోతున్న పట్టును ఇక్కడ భర్తీ చేసుకోవాలని చూస్తున్నది బిజెపి. మహారాష్ట్రలోని శనిసింగనాపూర్ ఆలయ ప్రవేశంపై మహిళలకు ఉన్న నిషేధాన్ని కోర్టు రాజ్యాంగ పరంగా సమానత్వ హక్కుల భావనకు భంగకరమని కొట్టివేసిన సందర్భంలో అక్కడ మహిళల ప్రవేశాన్ని అడ్డుకోకపోవడానికి అక్కడ ఉన్నది బిజెపి ప్రభుత్వమే. అదే కేరళలో అందుకు భిన్నంగా న్యాయవ్యవస్థ తీర్పుకు వ్యతిరేకంగా వ్యవహరిస్తున్నది.

మోహన్ భగవతీ దసరా ఉత్సవాల సందర్భంగా మాట్లాడుతూ ఆలయ నిర్మాణం ఆత్మగౌరవ అంశమని, దేశ సమక్యతను పటిష్టపరుస్తుందని చెప్పుకొచ్చారు. ఇది ఎంత హస్యాస్పదమైనదంటే గత మూడు దశాబ్దాలుగా అయోధ్య అంశం ఎంత నెత్తురు పారించింది, ఎంత విధ్వంసాన్ని సృష్టించింది , ఎంత లోతుగా మత విభజనను తీసుకొచ్చిందో తెలియనట్టు మాట్లాడడం దుర్మార్గం కాక మరేమిటి?

భక్తి పేరుతో ఏ సమూహాన్ని వివక్షకు గురిచేయరాదని, ఆచారాలు కట్టుబాట్ల పేరుతోనూ రాజ్యాంగ హక్కుల్ని ఉల్లంఘించడం కుదరదని సుప్రీంకోర్టు చెప్పడం సమానత్వ భావనని ఆమోదించని సంఘ్‌పరివార్‌కి రుచించడం లేదు. హక్కుల కంటే విశ్వాసాలే ప్రధానమన్నట్టు ఈ దేశ న్యాయవ్యవస్థ ఈ అంశాల్లో జోక్యం చేసుకోరాదని అలా చేయడం విశ్వాసాలకు విఘాతం కలిగిచండమే అనడం మొత్తంగా న్యాయ వ్యవస్థ పాత్రనే లేకుండా చేయడం ద్వారా దేశంలో మహిళలు, మైనార్టీలు, ఆదివాసులు, దళితులకు, ఇతర అణగారిన వర్గాలకు ఉండే కనీస రక్షణలను హక్కులను పరిరక్షించుకునే మార్గాలను మూసివేయడం ద్వారా బ్రాహ్మణీయ ఆధిపత్యాన్ని హిందూ ధర్మం పేరుతో స్థిరపరిచే కార్యాచరణకు పదును పెట్టే పనిలో ఉన్నది పరివార్.

నిజానికి ఆయోధ్య ఒక భూవివాద అంశం కాదు. మొత్తంగా ఈ దేశ ప్రజాస్వామిక, బహుళత్వ, లౌకిక విలువలను చెరిపివేసి రాజ్యాంగాన్నే రద్దుచేసే కుట్రలో పరివార్‌కి ప్రధానాస్త్రం. వీళ్లు ప్రవచించే రామ రాజ్యం అంటే హిందూ ఆధిపత్య రాజ్యమే. అసమానతలను, వివక్షతలను దైవ నిర్ణయమనే బ్రాహ్మణీయ భావజాలాన్ని పటిష్టంచేసి స్థిరపరచడమే తప్ప మరొకటి కాదు.

నాలుగున్నరేళ్లగా మోడీ మోహం తప్పుడు ప్రచారాలు, సామాజిక మాధ్యమాల్లో విచ్చలవిడిగా కల్పిత కథనాలతో ప్రజల్లో మెదళ్లలో నింపే ప్రయత్నాలు చేసినా ప్రజల అనుభవాలు ఆయన పాలనలో ఒరిగింది శూన్యమేనన్న భావనతో నిండుకోవడంతో సంఘ్‌పరివార్‌కు నిద్రపట్టడం లేదు. మోడీలాంటి 'మొనగాన్ని' యోగీ రూపంలో తయారు చేయాలనుకొని పచ్చి మతోన్మాది అయిన ఆధిత్యానాథ్ యోగిని మతపీఠం నుండి ఉత్తరప్రదేశ్ అధికార పీఠంమీద కూర్చోబెడితే అంతకంటే ఘోర పాలనను అందిస్తూ ఏ సమూహానికి భద్రత లేకుండా చేయడమే కాకుండా విద్యా, వైద్యం లాంటి అతి కీలకరంగాల్లో అత్యంత దారుణంగా విఫలమవడం, స్వయంగా తానే ప్రాతినిధ్యం వహించిన లోక్‌సభ స్థానాన్ని ఉప ఎన్నికల్లో చిత్తుగా ఓడిపోవడంతో సంఘ్‌పరివార్‌కి అయోధ్య తప్ప ఆదుకునే మరో అంశమేది కనుబడడంలేదు. పైగా ఎస్పీ, బిఎస్పీ, కాంగ్రెస్‌ల కలయిక చావు దెబ్బతీసే ప్రమాదమూ తప్పదనే జ్ఞానోదయమే వారిని అయోధ్యను మళ్లీ నెత్తిన పెట్టుకునేలా ప్రేరేపించింది. సంఘ్‌పరివార్, బిజెపికి అది రాజకీయ ప్రయోజనాలు తెచ్చిపెట్టే అంశమే కావచ్చు గానీ ప్రజలకది తక్షణ జీవన్మరణ సమస్య కాదని బాగా తెలుసు. బతుకులను బాగు చేసే బదులవైపు ప్రజల దృష్టి ఉంటే గుడుల పేరుతో ప్రజల మధ్య చిచ్చుపెట్టే మతోన్మాద ఎజెండా మీద దృష్టిపెట్టింది సంఘ్‌పరివార్.

ఉత్తరాదిన రాజకీయ పట్టు సడలుతుండడం, మూడు రాష్ట్రాలు కాంగ్రెస్ ఖాతాలోకి జారుకోవడం, దేశ రాజకీయాలనే నిర్దేశించే, కేంద్రంలో ప్రభుత్వాన్ని ఏర్పరచే ప్రక్రియలో అతికీలక పాత్ర పోషించే ఉత్తరప్రదేశ్‌లో ప్రతిపక్షాలు ఐక్యమవడం మళ్లీ అయోధ్య అగ్నిని రాజేయడానికి తక్షణ కారణమయ్యింది తప్ప అది ప్రజల డిమాండ్, ఆకాంక్ష అంతకంటే కాదు.

మరోవైపు ఆందోళన కలిగించే అంశమేమిటంటే ఎన్నికల రాజకీయాల్లో ఏ పార్టీ సూత్రబద్ధ వైఖరిని ప్రదర్శించే స్థితిలో లేకపోవడం. ప్రధాన ప్రతిపక్షమైన కాంగ్రెస్ కూడా లౌకిక పార్టీగా కనిపించే తీవ్ర ప్రయత్నం చేస్తున్నది తప్ప ఆచరణలో అది హిందూత్వన్నే ప్రదర్శిస్తున్నది. కోర్టు తీర్పుకు కట్టుబడి ఉంటామనే ప్రకటన తప్ప ఆలయ నిర్మాణ ఎజెండా ఈ దేశ లౌకిక విలువలకు వ్యతిరేకమైనదని బాహాటంగా చెప్పే పరిస్థితిలో లేదు. ఓట్లపైననే దృష్టి తప్ప రాజ్యాంగ ఆదర్శాలను ఆచరణలో ప్రదర్శించే నిజాయితీ, నిబద్ధత కాంగ్రెస్‌కు లేవు.

నిజానికి అయోధ్య ఇంత సంక్లిష్టం కావడం వెనుక సంఘ్‌పరివార్ విచ్ఛిన్నకర మతోన్మాద ఎజెండా కారణమైతే కాంగ్రెస్ అవకాశవాద రాజకీయాలు కూడా తక్కువేమి కాదు! గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో, మొన్నటి మూడు రాష్ట్రాల సాధారణ ఎన్నికల్లోనూ జంధ్య ప్రదర్శన చేసిన రాహుల్‌గాంధీ కనపడ్డ గుడిలోకెల్లి తాను ఎంత నిఖార్సయిన హిందువునో చెప్పుకున్నాడు. మోడీ అభివృద్ధి నమూనా డొల్లతనాన్ని చెప్పడం కంటే సంఘ్‌పరివార్ సనాతన ధర్మాన్ని పాటించడంలో మేమేమి వెనుకబడలేదనే సంకేతాన్ని కాంగ్రెస్ మృదు హిందూత్వ విన్యాసాల ద్వారా బట్టబయలవుతున్నాయి.

ఉత్తరాదిన ఎన్నికలు జరిగినప్పుడల్లా రాహుల్ గాంధీ గుడుల ప్రవేశంతో ప్రచారం మొదలుపెడితే, దక్షిణాదిన మంత్రాలకు చింతకాయలు రాలవు కాబట్టి ఆ పనిని చేసే సాహసం చేయలేదు. ప్రాంతీయ పార్టీలదీ దాదాపుగా అదే వైఖరి. మైనార్టీ ఓట్లు కావాలి కాబట్టి 'లౌకిక' మాటల్ని వల్లెవేస్తాయి తప్ప బాహాటంగా విచ్ఛిన్నకర హిందూత్వ ఎజెండాను వ్యతిరేకించే సాహసం చేయడం లేదు. అపర భక్తుడైన తెలంగాణ ముఖ్యమంత్రి బిజెపి మత రాజకీయాలను వ్యతిరేకిస్తున్నట్లు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తాడు తప్ప ఆయోధ్యలో ఆలయ నిర్మాణ ఎజెండాను నిర్ద్వందంగా వ్యతిరేకించిన సందర్భాలు లేవు!

'జీవకళ' గురించి ప్రవచనాలు చెప్పే రవిశంకర్‌లాంటి వాళ్లు ఆయోధ్య అంశంలో మధ్యవర్తిత్వం వహిస్తామన్నట్టు మొదలయ్యి అయోధ్యలో మంధిర నిర్మాణం జరుగకపోతే దేశంలో అంతర్యుద్ధం వస్తుందని, సిరియా లాంటి పరిస్థితులే తలెత్తుతాయని సంఘ్‌పరివార్ హెచ్చరికలనే జారీచేయడం చూస్తుంటే సంఘ్‌తో ప్రత్యక్ష సంబంధాలు లేనట్టే బయటికి కనపడినా అవన్నీ ముసుగులో ఉన్న బ్రాహ్మణీయ ఛాందస సంస్థలే!

ఈ దేశంలో దళిత, ఆదివాసీ, మహిళ, మైనార్టీల అస్తిత్వం, హక్కుల గురించి మాట్లాడే వాళ్లు, పోరాడే వాళ్లు దేశ ద్రోహులుగా కనిపిస్తారు. పచ్చి మత ఛాందస్తులు దేశభక్తులుగా వెలుగొందుతారు. మీడియా కూడా భయంతోనో, స్వప్రయోజనాల కోసమో ఆయోధ్య ఒక అతి ముఖ్యమైన అంశమన్నట్లు వెంటనే తేల్చిపారయ్యకపోతే ఉప్పెనేదో ఉరికొస్తున్నట్టు ప్రత్యేక కథనాల ప్రవాహంతో ప్రజల్ని ముంచివేస్తున్నది. సుప్రీం కోర్టులో భూయాజమాన్య వివాదం పేరుతోనైనా నడుస్తున్న ఒక వాజ్యం పట్ల అప్రమత్తంగా ఉండాల్సింది పోయి బాధ్యతారాహిత్యంతో ప్రజల్లో గందరగోళం తలెత్తేలా, ఆపోహలు పెరిగేలా, అసహనం కలిగించేలా కథనాలు ప్రసారం చేయడం 'సంచలనకాంక్ష'ను మాత్రమే తెలుపుతున్నది తప్ప ప్రజల మధ్య సహృద్భావం, సామరస్యం వెల్లివిరిసేలా వ్యవహరించడం లేదనేది స్పష్టమవుతున్నది.

2019 జనవరిలో ప్రయాగలో జరిగే కుంభమేళ వేదికగా లక్షలాది మందిని రెచ్చగొట్టే పనికి పదును పెడుతున్నవి పరివార్ శక్తులు. సందర్భం దొరికినప్పుడల్లా 'శతృ' దేశాల బూచీని, దేశ సమైక్యతా, సమగ్రతా

సెంటిమెంట్‌తో తామే దేశభక్తి పేటేంట్‌దారులమన్నట్టు వ్యవహరిస్తూ అంతర్గతంగా మతచిచ్చును రాజేస్తున్నాయి. దేశవ్యాప్తంగా రాబోయే సాధారణ ఎన్నికల ముందు మత చిచ్చును రాజేస్తే రోటీ, కపడా, మకాన్ లాంటి తక్షణ అవసరాలో, నిరుద్యోగం, ఉన్న ఉద్యోగం భద్రత, మూతపడుతున్న కంపెనీల కార్మికుల బతుకులు, అసంఘటిత రంగంలో బిక్కుబిక్కుమంటూ బతుకులెల్లదీస్తున్న బక్కజీవుల గురించి, ఆత్మగౌరం కోసం అనునిత్యం నెత్తురొడుతున్న దళితులు, అస్థిత్వం కోసం అనుక్షణం పరితపిస్తున్న మైనార్టీలు, కాలికింద నేలను కోల్పోతున్న ఆదివాసులు, ప్రతినిత్యం హింసకు గురిచేయబడుతున్న దేశ జనాభాలోని సగభాగమైన స్త్రీలు, అన్నింటిని అర్థంకాకున్నా మౌనంగా భరించే పిల్లలు ఇలా ఏ వర్గం జీవన్మరణ సమస్యలపై చర్చ కాకుండా నువ్వు అటా ఇటా అనే ఒక మత విభజన మాత్రమే జరిగేలా దేశ ప్రజలకి అన్ని దారులు మూసుకుపోయే ప్రమాదం తలెత్తుతుంది.

సరిగ్గా గుజరాత్ ముస్లీంల ఊచకోత తర్వాత నరేంద్రమోడీ ఇలాంటి విభజనను సృష్టించే నెత్తుటి మరకలు ఆరకముందే అధికార పీఠం మీద కూర్చున్నాడు. ఇవాళ అదే ప్రయోగాన్ని దేశ సాధారణ ఎన్నికల ముందు న్యాయవ్యవస్థ విశ్వాసపరమైన అంశాలను తేల్చలేదన్న మిషతో కొత్త చట్టం తీసుకువస్తే దేశం మత ప్రాతిపదిక చీలితే మైనార్టీల నెత్తురు పారితే మళ్లీ అధికారం అందుకోవాలన్నదే పరివార్ ఎత్తుగడ.

గోవుల్ని రక్షించే పేరుతో గోమాఫియాలు ఏర్పాటవుతున్నాయి. ఉత్తరప్రదేశ్ బులందర్‌షా ఘటనలో పోలీస్‌ఆఫీసర్ మృతికి కారణమైంది ఈ మాఫియానే. ఇప్పుడది కరసేవకుల మాఫియాను మళ్లీ ముందుకు తెస్తున్నది. నెత్తురుటేరులు పారించైన అధికారం నిలుపుకోవాలన్న దుష్ట పన్నాగాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఈ మందిర నిర్మాణమే కాదు బాబరు కాలం నుండి అందరు ముస్లీం రాజుల కాలంలో వారికి బలం అధికారం ఉన్న రోజుల్లో ఏంచేసారో మేము అధికారం అంగబలం ఉన్నప్పుడు అదే చేస్తామని వారణాసి జ్ఞాన్‌వ్యాపి మసీదు అయిన, ఢిల్లీలోని జామమసీదు అయినా ఏదైనా సరే 'వైభవోజ్వల' హిందూ సంస్కృతికి విఘాతం కలిగించిన ఏ కట్టడాన్నయినా కూల్చివేస్తామని బహిరంగంగా ప్రకటనలు గుప్పిస్తున్నాయి సంఘ్‌పరివార్ శక్తులు. తమ పార్టీ మైనార్టీ మోర్చా ద్వారా సున్నీ షియాల మధ్య ఉన్న విభేదాలను కూడా తమ విచ్ఛిన్న విద్వేషకర రాజకీయాల్లో భాగం చేసుకోవడానికి కుటిల యత్నాలు జోరుగా సాగుతున్నాయి.

ఈ చారిత్రిక సందర్భంలోనే దేశ ప్రజలందరి ఐక్యతను విశ్వాసాల మధ్య సామరస్యాన్ని పెంపొందించేందుకు, వట్టి విశ్వాసాలకంటే మానవ వికాసాన్ని, ఉన్నతమైన మానవ సంబంధాలను, భిన్నత్వంపై గౌరవాన్ని, లౌకిక ప్రజాస్వామిక విలువలను ఎత్తిపట్టేలా ప్రగతిశీల ఆలోచనాపరులు తమ కార్యాచరణకు ఏ బెదురు లేకుండా పదును పెట్టాలి. సందర్భం ఏదైనా గొంతులు చిన్నవైనా ఈ విచ్ఛిన్నకర ఎజెండాను ఎదిరించాల్సిందే, అడ్డుకోవాల్సిందే. పార్టీలు తక్షణ ఓట్ల ప్రయోజనాలకై కాకుండా భవిష్యత్తు తరాల కోసమైనా కనీసమైన సూత్రబద్ధ వైఖరి ప్రదర్శించి విలువల కోసం నిలబడకపోతే భవిష్యత్తులో ఈ ఎన్నికల ప్రజాస్వామ్యమైన నిలబడదనే విషయాన్ని గుర్తెరిగి వ్యవహరించాలి. వీ

*(రచయిత ఆంగ్ల ఉపాన్యాసకులు)*

# ఎన్నికల ఎత్తుగడే అయోధ్య వివాదం

***రాజకీయ ప్రయోజనాల కోసమే బిజెపి, ఆర్‌ఎస్‌ఎస్‌లు అయోధ్య అంశాన్ని వివాదం చేస్తున్నాయనీ, ప్రజలు అప్రమత్తమై ప్రత్యామ్నాయ రాజకీయాలతో ఈ మతోన్మాద శక్తులను ఓడించాలని అంటున్నారు* షేక్ కరిముల్లా**

'మతం ప్రజల పాలిట మత్తు మందు' – మార్క్స్

ఏ ముస్లిం మహ్మద్ ప్రవక్త పేరు చెప్పి ఓట్లడగడు.

ఏ క్రైస్తవుడు జీసస్ పేరు చెప్పి ఓట్లడగడు.

ఏ సిక్కు గురునానక్ పేరు చెప్పి ఓట్లడగడు.

కాని బిజెపి మాత్రం అయోధ్య రాముని పేరుతో ఓట్లడుగుతుంది. ఆ పేరుతో దేశంలో మత మారణహోమాన్ని సృష్టిస్తుంది – అంటూ ఇటీవల సోషల్ మీడియాలో ఈ పోస్టు చక్కర్లుకొడుతూ, ప్రజల్ని ఆకర్షిస్తూ ఉంది. దీన్ని ఎవరు రూపొందించారో కాని విషయాన్ని కొద్ది పదాలతో సూటిగా, స్పష్టంగా వాస్తవాన్ని చెప్పారు. ఏప్రిల్ 2019 సార్వత్రిక ఎన్నికలు, ప్రస్తుతం జరుగుతున్న ఐదు రాష్ట్రాలలోని ఎన్నికలలో లబ్ది పొందడానికి మళ్లీ ఎన్నికల ఎత్తుగడగా అయోధ్య వివాదాన్ని తెరపైకి తెచ్చారు. బిజెపి, సంఘపరివార్ శక్తులు మతవిద్వేశాలతో మూడు దశాబ్దాలుగా మనుగడ సాగిస్తూ, చివరకు రాజకీయ అధికారాన్ని పొందిన ఈ నాలుగన్నర ఏళ్లలో ప్రజలకు ఏమి చేయకపోగా, స్వతంత్ర్యానంతరం లౌకికస్ఫూర్తితో నిర్మించుకున్న రాజ్యాంగ వ్యవస్థలన్నింటినీ ధ్వంసం చేశారు.

నోట్ల రద్దు, వస్తు సేవల పన్ను (జిఎస్‌టి), చమురు ధరల బాధుడు వంటి వాటితో ప్రజల నడ్డి విరిచారు. ప్రతి రంగంలోనూ విఫలమై ప్రజలకు కన్నీళ్లు మిగిల్చారు. మళ్లీ అధికారంలోకి రావడానికి అయోధ్య రాముణ్నే నమ్ముకున్న ఈ శక్తులు నవంబర్ 25న అయోధ్యలో ధర్మ సభ పేరుతో అలజడి సృష్టించారు. ఈ మత విద్వేషాలు చల్లారకుండా ఉండేందుకు దేశ వ్యాప్తంగా వివిధ కార్యక్రమాలు నిర్వహించేందుకు ప్రణాళికలు రూపొందించారు. వారణాసిలో జ్ఞాన్‌వ్యాపి మసీదును కూల్చి విశ్వనాథాలయాన్ని నిర్మిస్తామని, ఢిల్లీలో జుమ్మ మసీదును కూడా కూలుస్తామని దేశం వీరి సొంత జాగీరైనట్లు బీరాలు పలుకుతున్నారు.

బెంగాల్‌లో తలపెట్టిన రథయాత్రకు ప్రభుత్వం అనుమతి నిరాకరించడంతో పాటు కోల్‌కతా హైకోర్టు కూడా బ్రేకులు వేసింది. 'బెంగాల్‌లో ఎట్టి పరిస్థితులలోనూ రథయాత్ర చేపట్టే తీరుతామని, తమని ఎవరూ ఆపలేరని' బిజెపి అధ్యక్షుడు అమిత్‌షా సవాల్ విసిరాడు. రామ జన్మభూమి–బాబ్రీ మసీదు వివాదంపై సుప్రీంకోర్టు విచారణకు తొందరేమీ లేదని జనవరి నెలకు వాయిదా వేసింది. సార్వత్రిక ఎన్నికలకు ముందు అయోధ్య అంశాన్ని వాడుకొని తద్వారా రాజకీయంగా లాభపడాలనుకున్న బిజెపి పరివారానికి సుప్రీం తీర్పు అడ్డుగా నిలిచింది. దీంతో సర్వోన్నత న్యాయ స్థానంపై సైతం ఈ శక్తులు దాడి చేస్తున్నాయి.

సుప్రీంకోర్టు తాము కోరుకున్న విధంగా పనిచేయాలని ఒత్తిడి చేయడం, న్యాయ వ్యవస్థను నియంత్రించాలనడం ఈ శక్తులు సాగిస్తున్న దాడుల్లో కెల్లా అత్యంత ప్రమాదకరమైనది. న్యాయ వ్యవస్థను హిందూ మతోన్మాద రాజకీయ లక్ష్యాలకు అనుగుణంగా పనిచేయించేందుకు ఈ శక్తులు బెదిరింపులకు పాల్పడడం ఆందోళనకరం. ఈ నేపథ్యంలో రామ మందిర నిర్మాణానికి ఆర్డినెన్స్ తెచ్చే యోచనలో కేంద్రం ఉందని ఆర్‌ఎస్‌ఎస్ నేత ఇంద్రకుమార్ ప్రకటించాడు.

మరోవైపు 'అయోధ్య విషయాన్ని కాసేపు పక్కన పెట్టండి. వెంటనే మాకు రుణమాఫీ చేయండి' అంటూ రైతులు ఢిల్లీలోని రామ్‌లీలా మైదానంలో గర్జించారు. దేశ రాజధానిలో రైతులు భారీగా కదం తొక్కారు. రైతు రుణమాఫీ, గిట్టుబాటు ధరలు, ఉచిత విద్యుత్, స్వామినాథన్ కమిషన్ చేసిన సిఫార్సుల అమలు లాంటి డిమాండ్లతో వారి సమస్యల పరిష్కారం కోరుతూ మొత్తం లక్ష మందికి పైగా రైతులు నినాదాలతో కదిలి వచ్చి ధర్నాలో పాల్గొన్నారు. భారత్ కిసాన్ సభ ఆధ్వర్యంలో 70కి పైగా రైతు సంఘాలతో నవంబర్ 28న ఢిల్లీలో భారీ ర్యాలీ జరిగింది. వైద్యులు, లాయర్లు, కళాకారులు, ఉపాధ్యాయులు, అన్ని వృత్తులవారు రైతులకు సంఘీభావం తెలుపుతూ ధర్నాలో పాల్గొన్నారు.

తెలుగు రాష్ట్రాల నుంచి కూడా వందల మంది రైతులు పాల్గొన్నారు. దేశ ప్రజలకు అన్నం పెట్టే అన్నదాతల ఆక్రంధనలు, వీరి ఆత్మహత్యలు వీరికి పట్టవు. ఈ రైతు సమస్యల పరిష్కారానికి ఆర్డినెన్స్ తీసుకురమ్మని వీరు మాట్లాడరు. ప్రజల మౌలిక సమస్యలైన ఆకలి, పేదరికం, విద్య, వైద్యం, నిరుద్యోగం లాంటివి పరిష్కరించమని ఎక్కడా మాట్లాడరు. ఉద్యమాలు చేయరు. గుళ్లూ గోపురాలంటూ ప్రజలు వారి ప్రధాన సమస్యలపైన ప్రశ్నించకుండా, ఉద్యమించకుండా మతం అనే మత్తుమందు చల్లి వలసవాదుల, కార్పొరేట్ల సేవలో మునిగి తేలుతూ దేశభక్తి ముసుగులో తమ స్వంత ప్రజలకు ద్రోహం చేసే దేశ ద్రోహులే ఈ మతోన్మాదులు అని చరిత్ర తేల్చిచెప్పింది.

ఎవరైనా చరిత్రను క్షుణ్ణంగా చదివి, నిశితంగా పరిశీలిస్తే తెలిసేదే మంటే చరిత్రలో ఏ ఉద్యమాలు పుట్టిన ప్రజలు వారి మౌలిక సమస్యల పరిష్కారానికి ఉద్యమించారనేది తెలుస్తుంది. ఇందులో ప్రజల ఆకాంక్షలో భాగంగా పార్టీలు పుడతాయి. మనుగడలో ఉంటాయి. కానీ బిజెపికి ఈ చరిత్ర లేదు. దేవుళ్లను సాధనంగా వాడుకొని మతోన్మాదంను రెచ్చగొట్టి, అన్యోన్యంగా జీవిస్తున్న ప్రజల మధ్య చిచ్చుపెట్టి, మతకల్లోలాలు సృష్టించి తాను మనుగడ కొనసాగిస్తూ మతాన్ని రాజకీయ అవసరాలకు వాడుకోవడమే దీని చరిత్ర. ప్రజలు తమ మౌలిక అవసరాల్లోంచి చూస్తే ఈ పార్టీ ముసుగు తొలగిపోతుంది. అందుకే ప్రజలు 'రామజన్మ భూమి కాదు – దున్నేవానికే భూమి కావాలి'.

'గుడులు కాదు - బడులు కావాలి, గోపురాలు కాదు - అక్షర జ్ఞానం కావాలి, విగ్రహాలు కాదు - వైద్యాలయాలు కావాలి, మాకు అన్నం కావాలి - అందుకు భూమి కావాలి, గుడి లేకున్నా బతుకు ఉంది, అన్నం లేకుంటే బతుకు లేదు' అంటూ ఈ మతోన్మాద పార్టీలను నిలదీయాలి. మౌలిక సమస్యల మీద ప్రశ్నించాలి, ఉద్యమించాలి, పోరాడాలి. అప్పుడే ప్రజా సమస్యలు పరిష్కరించబడి బతుకులు బాగుపడతాయి.

**బాబ్రీ మసీదు - రామ జన్మభూమి వివాదం చారిత్రక సత్యాలు**

మతోన్మాదుల చేతుల్లో చరిత్ర ఎప్పుడూ కీలుబొమ్మ కాజాలదు. ఈ వివాదం చారిత్రక వివాదాలకు సంబంధించినది కాదు. కొన్ని శక్తులు హిందూ మతాన్ని రాజకీయ అవసరాలకు వాడుకోవడం కోసం ఈ వివాదం సృష్టించబడింది. వాల్మీకి 'రామాయణం' రూపంలో ఓ సుదీర్ఘ కావ్యం తిరిగి రాశాడు. కావ్యం కాబట్టి దీంట్లోని పాత్రలు, స్థలు చాలా వరకు కల్పితాలు కావచ్చు. వాల్మీకి రామాయణం ప్రకారం రాముడు త్రేతాయుగంలో పుట్టాడు. ఆ కాలంలో ఈ అయోధ్యలో అసలు జనసంచారమే లేదు.

క్రీస్తు పూర్వం 7వ శతాబ్దిలో మాత్రమే మానవ సంచార ఆధారాలున్నాయి. రామాయణంలోని అయోధ్య గంగానది ఒడ్డున ఉంది. ప్రస్తుత ఈ అయోధ్య ఇందుకు భిన్నంగా సరయూ నది ఒడ్డున ఉంది. కాబట్టి ప్రస్తుత అయోధ్య రామ జన్మభూమి అనడానికి చారిత్రక ఆధారాలు లేవు. చారిత్రక సత్యాలు ప్రజల నమ్మకాలకు భిన్నంగా ఉంటాయి. ప్రస్తుత అయోధ్య బౌద్ధమతానికి కేంద్రమని, అక్కడ అనేక బౌద్ధరామాలు, స్థూపాలు ఉన్నాయని చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ రాశాడు. అలాగే జైన మతానికి చెందిన అవశేషాలు కూడా ఇక్కడ జరిగిన పురావస్తు శాఖ తవ్వకాలలో బయట పడ్డాయి. హిందూ మతానికి సంబంధించిన (రామాలయం) అవశేషాలేమీ బయల్పడలేదు.

అంతకు ముందు గుడి ఉన్న స్థలంలో బాబ్రీ మసీదు కట్టారన్న ఆరోపణకు ఇప్పటి వరకు ఎటువంటి చారిత్రక ఆధారాలు లేవు. బాబ్రీ మసీదుకు రెండు పక్కల ఉన్న శిలాఫలకాల్లో ఆ మసీదును బాబర్ కట్టించాడని పర్షియన్ భాషలో రాసి ఉంది. ఇది తప్పించి ఈ మసీదును బాబర్ కట్టించాడనడానికి సైతం వేరే ఆధారాలు లేవు. 1528లో అవధ్‌లోని బాబర్ రాజప్రతినిధి 'మీర్‌బక్షి' మసీదును నిర్మించాడని షరియత్ వాదం. అలాగే 1528లో మసీదు నిర్మాణ కాలంలో ప్రముఖ కవి తులసీదాసు వయస్సు 30 ఏళ్లు. ఆయన అయోధ్యలో నివసిస్తూనే 'రామ చరిత మానస్' రచించాడు.

దేవాలయం కూల్చివేత గురించి కాని, అక్కడ మసీదు నిర్మాణం గురించి కానీ తులసీదాస్ ఎక్కడా ప్రస్తావించలేదు. అంతటి రామ భక్తుడు తన కళ్ల ముందు అంత ఘోరం జరుగుతూ ఉంటే, అది నిజంగా జరిగినట్లయితే ఆయన ప్రస్తావించకుండా, రాయకుండా ఉండేవాడా! ఇది కేవలం సృష్టించబడిన సమస్య. 1949 డిసెంబర్ 22, 23 వరకు పరిస్థితి బాగానే ఉంది. ఈ తేదీలలో కొంతమంది హిందువులు రాత్రిపూట ఎవరూ లేని సమయంలో సీతా రాముల విగ్రహాలను పట్టుకొచ్చి బాబ్రీ మసీదులో ప్రతిష్ఠించారు, వివాదం సృష్టించారు. 1980 నుంచి దేశంలో మరీ ముఖ్యంగా ఉత్తర భారతదేశంలో హిందూ సమాజాన్ని మతతత్వంతో నింపే ప్రయత్నాలు తీవ్రమయ్యాయి. ఇవికాస్త 1992 డిసెంబర్ 6 బాబ్రీ మసీదు విధ్వంసంతో పరాకాష్టకు చేరుకున్నాయి. ఈ ఘటనతో భారత లౌకికతత్వం డొల్లతనం బైటపడింది.

అప్పటి కాంగ్రెస్ పార్టీ కూడా మతోన్మాదులకు పూర్తిగా సహకరించింది. నెహ్రూ అనంతరం వచ్చిన కాంగ్రెస్ పార్టీ నాయకులు లౌకిక వాదులుగా చెప్పుకుంటూ నటించారే కానీ, మైనార్టీ ప్రజలకు న్యాయం చేయలేదు. కాంగ్రెస్ పార్టీ కూడా బిజెపికి భిన్నంగా లేదు. వాస్తవానికి అది లౌకికవాదం పేరిట ముస్లిం ఓట్లను ఆకర్షిస్తూ మరోపక్క సుతిమెత్తని పద్ధతుల్లో హిందూ మతోన్మాదాన్ని పెంచి పోషిస్తున్నది. ఆ విధంగా హిందూ, ముస్లిం ఓట్లతో అధికారాన్ని నిలుపుకునే విధానాన్ని అనుసరిస్తున్నది. కాబట్టి మైనార్టీ ప్రజలు వామపక్ష ఉద్యమ పార్టీల వైపు ఉండాలి.

1984 పార్లమెంట్ ఎన్నికలలో బిజెపి కేవలం 2 సీట్లు, 74 శాతం ఓట్లతో అడ్రస్ లేని పార్టీగా ఉంది. 1986 ఫిబ్రవరిలో రాజీవ్ గాంధీ బాబ్రీ మసీదు తళాలు తీయడంతో బిజెపి చేతికి ఒక ఆయుధం దొరికినట్లయింది. 1992 బాబ్రీ మసీదు విధ్వంసంలో 1996 పార్లమెంట్ ఎన్నికల్లో 21.34 శాతం ఓట్లతో 161 సీట్లు సాధించింది. 1998 ఎన్నికల్లో ఈ సంఖ్య 25.6 శాతం ఓట్లు, 180 సీట్లు పెరిగాయి. 2014 ఎన్నికల్లో 31 శాతం ఓట్లు, 282 సీట్లతో పూర్తి మెజారిటీ సాధించి, రాజకీయ అధికారం సాధించింది. ఈ సీట్ల ఓట్లు మతోన్మాదంతో తప్ప ప్రజలకు మేలు చేసి తెచ్చుకున్నవి కావు. ఇదంతా ఒక ఎత్తు అయితే, అసలు విషయం ఆర్థిక అంశం.

1991లో ప్రారంభమైన నూతన ఆర్థిక విధానాలు అయోధ్య వివాదంతో దేశంలో మతోన్మాదం పెచ్చరిల్లడం ఒకే కాలంలో జరిగిన ఈ పరిణామాలు యాదృచ్ఛికంగా జరిగినవి కావు. ఈ నూతన ఆర్థిక విధానాలు ప్రజల జీవితాలను నాశనం చేస్తాయని పాలకులకు తెలుసు. ప్రజలు ఈ ఆర్థిక విధానాలకు, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ఉద్యమిస్తారనీ తెలుసు. అందుకే ప్రజల దృష్టి మళ్లించేందుకు అన్ని పాలక పార్టీలు మతోన్మాదాన్ని పెంచి పోషించాయి. ప్రజలకు కన్నీళ్లు మిగిల్చాయి. మొత్తంగా సామ్రాజ్యవాదం ప్రపంచీకరణకు పుట్టిన శిశువే నేడు దేశంలో పెచ్చరిల్లుతున్న మతోన్మాద ఫాసిజం.

గత 3 దశాబ్దాలుగా ముస్లిం ప్రజలపై జరుగుతున్న దాడులు వారిలో అభద్రతను నింపాయి. తాము దేశ ప్రధాన స్రవంతికి దూరం చేయబడ్డామన్న భావన వారిలో నిండుకుంది. ఇది ముస్లింల ఆర్థిక, రాజకీయ, సామాజిక స్థితిని పూర్తిగా దిగజార్చింది. బాబ్రీ మసీదు విధ్వంసం భారత సామాజిక వ్యవస్థపై మాయని మచ్చవేసింది. భారత రాజకీయ వ్యవస్థ గొప్పగా చెప్పుకునే ప్రజాస్వామ్యం, లౌకిక తత్వాల డొల్లతనాన్ని బయటపెట్టింది. రాజకీయ పార్టీల దివాలాకోరు రాజకీయాలను బయటపెట్టింది.

ఇప్పటికైనా ఈ సమస్యకు త్వరితగతిన ఓ రాజకీయ పరిష్కారం సాధించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ వివాదాస్పద ప్రాంతాన్ని మొత్తం జాతికి సంబంధించిన యాత్ర స్థలంగా ప్రకటించాలి. ప్రజలు ఈ మతోన్మాదం పట్ల అప్రమత్తమై ప్రత్యామ్నాయ రాజకీయాలతో మతోన్మాద శక్తులను ఓడించి, సుందర భారతావనిని నిర్మించుకోవాలి. వీ

*(రచయిత సామాజిక విశ్లేషకులు)*

# స్వరాష్ట్రంలో దగాపడ్డ ఆర్‌టిసి

***ప్రత్యేక రాష్ట్రం సాధించుకున్నా ప్రజా రవాణా సంస్థ ఆర్‌టిసి పరిస్థితి ఏ మాత్రం మెరుగుపడలేదనీ, దీనికి పూర్తిగా ప్రభుత్వ నిర్లక్ష్యమే కారణమనీ, ప్రజలు, ఉద్యోగులు సంఘటితంగా పోరాడి ఆర్‌టిసిని కాపాడుకోవాల్సిందేననీ అంటున్నారు కృష్ణతేజ***

తెలంగాణ రాష్ట్ర వెలుగు ఆర్‌టిసి, గత 51 నెలలుగా ఆర్‌టిసిని 'కారు' చీకటి అలుముకుంది. ఆర్‌టిసికి అన్నీ ఉన్నా స్వయం పాలకుల వివక్ష, యాజమాన్య అనాలోచిత, అసమర్థ చర్యల వలన సంస్థ నేడు పీకలలోతు నష్టాలతో కూరుకుపోయింది. గతంలో ఎన్నడూ లేని విధంగా కార్మికులకు వేతనాలు సకాలంలో చెల్లించలేని ఆర్థిక దుస్థితికి సంస్థ నెట్టబడింది. ఉద్యోగుల పొదుపు సంస్థలలోని వాటా ధనాన్ని కూడా చట్ట విరుద్ధంగా యాజమాన్యం ఇతర అవసరాలకు మరల్చింది.

విభజన అనంతరం సంపన్న రాష్ట్రంగా అవతరించిన తెలంగాణ రాష్ట్రంలో టిఎస్‌ఆర్‌టిసి మూడు పువ్వులు, ఆరుకాయలుగా వృద్ధి చెందుతుందని రాష్ట్ర ప్రజలు, ఆర్‌టిసి కార్మికులు ఆశపడ్డారు. వారి ఊహలకు భిన్నంగా సమైఖ్య పాలకులను తలదన్నే విధంగా 'బాతాల పోశెట్టి' మన బంగారు బాతును 'జబ్బుపడిన పరిశ్రమ'గా తీర్చిదిద్దాడు.

అక్రమ రవాణా అరికడతానని, ఆర్‌టిసి అప్పులు, నష్టాలు భారం ప్రభుత్వమే భరిస్తుందని, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా ఆర్‌టిసి కార్మికులకు కూడా వేతనాలు పెంచుతామని తెలంగాణ రాష్ట్ర సమితి గత ఎన్నికల మానిఫెస్టోలో వాగ్దానం చేసింది. వీటిలో ఏ ఒక్కటీ అమలు చేయలేదు. వాగ్దానాల అమలుకు డిమాండు చేస్తే ఆర్‌టిసిని మూసేస్తానని, ముక్కలు చేస్తానని ముఖ్యమంత్రే స్వయంగా కార్మికులపై జులుం ప్రదర్శించాడు, అయినా కార్మికులు సంయమనమే ప్రదర్శించారు. ఈ నెల 7న జరిగిన ఎన్నికల్లో ఆర్‌టిసి కార్మికులు టిఆర్‌ఎస్ కు అండగా నిలిచారు. టిఆర్‌ఎస్ అనూహ్య విజయం సాధించింది. ఇప్పటికైనా టిఆర్‌ఎస్ ప్రభుత్వం ఆర్‌టిసి పట్ల సానుకూలంగా వ్యవహరిస్తుందా?

**ఆర్‌టిసిపై వామన పాదం**

తెలంగాణ ఆర్‌టిసివి సహజ నష్టాలు కావు. సంస్థ పట్ల గత పాలకులు అనుసరిస్తున్న వైఖరినే 'కెసిఆర్' ప్రభుత్వం అనుసరిస్తున్నందున ప్రగతి రథచక్రాలు నష్టాల ఊబిలో కూరుకుపోయాయి. లాభనష్టాలతో సంబంధం లేకుండా ఆర్‌టిసి సముపార్జించే ఆదాయంలో పది శాతం ప్రభుత్వానికి చెల్లిస్తుంది. వివిధ వర్గాలకు ఆర్‌టిసి ఇస్తున్న బస్సు పాసుల రాయితీలను తెలంగాణ ప్రభుత్వం ఆర్‌టిసికి తిరిగి చెల్లించడం లేదు. టోల్‌ప్లాజా, స్పేరు పార్టుపై సేల్‌టాక్స్, వ్యాట్, జియస్‌టి ల పేరుతో ఆర్‌టిసిని నయాపాలకులు నిలువు దోపిడీ చేస్తున్నారు.

మూలుగుతున్న నక్కపై తాటికాయ పడ్డ చందంగా రోజురోజుకూ పెరుగుతున్న డీజిల్ ధర ఆర్‌టిసిని జీవచ్ఛవంగా మార్చింది. ప్రతిరోజు 36 లక్షల కి.మీ. తిరుగుతున్న ఆర్‌టిసి బస్సులు 7 లక్షల లీటర్ల డీజిల్ వినియోగిస్తోంది. 2015 మే 21న చివరసారిగా బస్సు ఛార్జీలు పెంచినప్పుడు డీజిల్ రేటు రు. 48 ఉంటే, ఇప్పుడు రు. 78కి చేరుకుంది. డీజిల్ రేటు పెరుగుదల వలన ఆర్‌టిసి సాలీనా 750 కోట్ల రూపాయలు నష్టపోతుంది. ఆర్‌టిసి ఒక రోజు ఆదాయం 12.57 కోట్ల రూపాయలైతే, ఖర్చు 13.96 కోట్ల రూపాయలకు పడగలెత్తింది. పెరిగిన డీజిల్ భారం ప్రభుత్వమే భరించాలన్న కార్మికుల చిరకాల డిమాండుకు మన ఏలికలు స్పందించడం లేదు.

ఆర్‌టిసి నిర్వహణ కోసం కేరళ రాష్ట్ర ప్రభుత్వం తమ వార్షిక బడ్జెట్టులో మూడువేల కోట్లు, తమిళనాడు రు. 4,700 కోట్లు కేటాయించాయి. అదే తెలంగాణ ప్రభుత్వం రు. 520 కోట్లు మాత్రమే కేటాయించి చేతులు దులుపుకుంది. తెలంగాణ ప్రభుత్వం సంస్థకు చెల్లించవలసిన రు. 583 కోట్లకు పంగనామం పెట్టింది.

ప్రజల రవాణా అవసరాలు ప్రతి సంవత్సరం 15 శాతం పెరుగుతున్నాయి. ఆర్‌టిసి విస్తరణ మాత్రం అందుకు భిన్నంగా ఉంది. రాష్ట్రవ్యాప్తంగా ప్రతి రెండు రోజులకు మూడు బస్సులు స్క్రాప్‌గా మారుతున్నాయి. ప్రతి నెలా వందమంది కార్మికులు రిటైరు అవుతున్నారు. ప్రతిరోజు 5 నుండి 8 మంది కార్మికులు చిన్న కారణాలకే ఉద్యోగాల నుండి తొలగించబడుతున్నారు. అయినా ఆర్‌టిసి ఉద్యోగాల భర్తీకి గాని, బస్సుల కొనుగోలుకు కాని, ప్రభుత్వం అనుమతించడం లేదు. రాష్ట్రం విడిపోయే నాటికి టియస్‌ఆర్‌టిసిలో 700 అద్దె బస్సులుంటే, తెరాస పుణ్యాన వాటి సంఖ్య నేడు 2300కి చేరాయి. ఈ 51 నెలల్లో ఆర్‌టిసి స్వంతంగా కొనుగోలు చేసిన బస్సుల సంఖ్య 130 మాత్రమే.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డాక అక్రమంగా ప్రయాణికులను రవాణా చేసే వాహనాల సంఖ్య పెరిగింది. పాలకుల అండతో ఆరెంజ్ ట్రావెల్స్ లాంటి ప్రైవేటు సంస్థలు తెలంగాణలో పురుడు పోసుకున్నాయి. వీరు కాంట్రాక్టు క్యారేజీలకు పర్మిట్లు తీసుకుని, స్టేజి క్యారియర్లుగా బస్సులను తిప్పుతున్నారు. ఆన్‌లైన్‌లో యధేచ్ఛగా బుకింగ్ జరుగుతున్నా నియంత్రించే నాధుడే లేదు. ప్రైవేటు ఆపరేటర్లకు పాలకులు బంధుమిత్రులయినందున ఆర్‌టిసి అధికారులు వీరికి పరోక్షంగా సహకరిస్తున్నారు. స్టేజి క్యారేజీ రూపంలో ప్రయాణికులను తరలించే హక్కు కేవలం టిఎస్‌ఆర్‌టిసికి మాత్రమే ఉంది. ఆర్టీఏ అధికారులకు, మన బంగారు పాలకులకు ఈ సామాజిక స్పృహ లోపించినందున ఆర్‌టిసి సాలీనా 800 కోట్ల రూపాయల ఆదాయం కోల్పోతుంది.

**ప్రగతిచక్రం - ప్రైవేటు పరం**

ప్రజారవాణా వ్యవస్థను ప్రభుత్వ పరిధిలో నిర్వహించాలనే సదుద్దేశ్యంతో స్వాతంత్రానంతరం ఆనాటి పాలకులు ఆర్‌టిసి యాక్టు 1950కి రూపకల్పన చేసారు. ఈ చట్టం వెలుగులోనే దేశం 60 ఆర్‌టిసిలు ప్రజారవాణా వ్యవస్థను సుసంపన్నం చేసాయి. లాభనష్టాలతో

సంబంధం లేకుండా ఒక సామాజిక బాధ్యతగా ప్రభుత్వాలు ఆర్‌టిసిలను ఆదరించాలని డా. బాబాసాహెబ్ అంబేద్కర్ సూచించారు. కాని నేటి పాలకులు స్వంత వనరులతో, స్వశక్తితో, అంతర్గత సామర్థ్యం పెంచు కోవడం ద్వారా లాభాల్లోకి రావాలని హితబోధ చేస్తున్నారు. బాహుబలి చేతులు కట్టేసి బాక్సింగ్ బరిలో విజయం సాధించడం సాధ్యమేనా?

1932లో హైద్రాబాద్ రాష్ట్రంలో ఆర్‌టిసి ఏర్పడింది. భారతదేశంలో ప్రజలను రవాణా చేయడానికి ప్రభుత్వరంగంలో ఏర్పడ్డ మొదటి సంస్థ ఇది. తొలుత 27 బస్సులు, 3 డిపోలు, 166 సిబ్బందితో ప్రారంభమైంది. తెలుగు ప్రజల వితరణ, కార్మికుల అంకిత భావం వలన సంస్థ నేడు లక్షల కోట్ల రూపాయల స్థిర, చరాస్తులకు యజమాని అయ్యింది. కాకతీయుల తోరణం గుండా, పంట పొలాల మధ్యలో ప్రగతి చక్రం పయనిస్తున్న దృశ్యం చూస్తుంటే బంగారు తెలంగాణ కల సాకారమైనట్టు కన్పిస్తుంది. కాని వాస్తవ పరిస్థితులు ఇందుకు భిన్నంగా ఉన్నాయి.

ఆర్‌టిసి గ్యారేజీలలో బస్సుల మరమ్మత్తుల నుంచి సెక్యూరిటీ సిబ్బంది వరకు, తాజాగా కరీంనగర్ జోన్‌లో ఆడిటింగ్ కూడా అవుట్‌సోర్సింగ్ పాలైంది. సమైఖ్య రాష్ట్రం 18 శాతంగా ఉన్న అద్దె బస్సులు 30 శాతం ఉండే విధంగా తెలంగాణ ప్రభుత్వం చట్ట సవరణ చేసింది. వరంగల్ రీట్రేడింగ్ షాపును, మియాపూర్ ప్రింటింగ్ ప్రెస్‌ను మూసివేశారు. తార్నాక ఆసుపత్రిలో మందుల విభాగాన్ని, వైద్య పరీక్షల నిర్వహణను ఆర్‌టిసి అధికారులు అస్మదీయులకు కట్టబెట్టారు. చివరకు తార్నాక ఆసుపత్రిని మూసివేసి జాతీయ ఇన్సురెన్స్ కంపెనీలకు ఆర్‌టిసి కార్మికుల ఆరోగ్యాన్ని తాకట్టు పెట్టే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. బస్సు పాసు సెక్షన్లు పూర్తిగా ప్రైవేట్ పరమయ్యాయి. అర్బన్ ట్రాన్స్‌పోర్ట్ నష్టాలలో ఉన్నందున సిటీ సర్వీసులన్నింటిని మెట్రో సంస్థకు అప్పగించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. కోట్ల రూపాయల విలువైన ఆర్‌టిసి భూములను, బస్టాండులను నామమాత్రపు లీజులకే ప్రైవేట్‌వ్యక్తులకు బదిలీ చేస్తున్నారు.

లాభాలు వచ్చే అంతరాష్ట్రీయ సర్వీసులను కుదిస్తున్నారు. గతంలో తెలంగాణలోని వివిధ ప్రాంతాల నుండి బొంబాయికి నడిచే అంతః రాష్ట్ర సర్వీసులు 24 ఉంటే, నేడు 4 కి కుదించారు. వీటి స్థానంలో ఆరెంజ్ సంస్థ బస్సులను ఎరేంజ్ చేసినట్టు కార్మిక సంఘాల నాయకులు వాపోతున్నారు.

**ఆర్‌టిసి కార్మికుల కన్నీటి గాథలు**

ఆర్‌టిసి కార్మికులు సీతమ్మ కష్టాలు అనుభవిస్తున్నారు. కార్మికుల ప్రమేయం లేకుండా జరిగిన సంఘటనలలోను యాజమాన్యం కార్మికుల్ని బలిపశువుల్ని చేస్తుంది. సస్పెన్షన్లు, రిమూవల్స్, ఇంక్రిమెంట్లలో కోతలు, డెబిట్లు నిత్యకృత్యమయ్యాయి. సిబ్బంది భర్తీ లేకపోవడంతో కార్మికులకు శుభ, అశుభ సందర్భాలలో కూడా సెలవులు మంజూరు కావడం లేదు. శవం ఇంట్లో ఉన్నా విధులకు హాజరు కావల్సిందే అనే మౌఖిక ఆదేశాలు ఆర్‌టిసిలో అమలవుతున్నాయి. సహజంగా జరిగే మానవ తప్పిదాలలో కూడా సానుభూతి, మానవతా దృక్పథం ప్రదర్శించకూడదని యాజమాన్యం అధికారులకు క్రూరత్వం బోధిస్తుంది. యాజమాన్యం వేధింపులు అధికమవ్వడంతో కార్మికులు డిపోల్లోను, బస్సుల్లోను ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. రాష్ట్రంలో ఐదుగురు ఆర్‌టిసి డ్రైవర్లు స్టీరింగ్ పైనే మరణించడం ప్రజాస్వామిక వాదులను కలవరపరుస్తున్నది. కెఎంపిఎల్, ఇపికె, బస్సు తనిఖీల పేర యాజమాన్యం కార్మికులను ఒత్తిడికి గురిచేస్తోంది. విధి నిర్వహణలో మానసిక ఒత్తిడి వలన డ్రైవర్లు, కండక్టర్లు, మెకానిక్కులకు ఊపిరితిత్తులు, కిడ్నీలు, బిపి, షుగర్, పక్షవాతం, పైల్స్ లాంటివి వృత్తి రుగ్మతలుగా మారాయి. రాష్ట్రవ్యాప్తంగా గుండెపోటుతో మరణిస్తున్న వారి సంఖ్య ఆర్‌టిసిలో రోజురోజుకు అధికమవుతోంది. ఈ కారణాల చేతనే ఎంప్లాయిస్ యూనియన్ ప్రధాన కార్యదర్శి రాజిరెడ్డి ఆర్‌టిసి డిపోలను కాన్‌స్టేషన్ క్యాంపులు (నిర్బంధ శిబిరాలు)గా వర్ణించారు.

**కార్మికుల వేతన వెతలు**

అద్భుతమైన మానవ వనరులున్న ఏకైక సంస్థ తెలంగాణ ఆర్‌టిసి. పనిదినంలో ప్రతి సెకను శ్రమించే ఆర్‌టిసి కార్మికులకు ఏప్రిల్ 2007 నుండి చట్టబద్ధంగా జరగాల్సిన వేతన సవరణ నామమాత్రపు మధ్యంతర భృతితో సుఖాంతమైంది. ఆనాడు సమైఖ్య పాలకులు ఆర్‌టిసి కార్మికులకు 23 శాతం ఐఆర్‌తో సత్కరిస్తే, నేడు ఎపిఎస్ఆర్‌టిసి సైతం కార్మికులకు 19 శాతం ఐఆర్ ఇచ్చిన చంద్రబాబు 'కొంతనయం' అనిపించుకున్నాడు. టియస్ఆర్‌టిసి కార్మికులకు 16 శాతం ఇచ్చి పాలాభిషేకం చేయించుకున్న ఘనత మాత్రం మన బంగారు తెలంగాణ నిర్మాతదే.

సంస్థ నష్టాల్లో ఉన్నందున ఆర్‌టిసి కార్మికులు వేతనాలు పెంచమనే హక్కు లేదని ప్రగతిభవన్ నూతన ఆర్థిక సూత్రాన్ని ఆవిష్కరించింది. ఆర్‌టిసి ఆదాయంలో 52 శాతం కార్మికుల వేతనాలు చెల్లిస్తున్నట్టు అధికారులు ముఖ్యమంత్రికి తప్పుడు నివేదిక ఇచ్చారు. సంస్థ ఆదాయంలో తమ వేతనాల శాతాన్ని అధికారులు గుట్టుగా దాచారు. ఆర్‌టిసిలో కింది స్థాయి ఉద్యోగి మూల వేతనం రు. 10,880 అయితే, ఎగ్జిక్యూటివ్ డైరక్టరు వేతనం రు. 1,30,500. వార్షిక ఇంక్రిమెంట్లలోను రు. 3,670 వ్యత్యాసం వుంది. ఈ అసమతౌల్యం దేశంలో ఇతర ఏ సంస్థల్లో లేదు.

ప్రగతి భవన్ నూతన ఆర్థిక సూత్రం తమకు వర్తించదని మన బంగారు తెలంగాణ పాలకులు రుజువు చేసుకున్నారు. 2 లక్షల 34 వేల కోట్ల రూపాయలు అప్పులున్న తెలంగాణ ప్రభుత్వం తమ ఎంఎల్ఎ, ఎంఎల్‌సిలకు 163 శాతం వేతనాలు పెంచుకుంది. కెసిఆర్ దేశంలోనే అత్యధిక వేతనం రు. 4 లక్షల 21 వేలు పొందుతున్న ముఖ్యమంత్రిగా రికార్డు సాధించారు. ఇది పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి వేతనం కంటే 52 రెట్లు, ప్రధానమంత్రి వేతనం కంటే రెండున్నర రెట్లు అధికం.

రాష్ట్రాన్ని, ఆర్‌టిసిని అప్పుల కుప్పగా మార్చిన వారి వేతనాలు ఆకాశంలో వుంటే, ఆర్‌టిసిని అన్ని పారామీటర్స్ లోను ఆకాశంలో ఉంచిన డ్రైవరు, కండక్టరు, మెకానిక్కుల వేతనాలు అధఃపాతాళంలో ఉండటం దురదృష్టకరం. ఎప్పుడూ ఓర్పుగా, సహనంగా వుండే ఆర్‌టిసి కార్మికులు ఆగ్రహించక ముందే పాలకులు అప్రమత్తమైతే శ్రేయస్కరం. ఆర్‌టిసి కార్మికులు 50 శాతం వేతన వృద్ధి డిమాండు అత్యంత సమంజసం.

ఆర్‌టిసి కార్మికుల పట్ల కెసిఆర్ సర్కార్ గతంలో కఠినంగా వ్యవహరించింది. సంస్థ పతనానికి కూడా హేతువైంది. 100 ఏనుగుల బలంతో కెసిఆర్ తిరిగి అధికారంలోకి వచ్చాడు. ఆర్‌టిసి పట్ల కెసిఆర్ సర్కారు గత వైఖరినే కొనసాగించే ప్రమాదం ఉంది. ఆర్‌టిసి సమస్యలు గంపగుత్తగా పరిష్కరించబడాలంటే ఐక్యపోరాటాలు తప్ప మరో దగ్గర దారి లేదు.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)* వీ

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| **రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్)** | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| **నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ** | హైదరాబాద్ | 90004 13413 |
| **సహచర బుక్‌మార్క్** | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| **బాల రాజేశ్వర బుక్ డిపో** | నల్లకుంట బస్ స్టాప్ | 9705055738 |
| **వెంకటేశ్వర బుక్ స్టాల్, స్టేషనరీ** | నల్లకుంట, శంకర్‌మఠ్ | 040-66131071 |
| **పస్ట్ లక్కీ పాన్ షాప్** | విద్యానగర్ సిగ్నల్స్ | 9848672831 |
| **సుధాకర్ బుక్ స్టాల్** | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక | 9949337605 |
| **వెంకటేశ్వర బుక్ స్టాల్** | రామ్‌నగర్ గుండు | 9502964995 |
| **భవాని బుక్ స్టాల్** | శివం రోడ్ | 9849836996 |
| **శ్రీభవాని బుక్ స్టాల్** | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) | 9640712555 |
| **ఓరియన్ బుక్ స్టాల్** | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) | 7702535137 |
| **అరవింద్ బుక్ స్టాల్** | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) | 8977995537 |
| **రెడ్డి బుక్‌స్టాల్** | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| **నేషనల్ బుక్‌హౌస్** | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| **దుర్గా భవన్ బుక్‌స్టాల్** | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| **డైమాండ్ బుక్‌స్టాల్** | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| **రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్** | మెహిదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| **రిలెబుల్ బుక్ సెంటర్** | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| **ఇస్పెక్ట్రం బుక్‌హౌస్** | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| **శ్రీలక్షి బుక్‌స్టాల్** | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| **లక్ష్మణ్** | చిక్కడపల్లి, హైదరాబాద్ | 93910 12051 |
| **మల్లిఖార్జున్ బుక్‌స్టాల్** | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| **సుధీర్ బుక్‌స్టాల్** | తార్మాక, హైదరాబాద్ | 95426 04166 |
| **లడ్డు బుక్‌స్టాల్** | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| **వినోద్ బుక్‌స్టాల్** | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| **రాజ్ బుక్స్ స్టేషనరీ** | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| **బాల్‌రెడ్డి బుక్‌స్టాల్** | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| **శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్** | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| **భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్** | కోహెడ | 95021 82545 |
| **భండారి కిష్టయ్య బుక్‌స్టాల్** | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| **గణేష్ బుక్‌స్టాల్** | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| **మహాలక్ష్మి బుక్‌స్టాల్** | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| **వినయ్ బుక్‌స్టాల్** | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| **పాండు బుక్ స్టాల్, కూల్ డ్రింక్స్** | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| **శరత్ బుక్ స్టాల్** | షాప్ నం. 3, ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుజూరాబాద్ | 98662 73720 |
| **సత్యసాయి బుక్‌స్టాల్** | ఖమ్మం | |
| **మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్** | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| **మణి బుక్‌స్టాల్** | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| **సురేష్ బుక్ స్టాల్** | శివాలయం వీధి, ప్రొద్దటూరు | 81210 02112 |
| **పద్మావతి బుక్‌స్టాల్** | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| **అనేక బుక్‌స్టాల్** | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| **మైత్రీ బుక్‌హౌస్** | మజీద్ వీథి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| **రాజేశ్ బుక్ సర్వీస్** | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| **వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ** | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| **రాఘవేంద్ర బుక్‌స్టాల్** | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |

*యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ (యుజిసి), ఇండియన్ కౌన్సిల్ ఫర్ సోషల్ సైన్స్ రిసర్చ్ (ఐసిఎస్ఎస్ఆర్) లను బలహీనపర్చడం, ఇండియన్ కౌన్సిల్ ఫర్ హిస్టారికల్ రిసర్చ్ (ఐసిఎచ్ఆర్) నేతృత్వాన్ని మార్చడం, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్‌బిఐ) గవర్నర్‌ల వివాదాస్పద రాజీనామాలు, ప్రధాని మాట వినలేదనే కారణంతో సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) డైరెక్టర్‌ను అర్ధాంతరంగా మార్చడం, ప్రతిపక్ష రాజకీయ నాయకుల మీద కక్షసాధింపుకు సిబిఐని, ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ (ఇడి)ని దుర్వినియోగం చేయడం, సుప్రీంకోర్టు, హైకోర్టుల న్యాయమూర్తుల చేత చట్టవ్యతిరేకమైన, అన్యాయమైన వివాదాస్పద తీర్పులు ఇప్పించడం, జెఎన్‌యు, ఎఫ్‌టిఐఐ, ఐఐటి వంటి అత్యున్నత ప్రామాణిక విద్యాసంస్థల అధిపతులను ఇష్టారాజ్యంగా మార్చడం... ఒక్కమాటలో చెప్పాలంటే ప్రధాని మోడీ నాయకత్వంలో కేంద్ర ప్రభుత్వం రాచరిక, నిరంకుశ పాలనను తలపిస్తున్నది. ఈ క్రమంలో తటస్థంగా, నిష్పాక్షికంగా, చట్టబద్ధంగా వ్యవహరించవలసిన రాజ్యాంగ వ్యవస్థలను లోపలి నుంచీ, బయటి నుంచీ విధ్వంసం చేయడం జరుగుతున్నది. ప్రజాస్వామిక, రాజ్యాంగ వ్యవస్థల విధ్వంసం దశాబ్దాలుగా సాగుతున్నదే కాని, సంఘ్ పరివార్ పాలనలో ఆ విధ్వంసం కొత్త ఉధృతిని సంతరించుకున్నది. దేశ భవిష్యత్తుకు ప్రమాదకరమైన ఈ పరిణామం గురించి ఐదు ప్రత్యేక వ్యాసాలను వీక్షణం మీకు సమర్పిస్తున్నది. – సం.*

# విధ్వంసమవుతున్న న్యాయవ్యవస్థ

***రాజ్యాంగయంత్రంలో ఒక భాగమైన న్యాయవ్యవస్థ విధ్వంసం గతం నుంచే సాగుతున్నప్పటికీ ఇటీవలి కాలంలో అది ఎలా పెచ్చరిల్లుతున్నదో వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

రాజ్యం భిన్నవర్గాల ప్రజల ప్రయోజనాల మధ్య సమతుల్యత సాధించి శాంతి సుస్థిరతలను స్థాపిస్తుందని నమ్మే గాంధేయవాదుల నుంచి, ఉదార ప్రజాస్వామికవాదుల నుంచి రాజ్యం పాలకవర్గానికి సేవ చేయడానికే ఉనికిలోకి వచ్చిందని విశ్వసించే మార్క్సిస్టుల దాకా అందరూ ప్రస్తుతం భారతదేశంలో రాజ్యాంగ వ్యవస్థల విధ్వంసం సాగుతున్నదని, అవి విశ్వసనీయతను పోగొట్టుకుంటున్నాయని విమర్శిస్తున్నారు. చట్టసభలు, అధికార యంత్రాంగం, అధికార వ్యవస్థలోని వేరువేరు సంస్థలు, న్యాయవ్యవస్థ, విద్యావ్యవస్థ వంటి రాజ్యాంగ వ్యవస్థలన్నీ కూడ వాటి ప్రకటిత లక్ష్యాలకు దూరం జరగడం, వ్యతిరేక దిశలో పనిచేస్తుండడం, వాటి ఔన్నత్యాన్ని, తటస్థతను, స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకోవడం వంటి ఎన్నో నిదర్శనాలను వారు చూపుతున్నారు. భిన్న దృక్పథాలు గల ఈ ఆలోచనాపరులందరూ ఒకే నిర్ధారణకు రావడానికి దారి తీస్తున్న ప్రస్తుత పరిస్థితులను నిశితంగా అర్థం చేసుకోవలసి ఉంది.

వర్గ సమాజంలో ఒక వర్గానికి సంపద మీదా, శ్రమ మీదా అధికారం అప్పగించడానికి, మరొక వర్గం మీద ఆంక్షలు విధించడానికి రాజ్యం పుట్టుకు వచ్చింది. ఆ రాజ్యాన్ని సౌలభ్యం కోసం ఆధిపత్య వర్గాల తరఫున ఒక చిన్న పాలకవర్గం నడపడం ప్రారంభమయింది. ఆ పాలకవర్గానికి బలప్రయోగం మీద, సంపద మీద, పంపిణీ మీద గుత్తాధిపత్యం ఉండేది. ఆ రాజ్యం ప్రధానంగా భూస్వామ్య రాచరిక కాలాలలో పూర్తిగా సైనిక స్వభావాన్ని సంతరించుకుంది. కాలం గడిచిన కొద్దీ రాజ్య పరిధి విస్తరించిన కొద్దీ ఆ రాజ్యాంగయంత్రం ఎన్నో కొత్త నిర్మాణాలనూ, విభాగాలనూ ఏర్పరచుకుంది. రూపంలో ఆ రాజ్యం వికేంద్రీకృతమైనట్టు, విస్తరించినట్టు కనిపించినా సారంలో మాత్రం ఒక అత్యల్పసంఖ్యాక పాలక వర్గపు సైనిక నిరంకుశత్వంగా, పాలనలో గుత్తాధిపత్యంగా మాత్రమే వందల సంవత్సరాలు సాగింది. ఆ నిరంకుశత్వాన్నీ, గుత్తాధిపత్యాన్నీ వ్యతిరేకించిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల వెల్లువలో రాజ్యాన్ని ప్రజాస్వామికీకరించాలనే నినాదం పెల్లుబికింది. పైకి స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, అధికారాల విభజన, ప్రజాస్వామ్యం, వ్యక్తి స్వేచ్ఛ, పత్రికా స్వాతంత్ర్యం వంటి ఎన్ని ఉదాత్తమైన నినాదాలు ఇచ్చినా ఈ పరిణామం పాత భూస్వామ్య పాలకవర్గాల చేతుల్లో నుంచి తన చేతుల్లోకి రాజ్యాధికారం స్వాధీనం చేసుకోవడానికి కొత్త బూర్జువా పాలకవర్గాలు పన్నిన ఎత్తుగడ మాత్రమే.

ఈ కొత్త పాలకవర్గంలోని ముఠాల మధ్య తగాదాలను పరిష్కరించి సమతుల్యత రూపొందించడానికి, ఏ ఒక్క ముఠాకో ఇష్టారాజ్యం కాకుండా ఉండడానికి పుట్టుకొచ్చినది అధికారాల విభజన సిద్ధాంతం. శాసననిర్మాణ, శాసనాధికార, న్యాయవ్యవస్థలను వేరు చేసి వాటికి సాపేక్షిక స్వాతంత్ర్యాన్నిచ్చిన తర్వాత శాసనాధికారం సాగించే అధికార

యంత్రాంగం అనేకానేక వ్యవస్థలుగా నిర్మాణాలుగా విడిపోయింది. వాటిలో కొన్ని అన్ని ముఠాలకూ సమాన దూరం పాటిస్తామనీ స్వతంత్రంగా ఉంటామనీ హామీ ఇవ్వడం జరిగింది. న్యాయవ్యవస్థను మిగిలిన వ్యవస్థలన్నిటికీ పైన, సమాంతరంగా నిలిపి రాజ్యపు అన్ని నిర్ణయాలనూ సమీక్షించే అధికారం ఇవ్వడం జరిగింది. ఈ అధికార విభజనలూ, సాపేక్షిక స్వాతంత్ర్యాలూ చివరికి కేవలం పాఠ్యపుస్తకాలలోనే మిగిలిపోయాయి. రాజ్యపు అన్ని అంగాలూ సారంలో ఒకటిగానే ఉండిపోయాయి. రూపంలో మాత్రం అవి స్వతంత్రంగా ఉన్నట్టు, ఒకదానితో ఒకటి విభేధిస్తున్నట్టు, ఒకదాని పనిని మరొకటి సమీక్షించి సవరిస్తున్నట్టు, ప్రజా ప్రయోజనాలను పరిరక్షిస్తున్నట్టు భ్రమలు సృష్టించడంలో విజయం సాధించాయి.

ఇటువంటి భ్రమలను సృష్టించడంలో, వ్యాపింపజేయడంలో అన్నిటికంటే ఎక్కువ పాత్ర నిర్వహించేది న్యాయవ్యవస్థ. చట్టబద్ధ పాలన పేరుతో ఎవరి పట్ల ప్రత్యేక రాగద్వేషాలు లేకుండా అందరినీ సమానంగా చూసే చట్టాన్ని వ్యాఖ్యానించడం, చట్టాన్ని అమలు చేయడం, చట్ట అమలును సమీక్షించడం మాత్రమే తన పనులు అని న్యాయవ్యవస్థ చెప్పుకుంటుంది. అయితే మూలంలోనే వర్గ సమాజంలో వర్గ చట్టమే రూపొందించబడుతుంది గనుక, సొంత ఆస్తిని, శ్రమ దోపిడీని, ఆధిపత్య పీడనను సమర్థించే చట్టమే ఉనికిలో ఉంటుంది గనుక మౌలికంగా న్యాయవ్యవస్థ ఎంత స్వతంత్రంగా ఉన్నప్పటికీ అది పేదలకూ, శ్రామికులకూ, పీడితులకూ ఏమీ మేలు చేయదు. కాని ఆ విషయం బహిరంగంగా బైటపడితే ప్రజల్లో అవిశ్వాసం, అసంతృప్తి పెరిగి సమాజ సుస్థిరతే దెబ్బతినే విస్ఫోటనం జరిగే అవకాశం ఉంది గనుక, దాన్ని నిరోధించడానికి న్యాయవ్యవస్థ ఎప్పుడూ తాను తటస్థంగా ఉన్నానని, చట్టబద్ధ పాలనను అమలు చేస్తూ సమాన దూరం పాటిస్తానని నమ్మించడానికి ప్రయత్నిస్తుంది. అలా నమ్మించడానికి అప్పుడప్పుడు ఉదాహరణ ప్రాయమైన ప్రజానుకూల తీర్పులు, నిర్ణయాలు ప్రకటిస్తుంది. కాని మౌలిక ప్రశ్నల దగ్గరికి, వ్యవస్థ మనుగడ గురించిన ప్రశ్నల దగ్గరికి, యథాస్థితిని సవాల్ చేసే ప్రశ్నల దగ్గరికి వచ్చేసరికి తన మేలిముసుగు తీసివేసి పాలకవర్గ సేవకురాలిగా రుజువు చేసుకుంటుంది.

పాలకవర్గంలో కూడ ముఠా తగాదాలు, భిన్నాభిప్రాయాలు ఉంటాయి గనుక తమకు వ్యతిరేకమైన తీర్పులు, నిర్ణయాలు వెలువడినప్పుడల్లా అసంతృప్త ముఠాలు ఈ వ్యవస్థ తన ప్రకటిత లక్ష్యమైన తటస్థతను పాటించడం లేదని, విధ్వంసమైపోతున్నదని, అధికారపక్ష ముఠా ఈ వ్యవస్థను తన ప్రయోజనాల కోసం ధ్వంసం చేస్తున్నదని గగ్గోలు పెడతాయి. అంటే స్వతంత్రమైనదని, నిష్పాక్షికమైనదని, రాగద్వేషాలకు అతీతమైనదని చెప్పుకునే న్యాయవ్యవస్థ సహజంగానే ప్రజల వైపు నుంచి చూసినప్పుడు ఎప్పుడూ విధ్వంసమవుతూనే ఉంటుంది, పాలకవర్గ ముఠాలలో కొన్నిటి దృష్టిలో కూడ అప్పుడప్పుడు విధ్వంసం అవుతూ ఉంటుంది.

బూర్జువా ప్రజాస్వామ్యం అమలయ్యే చోట న్యాయవ్యవస్థకు స్థూలంగా ఈ రెండు రకాల విధ్వంసాలూ ఉంటాయి. ఇక భారతదేశం వంటి అర్ధవలస, అర్ధభూస్వామ్య సమాజంలో, బూర్జువా ప్రజాస్వామిక వ్యవస్థ కూడ దాని అసలు రూపంలో ఏర్పడని చోట న్యాయవ్యవస్థ విధ్వంసం, ఆ మాటకొస్తే బూర్జువా ప్రజాస్వామిక రాజ్యాంగ వ్యవస్థలన్నిటి విధ్వంసం మరింత ఎక్కువగా, అవకతవకలుగా, ఇష్టారాజ్యంగా, హాస్యాస్పదంగా జరుగుతుంటుంది. రాజ్యాంగ వ్యవస్థలను క్రమబద్ధంగా పద్ధతి ప్రకారం విధ్వంసం చేయడం పాలకవర్గాలకు, ప్రత్యేకించి భారత పాలకవర్గాకు ఒక అవసరం. నిజానికి ఆ రాజ్యాంగ వ్యవస్థలంటే, వాటి సాపేక్షిక స్వాతంత్ర్యం అంటే, వాటి ప్రజాస్వామిక స్వభావం అంటే, చట్టబద్ధ పాలన అంటే ఈ పాలకవర్గాలకు ఎనలేని ఆగ్రహం. ఈ భూస్వామ్య, దళారీ పాలకులకు తెలిసినవే నిరంకుశాధికారం, ఇష్టారాజ్యం, అంతులేని దోపిడీ, పీడన, నిచ్చెనమెట్ల కులవ్యవస్థతో సహా అన్నిరకాల అంతరాలను యథాతథంగా కాపాడడం. అందువల్ల తాము చేసిన పనిని సమీక్షించే ఒక వ్యవస్థ ఉంటుందంటే, అది చట్టం ఎదుట మనుషులందరూ సమానమే అనే సూత్రాన్ని పాటిస్తుందంటే వారికి ఎక్కడలేని కోపం వస్తుంది. అందులోనూ న్యాయవ్యవస్థకు పునాదిగా ఉండే చట్టాలను భూస్వామ్యంతో మిలాఖతయిన వలసవాదులు తయారు చేశారు. ఆ తర్వాతి భూస్వామ్య – దళారీ పాలకులు ఆ చట్టాలను యథాతథంగా కొనసాగిస్తున్నారు. న్యాయవ్యవస్థలో నిర్ణయాధికారంలో ఉండేవారిలో అత్యధికులు ఆ వర్గానికి చెందినవారో, లేక ఆ వర్గ భావజాలాన్ని తమ మెదళ్లలో నింపుకున్నవారో మాత్రమే.

ఈ స్థితిలో భారత న్యాయవ్యవస్థ విధ్వంసం గురించి ఇవాళ కొత్తగా విచారించడానికి ఏమీ లేదు. భారత న్యాయ వ్యవస్థ ఆది నుంచీ న్యాయం పునాదిగా నిర్మాణం కాలేదు. కొంతవరకు చట్టాన్ని పునాదిగా పెట్టుకున్నది గాని అది వలసవాద చట్టం లేదా దానికి కొనసాగింపు అయిన భూస్వామ్య – దళారీ చట్టం. అందువల్ల భారత న్యాయవ్యవస్థ 1947 నుంచీ కూడ విధ్వంసం పాలవుతూనే ఉంది. జవహర్ లాల్ నెహ్రూ పాలనా కాలంలో ప్రారంభమైన ఈ విధ్వంసం ఇందిరా గాంధీ పాలనా కాలానికి మరింత విస్తరించింది. అత్యున్నత న్యాయవ్యవస్థ ఎమర్జెన్సీని నిర్లజ్జగా సమర్థించింది. కింది స్థాయిలో న్యాయవ్యవస్థ నిరంకుశత్వానికి, పోలీసు పాలనకు, హక్కుల హననానికి వీలు కల్పించింది. చట్టసమర్థన ఇచ్చింది. మౌలికంగా ప్రజల వైపు నిలబడే వైఖరిని ఎన్నడూ తీసుకోలేదు. మౌలికంగా వ్యవస్థను ప్రశ్నించే ప్రజా ఉద్యమాలు విస్తరించినకొద్దీ పాలకవర్గాలు మరింతగా న్యాయవ్యవస్థను విధ్వంసం చేయడానికి, కనీసం ప్రజానుకూల తీర్పులు రాకుండా చేయడానికి ప్రయత్నిస్తూ వచ్చాయి. ఎప్పుడో ఒక మెరుపు లాగ ఏదో ఒక ప్రజానుకూల తీర్పు వచ్చినట్టు కనిపించినా అది సముద్రంలో కాకిరెట్ట లాంటి అతి తక్కువ కావడం ఒక వైపు, అటువంటి తీర్పులు కూడ సక్రమంగా అమలు కాకపోవడం మరొకవైపు కలిసి న్యాయవ్యవస్థ విధ్వంసాన్ని సంపూర్ణం చేశాయి.

ఈ స్థితిలో సంఘ్ పరివార్ కేంద్ర ప్రభుత్వ అధికారాన్ని చేపట్టడంతో అప్పటికే సాగుతున్న రాజ్యాంగ వ్యవస్థల విధ్వంస కార్యక్రమాన్ని మరింత దూకుడుగా, మరింత ప్రజావ్యతిరేకంగా సాగించడానికి వీలు కలిగింది. ప్రజాప్రయోజనాల గురించి చర్చలకు అవకాశమే లేకుండా చట్టసభలను బలహీనం చేయడం, అధికార యంత్రాంగాన్ని స్వప్రయోజనాలకు వాడుకుంటూ దుర్వినియోగం చేయడం, రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్‌బిఐ), సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ), ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ (ఇడి), నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ (ఎన్ఐఎ), సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్ (సివిసి), కేంద్ర ఎన్నికల సంఘం (సిఇసి), కేంద్ర సమాచార

కమిషన్ (సిఐసి) వంటి అనేక ప్రామాణిక, అత్యున్నత సంస్థలను సంఘ్ పరివార్ ప్రయోజనాల కొరకు, చివరికి ప్రధానమంత్రి వ్యక్తిగత ప్రయోజనాల కొరకు వాడుకోవడం మొదలయింది. ఉన్నత విద్యా రంగాన్ని, జాతీయ స్థాయి విద్యా, చారిత్రక, తాత్విక సంస్థలను విధ్వంసం చేసి వాటి ప్రకటిత లక్ష్యాల నుంచి దూరం తీసుకుపోవడం జరిగింది. ఈ వరుసలోనే న్యాయవ్యవస్థను లోలోపలి నుంచి తొలిచివేయడానికి నరేంద్ర మోడీ ప్రభుత్వం ఒక పథకం ప్రకారం అనేక కుటిల ప్రయత్నాలు ప్రారంభించింది.

ప్రత్యేకించి న్యాయవ్యవస్థను ధ్వంసం చేసే ప్రయత్నాలకు వ్యతిరేకంగా సుప్రీంకోర్టు న్యాయమూర్తులలో నలుగురు సీనియర్ న్యాయమూర్తులు అసాధారణంగా బహిరంగ పత్రికాసమావేశం ఏర్పాటు చేసి, న్యాయవ్యవస్థలో జరుగుతున్న కొన్ని అవకతవకల గురించి ప్రస్తావించారు. అంతకు ముందే జస్టిస్ కర్ణన్ విషయంలో జరిగిన వివాదం, ప్రొఫెసర్ జి ఎన్ సాయిబాబా తదితరుల కేసులో ఎటువంటి సాక్ష్యాధారాలు లేకపోయినా, ప్రాసిక్యూషన్ తన నేరారోపణలను రుజువు చేయలేకపోయినా సాయిబాబాతో సహా ఐదుగురికి యావజ్జీవ శిక్షలు విధించడం, సిబిఐ ప్రత్యేక కోర్టు జడ్జి బ్రిజ్ మోహన్ లోయా నాగపూర్ లో అనుమానాస్పదంగా మరణించడం హత్య కావచ్చుననే అనుమానాలు, లోయా స్థానంలో వచ్చిన కొత్త న్యాయమూర్తి భారతీయ జనతాపార్టీ అధ్యక్షుడు అమిత్ షా ను కేసు నుంచి తప్పించడం, గుజరాత్ మారణకాండకు కారకులైన ఎందరో హంతకులను, కుట్రదారులను న్యాయస్థానాలు నిర్దోషులుగా వదిలిపెట్టడం వంటి ఎన్నో అక్రమాలు బైట పడి ఉన్నాయి.

ఈ ఒక్క సంవత్సరమే తీసుకుంటే ఆధార్ కార్డు ప్రామాణికత, బాబ్రీ మసీదు – రామజన్మభూమి వివాదం, శబరిమల ఆలయంలో మహిళల ప్రవేశం, దేశవ్యాప్తంగా హక్కుల కార్యకర్తల అక్రమ నిర్బంధం, స్వలింగ సంపర్కానికి చట్టబద్ధత ఉందా అనే వివాదం, వివాహేతర సంబంధాన్ని క్రిమినల్ నేరంగా పరిగణించవచ్చునా అనే వివాదం, జడ్జి లోయా అనుమానాస్పద మృతిపై విచారణ జరపాలనే విజ్ఞప్తి, రాఫేల్ విమానాల కొనుగోలులో జరిగిన అక్రమాలు, సిబిఐ డైరెక్టర్ ను అర్ధాంతరంగా తొలగించడం వంటి అనేక కీలకమైన సమస్యలను సుప్రీం కోర్టు విచారించింది. ప్రధాన న్యాయమూర్తిగా జస్టిస్ దీపక్ మిశ్రా ఉన్నారా, ఆయన స్థానంలో రంజన్ గోగోయ్ వచ్చారా అనేదానితో సంబంధం లేకుండా, మొత్తంగా చూసినప్పుడు న్యాయవ్యవస్థ న్యాయం పక్షాన మాత్రమే కాదు, చట్టం పక్షాన కూడ సంపూర్ణంగా నిష్పాక్షికంగా నిలబడలేదని తెలుస్తుంది. ప్రజల హక్కులు, రాజ్యాంగంలో హామీ ఇచ్చిన ప్రాథమిక హక్కులు, వ్యవస్థ మౌలిక స్వభావాన్ని ప్రశ్నించే కేసులు, హిందూ మతోన్మాదం వంటి వ్యవహారాల్లో న్యాయవ్యవస్థ పూర్తిగా అధికారపక్ష వైఖరినే తీసుకుంది. ఉపరితల సమస్యల్లో, వ్యవస్థ యథాస్థితిని ప్రశ్నించని సమస్యల్లో ప్రగతిశీల తీర్పులు ఇచ్చినట్టు నటిస్తూనే అత్యంత కీలకమైన కేసుల్లో ఆధిపత్య వర్గాలకు, పురుషాధిపత్యానికి, కులాధిపత్యానికి, హిందూ బ్రాహ్మణీయ భావజాలానికి కట్టుబడిన తీర్పులు ఇచ్చింది. చివరికి ఒక హైకోర్టు న్యాయమూర్తి భారతదేశాన్ని హిందూ దేశంగా ప్రకటించాలని తీర్పులోనే రాసే స్థితికి న్యాయవ్యవస్థ విధ్వంసం చేరుకుంది. ఒక్క మాటలో చెప్పాలంటే న్యాయవ్యవస్థ సంఘ్ పరివార్ స్వరం వినిపించే మరో ముఖంగా మారుతున్నది. రాజ్యాంగంలో, చట్టాలలో ఉన్న లోపాలను సవరించి వాటిని పరిపుష్టం చేసి, ప్రజానుకూలం చేయవలసిన స్థితి ఉండగా, న్యాయవ్యవస్థ వాటిని రద్దు చేసి, వాటి స్థానంలో మనుస్మృతిని ప్రవేశపెడుతున్నది. న్యాయవ్యవస్థ విధ్వంసానికి బహుశా ఇది పరాకాష్ట కావచ్చు.

భీమా కోరేగాం హింసాకాండకు బాధ్యులైన శంభాజీ భిడే, మిళింద్ ఎక్బోటేలను కాపాడడానికి సంఘ్ పరివార్ పూనికతో తయారై, మధ్యలో నరేంద్ర మోడీ హత్యకు కుట్ర జరిగిందనే అబద్ధాన్ని జతచేసుకున్న కేసు విషయం చూస్తే న్యాయవ్యవస్థ ఎంతగా విధ్వంసమయిందో స్పష్టంగా అర్థమవుతుంది. నిజమైన నేరస్తుల మీద కేసు నమోదు చేయలేదు. నమోదు చేసిన కేసును దర్యాప్తు చేయలేదు. ఆ ఘటన మీదనే తప్పుడు ఎఫ్ ఐ ఆర్ దాఖలు చేయించుకుని, దాని ఆధారంగా కేసు తయారు చేసి, దర్యాప్తు పేరుతో దేశవ్యాప్త దాడులు, వేధింపులు మొదలుపెట్టారు. దర్యాప్తు చేస్తున్న పోలీసు అధికారులకు దురుద్దేశాలు ఉన్నాయని ఈ వేధింపులు రుజువు చేస్తున్నాయని, అందువల్ల మరొక స్వతంత్ర సంస్థతో దర్యాప్తు చేయించాలని సుప్రీం కోర్టు ముందుకు వెళ్తే, వాదనలన్నీ అయిన తర్వాత 'రేపు ఫలానా న్యాయమూర్తి తీర్పు చెపుతారు' అని ప్రకటించి, రాత్రికి రాత్రే తీర్పును తారుమారు చేశారు. తెల్లారేసరికి మరొక న్యాయమూర్తి తీర్పు చెపుతారని పేరు మార్చారు. ముందు ప్రకటించిన న్యాయమూర్తిది అసమ్మతి తీర్పుగా, మైనారిటీ తీర్పుగా మార్చారు. ఇంత ఘనమైన సంఘ్ పరివార్ న్యాయవ్యవస్థ ఇది.

రాజ్యాంగ వ్యవస్థల విధ్వంసం అనేది కేవలం విప్లవకారులకో, అసమ్మతి వాదులకో మాత్రమే సమస్య కాదు. పాలన పద్ధతి ప్రకారం సాగుతున్నదా, దుడ్డు చేతిలో పట్టుకున్న హింసావాది ఇష్టారాజ్యంగా సాగుతున్నదా అనే సమస్య ఇది. మనం ప్రజాస్వామ్య పాలనలోనే ఉన్నామా, నిరంకుశాధికారుల పాలనలో ఉన్నామా అని తేల్చుకోవలసిన సమస్య ఈ రాజ్యాంగ వ్యవస్థల విధ్వంస సమస్య. దీన్ని కేవలం పాలకవర్గ ముఠాల మధ్య తగాదాగా వదిలివేస్తే రేపు వారిలో వారు రాజీకి వచ్చి ఈ విధ్వంస దిశ మార్చవచ్చు గాని, ప్రజా పాలనకు అవసరమైన వ్యవస్థల విధ్వంసం ఆగదు. ఈ విధ్వంసాన్ని గుర్తించి, మేల్కొని, విధ్వంసాన్ని ఆపడానికి ఒక విశాల ప్రజా పోరాటం సాగించడం ఒక్కటే ప్రజల ముందున్న ప్రత్యామ్నాయం. వీ

*(రచయిత వీక్షణం సంపాదకుడు)*

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# సిబిఐ స్వతంత్రతకు విఘాతం

***అవినీతి నియంత్రణ కోసం ఏర్పాటైన సిబిఐని అవినీతిమయం చేసి, తన స్వార్థ ప్రయోజనాల కోసం ప్రత్యర్థులపై ఆధిపత్యానికి బిజెపి కేంద్ర ప్రభుత్వం వాడుకుంటోందనీ, మొత్తంగా సిబిఐ ఉనికినే దెబ్బతీస్తోందని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

కేంద్ర దర్యాప్తు సంస్థ లేదా సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) అనేది భారతదేశంలో అత్యున్నత దర్యాప్తు సంస్థ. కేంద్ర ప్రభుత్వం అధికార పరిధిలో కేంద్ర సిబ్బంది, ప్రజా ఫిర్యాదులు, పెన్షన్లు మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలో పనిచేస్తుంది. రెండో ప్రపంచ యుద్ధకాలంలో, యుద్ధ ఖర్చులకు సంబంధించి అవినీతి, లంచగొండితనంపై దర్యాప్తుకు బ్రిటిష్ ప్రభుత్వం ఈ సంస్థను దేశీయ భద్రతా విధుల కోసం స్పెషల్ పోలీస్ ఎస్టాబ్లిష్‌మెంట్‌గా 1941లో ఏర్పాటు చేసింది. 1946లో కేంద్ర ప్రభుత్వ విభాగాలకు చెందిన సిబ్బంది అవినీతి, లంచగొండితనంపై దర్యాప్తునకు ఒక దర్యాప్తు విభాగం ఉండాలనే ఉద్దేశంతో ఢిల్లీ స్పెషల్ పోలీస్ ఎష్టాబ్లిష్మెంట్ (డిఎస్‌పిఇ) ఆక్ట్‌ను అనుసరించి దాని పరిధిని విస్తరించారు. 1963 ఏప్రిల్ 1న కేంద్ర హోంశాఖ ఒక తీర్మాణం ద్వారా ఈ విభాగం పేరును సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ)గా పేరు మార్చారు. ఈ సంస్థ నినాదం 'శ్రద్ధ, నిష్పక్షపాతం, న్యాయవర్తన'. ప్రధాన కార్యాలయం న్యూఢిల్లీలో ఉంది. ఢిల్లీ, కోల్‌కత, ముంబై, చెన్నైలలో ప్రాంతీయ కార్యాలయాలు ఉన్నాయి. ఈ సంస్థ ప్రధానంగా అవినీతి, క్లిష్టమైన నేరాలు వంటి వాటిని దర్యాప్తు చేస్తుంది. ఐదున్నర దశాబ్దాలుగా సిబిఐ అత్యున్నత రాజ్యాంగ వ్యవస్థగా కొనసాగుతోంది.

### విశ్వసనీయత కోల్పోయిన సిబిఐ

సిబిఐ భారతదేశంలో అత్యున్నత నేర దర్యాప్తు సంస్థ. అవినీతిపరులను వెదికి పట్టుకొని శిక్షవేయాల్సిన సిబిఐ కోటలోనే అవినీతి పాగా వేసింది. తనది స్వచ్ఛమైన పాలన, అవినీతి రహిత పాలన, పవిత్ర పాలన అంటూ తనను తాను ఆకాశానికి ఎత్తేసుకొంటున్న ప్రధాని నరేంద్రమోడీ కాలంలో వెలుగు చూసిన వాస్తవమిది. సిబిఐకి ఈ పరిస్థితి రావడానికి, ఇంతగా దిగజాండానికి ప్రధాని మోడీ అనుసరించిన విధానాలే కారణం. దొంగలను పట్టేవాడే పెద్ద దొంగ అయితే ఎలా? నీతులు చెప్పేవాడే పెద్ద అవినీతి పరుడయితే ఎలా? అవినీతిపరుల రహస్య కోణాలను బయటకు తీసి, వాటి నిగ్గుతేల్చి శిక్షించాల్సిన వాడే రహస్యంగా పెద్ద అవినీతిపరుడుగా తేలితే.. ఇక దేశంలో విచ్చలవిడిగా జరుగుతున్న అవినీతిని ఎవరు అడ్డుకుంటారనే సందేహం ప్రజల్లో కలగడం సహజం.

సిబిఐ అవినీతి నిగ్గుతేల్చడంలో నిజాయితీగా ఉంటుందని అందరికీ ఒక నమ్మకం. ఏ కేసునైనా సిబిఐకి ఇచ్చారంటే న్యాయం జరుగుతుందని, దోషికి శిక్ష పడుతుందని ప్రజలు నమ్ముతున్నారు. కానీ ఇప్పుడా నమ్మకం పోయింది. సిబిఐ ఉన్నతాధికారులే అవినీతికి ఎగబడ్డారు. ఈ పరిస్థితి ఎందుకొచ్చింది? సిబిఐ అధికారులు అంత ధైర్యంగా ఎందుకు అవినీతికి పాల్పడుతున్నారు? కోట్ల మీద ఆశలు వారికి ఎందుకు వచ్చాయి? నేరం చేయని వారిని రక్షించడం, నేరస్తుల నేరం నిరూపించి వారిని శిక్షించడం సిబిఐ పని. నిజానికి వారికి రాజకీయ నాయకులతో సంబంధం ఉండకూడదు. రాజకీయ నాయకులు, పాలకులు వాళ్లకు బాస్‌లు కాదు. సిబిఐ స్వతంత్ర సంస్థ.

ప్రధాని మోడీ, బిజెపి జాతీయ అధ్యక్షులు అమిత్‌షా సిబిఐని తమ స్వార్థరాజకీయాల కోసం వాడుకుంటున్నారు. ఇప్పుడు ఆశ్రితులను రక్షించే పనిలో ఉన్నారు. ప్రతిపక్షాలపైన సిబిఐని ఉసికొల్పారు. ప్రధాని మోడీయే తన స్వంత ప్రయోజనాల కోసం తమను వాడుకుంటున్నప్పుడు తామెందుకు అవినీతి ద్వారా కోట్లు సంపాదించకూడదని సిబిఐ భావిస్తే ఎలా తప్పనగలం? ప్రధాని మోడీ అవినీతిపరులను రక్షిస్తున్నారని, వారికి అండగా తమను నిలుపుతున్నారని సిబిఐ గమనించిన తర్వాత తానెందుకు సత్యంగా ఉండాలని సిబిఐ భావిస్తే ఆ తప్పెవరిది? తమను స్వార్థ ప్రయోజనాలకు వాడుకొన్న ప్రధాని మోడీ తమనూ రక్షిస్తారని వారి నమ్మకం. మోడీ ప్రభుత్వం సిబిఐ స్వతంత్రకు విలువ ఇవ్వకపోవడం, సిబిఐని స్వంత రాజకీయ ప్రయోజనాలకు వాడుకోవడం, ఇంటి పెద్ద స్వార్థం, ఇల్లును ముంచిందన్నట్టుగా ఉంది సిబిఐ కథ.

ఇవాళ సిబిఐకి సారధ్యం వహిస్తున్న ఉన్నతాధికారులు 'నీవు దొంగ అంటే నీవు దొంగ' అని తిట్టిపోసుకుంటున్నారు. సిబిఐ డైరెక్టర్ ఆలోక్‌వర్మ, స్పెషల్ డైరెక్టర్ రాకేశ్ ఆస్తానాలు పరస్పర అవినీతి ఆరోపణలు చేసుకున్నారు. 'నీవు కోట్లు తిన్నావు, అంటే నీవు కోట్లు తిన్నావ'ని రాళ్లు వేసుకుంటున్నారు.

నరేంద్రమోడీ కాలంలోనే ఈ అవినీతి ప్రారంభమైందని చెప్పలేం. నిజానికి భారతదేశంలో అవినీతిని పెంచి పోషించింది కాంగ్రెస్ పార్టీయే. అయితే విషాదకరమైన విషయమేమంటే కాంగ్రెస్ కాలంలోని అవినీతి తన కాలంలో జరుగదు. అవినీతిపరులకు కళ్లెం వేస్తానని నమ్మించి ప్రధాని కుర్చీలోకి వచ్చిన మోడీ అవినీతిపరులను కాపాడడం ప్రారంభించారు. ఈ బలహీనతే సిబిఐని అవినీతి బురదలోకి నెట్టింది. విజయ్‌మాల్యా, లలిత్‌మోడీ, నీరవ్‌మోడీల వేల కోట్ల ఎగవేతలు, బ్యాంకులలో లక్షల కోట్ల మొండి బకాయిలు, వ్యాపం నుంచి రాఫెల్ వరకు అనేక కుంభకోణాలు ఇటువంటివి ఎన్నో మోడీ కాలంలో బయటకు వచ్చాయి.

### సిబిఐలో వివాదానికి నేపథ్యం

2017 జనవరి 19న సిబిఐ డైరెక్టర్‌గా ఆలోక్ వర్మ నియామకం

జరిగింది. 2017 అక్టోబర్‌లో సిబిఐలోని ఐదుగురు సభ్యులతో కేంద్ర విజిలెన్స్ కమిషన్ (సివిసి) సమావేశమైనప్పుడు ప్రత్యేక డైరెక్టర్‌గా రాకేశ్ ఆస్తానాను నియమించడంపై సిబిఐ డైరెక్టర్ ఆలోక్‌వర్మ అభ్యంతరం తెలిపారు. అక్టోబర్ 22న సిబిఐ అదనపు డైరెక్టర్‌గా నియుక్తులైన ఆస్తానా నియామకాన్ని వ్యతిరేకిస్తూ నవంబర్ 2న ప్రముఖ న్యాయవాది ప్రశాంత్ భూషణ్ కోర్టును ఆశ్రయించినా లెక్కచేయలేదు. సిబిఐ పనితీరును పర్యవేక్షించే కేంద్ర విజిలెన్స్ కమిషన్ (సివిసి) అభ్యంతరాలను సైతం బేఖాతరు చేసింది.

సిబిఐ స్పెషల్ డైరెక్టర్‌గా పదోన్నతి కల్పించేటప్పటికి ఆస్తానాపై అరడజనుకు పైగా అవినీతి కేసులు నమోదై ఉన్నాయి. సిబిఐ డైరెక్టర్ ఆలోక్‌వర్మ ఈ విషయాన్ని లేఖ రూపంలో సివిసి దృష్టికి తీసుకెళ్లినా స్పందన కరువైంది. వడోదరాలో ఆస్తానా కుమార్తె వివాహానికి భారీగా పెట్టిన ఖర్చును కొందరు వ్యాపార ప్రముఖులు భరించారన్న అభియోగాలపై దర్యాప్తు జరుగుతోంది. అవినీతి కేసుల్లో విచారణ ఎదుర్కొంటున్న అధికారిని మోదీ సర్కార్ మరీ పట్టుబట్టి సిబిఐ ప్రత్యేక డైరెక్టర్‌గా పదోన్నతి కల్పించింది. అప్పటి నుంచి సిబిఐలో పలు కేసుల విచారణలో, అంతర్గత బదిలీల్లో ఆలోక్‌వర్మ, రాకేశ్ ఆస్తానా మధ్య ఆరోపణలు, ప్రత్యారోపణలు చోటు చేసుకుంటున్నారు. పరస్పరం అవినీతి ఆరోపణలు చేసుకుంటూ కేంద్ర విజిలెన్స్ కమిషన్‌కు, ప్రభుత్వానికి ఫిర్యాదులు చేసుకున్నారు.

ఢిల్లీకి చెందిన మాంసం ఎగుమతిదారు మొయిన్ ఖురేషీపై మనీలాండరింగ్ కేసుకు సంబంధించి ఆలోక్‌వర్మ, రాకేశ్ ఆస్తానాలు పరస్పర అవినీతి ఆరోపణలు చేసుకోవడంతో వివాదం తీవ్రస్థాయికి చేరింది. ఈ నేపథ్యంలో చరిత్రలో ఎన్నడూలేని విధంగా కేంద్ర దర్యాప్తు సంస్థ (సిబిఐ) తన సొంత ఉన్నతాధికారి రాకేశ్ ఆస్తానాపై 2018 అక్టోబర్ 15న కేసు నమోదు చేసింది.

దేశంలోనే అత్యున్నతమైన ఈ దర్యాప్తు సంస్థలో ఇటీవల చోటుచేసుకుంటున్న కొన్ని పరిణామాలు సిబిఐ విశ్వసనీయతనే ప్రశ్నార్థకం చేస్తున్నాయి. మోడీకి అత్యంత సన్నిహితుడైన సిబిఐ ప్రత్యేక డైరెక్టర్ రాకేశ్ ఆస్తానా ఎదుర్కొంటున్న అవినీతి ఆరోపణలు చాలా తీవ్రమైనవి. వృత్తి నైపుణ్యం, సామర్థ్యం ప్రాతిపదిక కాకుండా తనకు నచ్చినవారిని, కళంకితులను ఉన్నత స్థానాల్లోకి చొప్పించి ఈ సంస్థ ప్రతిష్టను దెబ్బతీసేందుకు మోడీ సర్కార్ ఎలా ప్రయత్నిస్తున్నదో మరోమారు వెల్లడైంది. రాజ్యాంగంపైన, రాజ్యాంగ విలువలపైన, పార్లమెంటరీ ప్రజాస్వామ్య సంస్థలపైన వీసమెత్తు విలువివ్వని మోడీ సర్కార్ ఇంతకన్నా భిన్నంగా వ్యవహరిస్తుందని ఎలా ఆశించగలం?

**సిబిఐలో ప్రభుత్వ జోక్యం**

2002లో గుజరాత్ మారణకాండకు సంబంధించి అనేక ఆరోపణలు వచ్చాయి. గోద్రా సబర్మతి ఎక్స్‌ప్రెస్ రైలు దగ్ధం ఘటన అనంతరం గుజరాత్‌లో మైనారిటీలపై హిందుత్వ శక్తులు సాగించిన మారణకాండపై దర్యాప్తు చేసి నాటి ముఖ్యమంత్రి నరేంద్ర మోడీకి క్లీన్‌చిట్ ఇచ్చినవాడు ఆస్తానా. మోడీ మంత్రివర్గంలో హోంమంత్రిగా ఉన్న అమిత్‌షా కొన్ని కేసుల్లో జైలులో కూడా ఉండి వచ్చారు. మోడీ ప్రధానిగా పగ్గాలు చేపట్టడానికి కొద్దివారాల ముందే ఆయనపై కేసులను సిబిఐ మూసేసింది. 2014లో మోడీ ప్రధాని కావడం, అమిత్‌షా బిజెపి అధ్యక్ష పదవి చేపట్టడం జరిగాక ఆస్తానా 'విధేయత'ను దృష్టిలో ఉంచుకుని సిబిఐని ఆయనకు అప్పగించాలని మోడీ-షా ద్వయం కోరుకుంది. ఆ తరువాత బిజెపి అధ్యక్షుడు అమిత్‌షాను సోహ్రాబుద్దీన్ షేక్ బూటకపు ఎన్‌కౌంటర్, జస్టిస్ లోయా అనుమానాస్పద మృతి కేసుల్లోంచి బయటపడేసింది ఆస్తానానే. పాలక పక్షీయులను కేసుల నుంచి కాపాడడానికి, పాలక పార్టీ ప్రత్యర్థులను వేధించడానికి సిబిఐని ఒక పావుగా కేంద్రం వాడుకుంటున్నది. ఆస్థానా ఒక పనిముట్టుగా మారారు.

అధికారంలో ఉన్న పెద్దలు ఆడమన్నట్లల్లా ఆడడం సిబిఐకి కొత్తేమీ కాకపోయినా మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఈ ధోరణి పరాకాష్టకు చేరుకుంది. 'పంజరంలోని చిలుక' అంటూ సిబిఐని సుప్రీంకోర్టు ఎప్పుడో పేర్కొంది. మోడీ అధికారంలోకి వచ్చాక రాజ్యాంగ సంస్థల్లోకి ఆర్‌ఎస్‌ఎస్ మనుషులను చొప్పించడం, న్యాయ వ్యవస్థలో జోక్యం చేసుకోవడం, ప్రజాస్వామిక సంస్థలను ధ్వంసం చేయడమే ఎజెండాగా పెట్టుకున్న మోడీ సర్కార్ తాజాగా సిబిఐని టార్గెట్ చేసింది. తనకు నమ్మిన బంటుగా ఉన్న గుజరాత్ కేడర్ ఐపిఎస్ అధికారి రాకేశ్ ఆస్తానాను మోడీ ఏరికోరి తెచ్చుకుని సిబిఐలో పెద్దపీట వేయడంలో అంతర్యమిదే. మరోవైపు తమ విధులను నిర్వర్తిస్తున్న అధికారులను సిబిఐ నుంచి తప్పించడం, వంత పాడేవారిని నియమించడం పరిపాటి అయింది. తెరవెనక నుంచి ఆర్‌ఎస్‌ఎస్ ఇచ్చే ఆదేశాల ప్రకారం అన్ని చోట్లా అస్మదీయులను తెచ్చిపెట్టుకోవడం ఒకటైతే రాజకీయంగా తమను రక్షించే వారిని అందలాలెక్కించడం మరోవైపున జరిగింది. సిబిఐలో ఇవాళ్టి ప్రకంపనలు తత్ఫలితాలే.

**సిబిఐలో అవినీతి-పరస్పర ఆరోపణలు**

మోడీ అండ చూసుకునే ఆస్తానా సిబిఐ చీఫ్‌తో సహా ఎవరినీ ఖాతరు చేయకుండా ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నారు. మాంసం వ్యాపారి మొయిన్ ఖురేషి కేసుతో సంబంధం ఉన్న సానాసతీష్ కేసును మాఫీ చేసేందుకు ఆస్తానా కోసం మూడు కోట్లు ముడుపులు తీసుకున్నారని ఆలోక్‌వర్మ గత జూలై 2018లో సివిసికి లేఖ రాశారు. ముడుపులు తీసుకుని అడ్డంగా పట్టుబడినా ఆస్తానాపై చర్యకు సివిసి కానీ, సిబిఐని పర్యవేక్షించే సిబ్బంది వ్యవహారాల శాఖను నేరుగా చూస్తున్న ప్రధాని మోడీ కానీ ఏలాంటి చర్య తీసుకోలేదు. ఆస్తానాపై గత ఆగస్ట్ 24న సిబిఐ ఎఫ్ఐఆర్ నమోదు చేసింది. సిబిఐ అదనపు డైరెక్టర్ రాకేశ్ ఆస్తానాపై ఆ సంస్థే స్వయంగా ఎఫ్ఐఆర్ నమోదు చేయడం దాని పతన పరాకాష్టకు ప్రతీక. ఢిల్లీకి చెందిన మాంసం ఎగుమతిదారు మొయినా ఖురేషీపై మనీలాండ్‌రింగ్ కేసును మూసేయడానికి రు. 5 కోట్లు అడిగి రు. 3 కోట్లు పుచ్చుకున్నారన్నది సిబిఐ ఆరోపణ.

ఎవరీ ఖురేషీ? ఉత్తరప్రదేశ్‌లోని రామ్‌పూర్‌లో చిన్న పశువధశాలను ప్రారంభించిన ఖురేషీ తర్వాత అక్కడ నుంచి మాంసం ఎగుమతిదారుగా మారాడు. నిర్మాణం, ఫ్యాషన్ వంటి వివిధ రంగాలకు విస్తరించాడు. పాతిక కంపెనీలకు పైగా నెలకొల్పాడు. ఆయనపై అనేక పన్ను ఎగవేత కేసులు ఉన్నాయి. హవాలా వ్యాపారం ద్వారా కోట్లు గడించాడు. దేశం నుంచి అక్రమంగా 200 కోట్లను విదేశాలకు తరలించాడని ఖురేషీపై

ఇడి కేసు నమోదు చేసింది. దర్యాప్తులో భాగంగా సిబిఐ, ఇడి, ఆదాయం పన్ను శాఖల అధికారులు ఖురేషీ నివాసాల్లో చేపట్టిన సోదాల్లో లభించిన డాక్యుమెంట్లు, సేకరించిన ఫోన్ సంభాషణల ఆధారంగా ఖురేషీ అక్రమాలు వెలుగులోకి వచ్చాయి. ఖురేషీపై సిబిఐ, ఇడిలు కేసు నమోదు చేశాయి. ఖురేషీ కేసుల దర్యాప్తునకు ఏర్పాటైన ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్)కు అస్తానా అధిపతిగా వ్యవహరించారు. ఈ కేసుతో సంబంధం ఉన్న హైద్రాబాద్‌కు చెందిన వ్యాపారవేత్త సానా సతీష్‌ను కేసు నుంచి తప్పించడం కోసం అస్తానా తరపున ఖురేషీ అడిగాడు.

ఖురేషీ కేసులో హైద్రాబాద్‌కు చెందిన సతీశ్‌సానాను విచారిస్తు న్నప్పుడు అస్తానాకు ముడుపులు ఇచ్చిన విషయం బయటకు వచ్చింది. ఈ కేసులో తన పేరు బయటకు రాకుండా చూసేందుకు దుబాయిలో ఉండే బ్యాంకర్ మనోజుప్రసాద్ ఈ మొత్తం అస్తానాకు ముట్టజెప్పారు. ఈ కేసులో ప్రధాన నిందితుడైన సానా సతీష్ ఖురేషీకి 3 కోట్లు లంచంగా ఇచ్చినట్లు మేజిస్ట్రేట్ కోర్టులో వాంగ్మూలం ఇచ్చారు. సతీష్ తన వాగ్మూలంలో సిబిఐ స్పెషల్ డైరెక్టర్ అస్తానా, దుబాయ్‌కు చెందిన వ్యాపారవేత్త మనోజ్‌ప్రసాద్, ప్రసాద్ బంధువు సోమేశ్‌ల పేర్లు ప్రస్తావించారు. అస్తానా కోసమే ఈ సొమ్ము తీసుకుంటున్నట్టు ఖురేషీ చెప్పారని కూడా సతీష్ పేర్కొన్నారు. దీని ఆధారంగా సిబిఐ అస్తానాపై 2018 అక్టోబర్ 15న కేసు నమోదు చేసింది.

ఖురేషీ కేసును అస్తానా నేతృత్వంలో సిట్ దర్యాప్తు చేస్తోంది. 2018 అక్టోబర్ 16న దుబాయి నుండి భారత్ వచ్చిన మనోజ్ ప్రసాద్‌ను అరెస్టు చేశారు. ఖురేషీని 2017 ఆగస్టులోనే ఇడి అరెస్టు చేసింది. అస్తానా తనపై నమోదైన అవినీతి కేసుకు సమాధానం చెప్పకుండా తాను దర్యాప్తు జరుపుతున్న కేసుల్లో సిబిఐ చీఫ్ ఆలోక్‌వర్మ జోక్యం చేసుకుంటున్నాడని కేబినెట్ సెక్రటరీకి 2018 ఆగస్ట్ 24న ఫిర్యాదు చేశారు. ఒక జూనియర్ అధికారి తన చీఫ్‌పై ఈ విధమైన ప్రత్యారోపణలు చేయడం సిబిఐ చరిత్రలో బహుశా ఇదే ప్రథమం.

హవాలా మార్గంలో అనేక దేశాలకు నిధులు చేరవేస్తున్న నేరంపై ఢిల్లీకి చెందిన మొయినా ఖురేషిపై సిబిఐ అనేక కేసులు నమోదు చేసింది. ఈ కేసులన్నీ రాకేశ్ అస్తానాయే పర్యవేక్షిస్తున్నారు. వీటిలో ఓ కేసులో హైదరాబాద్‌కు చెందిన సతీష్ సానా అనే వ్యాపారి పేరు తప్పించడానికి రాకేశ్ అస్తానా ఈ ముడుపులు పుచ్చుకున్నారన్నది అభియోగం. ఇందుకు దుబాయ్‌లో ఉండే ఇన్వెస్ట్‌మెంట్ బ్యాంకర్ మనోజ్‌ప్రసాద్, ఆయన సోదరుడు సోమేష్ ప్రసాద్‌లు మధ్యవర్తులుగా వ్యవహరించారు. ఈ మొత్తం వ్యవహారానికి సంబంధించి ఫోన్ కాల్స్, వాట్సాప్ మేసేజ్‌ల ఆధారంగా పూర్తి సాక్ష్యాధారాలను సేకరించినట్టు మనోజ్‌ప్రసాద్, సతీష్ సానాల నుంచి స్టేట్‌మెంట్స్ కూడా తీసుకున్నట్టు సిబిఐ పేర్కొనడం గమనార్హం.

**అక్టోబర్ 23 అర్ధరాత్రి డ్రామా**

అస్తానా మీద చర్య తీసుకోవాలని వర్మ ఆలోచించడంతో స్వతంత్రత, సమగ్రత ఆయుపట్టుగా భాసిల్లాల్సిన కేంద్ర దర్యాప్తు సంస్థ (సిబిఐ)లో అక్టోబర్ 23 అర్ధరాత్రి చోటుచేసుకున్న నాటకీయ పరిణామాలు యావత్ భారతావనిని దిగ్భ్రాంతికి గురిచేశాయి. మోడీ ప్రభుత్వం ఆగమేఘాల మీద సిబిఐపై కేంద్ర విజిలెన్స్ కమిషన్ విచారణకు అక్టోబర్ 23 సాయంత్రం ఆదేశించడం, గంటల్లోనే కేంద్ర విజిలెన్స్ కమీషన్ (సివిసి) నివేదిక సమర్పించడం, వెనువెంటనే సిబిఐ డైరెక్టర్‌గా ఉన్న ఆలోక్ వర్మను ఆ పదవి నుంచి తప్పించి సెలవుపై పంపడం, బిజెపి నమ్మిన బంటుగా ముద్రపడిన జాయింట్ డైరెక్టర్ రాకేష్ అస్తానా పైనా వేటు వేసినట్లు నాటకం, అంతా రాత్రికి రాత్రే జరిగిపోవడం అత్యంత ఆందోళనకరం. సిబిఐ అధిపతిగా తన కార్యనిర్వాహకాల్లో కేంద్ర ప్రభుత్వం అడుగడుగునా జోక్యం చేసుకుందన్న స్పష్టమైన సంకేతాన్ని మాత్రం ఆలోక్ వర్మ బయటి ప్రపంచానికి చేరవేయగలిగారు.

నోట్ల రద్దు అక్రమాలు, బ్యాంకులకు రుణాలు ఎగ్గొట్టి విదేశాలకు ఉడాయించిన బిజెపి బంధుమిత్రుల బాగోతాలు, స్వయానా ప్రధానమంత్రి కార్యాలయం వైపే వేలెత్తి చూపిస్తున్న రాఫెల్ కుంభకోణాల సెగతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న కేంద్ర ప్రభుత్వం తనకు కావాల్సిన కొందరు వ్యక్తులు కోర్టు బోను ఎక్కకుండా రక్షించుకోవడానికే సిబిఐపై మెరుపు దాడికి దిగిందన్నది సుస్పష్టం. రాజకీయంగా తనకు సానుకూలంగా లేని ఆలోక్ వర్మను డైరెక్టర్ పదవి నుంచి తప్పించడం వెనుకా అసలు కారణం ఇదేనని తేలిపోయింది. ఈ మధ్యలో రాఫెల్ కుంభకోణానికి సంబంధించిన కీలక రహస్యాలపై దర్యాప్తు జరపాలని ఆలోక్ వర్మ నిర్ణయించారు. ప్రాథమిక విచారణ చేపట్టాడు. దీంతో మోడీ సొంత ప్రయోజనాలకే దెబ్బతగలడం ప్రారంభమైంది. రాఫెల్ బండారం బయట పడుతుందన్న భయం మోడీకి పట్టుకుంది. అందుకే సిబిఐ డైరెక్టర్‌ను అర్ధరాత్రి తొలగించారు.

నిజానికి ఒక అధికారిని పదవి నుంచి తొలగించే అధికారం నియామక అధికారికే ఉంటుంది. పాలకులకు ఉండదు. ఈ చర్యల ద్వారా ప్రజలకు మోడీ ప్రభుత్వం పంపుతున్న సందేశమేమిటి? తన అధికారాలను పదిలపరచుకొనే ప్రయత్నంలో సహ అధికారితో ఘర్షణ పడినందుకే ఆలోక్ వర్మను తొలగించారా లేక వివాదస్పద రాఫెల్ ఒప్పందంపై దర్యాప్తునకు సంకల్పించినందునే ఆయన్ని తొలగించారా? సరే, అస్తానానూ తొలగించారు. అయితే ఆయన ఎదుర్కొంటున్న వివిధ ఆరోపణలపై దర్యాప్తు జరిపిస్తారా లేక ప్రజలు మరచిపోయేంతవరకు ఉదాసీనంగా వ్యవహరిస్తారా? లేక నిస్సిగ్గుగా ప్రధాని మోడీ అస్తానాపై వచ్చిన ఆరోపణలు రద్దు చేస్తారేమో వేచి చూడాలి!

**తాత్కాలిక డైరెక్టర్‌గా నాగేశ్వరరావు**

సిబిఐ జాయింట్ డైరెక్టర్‌గా ఉన్న ఎం. నాగేశ్వరరావును సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్ సిఫారసు మేరకు వర్మ స్థానంలో నియమించారు. నిజానికి సివిసికి కూడ ఆ సిఫారసు చేసే అధికారం చట్టప్రకారం లేదు. ఆలోక్‌వర్మ తనను డైరెక్టర్ పదవి నుంచి తొలగించడాన్ని సుప్రీం కోర్టులో సవాలు చేశారు. అవినీతిని నిర్మూలిస్తామంటూనే, అవినీతి ఆరోపణలున్న మరో అధికారి నాగేశ్వర్‌రావును తాత్కాలిక చీఫ్‌గా నియమించారు. నాగేశ్వర్‌రావుపై ఎన్నో ఆరోపణలు ఉన్నాయి. అంతే కాకుండా ఆయన హిందూ వారసత్వాన్ని పునరుద్ధరించే భావజాలమున్న వ్యక్తి.

నాగేశ్వరరావు అవినీతిపై పలు ఫిర్యాదులున్నాయని సుప్రీంకోర్టు సీనియర్ న్యాయవాది ప్రశాంత్‌భూషణ్ ఆరోపించారు. ఆయన్ని సిబిఐ

నుంచి తొలగించి దర్యాప్తు జరపాలని ఆలోక్ వర్మ గతంలో కేంద్రానికి సిఫారసు చేసినట్లు ప్రశాంత్‌భూషణ్ తెలిపారు. అందువల్లనే నాగేశ్వరరావు ఎలాంటి విధాన పరమైన నిర్ణయాలు తీసుకోవద్దని, ఇప్పటివరకు తీసుకున్న నిర్ణయాలు కోర్టుకు తెలియజేయాలని సుప్రీంకోర్టు ఆదేశించింది.

కేంద్ర ప్రభుత్వం రాకేశ్ ఆస్తానాను రక్షించే చర్యలు చేపట్టింది. అక్టోబర్ 23 అర్ధరాత్రి బాధ్యతలు చేపట్టిన వెంటనే నాగేశ్వర్‌రావు ఆస్తానా కేసు విచారిస్తున్న వారందరిని బదిలీ చేశాడు. సిబిఐపై పర్యవేక్షక అధికారాలు కలిగిన కేంద్ర విజిలెన్స్ కమిషన్ సూచనల మేరకు ప్రధానమంత్రి నేతృత్వంలోని నియామకాల కేబినెట్ కమిటీ ఈ ఇద్దరు అధికారులను పదవి నుంచి తొలగించి సెలవుపై పంపింది. సిబిఐలో జాయింట్ డైరెక్టర్‌గా ఉన్న ఐపిఎస్ అధికారి ఎం.నాగేశ్వరరావును తాత్కాలికంగా సిబిఐ డైరెక్టర్‌గా నియమించారు.

ఆలోక్ వర్మను సెలవుపై పంపడం, తన కార్యాలయం స్వాధీనం చేసుకొని సోదాలు జరపడం వంటి చట్టవ్యతిరేక చర్యల మీద వర్మ సుప్రీంకోర్టును ఆశ్రయించగా, సుప్రీంకోర్టు కూడ మళ్లీ విచారణ బాధ్యతను సివిసికే అప్పగించింది. సిబిఐ చేసే ఇతర దర్యాప్తుల్లోనే నిజాయితీ, నిష్పాక్షికత, శీఘ్రత లోపించినట్టు భావించి సుప్రీంకోర్టు స్వయంగా తన పర్యవేక్షణలో దానిచేత పనిచేయించిన సందర్భాలున్నాయి. అందువల్లనే ఈసారి సివిసిని ఎ.కె.పట్నాయక్ (రిటైర్డ్ న్యాయమూర్తి) నేతృత్వంలో దర్యాప్తు జరుపాలని సుప్రీంకోర్టు ఆదేశించింది.

సిబిఐ కేసుల్లో దర్యాప్తు ఎంతవరకు నిష్పాక్షికంగా జరుగుతుందోనన్న అనుమానం కలగడం సహజం. కోర్టులు కూడా రాజకీయాలకు ప్రభావితం అవుతున్నాయా అన్న సందేహం కలుగుతోంది. నాగేశ్వరరావు తాత్కాలిక పదవీకాలంలో ఎలాంటి ముఖ్యమైన విధాన నిర్ణయాలు తీసుకోకుండా సుప్రీంకోర్టు నిషేధం విధించినప్పటికీ, తాత్కాలిక డైరెక్టర్‌గా పదవి చేపట్టిన వెనువెంటనే చేసినపని, 13 మంది అధికారులను బదిలీ చేయడం. వారంతా ఆస్తానాపై అవినీతి ఆరోపణలపై దర్యాప్తు చేస్తున్న వారే. వారంతా వర్మ పక్షం వహిస్తున్న వారే. ఆవిధంగా ఆస్తానాకు తక్షణ ఉపశమనం కల్పించినట్లైంది.

**నాగేశ్వరరావు నియామకం వెనుక**

ఎం.నాగేశ్వరరావును తాత్కాలిక సిబిఐ డైరెక్టర్‌గా నియమించడం అత్యంత నాటకీయంగా జరిగింది. నాగేశ్వరరావు 1986 బ్యాచ్ ఒడిశా క్యాడర్ ఐపిఎస్ ఆఫీసర్. ఆస్తానాపై అవినీతి ఆరోపణలు వస్తున్న నేపథ్యంలో, ఆస్తానా నిస్సహాయ పరిస్థితికి నెట్టి వేయబడిన పరిస్థితుల్లో మోడీ ప్రభుత్వాన్ని ఆదుకునేందుకు వచ్చిన వ్యక్తిగా నాగేశ్వరరావు ప్రాముఖ్యతను అర్థం చేసుకోవచ్చు. నాగేశ్వరరావు క్యారీర్ ప్రారంభంలోనే వివాదాల్లో చిక్కుకున్నారు. ఒడిశా నబ్‌రంగ్‌పూర్ జిల్లా ఎస్‌పిగా పని చేస్తున్నప్పుడు విద్యార్థులు మత మార్పిడిలకు పాల్పడకుండా ప్రభుత్వ పాఠశాలల హెడ్‌మాస్టర్లకు ఆయన ఒక లేఖ రాసినట్లు ఆరోపణ ఉంది. 1998 డిసెంబర్ 10న ది హ్యుమేన్ అనే సంస్థ ఒక బహిరంగ వేడుకను నిర్వహిస్తూ ఆయనను అతిథిగా ఆహ్వానించింది. అక్కడ ఆయన తన ప్రసంగంలో 'ముస్లింలు, క్రిస్టియన్లు, మార్క్సిస్టులు' మానవ హక్కులకు అతి పెద్ద ప్రమాదకరం అని అన్నారు. 'భారత జనాభాలో క్రిస్టియన్లు, ముస్లింలు చాలా చిన్నభాగం. దేశ రెవెన్యూకు వారి తోడ్పాటు నామ మాత్రం. హిందువుల నుండి వసూలు చేసిన పన్నులు మైనారిటీల కోసం ఖర్చు చేయడం మానవ హక్కులను ఉల్లంఘించడమే!' అని ఆయన వ్యాఖ్యానించాడు.

అలాగే జమ్మూ-కశ్మీర్‌కు ప్రత్యేక హోదా కల్పిస్తున్న ఆర్టికల్ 370ని రద్దు చేయాలని మాట్లాడారు. ఈ ప్రసంగం వింటున్న పట్నాయక్ 1999 ప్రారంభంలో ఒడిశా హైకోర్టులో ఒక పిటిషన్ ఫైల్ చేశారు. సీనియర్ ఐపిఎస్ అధికారిగా ఉన్న నాగేశ్వరరావు 'ఇండియన్ సర్వీస్ (కాండక్ట్) రూల్స్'ను అతిక్రమించినట్లు పేర్కొన్నారు. మతపరమైన భావోద్వేగాలను, విద్వేషాలను రెచ్చగొట్టడం ద్వారా భారత శిక్షాస్మృతి సెక్షన్ 295, 295ఏ లను ఉల్లంఘించినట్లు పేర్కొన్నారు.

ఒక ఇన్‌స్పెక్టర్ జనరల్ (ఐజి) ఆఫ్ సెంట్రల్ రిజర్వ్ పోలీస్ ఫోర్స్ (సిఆర్‌పిఎఫ్)గా నాగేశ్వరరావు మతపరమైన అల్లర్లు జరిగిన 2008 కాంధమల్ జిల్లాలో ఉన్నారు. ఆయన పదవీ బాధ్యతలు చేపట్టిన వెంటనే సిఆర్‌పిఎఫ్ బలగాల కదలికలపై సాయంత్రం 6 గంటల నుండి ఉదయం 6 గంటల వరకు పరిమతులు విధిస్తూ ఉత్తర్వులు జారీ చేశారు. రాత్రి పూట క్రిస్టియన్లకు వ్యతిరేకంగా సంఘ్ పరివార్ గృహ దహనాలకు, దొమ్మీలకు యథేచ్ఛగా పాల్పడ్డారు. సరియైన విచారణ జరిపితే కాంధమల్ జిల్లాలో ఆయన దుష్కృత్యాలు తేలికగా వెల్లడవుతాయని పట్నాయక్ పేర్కొన్నారు.

ఢిల్లీలో సిబిఐలో పోస్ట్ చేసిన తరువాత కూడా సంఘ్ పరివార్‌తో నాగేశ్వరరావు సంబంధాలు సజావుగా సాగాయి. ఇటీవల ఎకనామిక్ టైమ్స్‌లో వెలువడిన వార్త ప్రకారం, ఆర్‌ఎస్‌ఎస్ సలహాదారులతో సంబంధాలు కొనసాగుతున్నాయి. మతపరమైన అభియోగాలు మాత్రమే కాక, అవినీతి ఆరోపణలూ ఉన్నాయి. నాగేశ్వరరావు ఒడిషా ఫైర్ బ్రిగేడ్‌లో అడిషనల్ డైరెక్టర్ జనరల్‌గా 2014 వరకూ ఉన్న పదవీ కాలంలో తమ విభాగం సిబ్బంది యూనిఫారాలు కొనుగోళ్లకు సంబంధించి రు. 3 కోట్లు దుర్వినియోగం చేశారని ఆరోపణ ఉంది. ఖాకీ యూనిఫారం కాకుండా పసుపురంగు యూనిఫాం ప్రవేశపెట్టాడు. దీనికి రాష్ట్ర ప్రభుత్వం నుంచి ఎటువంటి అనుమతులూ లేవు. 2015లో బినొయ్ బెహరాను అదే విభాగానికి అధిపతిగా నియమించినప్పుడు టెండర్లు పిలువకుండానే కొనుగోళ్లు జరిగినట్టు వెలుగులోకి వచ్చింది.

నాగేశ్వరరావు భార్య మన్నె సంధ్యపై కూడా కలకత్తాకు చెందిన షెల్ కంపెనీ ద్వారా డబ్బు అక్రమ లావాదేవీలు జరిపినట్లు అభియోగా లున్నాయి. అందులో ఆవిడ పెట్టుబడి కూడా పెట్టి ఉన్నారు. సవక్కు రిపోర్ట్ ప్రకారం సంధ్య ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా పెదపలకలూరు గ్రామంలో కొంత స్థలం కొనుగోలు నిమిత్తం ఆంజెలా మర్కంటైల్స్ ప్రైవేట్ లిమిటెడ్ నుంచి రు. 20 లక్షలు అప్పు తీసుకొన్నారనే ఆరోపణ ఉంది. కానీ ఆవిడ కలకత్తాలోని కంపెనీలో రు. 60 లక్షలు పెట్టుబడి పెట్టినట్లు తేలింది. అంటే నాగేశ్వరరావు అక్రమ మార్గంలో డబ్బుని మళ్లించి బినామి ఆస్తి పొందినట్టు ఈ నివేదిక పేర్కొంది. నాగేశ్వరరావుకు వ్యతిరేకంగా వచ్చిన ఆరోపణలపై కూడా సిబిఐ డైరెక్టర్ ఆలోక్‌వర్మ పరిశోధిస్తున్నారు. సవుక్కు రిపోర్టు ప్రకారం నాగేశ్వరరావు మీద పలు

ఆరోపణలున్నప్పటికీ సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్‌గా ఉన్న కెవికె చౌదరి ఎటువంటి చర్య తీసుకోలేదు. వర్మను తీసేయాలని మోడీ ప్రభుత్వానికి సిఫారసు చేసింది ఈ చౌదరే. సిబిఐ తాత్కాలిక డైరెక్టర్‌గా నాగేశ్వరరావుని నరేంద్రమోడీ ప్రభుత్వం నియమించడాన్ని హిందూత్వ సైద్ధాంతిక పాత్రిపదికపై జరిగిన నియామకంగా తప్ప మెరిట్ ప్రాతిపదికగా జరిగినట్లు కనబడడం లేదు. ఈ సంస్థను స్వీయ ప్రయోజనాల కోసం ప్రభుత్వం రాజకీయం చేస్తున్నదన్న ఆరోపణలు ఎదుర్కొంటున్నా, ప్రభుత్వం వెనక్కు తగ్గడం లేదని స్పష్టమవుతోంది.

**సిబిఐ విచారణను అడ్డుకున్న దోవల్**

సిబిఐలో అంతఃకలహం కేసు నవంబర్ 21న మరో కీలక మలుపు తిరిగింది. కేంద్ర గనులు, బొగ్గు శాఖల సహాయ మంత్రి హరిభాయ్ ప్రతిభాయ్ చౌదరి, జాతీయ భద్రతా సలహాదారు (ఎన్ఎస్ఎ) అజిత్ దోవల్, కేంద్ర ప్రధాన విజిలెన్స్ కమిషనర్ (సివిసి) కెవి చౌదరి, కేంద్ర న్యాయ శాఖ కార్యదర్శి సురేశ్ చంద్ర, తెలంగాణ కాంగ్రెస్ మాజీ ఎంఎల్ఎ కె.లక్ష్మారెడ్డిలపై సిబిఐలో డిఐజిగా ఉన్న మనీశ్ కుమార్ సిన్హా అనే ఐపిఎస్ అధికారి తీవ్ర ఆరోపణలు చేశారు. మాంసం వ్యాపారి మొయిన్ ఖురేషి కేసులో నిందితుడిగా ఉన్న సానా సతీశ్‌ను కేసు నుంచి బయట పడేసేందుకు హరిభాయ్ చౌదరి జూన్ తొలిపక్షంలో కోట్లాది రూపాయల లంచం తీసుకున్నారు. సిబిఐ ప్రత్యేక డైరెక్టర్ రాకేశ్ ఆస్తానాకు అనుకూలంగా విచారణను ప్రభావితం చేసేందుకు జాతీయ భద్రతా సలహాదారు (ఎన్ఎస్ఎ) అజిత్ దోవల్ దర్యాప్తులో జోక్యం చేసుకున్నారనీ, కేంద్ర ప్రధాన విజిలెన్స్ కమిషనర్ కెవి చౌదరిని సతీశ్ సానా కలిశారని మనీశ్ సిన్హా కోర్టులో తెలిపారు.

అప్పటి సిబిఐ డైరెక్టర్ అలోక్ వర్మ ముడుపులు పుచ్చుకున్నారనేలా సతీశ్ సానా చెప్పినట్లుగా రాకేశ్ ఆస్తానా బృందం తప్పుడు వాంగ్మూలం సృష్టించింది. ఇందులో సిబిఐ డిఎస్‌పి దేవేంద్ర కుమార్‌ది కీలక పాత్ర. మొయిన్ ఖురేషి కేసు దర్యాప్తు అధికారి కూడా ఆయనే. అలోక్ వర్మ అప్పటికప్పుడు అప్రమత్తమై రాకేశ్ ఆస్తానాపై కేసు నమోదు చేశారు. డిఎస్‌పి దేవేంద్ర కుమార్ నివాసంలో సోదాలు జరుపుతుండగానే ఒక ఫోన్ వచ్చింది. దీంతో సోదాలు నిలిపివేయాలని అలోక్ వర్మ సూచించారు. ఎందుకిలా అని మనీశ్ ప్రశ్నించగా జాతీయ భద్రతా సలహాదారు దోవల్ ఫోన్‌చేసి చెప్పినందు వల్లేనని వర్మ బదులిచ్చారు. దీంతో దేవేంద్ర వర్మకు సంబంధించిన మొబైల్ ఫోన్లు, ఇతర ఎలక్ట్రానిక్ పరికరాలను స్వాధీనం చేసుకోలేకపోయామని, కీలక ఆధారాలు సేకరించలేకపోయామని మనీశ్ కుమార్ సిన్హా కోర్టులో తెలిపారు. ఇక ఈ కేసుకు సంబంధించి పలువురు పబ్లిక్ సర్వెంట్ల నివాసాల్లో తనిఖీలు జరపాల్సి ఉందని డిఎస్‌పి ఎకె బస్సీ (ఈయనను అండమాన్‌కు పంపించారు) కోరినప్పటికీ డైరెక్టర్ అనుమతి ఇవ్వలేదు. 'దోవల్ వద్దంటున్నారు' అని నిస్సహాయత వ్యక్తం చేసినట్లు మనీశ్ తెలిపారు.

సిబిఐ డిఐజి మనీశ్ కుమార్ సిన్హా అవినీతితో సంబంధం ఉన్న పలువురి పేర్లు వెల్లడించడంతో 'సర్వ భ్రష్టత్వం' సాక్షాత్కరించింది. దీంతో సిబిఐలో సంక్షోభం మరింత విస్తరించింది. ముడుపుల మూటలు తెరుచుకున్నాయి. బెదిరింపులు, బేరసారాల మాటలు వినిపించాయి. సిన్హా మాటల్లో చెప్పాలంటే.. కీలకవ్యవస్థలేవీ తమ పని తాము చేయలేదు. పైగా చేస్తున్న వారికి అడ్డుపడ్డాయి. వారూ వీరూ కాదు, చివరికి దేశంలోనే అత్యున్నత స్థాయి అధికారి అయిన కేంద్ర కేబినెట్ సెక్రటరీ పికె సిన్హా సైతం తమ దర్యాప్తులో వేలు పెట్టారని మనీశ్ ఆరోపించారు. వెరసి వ్యవస్థలను భ్రష్టు పట్టించడంలో తలో చేయి వేశారని తెలిపారు.

ప్రధాని మోడీ-బిజెపి అధ్యక్షుడు అమిత్‌షా ఏరికోరి సిబిఐ స్పెషల్ డైరెక్టర్‌గా నియమించుకున్న రాకేశ్ ఆస్తానా కేసులో దర్యాప్తునకు మనీశ్ నేతృత్వం వహించారు. ప్రజా ప్రయోజనాల పేరిట ఎం.నాగేశ్వరరావు అక్టోబర్ 23 అర్ధరాత్రి మనీశ్‌ను నాగపూర్‌కు పంపించారు. తన బదిలీ చెల్లదంటూ ఆయన నవంబర్ 21న సుప్రీంకోర్టును ఆశ్రయించారు. రాకేశ్ ఆస్తానాను కాపాడేందుకు ఎప్పుడు, ఎవరెవరు ప్రయత్నించారో వివరించారు. ఈ కేసులో ఫిర్యాదుదారుడు, హైదరాబాద్ వ్యాపారవేత్త సతీశ్ సానా చెప్పిన సంగతులతోపాటు దర్యాప్తులో తమ బృందం గుర్తించిన విశేషాలు 34 పేజీల అఫిడవిట్‌లో సుప్రీంకోర్టు దృష్టికి తీసుకొచ్చారు.

**ముగింపు**

సిబిఐ మాజీ డైరెక్టర్ అలోక్ వర్మ కేసులో సుప్రీంకోర్టు న్యాయాన్ని వాయిదా వేసింది. ఆలస్య న్యాయం న్యాయ తిరస్కరణకు దారితీయగలదు. దీంతో న్యాయస్థానాలు కూడా రాజకీయాలకు ప్రభావితమౌతున్నాయా అన్న సందేహం కలుగుతుంది. రా, ఐటి, ఐబిలతో పాటు ఆర్థిక నేరాల పరిశోధన సంస్థ ఈడీ కూడా కుంభకోణాల కుమ్ములాటల్లో చిక్కుకుంది. గుజరాత్ నమూనా అద్భుతమని, అది దేశానికి అవసరమని, మోడీ సమర్థ పాలకుడని సంఘ్‌పరివార్ చేసిన ప్రచారానికి ప్రజలు మోసపోయారు. ప్రతిపక్షాలు నిజాలను చాటలేదు. పెద్దనోట్ల రద్దు, సిబిఐ, ఆర్‌బిఐ లాంటి సంఘటనలు ఇంకా జరుగుతాయి. మోడీ కుట్రాజకీయం, వ్యవస్థల విధ్వంసం, బుద్ధిజీవులపై దేశద్రోహ కేసులు, హత్యలు నాజీ పాలనను తలపిస్తున్నాయి. మోడీ కీలకమైన ప్రభుత్వ సంస్థలలో తమ విధేయులను నియమించుకోవడమనే దుస్సంప్రదాయానికి పాల్పడుతున్నాడు.

ఇంగితం మరిచి కేవలం తమ అడుగులకు మడుగులొత్తుతారనే కుయుక్తితో ఆశ్రితులను, అంతేవాసులను అత్యున్నత స్థానాల్లో కూర్చోబెడితే ఫలితం ఇలాగే ఉంటుంది. అవినీతి నిర్మూలనే ఏకైక లక్ష్యంగా గల అత్యున్నత సంస్థగా సిబిఐ ఉనికే మసకబారింది.! కొంతకాలంగా సిబిఐ చేసే దర్యాప్తులోనే నిజాయితీ, నిష్పాక్షికత, శీఘ్రత లోపించింది. ఈ ఉదంతంలో ప్రధాన నిందితుడు సిబిఐ అదనపు డైరెక్టర్ హోదాలోని వాడు కావడం వల్ల, ఈ కేసు కేంద్ర పాలకుల ప్రతిష్ఠ మీద నీలినీడలు పరుస్తున్నాయి. నిజానికి ఇవాళ ఈ వ్యవస్థలో విశ్వసించదగిన, గౌరవించదగిన సంస్థ ఏదీ లేదని, ప్రతి సంస్థనూ తమ స్వార్థ రాజకీయ ఆర్థిక ప్రయోజనాలకే వాడుకుంటున్నారు. రాజ్యాంగబద్ధ సంస్థలలో ఏ ఒక్కదాన్నీ ప్రజలకు, రాజ్యాంగానికి జవాబుదారీగా పనిచేయనీయమని నానాటికీ మరింత నిస్సిగ్గుగా మోడీ వ్యవహరిస్తున్నాడు. ఈ కుళ్లిపోయిన వ్యవస్థను ఇంకా ఇలాగే కొనసాగిద్దామా ప్రజలే తేల్చుకోవలసి ఉంది. పౌరసమాజం, మేధావులు తమ కర్తవ్యాన్ని నిర్భయంగా నిర్వర్తించాలి. ప్రజల సామాజిక చైతన్యం పెంచాలి. మార్పుకు నాంది పలకాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ రాజకీయం

***ప్రజలపక్షంగా నిలిచి అవినీతి, అక్రమాలను నిరోధించాల్సిన దేశ అత్యున్నత నిఘా సంస్థలు రాజకీయ పావులుగా మారి అవినీతిని మరింత పెంచిపోషిస్తున్నాయని అంటున్నారు* ఎ. పున్నయ్య**

స్వతంత్ర భారతదేశంలో ఫెడరల్ స్ఫూర్తి విరాజిల్లేలా ప్రజల ఆకాంక్షలు నెరవేర్చి లేదా దేశ సమగ్రతను కాపాడుటకు రాజ్యాంగబద్ధ వ్యవస్థలను ఏర్పాటు చేసుకోవడం జరిగింది. తొలినాళ్లలో ఈ వ్యవస్థలు అత్యంత పారదర్శకంగా పనిచేస్తూ అద్భుత ఫలితాలనందిచాయి. క్రమంగా మారుతున్న కాలంలో రాజకీయ రంగులద్దుకోవడంతో కీలక రాజ్యాంగ విభాగాలన్నీ బలహీనమై ప్రజాస్వామ్య ఆకాంక్షలకు, విలువలకు తిలోదకాలిచ్చాయి. మారిన ఈ స్థితి ప్రజాస్వామ్యాన్ని కాంక్షించే వారిని మరింత ఆవేదనకు గురిచేస్తుంది. ఈ క్రమంలో స్వతంత్ర ప్రతిపత్తిగల ఎన్నికల సంఘం కోరలు పీకిన పాముగా మారిపోయింది. ఇక రిజర్వు బ్యాంకు కాగితపు పులిచందమైంది. దశాబ్దాలుగా అభివృద్ధికి దిశా నిర్దేశం చేసిన ప్రణాళిక సంఘం రద్దయింది. దాని స్థానంలో నీతి ఆయోగ్ వచ్చింది. ఫలితంగా రాష్ట్రాలకు నిధులు కేటాయించే ప్రణాళిక సంఘం పని ఇప్పుడే కేంద్ర ఆర్థిక శాఖకు బదిలీ అయింది. విశ్వవిద్యాలయ విరాళాల సంఘాన్ని ముక్కలు చేసి సృజనాత్మకమైన ఉన్నత విద్యకు, పరిశోధనలకు దూరం చేసినారు. కేంద్ర దర్యాప్తు సంస్థ (సిబిఐ) వెన్నెముక లేని వానపామైంది. అవినీతి నిరోధక సంస్థల, ఆదాయపు పన్నుశాఖ, కేంద్ర నిఘా విభాగంతో పాటు ప్రభుత్వ సంస్థల శాఖలన్నీ పాలక పక్షం వహించి అవినీతిని పెంచి పోషిస్తున్నాయి. ప్రజాస్వామ్యంలో శాసన వ్యవస్థ శాసనాలను రూపొందిస్తే అమలు చేయాల్సిన బాధ్యత కార్యనిర్వాహక శాఖది. శాసనవ్యవస్థ రూపొందిన శాసనాలను, చట్టాలను అమలు చేయడంలో కార్యనిర్వాహక వ్యవస్థ విఫలమైనపుడు దర్యాప్తు వ్యవస్థలు జోక్యం చేసుకొని పరిస్థితులను సమీక్షించి చర్యలు తీసుకోవాలి.

**భారత అత్యున్నత ఆర్థిక విచారణ సంస్థ ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్**

భారత ప్రభుత్వ అత్యున్నత దర్యాప్తు సంస్థ సిబిఐ కాగా, అత్యున్నత ఆర్థిక విచారణ సంస్థ ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్. ఇది భారత ప్రభుత్వ ఆర్థిక న్యాయ సూత్రాలను కాపాడుతూ ఆర్థిక నేరాలను నియంత్రణ చేస్తుంది. ఇది మరో దేశ ఆర్థిక పరిశోధనా సంస్థ భారత రాజ్యాంగాన్ని, చట్టాలను గౌరవిస్తూ న్యాయబద్ధమైన, కచ్చితమైన భారత రెవెన్యూ సర్వీసెస్, భారత పోలీస్ సర్వీసెస్, భారత పరిపాలన సర్వీసెస్ అధికారుల మార్గదర్శకత్వంతో ముందుకు పోతుంది. వృత్తిపరమైన ప్రమాణాలను, విశ్వతనీయతను పెంచడానికి ప్రయత్నిస్తుంది. ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ సమగ్రత, నైతికత, నిజాయితీ, జవాబుదారీతనం, నిబద్ధత, శ్రేష్టత, నిష్పాక్షికత అనే కీలక విలువలను పెంపొందించాలనే విశాల లక్ష్యంగా పనిచేస్తుంది. ఈ లక్ష్యాలను భిన్నంగా విదేశీ మారక నిర్వాహణ చట్టం (ఎఫ్ఇఎంఎల)ను అనుసరించి విదేశీ మారక క్రయ విక్రయాల్లో ఒక వ్యక్తి గాని, సంస్థ గాని ఏదైనా ఉల్లంఘన జరిపితే దానిపై విచారణ జరిపి చర్యలు తీసుకుంటుంది. మనీ లాండరింగ్ చట్టం (పిఎంఎల్ఎ) ప్రకారం ఒక వ్యక్తి లేదా సంస్థ చట్ట విరుద్ధంగా అవినీతితో లేదా క్రిమినల్ కార్యకలాపాలతో డబ్బులు సంపాదించినట్లు అనుమానిస్తే విచారణ జరిపి చర్యలు తీసుకుంటుంది. ఆరు దశాబ్దాలకు పైగా సమర్థవంతంగా పనిచేస్తూ స్వతంత్ర ఆలోచనలతో ముందుకు పోతున్నట్లు (ఇడి) ప్రకటించి నప్పటికీ, సమాజంలో వక్రీకరణ పొందుతున్న కొత్తతరం ఆలోచనలతో సాంకేతిక పరిజ్ఞానంతో నూతనంగా ఆవిష్కృతమవుతున్న మోసాలకు, ప్రభుత్వ కళ్లుకప్పి దేశ ఆర్థిక వ్యవస్థకు తూట్లు పొడిచే నేరగాళ్ల నడ్డివిరిచే విధంగా శరవేగమైన పరిజ్ఞానంతో సతంత్ర విధానాలతో పనిచేయడం లేదన్నది నిష్టుర సత్యం.

**ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ ప్రధాన విధులు**

విదేశీ మారక నిర్వాహణ చట్టం (ఎఫ్ఇఎంఎల), మనీ లాండరింగ్ చట్టం 2002 (పిఎంఎల్ఎ) నిబంధలను అమలుపరిచి వివాదాలపై దర్యాప్తు జరుపుతుంది. ఈ రెండు రకాల చట్టాల్లో జరిగిన జరుగుతున్న ఉల్లంఘనలపై విచారణ జరుపుతుంది. నేరాలలో పాల్గొన్న వ్యక్తులను లేదా సంస్థలను కఠినంగా శిక్షించేందుకు చర్యలు తీసుకుంటుంది. ఫారిన్ ఎక్స్‌చేంజ్ రెగ్యులేషన్ యాక్టు 1973కి సంబంధించిన నోటిఫికేషన్స్‌పై వచ్చే ఆరోపణలను విచారిస్తుంది. ఆస్థిపరమైన ఆర్థిక నేరస్థుల చట్టం 2018 లక్ష్యాల పవిత్రతను కాపాడుతుంది. విదేశీ మారక నిర్వాహణ చట్టం వివాదాలకు సంబంధించి విదేశీ మారకం, స్మగ్లింగ్ చర్యల చట్టం 1974 కేసులను విచారిస్తుంది. అంతేగాక మనీ లాండరింగ్ నిబంధనల ప్రకారం నగదు బదిలీ డర్టీ మనీని క్లీన్ మనీగా చూపించే ప్రక్రియలో చేసే సంస్థాగత మోసాలను బట్టబయలు చేస్తుంది. నిబంధనలకు అనుగుణంగా నగదు బదిలీ, ఆస్తుల పునరుద్ధరణ అంశాలతో సహకారాన్ని పెంపొందించాలనే ప్రధాన విధులుగా ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ కార్యకలాపాలను నిర్వహిస్తుంది. ఈ లక్ష్యాలను అమలు పరుచుటకు 1956 మే 1న విదేశీ ఎక్స్‌చేంజ్ రెగ్యులేషన్ యాక్ట్ 1947 (ఎఫ్ఈఆర్ఎ) ను నిర్వహించడానికి ఆర్థిక వ్యవహారాల విభాగంలో ఒక ఎన్‌ఫోర్స్‌మెంట్ యూనిట్ ఏర్పడింది. 1957లో ఈ యూనిట్‌ను ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్‌గా మార్చినారు. దీని ప్రధాన కార్యాలయం న్యూ ఢిల్లీలో ఉండగా ముంబాయి, కలకత్తా, చెన్నై, చండిగడ్‌లలో ప్రాంతీయ కార్యాలయంతో మరో 49 కార్యాలయాలతో దేశమంతటా పనిచేస్తుంది. వివిధ దర్యాప్తు ఏజెన్సీలు కస్టమ్స్, సెంట్రల్ ఎక్సైజ్, ఎన్‌కమ్ ట్యాక్స్, పోలీసు అధికారుల డిప్యూటేషన్స్‌తో పునర్నిర్మాణాన్ని సాధించి సుమారు 3000 మంది సిబ్బందితో కార్యనిర్వాహక బృందాలుగా ఏర్పడి దేశ వ్యాప్తంగా పనిచేస్తుంది.

**విరుచుకుపడిన ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ పని విధానం**

మనీ లాండరింగ్‌కు పాల్పడ్డారనే పిర్యాదుతో గ్రీన్‌పీస్ అనే పర్యావరణ సంస్థను ఈడీ అధికారులు తప్పు పట్టినారు. దేశంలోని ప్రముఖమైన వ్యక్తుల ద్వారా, సంస్థల ద్వారా నిధులను ఈ సంస్థ పొందుతుంది. ఈ స్వచ్ఛంద సంస్థ దాతల నుండి స్వీకరించే మొత్తాలకు ఒక విధానం లేదని ఈడి పేర్కొంటూ మోసపూరితమైన మార్గాల ద్వారా అవినీతి పద్ధతుల్లో నిధుల సేకరణ జరుగుతుందని రాతపూర్వక సాక్ష్యాలను అందదించాలని ఈడి గ్రీన్‌పీస్ సంస్థను కోరింది. విదేశీ కాంట్రిబ్యూషన్ రెగ్యులేషన్ యాక్ట్ (ఎఫ్‌సిఆర్‌ఎ) ముసుగులో జాతీయ వ్యతిరేక కార్యకలాపాలలోఓ పాల్గొన్నందుకు రిజిస్ట్రేషన్లు రద్దు చేసింది.

**అమ్నెస్టీ ఇంటర్‌నేషనల్**

మానవ హక్కుల పునరుద్ధరణకు కృషి చేస్తున్న అమ్నెస్టీ ఇంటర్‌నేషనల్ ప్రభుత్వ అధిక స్థాయి అధికారానికి వ్యతిరేకంగా పనిచేస్తుంది. ఈ సంస్థ పారదర్శకంగా పనిచేస్తున్న విశ్వాసం ప్రజలందరిలో ఉంది. ఈ సంస్థ కూడా ఫారిన్ కంట్రిబ్యూషన్ రెగ్యులేషన్ యాక్ట్ (ఎఫ్‌సిఆర్‌ఎ) ను ఉల్లంఘించిన పిర్యాదు మేరకు ఈడి అధికారులు ముఖ్యమైన పత్రాలతో పాటు లాప్‌టాప్‌లను స్వాధీనం చేసుకున్నారు.

**విద్యా సంస్థలకు మినహాయింపు**

భారతదేశంలోని విద్యా సంస్థలకు ఏ విదేశీ సంస్థ నుండైనా, వ్యక్తుల నుండైనా వసూలు చేసిన ఫీజు ఎఫ్‌సిఆర్‌ఎ 2010 ప్రకారం మినహాయింపు ఉంటుంది. దీనికి సంబంధించిన వివరాలను, అకౌంట్స్‌ను ఈడికి అందించాలి. విదేశీ సహకారం ముసుగులో అనేక అవకతవలు జరగుతున్నట్లు ఈడి గుర్తించింది. ఇట్లా విదేశీ సహకారం తీసుకునే సంస్థలకు మార్గదర్శకాలను విడుదల చేసింది.

భారత రిజర్వు బ్యాంక్ నోటిఫికేషన్ విదేశీ మారక నిర్వాహణ చట్టం 22 (ఆర్) ఆర్‌బిఐ – 16 ప్రకారం ఏదైనా ప్రభుత్వ సంస్థ, స్వచ్ఛంద లేదా లాభాపేక్ష లేని సంస్థ విదేశీ సంస్థ ఏజెన్సీ లేదా శాఖను ఏర్పాటు చేయాలనుకుంటే విధిగా విదేశీ కాంట్రిబ్యూషన్ రెగ్యులేషన్ యాక్టు కింద రిజిస్ట్రేషన్ పొందాలి అని ఈడి ఉత్తర్వులను ఇచ్చింది. దీని ప్రకారం అవినీతి కార్యక్రమాలు జరిగితే ఎలాంటి నోటీసులు ఇవ్వకుండానే జప్తు చేసే అధికారాలు ఈడీకి ఉంటాయి. జాతీయ ప్రయోజనాన్ని కోల్పోయే పద్ధతిలో కొన్ని సంస్థలు మోసపూరితంగా నిధులను పొందుతున్నారని ఇటీవల ఇలాంటి సంస్థలపై దాడీచేయగా 13,000 సంస్థలు నకిలీవిగా గుర్తించి ఎఫ్‌సిఆర్‌ఎ ప్రకారం రిజిస్ట్రేషన్లు రద్దుచేసినారు.

**ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ ఆర్థిక క్రమశిక్షణకు బాటలు వేయాలి**

విదేశీ మారక నిర్వహణ చట్టం, మనీ లాండరింగ్ చట్టం నిబంధనల ఉల్లంఘనలపై ఈడీ దృష్టిసారించాలి. డొల్ల కంపెనీలు సృష్టించి కోట్లాది రూపాయల మనీ లాండరింగ్‌కు, హవాలా దందాకు పాల్పడినట్లు ఆరోపణలు వస్తే ఈడీతో పాటు డైరెక్టరేట్ ఆఫ్ రెవెన్యూ ఇంటలిజెన్స్ డిఆర్‌ఐ విభాగాలు గమనించాలి. ఐటి అధికారులతో పాటు ఈడీ అధికారులు కూడా రంగంలోకి దిగాలి. నల్లడబ్బు దాచుకున్న వారిని నీళ్లు తాపించాలి. సూట్‌కేసు కంపెనీలకు చుక్కలు చూపించాలి. అవినీతిపరుల గుండెల్లో రైళ్లను పరిగెత్తించాలి. మనీ లాండరింగ్‌కు పాల్పడే షెల్ కంపెనీల బండారం బయటపెట్టి నిర్వాహకులు ఎంతటి వారైనా కఠినంగా శిక్షించాలి. దేశ ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేసి ఆర్థిక వ్యవస్థ విధ్వంసానికి కారణమవుతున్న వ్యక్తుల, సంస్థల భూటకపు పారిశ్రామిక నిర్మాతలపై దేగ కన్ను వేసి కొరడా ఝుళిపించాలి. అక్రమార్కుల వెన్నులో వణుకు పుట్టేలా దేశ ఆర్థిక వ్యవస్థకు పటిష్ట భద్రతగా నిలబడడమే ఈడీ విధానం. అలా ఆర్థిక అరాచకత్వం జరగకుండా ఆర్థిక క్రమశిక్షణకు బాటలు వేయాలి.

**ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్, సిబిఐ మధ్య తేడా**

ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ విదేశీ మారక నిర్వహణ చట్టం అమలులో అనుమానిత ఒప్పందాలపై విచారణ జరిపి (సివిలు దావాలను) పౌర చట్టాల ప్రకారం విచారిస్తుంది, మనీ లాండరింగ్ నేరారోపణలపై క్రిమినల్ చట్టం ప్రకారం విచారించే అధికారాలను కలిగి ఉంది. పై రెండు చట్టాల ప్రకారం ఆర్థిక అంశాలను క్రమబద్ధీకరిస్తుంది. సిబిఐ పరిశ్రమ, నిష్పాక్షికత, సమగ్రతల లక్ష్యంగా ప్రజా జీవితంతో అత్యున్నత పాత్ర పోషిస్తుంది. స్థూలంగా ఆర్థిక వ్యవస్థను అవినీతి రహిత పాలనను ఉన్నతీకరించి దేశ సార్వభౌమాధికారాన్ని రక్షించాలి. సిబిఐ కేంద్ర ప్రభుత్వం పర్సనల్ పబ్లిక్ పిర్యాదులు, పెన్షన్ పిర్యాదులను పర్యవేక్షిస్తుంది. సిబిఐలో కూడా ప్రత్యేక నేరాలకు ప్రత్యేకమైన చట్టాల పరిధిలో విచారణ జరుగుతుంది. రాష్ట్రాల సాధారణ ఒప్పంద అనుమతితోనే ఆయా రాష్ట్ర వ్యవహారాల్లో విచారణ దర్యాప్తులు చేయాలి.

**మారిన రాజ్యాంగబద్ధ సంస్థ విధానం**

తొలినాళ్లలో అత్యంత పారదర్శకంగా వ్యవహరించిన ఈడీ తర్వాత కాలంలో స్వార్ధ రాజకీయ నాయకుల, ప్రభుత్వాల కీలు బొమ్మలుగా మారిపోయింది. ఇది రాజకీయ నాయకుల ప్రత్యర్థులపై ప్రయోగించే అస్త్రంగా మారిపోయింది. తమ చెప్పుచేతల్లో లేని నాయకులపై పట్టు సాధించడానికి ఇటువంటి రాజ్యాంగ వ్యవస్థను చేతులుడిగేలా చేయడం జరిగింది. అసలు నేరస్థులను పక్కకు పెట్టి రాజకీయ కక్ష సాధింపుల వేదికగా మారింది. ఈ నేపథ్యంలో అనేక మంది ఆర్థిక రాజకీయ పలుకుబడిగల నేరగాళ్ల, సంస్థలు యథేచ్ఛగా 'ఈడీ' నిబంధనలను ఉల్లంఘించడం పరిపాటి అయింది.

**ఆర్థిక నేరస్తుల పరారీ బిల్లు ఆమోదం**

కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న నయా ఉదారవాద విధానల వల్ల చాలా మంది ఆర్థిక నేరస్తులు సులభంగా దేశం వదలిపోతున్నారు. విదేశాల్లో ఉండే ఆర్థిక నేరస్థులను వెనక్కి రప్పించే విధంగా కాకుండా దేశం నుండి పారిపోకుండా చట్టాలను తీసుకురావాలని చాలా సంవత్సరాలుగా చర్చలు జరిగినాయి. ఈ నేపథ్యంలో వచ్చిన పరారి ఆర్థిక నేరస్థుల బిల్లు – 2018 స్వాగతించాల్సిందే. విజయ్ మాల్యా, నీరవ్ మోడీ వంటి బడా ఆర్థిక నేరస్థులు చట్టం నుండి తప్పించుకు నేందుకు విదేశాలకు పారిపోకుండా పరారి ఆర్థిక నేరస్థుల బిల్లు – 2018 (ఫ్యుడల్ ఎకనామిక్ ఆఫెండర్స్ బిల్లు – 2018) రాజ్య సభలో ఆమోదం పొందింది.

న్యాయ స్థానాలలో విచారణను తప్పించుకునేందుకు ఆర్థిక నేరస్థులు విదేశాలకు పారిపోతున్న సంఘటనలు పెరిగిపోతున్న క్రమంలో ఈ చట్టంతో కళ్లెం వేయవచ్చు. ప్రస్తుతం ఉన్న చట్టాలు విదేశాలకు పారిపోతున్న ఆర్థిక నేరస్థుల ఆస్తులను జప్తు చేసుకునే అధికారం ఇవ్వడం

లేదు. ఈ కొత్త చట్టం ప్రకారంగా నేరస్థులు పారిపోకుండా చూసే సమర్థవంతమైన రాజ్యాంగ మార్గంగా చెప్పవచ్చు. నేరస్థులు కోర్టుల ఎదుట హాజరుకాకున్నా వారి ఆస్తులను స్వాధీనం చేసుకునే హక్కు ఈ చట్ట ప్రకారం ఉంది. ఈ చట్టానికి ఏ రూపంలో కన్నం వేస్తారో వేచి చూడాలి.

**సుస్థిర అభివృద్ధికి అవినీతే ప్రధాన కారణం – ఐరాస**

ఐక్యరాజ్య సమితి ఉద్దేశం ప్రకారం 2030 సంవత్సరం నాటికి భారతదేశం సుస్థిర అభివృద్ధి లక్ష్య సాధనకు అవినీతి నిరోధక చర్యలు, చట్టాల అమలు, అవినీతి తగ్గింపుకు సహకారంతో పాటు అవినీతితో సంపాదించిన ఆస్తులు స్వాధీనం చేసుకునే ప్రధానాంశాలను గుర్తించింది. వాటిని అమలు చేయుట ద్వారానే పై లక్ష్యం సాధ్యమవుతుందని పేర్కొన్నది. భారతదేశంలో అభివృద్ధి ఖర్చుకు 10 రెట్లు నిధుల అవినీతి జరుగుతుంది. ఇటీవలి ట్రాన్స్‌రెన్స్ ఇంటర్‌నేషనల్ అధ్యయనంలోఓ భారత్‌లో 62 శాతం ప్రజలు లంచాలు ఇవ్వవలసి వస్తుందని పేర్కొన్నారు. సెంటర్ ఫర్ మీడియా సర్వీసెస్ సర్వేలో ఆంధ్రప్రదేశ్, గుజరాత్, మధ్యప్రదేశ్, పంజాబ్, కర్నాటక, ఉత్తరప్రదేశ్, తెలంగాణ, పశ్చిమ బెంగాల్, ఢిల్లీ, తమిళనాడు, బీహార్, రాజస్థాన్, మహారాష్ట్రల్లో అవినీతి సర్వే నిర్వహించింది. గత ఏడాది కంటే ఈ రాష్ట్రాలలో అవినీతి భారీగా పెరిగిందని తెలిపింది. ఈ క్రమంలో దేశం మొత్తం మీద పెద్ద ఎత్తున శబ్ధం వచ్చేలా ఈడీ, ఐటి, డిఆర్ఐ లాంటి దాడులు నిర్వహించి సుస్థిర అభివృద్ధికి బాటలు వేయాలి.

**అవినీతి నిరోధక చట్టాల నీరేగార్చే ప్రయత్నం**

అవినీతికి అడ్డుకట్ట వేయాల్సిన చట్టాలకు మరింత పదును పెట్టాలని ప్రభుత్వాలు నిరుగార్చే సవరణలను మానుకోవాలని మాజీ లా కమిషన్ చైర్మన్ ఏ పి షా ప్రభుత్వానికి లేఖ రాయడం అంటే అవినీతి తీవ్రత ఏ మేరకు పెరిగిందో స్పష్టం అవుతుంది. పారదర్శకత జవాబుదారీతనాన్ని పెంపొందించడంలో ప్రభుత్వ వైఖరి సానుకూలత ఉన్నప్పుడే అవినీతికి అడ్డుకట్ట వేయడంలో పురోగతి సాధ్యమవుతుంది. అవినీతికి గల వ్యవస్థాగత కారణాలను అన్వేషించి వాటిని తొలగించే దిశగా ఆలోచననూ, ఆచరణలనూ ప్రభుత్వాలు పెంచుకోవడం అవసరం. ఈ ప్రభుత్వాలు దార్శనికతతో కంపెనీల చట్టం 2013కు ప్రతిపాదించే సవరణలు మోసాలకు పాల్పడేవారి పట్ల ప్రతికూలంగా ఉండేటట్లు ఏర్పాటు చేయాలి. 2013 చట్టం కార్పొరేట్ పాలనలో నూతనత్వానికి హామీ ఇచ్చిందని భారతదేశ చరిత్రలోనే అకౌంట్స్‌లో పెద్ద మోసంగా సత్యం కుంభకోణం వెలుగు చూసిన తర్వాత ఈ చట్టం తీసుకొచ్చారు. మోసాలకు పాల్పడినవారి పట్ల కఠిన చర్యలు తీసుకునేలా సెక్షన్ 447ను చేర్చినారు. బ్యాంకులకు పెద్ద మొత్తంలో అప్పులు ఎగవేసిన కింగ్‌ఫిషర్ మాజీ అధినేత విజయ్ మాల్యా, వజ్రాల వ్యాపారి నీరవ్ మోడీ, మోహల్ చోక్సీ కేసులు ఈ తరహాకు సంబంధించినవే. అధికారంలో ఉన్న పార్టీ 10 ప్రభుత్వ రంగ సంస్థల నిర్వాహకులుగా అధికార పార్టీ ప్రతినిధుల్ని నియమించారు. ఇది ఆక్షేపనీయం. ఓఎన్‌జిసి బోర్డు డైరెక్టర్‌గా సంబీత్ పాత్ర ఇంజనీర్స్ ఇండియా డైరెక్టర్‌గా షాజీయా ఇల్మీని నియమించారు. ఆయా రంగాల్లో నైపుణ్యం ఉన్న వారినే నియమించాలి. రాజకీయ పార్టీలకు ఎన్నికల విరాళాలను అందించే వ్యక్తులను కార్పొరేట్ శక్తులుగా నియమించడం అవినీతిని ఎట్లా ప్రోత్సహిస్తుందో ఈ ప్రభుత్వాలకే చెల్లుతుంది.

**హీరా గ్రూప్ కంపెనీ:** బంగారు, వజ్రాభరణాలను వాయిదాల్లో తీసుకోవాలని హీరా గ్రూప్ కంపెనీ అంతర్జాతీయంగా మదుపరులను ఆకర్షించింది. వజ్రాభరనాలనే స్కీమ్ ద్వారా సభ్యులకు ఇస్తామని హీరా గ్రూప్ కంపెనీ అధినేత హీరాషేక్ విదేశీ మారక ద్రవ్య చట్టాలను (ఎఫ్ఇఎంఎ) బహిరంగంగా ఉల్లంఘించి భారత కరెన్సీలో రు. 125 కోట్లు సమీకరించింది. ఆశ్చర్యంగా ఆమే స్వంతానికి అందులో రు. 62 కోట్లు విత్‌డ్రా చేసుకుంది. ఈ పెట్టుబడులను హీరా గోల్డ్, హీరా ప్రొడక్స్‌లలో స్కీమ్, ఏ, ఈ, ఎస్, జీలలో మదుపు చేయించుకున్నారు. చట్ట ప్రకారంగా మదుపు చేసిన ప్రవాస భారతీయుల వివరాలు ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్‌కు సమర్పించాలి. ఈ రెండు సంవత్సరాలలో ఒక్కరి పేరు నమోదు చేయలేదు. హీరా గ్రూప్‌లో అన్న ఒక్క కంపెనీ ఆదాయపు వివరాలను మాత్రమే ఆదాయపు పన్ను శాఖకు సమర్పించినారు. ఈ లెక్కలను పరిశీలిస్తే ఆ కంపెనీ ఏడాది కాలంలో రు. 224.15 కోట్ల వస్తువులను విక్రయించగా ఖర్చులు రు. 217.90 కోట్లు అయినట్లు ఐటి శాఖకు నివేదించారు. వీటి ఆధారంగా ఉజ్జాయింపుగా లెక్కలు వేస్తే రు. వంద కోట్లకు లాభం రు. 3 కోట్లే. హీరా గ్రూప్ కంపెనీల్లో పెట్టుబడి పెట్టిన మదుపరుల ఆధారంగా స్థిరచర ఆస్తులు రు. 300 కోట్లు. బ్యాంకుల్లో నగదు రు. 23 కోట్లు మదుపరుల పెట్టుబడులను కనిష్ట మొత్తాలను పరిగణలోకి తీసుకుంటే రు. 6 వేల కోట్లవుతున్నాయి. ఇంత పెద్ద మొత్తాన్ని ఈడీ దగ్గర నమోదు కాకపోవడం అతి పెద్ద ఆర్థిక ఉల్లంఘనే అవుతుంది.

**మెహల్ చోక్సీ :** పంజాబ్ నేషనల్ బ్యాంకు (పిఎన్‌బి) లో రు. 13,600 కోట్లు మోసగించిన వజ్రాల వ్యాపారి మెహల్ చోక్సి కనీసం వెరిఫికేషన్ లేకుండానే పాస్‌పోర్ట్‌ను అందించారు. 2015లో ముంబాయి ప్రాంతీయ పాస్‌పోర్టు కార్యాలయం నుంచి పాస్‌పోర్టు పొందినప్పుడు చోక్సీ ప్రాంతీయ పాస్‌పోర్టు కార్యాలయం నుంచి రివెరిఫికేషన్ జరిపి పాస్‌పోర్టును మంజూరు చేయాలి కాని, అధికారులు ఆన్‌లైన్‌లో క్రిమినల్ యాంటిసిడెంట్స్ అండ్ ఇన్‌ఫర్‌మేషన్ సిస్టమ్ ద్వారా చోక్సీకి క్లియర్ రిపోర్టు ఇచ్చినారు. అవినీతిని అరికట్టే పాస్‌పోర్టు కార్యాలయాలు వెరిఫికేషన్ చేసే పోలీస్ ఆఫీసర్స్ విదేశాలకు వెళ్లుటకు చోక్సీకి రెండ్ కార్పెట్ పరచడం బాధాకరం. ఇక్కడ కూడా ఈడీ లాంటి రాజ్యాంగబద్ధ వ్యవస్థల డొల్లతనం బయటపడుతుంది.

**రిత్విక్ ప్రాపర్టీస్ :** సిఎం రమేష్‌కు చెందిన రిత్విక్ ప్రాపర్టీస్ అనుబంధ కంపెనీల్లో సోదాలు జరిపారు. ఇతని వ్యాపార సామ్రాజ్యం గత మూడేళ్లలో అనూహ్యంగా పెరిగింది. 2013–14 సంవత్సరానికి రు. 55,349.26 కోట్లుగా ఉన్న రిత్విక్ ప్రాపర్టీస్ ఆదాయం రెండేళ్లలో ఏకంగా 145 శాతంతో రు. 1,35,720.78 కోట్లకు చేరింది. ఇది తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత జరిగిన మార్పు. 10కి పైగా ప్రధాన కంపెనీలతో పాటు పలు డొల్ల కంపెనీలు ఉన్నట్లు దర్యాప్తులో తేలింది. తిర్విక్ ప్రాజెక్టు ద్వారా వచ్చిన నిధులను గొలుసుకట్టు కంపెనీల్లో (షెల్ కంపెనీలు) కి మళ్లించడం ద్వారా భారీ మొత్తాలను తరలించినట్లు ఐటి అధికారులు అనుమానిస్తున్నారు. ఇంత పెద్ద మొత్తాన్ని ఈడీ అధికారులు గుర్తించకపోవడంపై పలువురు అనుమానం వ్యక్తం చేస్తున్నారు. ఇది కేవలం సిఎం చంద్రబాబు నాయుడుగారి కనుసన్నలలోనే జరుగుతుందనేది యథార్థం. కాగా ముఖ్యమంత్రి చంద్రబాబు అండతో సాగునీటి ప్రాజెక్టుల పనులు చేయకుండానే చేసినట్లు రికార్డుల్లో చూపించి నిధులు బొక్కేసిందని ఐటి సోదాల్లో వెలుగులోకి వచ్చింది.

**సాయి మౌర్య ఇన్‌ఫ్రా బిల్డర్స్ ఎస్టేట్ :** రేవంత్ రెడ్డికి చెందిన సాయి మౌర్య ఇన్‌ఫ్రా బిల్డర్స్ ఎస్టేట్ ప్రైవేట్ లిమిటెడ్, జిఎస్‌ఆర్ ప్రైవేట్ లిమిటెడ్, ఐమగధ ప్రాజెక్టు ప్రైవేట్ లిమిటెడ్, మగధ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్ లాంటి మొదలైన 18 డొల్ల కంపెనీలను నడిపించినారు. 18 కంపెనీలను జూబ్లీహిల్స్‌లోని తన నివాసం చిరునామాపై నడిపించినాడు. వాటి ద్వారా జరిగే రియల్ ఎస్టేట్ వ్యాపారాలు, ఆర్థిక లావాదేవీల గురించి ఏ మాత్రం రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్ (ఆర్ఒసి) ఈడీలకు తెలుప లేదు. అనంతరం కంపెనీలు మూతపడ్డట్లుగా రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్‌ను నమ్మించినాడు. కాని నిజానికి కంపెనీలు మూతపడలేదు. కోట్లాది రూపాయల లావాదేవీలు కొనసాగించినారు. భారీ మొత్తంగా పన్నులను ఎగవేసినారు. పై లావాదేవాల ద్వారా వచ్చిన మొత్తాలను హాంకాంగ్, సింగపూర్, మలేషియా, దుబాయిల్లోని అకౌంట్స్‌కు బదిలీ చేసి మనీ లాండరింగ్‌కు పాల్పడినారు. దినితో పాటు దుబాయ్ నుంచి కోట్ల రూపాయాల హవాలా దందాను సాగించినారు. ఫెమా, మనీ లాండరింగ్ చట్టాలను ఉల్లంఘించినందున ఆలస్యంగా మేల్కొన్న ఈడీ, డిఆర్ఐ అధికారులు రాజకీయ కనుసన్నల్లో రంగంలోకి దిగి విచారిస్తున్నారు.

**జగతి పబ్లికేషన్ :** వై.ఎస్. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు అధికారాన్ని అడ్డుపెట్టుకొని జగతి పబ్లికేషన్స్ ద్వారా వై.ఎస్. జగన్ అక్రమంగా ఆస్తులు సంపాదించాడన్న ఆరోపణలపై ఈడీ దర్యాప్తు జరిపింది. మనీ లాండరింగ్‌కు పాల్పడినందున నేరాభియోగ పత్రాలను ఈడీ కోర్టులో దాఖలు చేసింది. రాంకి సంస్థ జగతి పబ్లికేషన్స్‌లో 10 కోట్ల పెట్టుబడి పెట్టడం వల్ల 133 కోట్ల రూపాయల లబ్ది పొందినట్లు అభియోగ పత్రంలో ఈడీ ప్రస్తావించింది. ఇది మనీ లాండరింగ్ చట్టం ఉల్లంఘనగా విచారణ జరుగుతుంది.

**ఐఎన్ఎక్స్ మీడియా, ఎయిర్ సెల్ మాక్సిన్ కుంభకోణం:** చిదంబరం కేంద్ర ఆర్థిక మంత్రిగా ఉన్న సయంలో ఐఎన్ఎక్స్ మీడియా, ఎయిర్ సెల్ మాక్సిన్ కేటాయింపులో భారీ అవకతవకలు జరిగాయని పేర్కొన్నారు. అధికారాన్ని అడ్డం పెట్టుకొని చిదంబరం కొడుకు కార్తీక్ మనీ లాండరింగ్‌కు పాల్పడ్డందుకు ఈడీ విచారణ జరుపుతుంది.

**విజయ్ మాల్యా:** కింగ్‌ఫిషర్ విమానయాన సంస్థ మాజీ చీఫ్, యూనైటెడ్ బ్రూవరీస్ మద్యం తయారీ సంస్థల యజమాని విజయ్ మాల్యా భారతీయ బ్యాంకులకు ఇవ్వాల్సిన 9,000 కోట్లను పొందేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇతను పలు ఆర్థిక నేరాలకు సంబంధించిన కేసులను ఎదుర్కొంటున్నాడు. పరారీ నేరస్తుల జాబితాలో ఉన్న మాల్యాపై గతంలో ఈడీ దర్యాప్తు చేసింది. పూర్తి స్థాయిలో విచారించాల్సిన అవసరముంది.

**డి.కె. శివకుమార్:** కర్ణాటక మంత్రి డి.కె. శివకుమార్ పన్ను ఎగవేత, హవాలా లావాదేవీల కేసు ఆధారంగా ఈడీ కేసు నమోదు చేసింది. ఇతను ఢిల్లీ, బెంగళూర్ నగరాల్లో వివిధ నెట్‌వర్క్ ద్వారా ప్రాంగణాలను ఏర్పాటు చేసుకొని హవాలా చానల్స్ ద్వారా రెగ్యులర్‌గా లేక్కలేనంత నగదును బదిలీ చేస్తున్నారని ఈడీ గుర్తించింది. దర్యాప్తు జరుపుతుంది.

**సుజనా గ్రూప్:** వై.సుజనా చౌదరి 120 షెల్ కంపెనీల పేరుతో 5,700 కోట్ల రూపాయల మేర కుంభకోణంలో బ్యాంకులను మోసం చేసినాడని ఈడి దర్యాప్తు చేసింది. బ్యాంకుల కన్సార్టియం బెస్ట్ అండ్ క్రోమ్టన్ ఇంజనీరింగ్ ప్రాజెక్టు లిమిటెడ్ ద్వారా 364 కోట్ల మోసం జరిగిందని గుర్తించినారు. 120 షెల్ కంపెనీలను నియంత్రిస్తున్నారు. ఇందులో వ్యాపార కార్యకలాపాలు లేని కంపెనీలు 100కు పైగా ఉన్నాయి. ఎఫ్ఇఎంఎకు ఉల్లంఘనగా ఈ కంపెనీలను కొనసాగిస్తున్నారు. దీనిపై ఈడీ దర్యాప్తు జరుపుతుంది.

**గాలి జనార్ధన్ రెడ్డి అక్రమ మైనింగ్ కేసు:** అక్రమ మైనింగ్ ద్వారా ఒబులాపురం మైనింగ్ కంపెనీ లిమిటెడ్, బ్రాహ్మణీ ఇండస్ట్రీస్ ద్వారా (పిఎంఎల్ఎ) మనీ లాండరింగ్‌కు పాల్పడినందుకు ఇతనిపై ఈడీ దర్యాప్తు చేసింది. ఇతనిపై మైన్స్ అండ్ మినిరల్స్ చట్టం, అటవీ నిల్వల చట్టం, అవినీతి నిరోధక చట్టాలల్లో కేసులు నమోదు అయినవి.

ప్రభుత్వాలు మారినా పాలనా విధానాల్లో పటిష్టమైన, నిస్వార్థమైన, నిష్పక్షపాతమైన, బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతం లేని స్వచ్ఛ పాలన కరువైన నేపథ్యంలో ఇప్పటికీ దేశంలో ఎంతమంది నేరగాళ్లకు శిక్షలు పడ్డాయి? ఎన్ని సంస్థలు మూతపడ్డాయి. ఆర్థిక కుంభకోణాలకు, వేల కోట్ల రూపాయల దేశ ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నం చేసి, బ్యాంకింగ్ వ్యవస్థను సైతం గుల్లచేసిన వారిపై ఎటువంటి చర్యలు లేకపోవడం, సంవత్సరాల తరబడి సాగించే విచారణాపర్వంలో దొంగలు దొరలుగా చెలామణి అవుతూనే ఉన్నారు.

ఈ నేపథ్యంలో ఈడీ లాంటి అత్యున్నత స్థానంలో పనిచేస్తున్న అధికారులు దేశ ఆర్థిక భద్రత, దేశ సంక్షేమం దృష్ట్యా కేవలం ఐదేళ్లకోసారి రంగులు మార్చుకునే రాజకీయ ఊసరవెళ్లల మధ్య స్థితప్రజ్ఞత ప్రదర్శించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. దేశ శాశ్వత ప్రయోజనాల దృష్ట్యా వ్యవహరించాల్సి ఉంటుంది కాని, రాజకీయ స్వప్రయోజనాల కోసం వాళ్ల అడుగులకు మడుగులొత్తడం మానుకోవాలి. విచారణలు వేగవంతంగా, నిష్పక్షిపాతంగా నిర్వహించి దోషులను దేశం ముందు నిలబెట్టాలి.

**ముగింపు**

రాజకీయ నాయకుల, అధికారుల అండదండలతో వారి వారి కనుసన్నలలోనే కోట్ల కొలది అవినీతి జరుగుతుందని పై వ్యక్తుల, సంస్థల మోసపూరిత విధానాలను బట్టి అర్థమవుతుంది. ఆ నేరాల నియంత్రణలో ఈడీ లాంటి వ్యవస్థలు బలహీనమై, చేష్టలుడిగి చూశాయని అర్థమవుతుంది. అవినీతిపరులు దానికి సహకరించిన ఏ కొద్ది మందో ఎన్‌ఫోర్స్‌మెంట్ స్కావర్లో నమోదు కావడం చూస్తే ఈ దేశంలో ఉండే నిఘా వ్యవస్థలు ఎంత బలహీనమైనవో అర్థం చేసుకోవచ్చు. ప్రజల పక్షంగా నిలవాల్సిన అవినీతి నిరోధక సంస్థలు, కేంద్ర నిఘా విభాగాలు, దర్యాప్తు సంస్థలు పాలకపక్షం చంకనచేరి అవినీతిని పెంచి పోషిస్తున్నాయి. అత్యధిక ఈడీ దాడులు ప్రధానమంత్రి ఆఫీసు నుంచి వచ్చే ఆదేశాలమేరకే జరుగుతున్నాయనేది వాస్తవం. ప్రభుత్వాలు ఏవైనా కావచ్చు, అధిక దాడులు మాత్రం ప్రతిపక్షాల మీద జరుగుతున్నాయి. పెద్దోల్లకో న్యాయం, పేదోళ్లకొక న్యాయమా? బడాబాబులకు ఎంతమందికి కళ్లెం వేసిందో ఈడి సమీక్షించుకోవాలి. ఐటి పడుకున్న పాములాగా కాకుండా ఇప్పుడు కొత్త కొరలు తొడగాలి. ఇప్పటికే అన్ని అకౌంట్లకు ఆధార్, పాన్‌కార్డులను తప్పనిసరి చేసినారు. ఇకపై ఆస్తులే తాచుపాముల్లాగా మారాలి.

విశాల భారతదేశంలో ప్రజాస్వామ్యం ముసుగులో అదృశ్య హస్తాల ప్రమేయం పక్కా ప్రణాళిక ప్రకారం జరుగుతుంది. అధికారంలోకి రాగానే ప్రభుత్వ పాలనను రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగిస్తున్నారు. అధికారంలోకి ఏ పార్టీవారు వచ్చినా ఆ పార్టీ నాయకులు నడిపిస్తున్న రాజకీయాలు రోజు రోజుకు పెరిగిపోతున్నాయి. ఇలాంటి పాలన చేసే రాజకీయ నాయకులకు మన రాజ్యాంగ సంస్థలు కొన్ని సందార్భాల్లో అడ్డంకిగా మారుతున్నాయి. అందుకే ఒక పద్ధతి ప్రకారం వాటిపై దాడులు జరుపుతున్నారు. కీలక వ్యవస్థలను నిర్వీర్యం చేసి భారతదేశ ఫెడరల్

# ప్రపంచీకరణ మాయాజాలంలో రిజర్వ్ బ్యాంక్

***ప్రభుత్వ రంగ బ్యాంకులను బలహీనం చేస్తూ, ఆర్థిక వ్యవస్థను ప్రమాదంలో నెట్టి ప్రభుత్వాలు తమ రాజకీయ స్వార్థ ప్రయోజనాల కోసం కార్పొరేట్ సంస్థలకు మేలు చేకూర్చేలా ప్రయత్నాలు చేస్తున్నాయని అంటున్నారు కేశవ్***

ఇటీవల ఆర్‌బిఐకీ, ఆర్థిక మంత్రిత్వ శాఖకీ మధ్య కనిపిస్తున్న, వినిపిస్తున్న చర్చలోకొస్తున్న విభేదాలు-ప్రపంచీకరణ్ణ నేపథ్యంలో కార్పొరేట్లకూ, ప్రపంచ బ్యాంక్‌కూ అనుకూలంగా అడుగులు వేసే ప్రభుత్వం కొత్త విన్యాసాల మీద మరిన్ని సందేహాలు కలుగుతున్నాయి. స్వేచ్ఛా వాణిజ్యంలో అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్థిక వ్యవహారాలను కూడా సామ్రాజ్యవాదం నియంత్రించడం ఇప్పుడు ఎదుర్కొంటున్న సమస్య. తృతీయ ప్రపంచ దేశాల వాణిజ్యం దిశ ఎటువైపు ఉండాలో, అభివృద్ధి చెందుతున్న దేశాలు తమ వర్తకాన్ని సామ్రాజ్య దేశాల అభీష్టాల మేరకు ఎలా తమను తాము మలచుకోవాలో గతంలో ప్రపంచ వాణిజ్య సంస్థ నేర్పింది. వీరి మాటను జవదాటి అలా మలచుకోని చిన్న దేశాలకు ఆంక్షల పేరు మీద అజమాయిషీ ఎలా చేశారో మనం గతంలో చూశాం. ఇంధనం సమృద్ధిగా ఉన్న ఇరాక్ లాంటి దేశాలు ఎంత దారుణమైన మానవ హక్కుల ఉల్లంఘనని చవి చూశాయో మనం చూశాం.

పెట్టుబడిదారీ వ్యవస్థలో దోపిడీకి రెక్కలు ఇలానే వ్యాపిస్తాయి. ప్రపంచీకరణ పేరు మీద విపరీతమైన పెట్టుబడి వర్ధమాన దేశాల మీద పడుతున్నపుడు, ప్రపంచ బ్యాంక్‌ల నుండి విపరీతమైన అప్పుల మీద భారతదేశం లాంటి దేశాలు ఆధారపడుతున్నపుడు దేశంలోని చట్టాలు, ఆర్థిక సంస్థలు కూడా వారికి అనుగుణంగా మార్చాలనే షరతులు కొత్త కాదు. సమానత్వం పేరుమీద కేంద్ర బ్యాంక్‌ల పనితీరు కూడా ఇందుకు అతీతం కాదు. అంతా ప్రభుత్వం కనుసన్నల్లోనే జరిగి పోవాలి. అందుకే, రిజర్వ్ బ్యాంక్, ఆర్థిక శాఖ మధ్య ఇంతవరకు లేని వాద ప్రతివాదాలు మీడియాలో కనిపిస్తున్నాయి. వినిపిస్తున్నాయి.

ఆర్థికశాఖ చెబుతున్నదేదో రిజర్వ్ బ్యాంక్ పాటించడానికి ఇష్టం లేనట్టు, ప్రభుత్వం రిజర్వ్ బ్యాంక్ సార్వభౌమత్వానికి అడ్డుతగులుతున్నట్టు ఇది దేశ ఆర్థిక వ్యవస్థకి శుభ సూచకం కానట్టు, ఈ వ్యవహార సరళి మారడం అవసరమన్నట్టు సాధారణ మనిషికి అర్థం అవుతున్నట్టు ఉంది.

ప్రభుత్వం సెక్షన్ 7ను రిజర్వ్ బ్యాంక్ మీద ప్రయోగించొచ్చు అనే అపవాదులు కూడా ప్రచారం అయ్యాయి. రిజర్వ్ బ్యాంక్ స్వాతంత్ర్యాన్ని గౌరవించని ప్రభుత్వాలు మార్కెట్ శాపానికి గురికావలసి ఉంటుందని డెప్యుటీ గవర్నర్ బాసుదేవ్ ఆచార్య చెబుతోన్న మాటలు ఎన్నో నిజాలను బయటికి తెస్తున్నాయి. రెంటికీ మధ్య సయోధ్య కోసం, మరిన్ని తీవ్రతరమైన విషయాలను చర్చించడానికి నవంబర్ 19న రిజర్వు బ్యాంక్ బోర్డు కీలక సమావేశం జరిగింది. మింగుడు పడని, కొరుకుడు పడని విషయాలను ఎంపికైన నిపుణుల కమిటీకి అప్పజెప్పారు.

**రిజర్వ్ బ్యాంక్ బోర్డులో ఎవరుంటారు?**

రిజర్వ్‌బ్యాంక్ బోర్డులో 18 మంది సభ్యులు ఉంటారు. గవర్నర్‌తో పాటు నలుగురు డెప్యుటీ గవర్నర్‌లు ఉంటారు. ఉర్జిత్ పాటిల్ గవర్నర్ కాగా, ఎం.ఎస్. విశ్వనాథన్, విరాల్ ఆచార్య, బి.పి.కనుంగో, మహేష్ కుమార్ జైన్ డెప్యుటీ గవర్నర్‌లు. వీరితో పాటు, ఇద్దరు గవర్నమెంట్ నామినీలు, ఒక్కొక్క స్థానిక బోర్డు నుండి ఒక్కొక్కరు లెక్క నలుగురు డైరెక్టర్‌లు ఉంటారు. ప్రభుత్వం మరో నలుగురు డైరెక్టర్‌లను నియమిస్తుంది. ఇలా మొత్తం 18 మంది మొత్తం బ్యాంకింగ్ వ్యవస్థనే తద్వారా దేశ ఆర్థిక వ్యవస్థనే నియంత్రించే రిజర్వ్ బ్యాంక్ బోర్డులో తమ బాధ్యతను నిర్వహిస్తారు. రిజర్వ్ బ్యాంక్ బోర్డు సమావేశాలు అత్యంత సాధారణమైనవిగా ఉండేవి. కానీ, అక్టోబర్ 23న జరిగిన 574వ

విలువలను ధ్వంసం చేస్తున్నారు. సరిగ్గా నియంతలు పుట్టుకొచ్చిన దేశాల్లో ఇలాగే జరుగుతుంది. కాని భారతదేశ ఆలోచనకే ఇది ప్రమాదకరం. ఈ దేశానికి వేల సంవత్సరాలుగా వారసత్వంగా వస్తున్న తాత్విక పునాదికి, ఆధునిక భారత రాజ్యాంగబద్ధ పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికిది గొడ్డలి పెట్టు లాంటిది. ఈ స్థితికి ఆయా కాలాల్లో బలహీనమైన ప్రతిపక్షంతో పాటు బాధ్యత మరిచిన మీడియా కూడా.ప్రతిపక్షం బలహీనపడితే ప్రజలు ప్రజా ఉద్యమాల ద్వారా ప్రతిపక్షంగా ముందుకొచ్చిన సంఘటనలు ప్రపంచ చరిత్రలో కోకొల్లలు. పాలకులు రాజ్యాంగ శక్తుల ముసుగులో చేస్తున్న తప్పుడు విధానాలను సమాజం గమనిస్తుంది. ఇప్పటికైనా ఈ దేశంలోని రాజకీయ వ్యవస్థలు రాజ్యాంగబద్ధ వ్యవస్థల్లో జోక్యాన్ని మానుకోవాలి. అప్పుడే దేశంలో ఆర్థిక క్రమశిక్షణ నేర రహిత సమాజ నిర్మాణానికి పునాది వేసినవాళ్లు అవుతారు. లేనిచో పరిణామాలు తీవ్రంగా ఉంటాయి.

శరవేగంగా పరుగెడుతున్న సమాజంలో ఆర్థిక అరాచక ధోరణుల కట్టడిపై ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ మీద పెట్టుకున్న నమ్మకాన్ని ఎంత శాతం నిలుపుకుంటుందనేది తాజా సంఘటనల ఫలితాలు పలు అనుమానాలకు తావిచ్చినాయి. పాలక వర్గాల రాజకీయ ప్రయోజనాలకే 'ఈ' ముఠా పనిచేస్తుందనేది బహిరంగంగా చర్చించడం విచారకరం.

ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్ వ్యవస్థాగత కారణాలను లోపాలను సమీక్షించుకొని అడుగులు ముందుకు వేయాలి. పారదర్శక, ప్రగతిశీల ఆలోచనల ఆచరణలతో ఈడీ లక్ష్యాలను తూచ తప్పకుండా ముందుకు తీసుకురావాలి. రాజకీయ నిరంకుశత్వానికి ప్రగతిశీల శక్తులలో ఉన్న అలసత్వానికి వ్యతిరేకంగా చైతన్యాన్ని సమీకరించుకొని దోషులు ఏ స్థాయి వారైనా ఈడీ లక్ష్యాలకు పదును పెట్టడం చారిత్రక కర్తవ్యంగా భావించాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్ తెలంగాణ యూనివర్సిటీ)* ఈ

సమావేశం మాత్రం వాదనలతో నడిచిందని తెలిసింది. ప్రభుత్వ నామినీలు ప్రభుత్వం తరుపున మాట్లాడారు. రిజర్వ్ బ్యాంక్ దగ్గర ఉన్న పెట్టుబడి నిల్వలు ఎటువంటి షరతులు లేకుండా ప్రభుత్వానికి తర్జుమా చెయ్యాలని ప్రభుత్వం కోరుకుంటోంది.

**విభేదాలు ఏ విషయాల మీద ఉన్నాయి?**

ద్రవ్యం కొరతని భర్తీ చెయ్యడం మీద విభేదాలు ఉన్నాయి. ఆర్‌బిఐ తీసుకున్న సత్వర నివారణ చర్యల మీద కూడా ప్రభుత్వానికి వ్యతిరేకత ఉంది. 11 పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లు, ఒక ప్రైవేటు బ్యాంక్ మీద సత్వర నివారణ చర్యలను ఆర్‌బిఐ అమలు చెయ్యాలని అనుకుంది. వాటి కాపిటల్ బేస్‌ను సరిచెయ్యకుండా అవి అప్పులివ్వడం మీద ఆర్‌బిఐ నియంత్రణ విధించింది. అన్నిటికంటే ముఖ్యమైన విషయం ఆర్‌బిఐ నిధులు. ఆర్‌బిఐ దగ్గర చాలా ఎక్కువ నిధులున్నాయని, ఇది ప్రపంచంలో అన్ని కేంద్రీయ బ్యాంక్‌ల నిధుల కంటే ఎక్కువని కేంద్ర ప్రభుత్వం భావిస్తోంది. 2018 మార్చ్ 31 నాటికి రిజర్వ్ బ్యాంక్ దగ్గర 9 లక్షల 68వేల 710 కోట్ల రూపాయల నిధి వివిధ రూపాల్లో ఉంది. 3.6 లక్షల కోట్లు ప్రభుత్వానికి రిజర్వ్ బ్యాంక్ నుండి కావాలి. మొత్తం ఆస్తుల్లో 26 శాతం రిజర్వులు ఆర్‌బిఐ దగ్గర ఉన్నాయి. కానీ ప్రపంచంలోని కేంద్రీయ బ్యాంక్‌ల్లో అదే నిల్వలు 16 శాతం ఉన్నాయని ఆర్‌బిఐలోని ప్రభుత్వ నామినీల వాదన. చిన్న, మధ్యస్థాయి సంస్థలకు రుణాలివ్వాలని ఆర్థిక మంత్రిత్వశాఖ చెబుతోంది.

అభివృద్ధి అనీ, అభివృద్ధిని ప్రోత్సహించాలనీ, ప్రభుత్వాలు పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లకు అభివృద్ధి మంత్రాలను నేర్పాయి. పర్యవసానంగా, పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లు కార్పొరేట్లకు విపరీతమైన రుణాలని ఇచ్చేలా ప్రోత్సహించాయి. నీరవ్ మోదీలు, మేహుల్ చోక్సీలు, విజయ్ మాల్యాలు, విపరీతమైన రుణాలను తీసుకొని పారిపోయారు. వీరి నుండి బకాయిలు రాబట్టుకోవడానికి ప్రయత్నాలు సీరియస్‌గా జరగడం లేదు.

2013 నుండి 2015 వరకు 1.14 లక్షల కోట్ల రుణం పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లు రైట్ ఆఫ్ చేశాయి. ఒక్క 2015లోనే 10 పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లు 40వేల కోట్లు రైట్ ఆఫ్ చేశాయి.

పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లు ఇలా మొండి రుణాలతో సతమతమై పోతుంటే వాటిని ఆదుకోవడానికి, వాటిలో ఫ్రెష్‌గా పెట్టుబడిని పంపింగ్ చెయ్యడానికి ఆర్థిక మంత్రిత్వ శాఖకి ఆర్‌బిఐ దగ్గరున్న నిధుల్నించి మూడో వంతు నిధి ఎటువంటి షరతులు లేకుండా కావాలి.

నిపుణుల కమిటీ ఈ అంశం మీద కూడా దృష్టి సారిస్తోంది. ఎట్టకేలకు నిధులు కనీసం మే నెల వరకు అయినా సురక్షితంగా ఉంటాయని పూర్వ ఆర్థికమంత్రి చిదంబరం అంటున్నారు. కానీ, ఇంతలోనే పార్లమెంటు కమిటీ ముందు ఉర్జిత్ పాటిల్ వ్యాఖ్యలు ఆలోచింప జేస్తున్నాయి. ఆర్‌బిఐ దగ్గర ఉన్న 9.7 లక్షల కోట్ల మీద కన్ను వెయ్యకూడదనీ, దేశ ఆర్థిక సమతౌల్యానికి ఈ నిధి అవసరమని నేరుగా ఆర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పాటిల్ నొక్కి చెప్పారంటే సమస్య ఎంత తీవ్రమైందో అర్థమవుతుంది. ఇవి ఆపదలో ఆదుకుంటాయని ఆయన స్పష్టంగా చెప్పారు. చమురు ధరల్లో అస్తవ్యస్థత చోటుచేసు కున్నప్పుడు, రూపాయి విలువ పడిపోయినప్పుడు, స్టాక్ మార్కెట్ నుండి బయటి ఇన్వెస్టర్లు పలాయనం చిత్తగించినప్పుడు ఈ నిధులే కాపాడతాయని ఆయన అన్న మాటల్లో నిజం లేకపోలేదు.

**మార్కెట్ నియంత్రిస్తున్న కాలం**

ప్రపంచీకరణలో మార్కెట్ నియంత్రిస్తున్న కాలం ఇది. ఇదివరకు ఆర్థిక వ్యవహారాలు ప్రభుత్వం తన పన్నుల బడ్జెట్ విధానం ద్వారా నిర్వహించేది. కానీ, స్వేచ్ఛా వాణిజ్యానికి ఇది చాలదు. ప్రపంచీకరణ ముద్దుపేరుతో పొంచి ఉన్న సామ్రాజ్యవాదానికి ప్రభుత్వాలు స్వేచ్ఛా వాణిజ్యానికి మద్దతుగా నెరవేర్చే ఫిస్కల్ చర్యలు చాలవు. అంతకంటే మరింత సానుకూలమైన మార్కెట్ కావాలి. దేశాల మార్కెట్లు బయటి పెట్టుబడిదారుల వ్యాపారానికి అనుకూలంగా మారాలి. పెట్టుబడుల స్వైర విహారానికి అనుకూలంగా కేంద్ర బ్యాంక్‌లు కూడా స్పందించాలి. దేశ ఆర్థికవ్యవస్థకు నష్టం ఉన్నా సరే. మున్ముందుకు బ్యాంక్ రేట్లు కూడా ప్రభుత్వం చెప్పే విధంగా నడవాలి. ద్రవ్య నియమాల కమిటీలో మార్పులు చేపట్టే విషయంలో ఇలానే న్యూజిల్యాండ్ ప్రభుత్వం కూడా ఇటీవల విమర్శలకు గురైంది.

ఇటీవల బ్రిటన్లో కూడా ఆర్థిక మంత్రిత్వ శాఖకీ, కేంద్ర బ్యాంక్‌కీ మధ్య సయోధ్య జరుగుతోంది. బ్యాంక్‌లో జరుగుతోన్న ప్రతి విషయం ప్రభుత్వానికి తెలిసే విధానం ఉండాలని ఆలోచన నడుస్తోంది. బాసెల్ 3 ఒప్పందాలకు కేంద్రీయ బ్యాంక్‌లు తలొగ్గాలి. బ్యాంక్‌లకు సంబంధించని ఫైనాన్సియల్ కంపెనీలలో నిధుల కొరత ఉంది. ఐఎల్ఎఫ్ఎస్ డిఫాల్టర్ కావడంతో బ్యాంక్‌లకు సంబంధించని ఫైనాన్సియల్ కంపెనీల్లో ఈ సమస్య మరింత పెరిగింది.

పైగా, ఈ మధ్యనే ఆర్‌బిఐ ఒక విప్లవాత్మకమైన సర్క్యులర్ జారిచేసింది. ఎగవేతదార్లు రుణాలను చెల్లించాలని అలా చెల్లించకపోతే, తాము దివాలా అయినట్టు చర్యలు ఆరంభించాలని తన సర్క్యులర్‌లో చెప్పింది. ఇది ప్రభుత్వానికి ఇబ్బంది పెట్టింది. 40 శాతం మొండి బకాయిలు పది కార్పొరేటు సంస్థల చేతుల్లో ఉన్నాయి. ఒక్క విద్యుత్తు విభాగం చేతుల్లోనే 3 లక్షల కోట్ల అప్పు ఉంది. ఒకవేళ ఈ విభాగం అప్పులు చెల్లించాలన్నా ఆ ఖర్చు ఆ భారం కొనుగోలుదార్ల మీద వేస్తుంది. ఇది ప్రభుత్వానికి ఎన్నికల ముందు తలనొప్పి వ్యవహారమే.

మరోవైపు, వ్యవస్థ కూడా కార్పొరేట్లకే అనుకూలంగా ఉంది. అలా మారుతోంది. పబ్లిక్ సెక్టార్ బ్యాంక్‌లు విపరీతంగా కార్పొరేట్లకు రుణాలిచ్చి తమకు తాము బలహీనం అయ్యాయి. అభివృద్ధి పోటీలో బ్యాంక్‌లు కూడా క్యూ కట్టేలా చేశారు. అలా రుణాలిస్తేనే కదా దేశంలో–అభివృద్ధి కోసం ప్రయత్నించే కార్పొరేట్లకు సహకరించినట్టు అవుతుంది. బ్యాంక్‌లు ఇలా రుణాలు ఇవ్వకపోతే నిరర్ధకమైన ద్రవ్యంతో సాధించేదేమిటి? ఫలితంగా, మొండిబాకీలు చెల్లించకుండా బ్యాంకుల్ని బలహీనం చేసేసి హాయిగా విలాసాలు అనుభవిస్తున్నారు. ఎగవేతదార్ల పేర్లను కూడా ముఖ్యమైన ప్రభుత్వ సంస్థలకే ఆర్‌బిఐ ఇవ్వదలచు కోవడం లేదు. సామాన్య జనాల దృష్టిని పటేల్ విగ్రహంలోనో, రాముని విగ్రహంలోనో, అయోధ్యలోనో, మసీదుల్లోనో, మూకల హత్యలవైపో మరల్చేసి ఆర్థిక దోపిడీని నిరాటంకంగా కొనసాగించే పరిస్థితి నేడు ఉంది. దేశ ఆర్థికవ్యవస్థని మరింత ప్రమాదంలోకి నెట్టేసే చర్యల్ని ఈ వివాదాలు గుర్తుచేస్తున్నాయి. అటు విరాల్ ఆచార్య వ్యాఖ్యలు, ఇటు ఉర్జిత్ పాటిల్ బల్లగుద్ది చెబుతోన్న మాటలు వింటుంటే, చాపకింద నీరులా ఆర్‌బిఐలోకి జొరబడుతున్న ప్రపంచీకరణ గాలుల తీవ్రత తెలుస్తోంది.

*(రచయిత ఉపాధ్యాయులు. జాగృతి సమీక్ష సంపాదకులు)* వీ

# ప్రమాదంలో ఉన్నత విద్య

***విశ్వవిద్యాలయాల కొరత, ఉన్నవాటిల్లో బోధన, బోధనేతర సిబ్బంది కొరత, నిధులు కేటాయించకపోవడం ఉన్నత విద్యను నిర్లక్ష్యం చేసి ప్రైవేట్ విద్యా విధానాన్ని ప్రోత్సహించడానికేనని అంటున్నారు లక్ష్మణ్ గడ్డం***

**1991** తర్వాత వచ్చిన ఆర్థిక సంస్కరణల తర్వాత దేశంలో ఉన్నత విద్య ప్రమాదం అంచుకు చేరుకున్నది. యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్‌లో ప్రభుత్వ జోక్యం పెరిగిన తర్వాత నామమాత్రంగా మారడంతో ఉన్నత విద్యా ప్రమాణాలు మరింత దిగజారాయి. ఉన్నత విద్యారంగంలో ప్రవేశ పెట్టిన సమస్త సంస్కరణలు, పరిస్థితులు మరింత అధ్వానంగా మారడానికి దారితీశాయి గాని, ఉన్నతీకరించడానికి ఉపయోగపడలేదు. విద్యారంగాన్ని కాపాడలంటే మళ్లీ పాత పద్ధతులు అనుసరించడమే శరణ్యంగా గోచరిస్తుంది.

భారతదేశం 2030 నాటికి యువశక్తిగా ఆవిర్భవిస్తుందని పాలకులు ఆశిస్తున్నారు. దాదాపుగా 14 కోట్లమంది యువకులు కాలేజీకెళ్లే వయసులో ఉంటారని అంచనా వేస్తున్నారు. ఇంత మంది భవిష్యత్తును నిర్ణయించే ఉన్నత విద్యారంగం పరిస్థితిని ప్రస్తుత పరిస్థితులతో బేరీజు వేసుకుంటే ఆందోళనకు గురికాక తప్పదు.

దేశవ్యాప్తంగా 789 విశ్వవిద్యాలయాలు, 38 వేల కళాశాలు ఉన్నాయి. అందులో 11,443 ఇతర విద్యా సంస్థలున్నాయి. 260 ప్రైవేట్ విశ్వవిద్యాలయాలు, 47 కేంద్ర విశ్వవిద్యాలయాలు, ఒకటి కేంద్ర ఓపెన్ యూనివర్సిటీ, 13 రాష్ట్ర ఓపెన్ యూనివర్సిటీలు, 74 జాతీయ ప్రాముఖ్యం గల సంస్థలు, 290 రాష్ట్ర ప్రభుత్వ విశ్వవిద్యాలయాలు, 123 డీమ్డ్ విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. పొరుగు దేశమైన చైనాలో 2,914 విశ్వవిద్యాలయాలున్నాయి. భారత్‌తో పోలిస్తే నాలుగో వంతు జనాభా కూడా లేని అమెరికాలో సుమారు 5,300 విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. అండమాన్ నికోబర్ ద్వీపాలలో దాద్రా, నగర్ హవేలి, డామన్ అండ్ డయ్యూ, లక్షద్వీప్‌లలో విశ్వవిద్యాలయాలు లేవు. గోవాలో రెండు విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉన్నాయి. ఉత్తరప్రదేశ్‌లో అత్యధికంగా 59 విశ్వవిద్యాలయాలున్నాయి. విశ్వవిద్యాలయాలు, కాలేజీల్లో చేరిన విద్యార్థుల సంఖ్య 2-9 కోట్లు. ఇందులో 1.6 కోట్ల మంది విద్యార్థులు, 1.3 కోట్ల మంది విద్యార్థినిలున్నారు.

సంఖ్యాపరంగానే కాకుండా నాణ్యత ప్రమాణాల పరంగాను మనదేశం బాగా వెనుకబడి ఉంది. టైమ్స్ హైయర్ ఎడ్యుకేషన్ వరల్డ్ యూనివర్సిటీ ర్యాంకింగ్ 2018 సెప్టెంబర్‌లో అత్యుత్తమ విశ్వవిద్యాలయాల జాబితా ప్రకటించింది. ఇంగ్లండ్‌లోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయం వరుసగా మొదటి, రెండవ స్థానాలు దక్కించుకున్నాయి. మొత్తం 86 దేశాల విశ్వవిద్యాలయాలు అగ్రశ్రేణి 200 అత్యున్నత విశ్వవిద్యాలయాల్లో స్థానం పొందాయి. ఇంగ్లండ్, అమెరికా, జపాన్, చైనా, జర్మనీ, నెదర్లాండ్ ఉన్నత స్థానాలు పొందగలిగాయి. ఆ జాబితాలో భారత్‌కు చోటే దక్కలేదు. మనదేశం కనీసం చైనా, జపాన్‌లను ఎందుకు అందుకోలేకపోతుందో ఆచరణాత్మక విశ్లేషణ జరగాలి.

చదువును సంస్కరించాల్సిన బాధ్యత పాలకుల పైనే ఉంటుంది. అది ఒక రాజకీయ ఎజెండాగా మారాలి. మనదేశ రాజకీయ నాయకులు, ఉన్నతాధికారులు అధ్యయనాల పేరుతో ప్రజల డబ్బులతో ఆయా అభివృద్ధి చెందిన దేశాల్లో పర్యటిస్తుంటారు. ప్రధాని నరేంద్రమోడీ ఇప్పటికే 41 ట్రిప్పులతో 51 దేశాలు తిరిగి వచ్చాడు. కోట్ల రూపాయల ప్రజాధనం వెచ్చించాడు. ఆ దేశాలతో పోలిస్తే ఉన్నత విద్యారంగంలో భారత్ ఎక్కడుందో అధ్యయనం చేశారా? అమెరికా, జపాన్, ఇంగ్లండ్, చైనా వంటి దేశాల్లోని విద్యా వ్యవస్థ తరహాలో భారతదేశ పరిస్థితులకు అనువైన అభివృద్ధి నమూనా రిపోర్టు రూపొందించగలిగారా? అది జాతీయవాదానికి, కాషాయీకరణకు వ్యతిరేకమని భావిస్తున్నారా.

శాస్త్రసాంకేతిక రంగాల్లో కొత్త విధానాలు అమలు చేస్తున్న ఆ దేశాలతో పోలిస్తే మనమింకా చాలా వెనుకబడే ఉన్నాం. వెనకబాటుకు కారణాలను ఎప్పుడైనా విశ్లేషించామా? ఉన్నతవిద్యా రంగం అభివృద్ధిని ఆటంక పరుస్తున్న అంశాల్లో ప్రధానమైనది పెట్టుబడి. ఉన్నత విద్యారంగంలో ప్రభుత్వ పెట్టుబడి చాలా తక్కువగా ఉంది. ప్రభుత్వ పెట్టుబడి స్థూల దేశీయ ఉత్పత్తిలో రెండు శాతం మించడం లేదు. భారత ప్రభుత్వం ఉన్నత విద్యనభ్యసిస్తున్న ఒక్కో విద్యార్థిపై పెడుతున్న ఖర్చు ప్రపంచంలో మరెక్కడా లేనంత తక్కువ స్థాయిలో ఉందని ఐక్యరాజ్య సమితి విద్యా శాస్త్రీయ సాంస్కృతిక సంస్థ (యునెస్కో) వెల్లడించింది.

1986 నాటి నూతన విద్యా విధానం సిఫారసుల ప్రకారం జిడిపిలో 6 శాతం ఖర్చుపెట్టాల్సి ఉంది. కాని ఈ లక్ష్యాన్ని భారత ప్రభుత్వం ఎన్నడూ చేరుకోలేదు. గత సంవత్సరం నవంబర్‌లో యుజిసి విడుదల చేసిన వివరాలు కేంద్ర, రాష్ట్ర విశ్వవిద్యాలయాల మధ్య అగాధం ఎంత ఉందో వెల్లడించాయి. దాదాపుగా 47 కేంద్రీయ విశ్వవిద్యాలయాలకు రు. 6,406 కోట్లు మంజూరు చేసి 290 రాష్ట్ర ప్రభుత్వ విశ్వవిద్యాలయాలకు రు. 911 కోట్లతో సరిపెట్టింది. ఐఐటి, ఐఐఎంలు స్వయం పోషక సంస్థలుగానే మనగలుగుతున్నాయి. ప్రభుత్వం ఉన్నత విద్యా రంగాన్ని ప్రైవేటీకరణ చేయాలనే ఉద్దేశంతో సరిపడ నిధులను కేటాయించడం లేదు. ఖాళీ అయిన పోస్టులను ఏళ్ల తరబడి భర్తీ చేయకుండా కాలయాపన చేయడం వల్ల ఉన్నత విద్యాలయాలు ఆదరణకు నోచుకోలేకపోతున్నాయి. వందేళ్ల చరిత్ర కలిగిన ఉస్మానియ విశ్వవిద్యాలయానికి ప్రతి సంవత్సరం రు. 771 కోట్లు కేటాయించాలి

కానీ, కేవలం రు. 150 కోట్లు విడుదల చేసి తెలంగాణ ప్రభుత్వం తమకేమీ పట్టనట్లు వ్యవహరిస్తుంది. తెలంగాణ ప్రభుత్వం గత సంవత్సరం అన్ని యూనివర్సిటలకు కలిపి రు. 420 కోట్లు కేటాయింపు చేస్తే అందులో రు. 210 కోట్లు మాత్రమే విడుదల చేశారు. ఈ విద్యా సంవత్సరానికి గాను అన్ని యూనివర్సిటీలకు కలిపి రు. 210 కోట్లు మాత్రమే కేటాయించారు. మరి ఇంత తక్కువ మొత్తాల కేటాయింపులతో విశ్వవిద్యాలయాల అభివృద్ధి ఎలా సాధ్యమవుతుందో ప్రభుత్వాలే వెల్లడించాలి. ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థుల సంఖ్యను బట్టి చూస్తే యుజిసి నిబంధనల ప్రకారం మొత్తం 1603 మంది అధ్యాపకులు ఉండాలి. కాని ప్రస్తుతం 520 మంది అధ్యాపకులు మాత్రమే ఉన్నారు. మిగతా పోస్టులన్నీ ఏళ్ల తరబడి ఖాళీగా పడి ఉన్నాయి. కాంట్రాక్ట్ అధ్యాపకులచే నెట్టుకొస్తున్నారు. ఈ భౌతిక పరిస్థితులు అంతర్జాతీయ స్థాయి ప్రమాణాలు కలిగి ఉండడానికి దోహద పడతాయా?

మనదేశ ఉన్నత విద్యా రంగంలో ఉన్నత ప్రమాణాల స్థాయిలో నానాటికీ క్షీణత ప్రస్ఫుటంగా కళ్లకు కనబడుతుంది. ఇది మరింత ఆందోళన కలిగిస్తున్న తీవ్రమైన సమస్య. దేశం సర్వతోముఖాభివృద్ధి చెందాలంటే విశ్వవిద్యాలయాల్లో సమర్థవంతమైన ప్రమాణాలు పెంపొందించుకున్న మానవ వనరుల సృష్టి జరగడం ప్రాథమిక అవసరం. మానవులు మహనీయులుగా మారడం ఇక్కడే జరగాలి. కాని ఉన్నత విద్యా సంస్థల్లో సమర్థవంతమైన బోధన సిబ్బంది తీవ్రమైన కొరతవల్ల విద్యార్థుల అభ్యసన సామర్థ్యాన్ని, గ్రహనశక్తిని కుంగదీసి వారి భవిష్యత్తును అగమ్యగోచరంగా మారుస్తున్నది.

అంతర్జాతీయ ఉత్కృష్ట విద్యా నాణ్యత ప్రమాణాలను సాధించడానికి భారతదేశం ఆరుతరాల పాటు అంటే 126 సంవత్సరాలు పరిశ్రమించా లంటున్న అసోచమ్ (భారత వాణిజ్య, పారిశ్రామిక సంఘాల సమాఖ్య) అధ్యయనం వెల్లడిస్తుంది. ఉత్తమ ఉపాధ్యాయ విద్యను అందించడానికి విశిష్టమైన సంస్థనొకదాన్ని నెలకొల్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఉపాధ్యాయులు సమర్థవంతమైన వాళ్లు కాకపోతే కొన్ని తరాలు నష్టపోతాయి. గురువులను తయారు చేసే ఉపాధ్యాయ విద్యా వ్యవస్థ నేడు దేశానికి అత్యంత అవసరం. ఉన్నత విద్యా ప్రమాణాల పరిరక్షణలో విశ్వవిద్యాలయాల ఉప కులపతులు, అధికారుల పాత్ర చాలా కీలకం. అత్యంత ప్రతిభావంతమైన, సమర్థవంతమైన దార్శనికులను విశ్వవిద్యాలయాలకు అధిపతులుగా నియమించాలి.

అంతర్జాతీయ ప్రామాణిక పత్రికల్లో శాస్త్రీయ దృక్పథంతో కూడిన పరిశోధన పత్రాలు ఎన్ని ప్రచురితమయ్యాయనేదాన్ని ప్రమాణంగా తీసుకొని అధిపతులను నియమించాలనేది అంతర్జాతీయ నియమం. పరిశోధన పత్రాలు, సామాజిక అంశాల అధ్యయన నివేదికలు ఒక వ్యక్తి శాస్త్రీయ దృక్పథాన్ని, నైపుణ్యాన్ని, సృజనాత్మకతను ప్రస్ఫుటిస్తాయి. అలాంటి వ్యక్తులు ఎవరైన దిశానిర్దేశన అందించగలరు.

కాని మన దేశంలో కులం, మతం, భావజాలం ప్రముఖ పాత్ర పోషిస్తున్నాయి. మతతత్వ బిజెపి అధికారంలోకి వచ్చిన తర్వాత హిందూ మతతత్వ భావజాలం, ఆ భావజాలాన్ని అనుసరిస్తున్న వ్యక్తులను అధిపతులుగా నియమిస్తుంది. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం లో జరిగిన రోహిత్ వేముల సంస్థాగత హత్య. జెన్‌యులో కన్హయ్య కుమార్ మీద దేశద్రోహం కేసు, నజీబ్ అదృశ్యం, అలహాబాద్ విశ్వవిద్యాలయంలో రిచాసింగ్ ఎదుర్కొంటున్న ఇబ్బందులు, జాదన్‌పూర్ విశ్వవిద్యాలయంలో, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో, ఢిల్లీ విశ్వవిద్యాలయంలో, పూనాలో, చెన్నైలో, బొంబాయిలోని ఉన్నత విద్యా సంస్థల్లో జరుగుతున్న ఆకృత్యాలు వ్యవస్థల కాషాయీకరణం కావడం వల్ల జరిగినవే.

ఇంకా ముందుకెళ్లి ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ హిస్టారికల్ రిసెర్చ్, ఐఐటి, ఐఐఎం, ఎఐఐఎంఎస్, ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఫిల్మ్ టెక్నాలజీల్లో తను భావజాలం నమ్మినవారిని అధిపతులుగా నియమించింది. విద్యావ్యవస్థను కులషితం చేసింది. సంస్థలను కాషాయీకరించి తిరోగమన మార్గంలో మళ్లీ మనువాద ఆచరణలోకి తీసుకెళుతుంది. ఈ తిరోగమన చర్యలను తిప్పికోట్టాల్సిన బాధ్యత ప్రజలపై ఉంది. దీన్ని సరిచేసి సమర్థులైన, ప్రతిభా పాటవాలు కలిగిన వ్యక్తుల్ని నియమిస్తేనే పరిస్థితి మెరుగుపడుతుంది. అధ్యాపకుల్లో నైతిక స్థైర్యం పెరిగి ఉన్నత విద్యా వ్యవస్థ బాగుపుడుతుంది. తిరోగమన శక్తులను ఓడించడం ద్వారానే ఇది సాధ్యమవుతుంది. ఉపేక్షిస్తే దుష్టశక్తులు పెట్రేగిపోతాయి. ఇప్పటికీ యుజిసిని రద్దుచేసి కేంద్ర మానవ వనరుల పరిధిలోకి వచ్చే హైయర్ ఎడ్యుకేషన్ ఆఫ్ ఇండియా కమిషన్ (ఎచ్ఇసిఐ)ని తీసుకొస్తున్నారు. దీంతో విద్యారంగంపై రాజకీయ నియంత్రణ పెరిగి ఉన్నత విద్యావ్యవస్థ తన చేతుల్లో బందీగా మారుతుంది. విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తికి విఘాతం కలుగుతుంది. ఈ కమిషన్ కూర్పు 14 మంది సభ్యులతో కూడి ఉంటుంది. ఇందులో విద్యావేత్తలు కేవలం నలుగురు మాత్రమే. అందులో ఇద్దరు పదవిలో ఉన్న వైస్ చాన్సలర్లు. మిగిలిన పది మందిని ప్రభుత్వం నియమిస్తుంది. ఇందులో పారిశ్రామిక వేత్తలు, ప్రభుత్వ అధికారులు ఉంటారు. వీరంతా ప్రభుత్వానికి లొంగి ఉండాల్సిందే. లేకుంటే వారిని ప్రభుత్వం ఎప్పుడైనా తొలగిస్తుంది. దీంతో ఉన్నత విద్యా వ్యవస్థ సమస్తం ప్రభుత్వం ఆధీనంలోకి వస్తుంది. విశ్వవిద్యాలయాల స్వయం ప్రతిపత్తి మంటగలుస్తుంది. దీనికి వ్యతిరేకంగా విద్యా వ్యవస్థ పరిణామాలను గమనిస్తున్నంత వారంతా పోరాడాలి.

భారతదేశం 2020 నాటికల్లా ఉన్నత విద్యను అందుకోగలిగే వారి సంఖ్యను 30 శాతానికి పెంచాలని పాలకులు లక్ష్యంగా పెట్టుకున్నారు. ప్రస్తుతం ఈ సంఖ్య 20 శాతానికి కూడా చేరుకోలేదు. మరొక్క సంవత్సర కాలంలో 30 శాతాన్ని చేరుకోవడం సాధ్యమవుతుందా? అరకొర నిధులతో కొట్టుమిట్టాడుతున్న మన విద్యా వ్యవస్థలో ఆ లక్ష్యం సాధ్యపడుతుందా? విశ్వవిద్యాలయాల స్థాయిలో ఉన్నత విద్యను, పరిశోధనలను అత్యున్నతంగా తీర్చిదిద్దాలంటే అండర్ గ్రాడ్యుయేట్ విద్యా వ్యవస్థను ప్రక్షాళణ చేయాలి. ఈ అండర్ గ్రాడ్యుయేట్ స్థాయి విద్యా వ్యవస్థ తీవ్రమైన అకడమిక్ లోపాలతో కొట్టుమిట్టాడుతుంది. తీవ్రమైన అధ్యాపకుల కొరత, నిధుల కొరత నెలకొని ఉన్న పరిస్థితిలో కాంట్రాక్ట్ నియామకాల మీద ఆధారపడే దుస్థితి ఏర్పడింది. ప్రభుత్వ కళాశాలల్లో ముఖ్యంగా ప్రైవేట్ కళాశాలల్లో అధ్యాపకులకు సరైన విద్యా అర్హతలు, శిక్షణ ఉండడం లేదు. నిధుల కొరతవల్ల సమర్థవంతమైన అధ్యాపకులను నియమించలేని దుస్థితిని ఎదుర్కొంటున్నది. పైగా

విపరీతమైన పని ఒత్తిడిలో బోధనా నాణ్యత తగ్గుతోంది. వీరు మరిన్ని విద్యార్హతలను విస్తృతంగా పెంచుకోవడం పట్ల, పరిశోధనల పట్ల ఆసక్తి మొగ్గ తొడగాల్సిన దశ ఈ స్థాయే. కాని సరైన ప్రేరణ కొరవడడం వల్ల ముందుకు సాగలేకపోతున్నారు. ఈ పరిస్థితుల్లో మదింపు - కుదింపు మండలి (నాక్) అనుమతితో, గుర్తింపుతో నడుస్తున్న సంస్థలు పదిశాతం మించడం లేదంటే విద్యా ప్రమాణాలు దిగజారుతున్న స్థితికి నిదర్శనం.

దేశంలో ప్రైవేట్ యూనివర్సిటీలు అనేకంగా పుట్టుకొస్తున్నాయి. ప్రభుత్వ అవార్డులు అందుకుంటున్నాయి. రిలయన్స్‌కు చెందిన జియో సంస్థ దేశంలోనే అత్యున్నత విద్యా సంస్థగా కేంద్ర ప్రభుత్వ అవార్డు పొందడం విద్యావేత్తలకు విస్మయం కలిగిస్తుంది.

తెలంగాణ ప్రభుత్వం ప్రైవేట్ యూనివర్సిటీల ఏర్పాటుకు రంగం సిద్ధం చేసింది. ఈ మేరకు 2018 మార్చి 28న అసెంబ్లీలో బిల్లును ఆమోదించింది. తర్వాత ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని దీన్ని పక్కకు నెట్టింది. తెలంగాణ రాష్ట్ర సమితి ఎన్నికల్లో గెలిచి తిరిగి అధికారంలోకి వచ్చింది కనుక బిల్లును బయటికి తీసింది. దేశీయ సంస్థలు, విదేశీ విద్యా సంస్థలు ప్రైవేట్ యూనివర్సిటీల ఏర్పాటుకు ఆసక్తిగా ఎదురు చూస్తున్నాయి. కనుక రాష్ట్ర ప్రభుత్వం ఇందుకు సంబంధించి నోటిఫికేషన్ జారీ చేయనుంది. వాటిల్లో వచ్చే విద్యా సంవత్సరం 2018 - 2019 నుంచి ప్రవేశాలు చేపట్టేందుకు అన్ని ఏర్పాట్లు చేస్తుంది. ఇప్పటికే హైదరాబాద్‌లో మహీంద్రా ఏకోల్ తమ విద్యాసంస్థను స్థాపించింది. బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (బిట్స్ పిలాని) క్యాంపస్ హైదరాబాద్‌లోనే ఉంది. తెలంగాణలో ప్రైవేట్ యూనివర్సిటీలు ప్రవేశిస్తే ప్రభుత్వ రంగంలో 11 యూనివర్సిటీల ఉనికికి విఘాతం కలుగుతుంది. వెనుకబడ్డ ప్రాంతాల విద్యార్థుల అవసరాలు తీర్చుతున్న ఉస్మానియా తదితర విశ్వవిద్యాలయాలు చరిత్ర గమనంలో కలిసిపోతాయి. వెనకబడ్డ వర్గాల విద్యార్థుల భవిష్యత్తు అగమ్యగోచరంగా మారుతుంది. తెలంగాణలోని విద్యా వేత్తలు, విద్యార్థులు దీన్ని వ్యతిరేకించాలి.

దేశంలో వ్యవస్థలు నిరర్థకంగా మారిపోతే నష్టపోయేది బడుగు బలహీనవర్గాల ప్రజలే. వ్యవస్థ, యంత్రాంగం ఖరాఖండీగా నిబంధనలకు, సూత్రాలకు కట్టుబడి ఉండకపోతే నష్టపోయేది కింది వర్గాల ప్రజలే. వ్యవస్థలను పునరుజ్జీవింప చేసుకోవాల్సిన బాధ్యత ప్రజలందరి మీద ఉంది. ప్రభుత్వం అజమాయిషీలోనే ఉన్నత విద్య విస్తరణ, వికాసం జరిగితేనే అన్ని సామాజిక వర్గాలకు న్యాయం జరుగుతుంది. నాణ్యత, ప్రమాణాలకు రక్షణ దొరుకుతుంది. నిధుల కొరత కారణం జూపి ఉన్నత విద్యను విస్మరిస్తే తరతరాలుగా నష్టపోతాం. అభివృద్ధి చెందిన దేశాల్లో సైతం ఉన్నత విద్యకు ప్రభుత్వాలు సరైన నిధులను కేటాయిస్తున్నాయి. ఉన్నత విద్యకు మనదేశంలో కూడా నిధులు సమకూర్చే బాధ్యత సర్కార్ వహించాలి. ఎట్టి పరిస్థితుల్లో ఈ బాధ్యత నుండి వైదొలగరాదు. అధ్యాపకుల నియామకాన్ని సంపూర్ణంగా చేపట్టాలి. అధ్యాపకుల నియామకాలను శాస్త్రీయ పద్ధతుల్లో జరపడంపై దృష్టి సారించాలి. విద్యార్థుల్లోని శక్తి సామర్థ్యాలను వెలికితీసి దేశాభివృద్ధికి వినియోగించే ఉన్నత విద్యా నమూనాను రూపొందించుకోవాలి. అప్పుడే మనం సంపదలో ధనవంతులం కాదు, మానవ వనరుల అభివృద్ధిలో పురోగమిస్తాం.

*(రచయిత అధ్యక్షులు పౌరహక్కుల సంఘం)* వీ

# శ్రీకాకుళం జిల్లా జైలు - వెట్టిచాకిరీకి నిలయం

*జైళ్లు సంస్కరణ కేంద్రాలుగా కాకుండా శిక్షలకు నిలయాలుగా మారాయనీ, జైళ్లలో ఖైదీలు దుర్భరమైన పరిస్థితులను అనుభవిస్తూ వెట్టిచాకిరీ చేయాల్సి వస్తోందనీ అంటున్నారు* **వై. వెంకటేశ్వర్లు**

శ్రీకాకుళం జిల్లా కేంద్రానికి కూతవేటు దూరంలో ఉన్న జిల్లా జైలు రాష్ట్రంలోనే ఆదర్శవంతమైన జైలని, ఖైదీల సంక్షేమానికి అనేక మౌలిక సదుపాయాలు కల్పించామని, పరిశుభ్రతకు మారుపేరని జైలు అధికారులు గొప్పగా చెప్పుకుంటారు. దీని వెనుక రిమాండ్ ఖైదీల కోసం 'వంశధార', 'పూర్య', 'చంద్ర' బ్లాక్‌లే గాక అన్నపూర్ణ బ్లాక్, వాటర్ ప్లాంట్, వీటిని మించి హిందుత్వాన్ని ఖైదీల్లో చొప్పించడానికి శ్రీకృష్ణుడి ఆలయం. పచ్చని చెట్లు, కాయగూరలు, కొబ్బరి, మామిడి జామ, దానిమ్మ, సపోట చెట్లతో ఆహ్లాదకరమైన వాతావరణం మరోవైపు కనిపిస్తుంది. ఈ పండ్ల సంపదంతా జైలు అధికారులకే. పొరపాటున చిన్నకాయని ఖైదీలు తెంపినా వాళ్లని కొట్టి అదే చెట్టుకు కట్టేస్తారు.

శ్రీకాకుళం జిల్లా జైల్లో 9 నెలల పాటు ఎటువంటి విచారణ లేకుండా మగ్గుతున్న ఆదివాసులు బిడిగి సురేష్ సన్నాఫ్ సుక్కు – ఒరిస్సా, ఆరికె రాజారావు సన్నాఫ్ బుడ్డయ్య – శ్రీకాకుళం జిల్లా, కెద్రిక శివమాధవ్ సన్నాఫ్ సుక్కు – విజయనగర్ జిల్లా, బిడిగి సింగన్న సన్నాఫ్ సుంద్రో – శ్రీకాకుళం జిల్లా వివిధ జిల్లాలకు చెందిన ఆదివాసి యువకులపై అనేక రకాల కేసులు బనాయించి శ్రీకాకుళం జిల్లా జైల్లో నిర్బంధించారు. కేసు వాయిదాలకు గాని కోర్టులో ప్రవేశపెట్టలేదు. ఏమని ప్రశ్నించినా కేసు ఫైల్ కనిపించడం లేదని మాట దాటేస్తున్నారు. అమాయక ఆదివాసుల కేసులు విచారణ జరపకపోగా జైళ్లలో వెట్టిచాకిరి చేయిస్తున్నారు. ఈ విధంగా దేశ వ్యాప్తంగా ఆదివాసులను అక్రమంగా అరెస్టులు చేసి సంవత్సరాల పాటు జైల్లో నిర్బంధిస్తున్నారు. ఆదివాసులు ఏళ్ల తరబడి జైళ్లలోనే దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. 2018 నవంబర్ 11న తిత్లీ తుఫాన్ బాధితులకు బియ్యం, బట్టలు పంచడానికి వచ్చిన ప్రజా సంఘాల నాయకుల్ని, మమ్మల్ని అరెస్టు చేసి జిల్లా జైలుకు తరలించడం జరిగింది. నవంబర్ 23 వరకు ఖైదీల మధ్య పడపడంతో అనేక విషయాలు ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చాయి. ఇందులో వెట్టిచాకిరి, దౌర్జన్యం, బూతులే గాక అనేక మంది ఖైదీలపై అధికారులు దాడులు చేస్తున్నట్లు తెలిసింది. పురుగులు పడ్డ అన్నం, నీళ్లతో మజ్జిగ, కూరలు ఖైదీలకు పెట్టడం జైలు అధికారులు ఒక విధానంగా పెట్టుకున్నారు. ఖైదీల కిచెన్ హాల్, అధికారుల కిచెన్ హాల్ వేరు వేరుగా ఉండడం వల్ల అధికారులకు రోజు విందు భోజనాలు, ఖైదీలకు మాత్రం పశువులు కూడా తినని ఆహారం పెడుతున్నారు. ఇంటర్వ్యూ సమయంలో బంధువులు తెచ్చిన తినే వస్తువులు కూడా అడ్డగిస్తున్నారు. ఎవరైనా ప్రశ్నిస్తే లాఠీదెబ్బలే కాక, సింగిల్ లాకప్‌లో మాగ్గాల్సిందే. జైల్లో పేషెంట్లు సైతం స్వెట్టర్లు, చెప్పులు వేసుకోవడానికి అనుమతి లేదు. కాని అధికారులు మాత్రం దర్జాగా బూట్లు, ఖరీదైన సెట్టర్లు వేసుకొని జైల్లో తిరగవచ్చు. ఖైదీలు ఉండే రూములు (బ్లాక్), లెట్రిన్, బాత్‌రూములు డెటాల్‌తో ప్రతిరోజు శుభ్రం చేసి, నీళ్లతో రూములు పరిశుభ్రం చేసి అంటువ్యాధులు, దోమలు రాకుండా చేసి తమ శ్రమతో రిమాండ్ ఖైదీలు జైలును శుభ్రంగా ఉంచుతున్నారు.

జైల్లో పాఠశాల ఖైదీలకు చదువు చెప్పడం కాక మొక్కుబడిగా ఉంది. దాని వలన ఎవరికి ఎటువంటి ప్రయోజనం కలగడం లేదు. జైల్లో ఉన్న లైబ్రరీ పేరుకే గాని చదువుకోవడానికి ఎటువంటి పుస్తకాలుండవు. దినపత్రికలు అందించరు. బయటి మిత్రుల ద్వారా పుస్తకాలు తెప్పించుకోవడానికి అనుమతించరు. లీగల్ సెల్ సర్వీస్ అథారిటీ, మరికొందరు అధికారులు వచ్చినా ఖైదీలు తమ సమస్యలు చెప్పుకునే స్వేచ్ఛలేదు. అధికారులకి వినతి పత్రాలు ఇచ్చినా ఎలాంటి ఉపయోగం లేదు. ఇదంతా మొక్కుబడిగా జరిగే తంతు అని ఖైదీలు వాపోతున్నారు. చిన్న చిన్న నేర ఆరోపణలు చేయబడ్డ వాళ్లు, పేదలు ఎక్కువ సంఖ్యలో ఈ జైల్లో మగ్గుతున్నట్లు స్పష్టంగా అర్థమవుతుంది.

నవంబర్ 23న తిత్లీ తుఫాన్ కుట్ర కేసులో కొందరు విడుదల కాగా, అప్పటికే వారం రోజులుగా మరో తిత్లీ తుఫాన్ కుట్ర కేసులో రిమాండ్ ఖైదుగా ఉన్న పి. దుర్యోధన, (పికెఎస్)తో పాటు ఎన్. వీరస్వామి (పిడిఎం), కె. వెంకటేష్ (పిడిఎం), కె. నీలకంఠు (పికెఎం) లను ఇరికించి పలాస కోర్టుకి వాయిదాకి తీసుకెళ్తూ ఇద్దరు, ఇద్దరు చొప్పున సంకెళ్లువేసి బంధించారు. ఖైదీలను స్పెషల్ బస్సులో కోర్టు వద్దకు గొలుసులతో తీసుకెళ్లి పరిసర ప్రజలను భయభ్రాంతులకు గురిచేశారు. నిత్యం ప్రజా ఉద్యమాల్లో పనిచేస్తూ ఉండే ప్రజా సంఘాల కార్యకర్తలకు ఈ విధంగా బేడీలువేసి వాయిదాలకు తీసుకురావడం అప్రజాస్వామికం. న్యాయ స్థానాల అనుమతి లేకుండా ఎవరికి బేడీలు వేయకూడదని సుప్రీంకోర్టు 1980 లోనే స్పష్టంగా తీర్పు ఇచ్చినా పోలీసులు దీనిని పరిగణలోనికి తీసుకోవడం లేదు. వ్యక్తికి సంకెళ్లు వేయడం, గొలుసులతో బంధించడం అంటే జంతుసమానంగా ప్రవర్తించడమేనని సుప్రీంకోర్టు గతంలోనే పేర్కొన్నది.

జైళ్లు అనేవి సంస్కరణ దిశగా కాకుండా శిక్షలకు నిలయాలుగా మారాయి. ఈ విధంగా జైళ్ల పరిస్థితి దుర్భరంగా ఉంది. జైళ్లలో ఎక్కడా జైల్ మ్యానువల్ అనుసరించి విచారణలో ఉన్న ఖైదులు అవసరాలు తీర్చడంలేదు. కొన్ని జైళ్లలో కెపాసిటీని మించి 3–4 రెట్లు ఎక్కువమంది ఖైదీలను ఉంచడం సర్వసాధారణం అయింది. రాజకీయ కనీసం డైరెక్ట్ ఇంటర్వ్యూ శ్రీకాకుళం జిల్లా జైల్లోలేవు. జైళ్లలో అక్రమ నిర్బంధాలు, వెట్టిచాకిరి నిర్మూలన కోసం ప్రజాస్వామికవాదులు ఉద్యమించాల్సిన అవసరం ఉంది.

*(రచయిత దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమ ప్రధాన కార్యదర్శి)* వీ

# చెరువు పర్యాటకంతో ప్రజలు ఇబ్బందులు

***లక్నవరం చెరువు పర్యాటక కేంద్రం కావడంతో వచ్చే పోయే వాహనాల రద్దీ వల్ల రోడ్డు ప్రమాదాలతో ప్రజలు వికలాంగులై ఉపాధి కోల్పోతున్నారనీ, ప్రభుత్వం ప్రత్యామ్నాయంగా వారికి సరైన ఉపాధి చూపించాలనీ అంటున్నారు*** **భాస్కర్ ఏంపెల్లి**

లక్నవరం చెరువు వరంగల్ నుండి 70 కిలోమీటర్ల దూరంలో గోవిందరావుపేట మండలంలో ఉంది. ప్రకృతి సహజంగా ఏర్పడిన కాకతీయుల కాలం నాటి చెరువు చుట్టూ అడవి, కొండలతో ఎంతో అందంగా ఉంటుంది. ఆ చెరువు నీరు దాదాపు 3000 ఎకరాలకు సాగునీరు అందిస్తుంది. చెరువు నుండి వచ్చే తూము నీరు జంపన్న వాగుగా మారి ఏటూరునాగారం దగ్గర గోదావరిలో కలుస్తుంది. ఇక్కడి అందాలను చూడడానికి రాష్ట్రం నలుమూలల నుంచి పర్యాటకులు వస్తుంటారు. ముఖ్యంగా సమ్మక్క–సారక్క జాతర సమయంలో తిరుగు ప్రయాణంలో అందరూ ఈ చెరువును దర్శించుకునే వెలతారు.

ఈ చెరువును చేరడానికి ముందు మూడు కిలోమీటర్ల దూరంలో బుస్సాపూర్ అనే గ్రామం ఉంటుంది. ఆ చెరువుకు ఎంత పర్యాటకులు పెరిగితే ఈ గ్రామం అంత ఇబ్బంది పడుతుంది. వచ్చి పోయే పర్యాటకుల వాహనాలు చేసే వాయుకాలుష్యం, శబ్దకాలుష్యం ఒక ఎత్తైతే. పర్యాటకుల వాహనాలు చేసే ప్రమాదాల వలన మానసికంగా, ఆర్థికంగా కృంగిపోయి కోలుకోలేని వారు చాలా మంది. ప్రమాదాలకు కారణమైన పర్యాటకుల మీద చర్య తీసుకుంటే పర్యాటకులు తగ్గుతారని వారి మీద ఎలాంటి చర్యలు తీసుకోవట్లేదు. ప్రమాదాలకు గురైన వారిని ప్రభుత్వం ఆదుకోవట్లేదు. ఇక వారు సొంత ఖర్చులతో నయమయి ఇంటికివచ్చి ఏ పని చేసుకోలేక ఉపాధి కోల్పోతున్న పరిస్థితి.

చెరువు మీదకు వచ్చే కార్లు చాలాసార్లు ఆక్సిడెంట్లు చేసింద్రు. ఆ ప్రమాదాల వల్ల చాలామంది ఆర్థికంగా చితికిపోయారు. హాస్పిటల్ ఖర్చులు, పైగా ప్రమాదం తర్వాత ఏ పని చేయలేకపోవడంతో ఉపాది కోల్పోయారు. అలాంటి ఒక ఉదాహరణ విజయ, శ్రీనుల కుటుంబం. శ్రీను భార్య విజయ ప్రమాదం జరిగిన విధానం గుర్తు చేసుకుంటూ, 'కాల్వ దాటినంక ఇటు నుండి బైకు మీద పోతాండు, మూల మీద అటు నుండి కారు వస్తంది, చూసుకోకుంట గుద్దేసిండు'. ప్రమాదం జరిగిన రోజున ఆమె కూడా ఇంట్లో లేదు. పత్తి ఏరడానికి వేరే ఊరికి కూలికి పోయింది.

ములుగు హాస్పిటల్‌కి వేసుకచ్చి ఫోన్ చేస్తే అక్కడికి వెళ్లింది. అక్కడ ప్రభుత్వ హాస్పిటల్‌లో పట్టించుకునే వాళ్లు ఎవరు లేరు. వేరే పెద్ద హాస్పిటల్స్ ఏమిలేక వరంగల్ ప్రైవేటు హాస్పిటల్‌కి తీసుకు పోయారు. నడుం బొక్క కొంచెం విరిగింది అని ఆపరేషన్ చేసి, బాగు చేసింద్రు. ఆ ప్రమాదం చేసిన కారు మీద కేసు పెట్టంద్రు. 'మేము హాస్పిటల్‌ల పదిహేను రోజులు ఉండేసరికి, కేసు మూసిపడేసింద్రు ఇక్కడ. స్టేషన్‌కాడికి పోతే ఏమి ఇస్తదమ్మా, పదివేలు ఇస్తదుకావచ్చు, అంతకంటే ఎక్కువ ఇస్తదా? ఆ పదివేలకు ఇగ వీనికిన్ని, వానికిన్ని ఖర్చులే అయితయి అన్నరు. యాక్సిడెంట్ చేసిన కారోడు ఒక్క రూపాయి ఇయ్యలేదు. ఏ పోనియ్‌లే ఇగ అని సప్పుడుదాక వదిలేసినం' అని విజయ ఆవేదన చెందుతుంది. 'మాకు సపోర్ట్ ఎవరు మాట్లాడేటోల్లు లేరు. ఒక్క రూపాయి కూడ ఇవ్వలేదు. హాస్పిటల్‌లో రెండు లక్షలు ఖర్చయ్యింది. ఉన్న భూమి అమ్ముకునేటట్టు అయ్యింది. ఎవ్వరు సహాయం చెయ్యలేదు. ఇక ఎందుకు ఆ తిరుగుల్లు అని ఇప్పుడు ఎక్కడ నుంచి పెట్టాలె అదనంగ. మనమే బొందలపడి ఉన్నమని వదిలేసినం.'

శ్రీను అదువరకు తాల్లు ఎక్కేది. డిసిఎం కూడా ఉండేది. 'యాక్సిడెంట్ అయినంక మూడు నెల్లు డ్రైవర్లకు ఒప్పజెప్పినం. వాల్లు ఫైనాన్స్ కాడ కట్టలె. మూడు నెల్లకు లక్ష రూపాయలయినయి. ఫైనాన్స్ వానికి ఏడతెచ్చి కట్టాలే. మేమె ఇప్పుడు అప్పుల పడి ఉన్నం. ఇక ఫైనాన్స్ వానికే డిసిఎం వదిలేసినం' అంటడు శ్రీను.

కుమారస్వామి స్వామి మాలేసుకుని వస్తాంటే, ఆటో గుద్దిపోయింది. ఆటో చెరువు చూడడానికి వచ్చిన మామునూరు వాల్లది. 'కేసు పెట్టినం, కానీ రూపాయి ఇయ్యలేదు' అని వాపోతుంది ఆయన భార్య. ఒక లాయర్‌ను పెట్టి కాగితాలన్ని ఇచ్చినం. లాయర్ ఇంత వరకు ఏ సప్పుడు లేదు, ఏ సడి లేదు. కేసుపెట్టి రెండేండ్లయింది, ఏం చెప్తలేడు లాయర్.

యాకయ్య 60 సంవత్సరాలు దాటి, కొడుకులు బిడ్డలు లేని వృద్దుడు. చల్వాయి పోయి వస్తాంటే ఆటో గుద్దింది. ఒక కాలు మొత్తం తీసేశారు. ఇంత పొలం ఉంటే చేసుకొని బతికేది. భార్య కూడ వయసు మీద పడి ఏ పని చేతకాక ఉన్నది. కనీసం పట్టిచ్చుకున్న నాదుడు లేడు అని బాధపడుతడు. ఉన్న పొలం అమ్ముకుని బ్యాంకులో వేసుకుని వచ్చిన డబ్బులతో కాలం ఎల్లదీస్తున్నరు. 'లక్నవరం చెరువు పర్యాటక కేంద్రంగా మారడం వలన గ్రామానికి ఏ లాభం లేదు. ఇంకో జింకల పార్కు కట్టిస్తమని ఉన్న పోడు భూములు గుంజుకున్నరు. చెరువుకు వచ్చిపోయే కార్లు, రద్దీ వలన దుమ్ము, పొగ! రోడ్డు మీద నీల్లు చల్లిస్తమన్నరు టాంకర్లు పెట్టి. అట్ల లేదు. ఇట్ల లేదు' అంటడు లక్ష్మారెడ్డి.

చెరువు అభివృద్ధి పేరుతో ఇక్కడి ఆదివాసులు, ఇతర పేదప్రజలు పోడు కొట్టుకుని సాగుచేసుకుంటున్న భూములు, జింకల పార్కు కట్టాలని, పర్యాటకులకు గెస్ట్‌హౌస్‌లు కట్టాలని గుంజుకున్నారు. స్థానికులకు గెస్ట్ హౌస్‌లో ప్లేట్‌లు కడిగే ఉద్యోగాలు ఇవ్వచూపుతున్నారు. ఊళ్లో ఇంతో అంతో డబ్బున్న భూస్వాములు పర్యాటకులకు అవసరమయ్యే రూములు, మధ్యం ఇతర సదుపాయాలు కల్పిస్తూ సంపాదించుకుంటున్నారు. కానీ పర్యాటకాన్ని పెట్టుబడి చేసుకోలేని, కనీసం ఉపాధిగా కూడా

# ఆంధ్రప్రదేశ్‌లో బిసి భావన

***బిసిలు ఇంకా అనేక రంగాల్లో వెనకబడే ఉన్నారనీ, రాజకీయంగా, ఆర్థికంగా ఎదుగుదలకు అన్ని కులాలు ఏకమై ఉద్యమాలు చేయాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* డా. మేడికుర్తి ఓబులేసు**

'బహుజన' అనే పదంలో బిసి, దళిత, గిరిజన మొదలైన వారందరూ ఇమిడి ఉన్నారు. అయితే, నేడు మనం 'బహుజన' అనే పదాన్ని కేవలం ఒక్క బిసిలకు మాత్రమే పరిమితం చేసుకొని మాట్లాడుతున్నాం. ముందుగా బిసిల పరిణామ క్రమాన్ని తెలుసుకోవాలి. బిసి అనే భావన బిసి రిజర్వేషన్ సిస్టమ్ నుండి మొదలైంది.

బిసి అంటే 140కి పైగా కులాలు. ఇందులో 80కి పైగా కులాలు బడుగు, బలహీన, సంచార కులాలు. నాటకాలు వేసేవారు, దొమ్మరులు, తోలుబొమ్మలాటలాడేవాళ్లు, పంబలోళ్లు, పులివేషగాళ్లు, కళావంతులు, నఖాసు, చిత్ర, గినియార్, గొల్లసుద్దులు, వడ్డెరలు, మొండోళ్లు, పాములాడించేవాళ్లు, గారడీవాళ్లు, జోగిని, జంగాలు, మొండిబండ, పాముల, బంద, పెద్దమ్మవాళ్లు, దేవర వాళ్లు, ఎల్లమ్మ వాళ్లు, ముత్యాలమ్మవాళ్లు, వీరముష్టి, గుడాల, కింజర-భట్ట, కొప్మారే, మొండిపట్ట, నొక్కర, పరికి ముగ్గుల, చొపమారి, కైకాడి, జోషినంది వాలాస్, మందుల, మహతార్, బొందిలి, పూసల, జక్కుల, గంగిరెడ్లువాళ్లు, దాసరులు ఇలా అనేక కులాల వాళ్లు బిసిల్లో ఉంటున్నట్లు అనేక మంది గుర్తించలేదు.

వీరి సంఖ్య చాలా తక్కువ. వీరిలో చాలా మందికి అక్షరాస్యత, స్థిరనివాసం లేదు. వీరిలో బిసిలు అనే సంఖ్యాపరమైన జనాభా తప్ప బిసిలు అనే ఐడెంటిటీ స్పృహ లేదు. వీళ్లల్లో నేటికి చాలా మంది సంచార జీవనం చేస్తున్నారు. కొందరికైతే బిసి అనే గుర్తింపు కూడా లేదు. ఇంతటి విపత్కర పరిస్థితుల్లో బిసి అనే భావన చిక్కుకొని ఉంది. బిసిలపైన సాహిత్యం వచ్చిందంటే సమాజంలో సామాజికతకు గురై స్థిరనివాసం ఏర్పడి ఆర్థికంగా కొంత వెసులుబాటు కలిగిన వారిపైన మాత్రమే వచ్చింది.

శూద్రులైన షెడ్యూల్డ్ కులాలు, వెనుకబడిన తరగతులు అగ్రకులాల వారితో పాటుగా విద్య, ఉపాధి, సామాజిక ఎదుగుదలపై బ్రిటిష్ పరిపాలనా కాలం నుండి వివిధ రకాలుగా ప్రయత్నిస్తున్నారు. ఆ ప్రయత్నంలో భాగంగానే మహాత్మా జ్యోతిరావ్ పూలే ప్రేరణతో అంబేద్కర్ చేసిన పోరాట ఫలితంగా 1902లో మహారాష్ట్రకు చెందిన శూద్ర సంస్థానాధీశుడైన సాహూ మహరాజ్ అణగారిన కులాలకు ప్రత్యేక రిజర్వేషన్ కల్పించారు. తర్వాత, 1909లో బ్రిటిష్ ప్రభుత్వ సంస్కరణల లో భాగంగా మింటోమార్లే ముస్లింలకు ప్రత్యేక రిజర్వేషన్స్ ఉండాలనే ప్రతిపాదన తెచ్చాడు.

అనంతరం మాక్డోనాల్డ్ కమ్యూనల్ అవార్డు ద్వారా 1932లో జరిగిన పూనా ఒడంబడిక ద్వారా ముస్లింలు, హరిజనులకు (ఎస్‌సి) ప్రత్యేక పోలింగ్ నియోజకవర్గాలు ఏర్పడ్డాయి. మరోవైపు దక్షిణ భారతదేశంలో బ్రాహ్మణాధిక్యానికి వ్యతిరేకంగా 1906లో 'దక్షిణ భారత విముక్తి సమాఖ్య' అటు తర్వాత 'జస్టిస్ పార్టీ' ఏర్పడి, 1920లో అధికారంలోకి వచ్చిన జస్టిస్ పార్టీ 1927లో కమ్యూనల్ జిఒ తేవడం ద్వారా అనేక కులాలకు రిజర్వేషన్లు కల్పించబడ్డాయి.

మరోవైపు 1917లో కర్ణాటకలో బ్రాహ్మణేతరులతో (శూద్రులు) ఏర్పడిన ప్రజామిత్ర మండలి జరిపిన పోరాట ఫలితంగా 1921లో విద్యా ఉద్యోగాలలో బిసిలకు రిజర్వేషన్లు కల్పిస్తూ మైసూరు సంస్థానం నిర్ణయం తీసుకుంది. కర్ణాటకలో జరిగిన పోరాట స్ఫూర్తితో కాంగ్రెస్ పార్టీ నుండి బయటికి వచ్చిన పెరియార్ రామస్వామి నాయకర్ ఆత్మగౌరవ నినాదంతో ద్రవిడకజగం (డి.కె.) పార్టీని స్థాపించి హరిజన, గిరిజన, క్రిస్టయన్‌లతో సహా వెనుకబడిన తరగతుల వారికి విద్యా, ఉద్యోగ రంగాలలో రిజర్వేషన్లు కల్పించడానికి పోరాడారు.

ఈ రిజర్వేషన్లకు వ్యతిరేకంగా రాజ్యాంగంలోని ఆర్టికల్ 13 'అందరికీ సమానత్వం ఉన్నదని, హక్కులు ఇచ్చిందని, మనది సమాన న్యాయమని, లౌకిక రాజ్యమని' కావున, రిజర్వేషన్లు రాజ్యాంగ విరుద్ధమని వాదిస్తూ 1950లో దొరైరాజన్, శ్రీనివాస్ అనే బ్రాహ్మణులు మద్రాసు హైకోర్టుకు వెళ్లగా రిజర్వేషన్లు చెల్లవని హైకోర్టు తీర్పునిచ్చింది. దాంతో భారత ప్రభుత్వం మొదటి రాజ్యాంగ సవరణ చట్టం 1951 ద్వారా 15(4), 16(4) ఆర్టికల్స్‌ను చేర్చి ఎస్‌సి, ఎస్‌టి, బిసిలకు రాజ్యాంగ బద్ధంగా రిజర్వేషన్లు కల్పించే వీలును కల్గించింది.

---

ఉపయోగించుకోలేని ప్రజలు ఇబ్బందులకు గురవుతున్నారు. గ్రామం మధ్యలో నుండి చెరువుకు దారి ఉండడం వలన వాహనాల పొగ, దుమ్మంతా ఇండ్లల్లో పడుతుంది. శ్వాశకోశ వ్యాధులకు దారితీస్తుంది. పైగా ఆ వాహనాల చప్పుడుకు అనేక తిప్పలుపడుతూ, ఎవరికి చెప్పుకోవాలో తెలియని పరిస్థితి. ఈ పర్యాటకం వారికి ఉపాధిని ఇవ్వకపోయినా పర్వాలేదు కానీ ఉన్న ఉపాధిని చేసుకోలేని పరిస్థితి తీసుకురాకూడదు. వాహనాల వల్ల రొడ్డు మీద దుమ్ము లేవకుండ నీళ్లు చల్లించి, ప్రమాదాలు జరగకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. ప్రమాదాలకు గురైన వారిని ఎంతోకొంత ఆర్థిక సహాయం చేసి ప్రభుత్వం ఆదుకోవాలి. చెరువు మీద వచ్చే ఆదాయాన్ని, నిర్వహణను స్థానిక ఆదివాసులకు అప్పగించాలి.

*(రచయిత తెలంగాణ విద్యార్థి వేదిక, రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

అయితే ఎస్‌సి, ఎస్‌టిల విషయంలో వారిని స్పష్టంగా గుర్తించి రిజర్వేషన్లు కల్పించిన ప్రభుత్వం, బిసిల విషయంలో అవకాశం ఉన్నా రిజరేషన్లు కల్పించలేదు. ఈ అన్యాయాన్ని గుర్తించి కొన్ని బిసి కులాలు నడిపిన అనేక ఉద్యమాల ఫలితంగా బిసిలకు రిజర్వేషన్స్ కల్పించే నిమిత్తం 29-1-1953న బ్రాహ్మణ కులానికి చెందిన అప్పటి ఎం.పి. కాకా సాహెబ్ కాలేల్కర్ అధ్యక్షతన ఆర్టికల్ 340 కింద 11 మంది సభ్యులతో బిసి కమిషన్‌ను కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఇది తొలి బిసి కమిషన్. ఈ కమిషన్ 1955లో తన నివేదికను ప్రభుత్వానికి అందజేసింది. అయితే కమిషన్ అధ్యక్షుడైన కాలేల్కర్ రాష్ట్రపతికి లేఖ రాస్తూ వెనుకబాటుతనాన్ని గుర్తించేందుకు కులాన్ని పరిగణలోకి తీసుకోవడాన్ని వ్యతిరేకించారు. దీనిపై తర్వాత కాలంలో పార్లమెంట్‌లో ఎటువంటి చర్చ జరగలేదు.

కేంద్ర ప్రభుత్వం బిసి రిజర్వేషన్లను ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పాటు చేసుకోవాలని కోరి తన బాధ్యత నుండి తప్పుకుంది. ఐతే కేంద్ర ప్రభుత్వం పై నిర్ణయాలకనుగుణంగా అనేక రాష్ట్ర ప్రభుత్వాలు ఆంధ్రప్రదేశ్‌లో (1963) 'అనంతరామన్ కమిషన్' కేరళలో 'కుమార్ పిళ్లై కమిషన్' (1966), జమ్మూ కశ్మీర్‌లో 'డా. సి.బి. గజేంద్ర గాడ్కర్ కమిషన్' (1967), కర్ణాటకలో 'వాహనూరు కమిషన్' 1970 తర్వాత బిసిలకు రిజర్వేషన్స్ తమిళనాడులో 50 శాతం, కర్ణాటకలో 48 శాతం, జమ్మూకాశ్మీర్ 42 శాతం, కేరళలో 40 శాతం, బీహర్‌లో 26 శాతం, ఆంధ్రప్రదేశ్‌లో 25 శాతం (అనంతరామన్ కమిషన్ కులాన్ని ప్రాతిపదికగా తీసుకొని, 30 శాతం రిజర్వేషన్స్ కల్పించాలని సిఫార్సు చేయగా, ప్రభుత్వం 1975 నుండి 25 శాతం రిజర్వేషన్లు కల్పించింది) ఉత్తరప్రదేశ్‌లో 25 శాతం, మహారాష్ట్రలో 14 శాతం, గుజరాత్‌లో 10 శాతం ఇలా దేశవ్యాప్తంగా మొత్తం 12 రాష్ట్రాలలో మాత్రమే బిసిలకు రిజర్వేషన్లను ఆయా రాష్ట్రాల ఇష్టానుసారంగా కల్పించాయి.

దేశవ్యాప్తంగా ఒక స్పష్టమైన విధానం లేకపోవడంవల్ల తామెంత నష్టపోతున్నామో గుర్తించిన కొన్ని బిసి కుల సంఘాల నాయకులు బిసిలకు జనాభా నిష్పత్తి ప్రకారం రిజర్వేషన్స్ సౌకర్యం కల్పించాలని పోరాటం చేశారు. దీని ఫలితంగా జనతా ప్రభుత్వం 1978, డిసెంబర్ 28న బిందేశ్వరి ప్రసాద్ మండల్ అధ్యక్షతన ఆరుగురు సభ్యులతో కమిషన్‌ను వేసింది. ఇది రెండవ బిసి కమిషన్.

ఈ కమిషన్ 1980లో తన నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. ఈ నివేదికలో దేశం మొత్తం మీద 3743 వెనుకబడిన కులాలు ఉన్నట్లు నిగ్గుతేల్చింది. ఈ కమిషన్ వెనుకబడిన కులాలను కులం ఆధారంగానే గుర్తించింది. అంతేగాక ఈ వెనుకబడిన కులాలను 1931 నాటి జనాభా లెక్కల ప్రకారం ఈ వర్గీకరణ జరిగింది. మండల్ కమిషన్ నివేదికను ఇందిరాగాంధీ ప్రభుత్వం చెత్తబుట్టలో భద్రంగా దాచిపెట్టింది. పార్లమెంట్‌లో ప్రవేశపెట్టలేదు. ఇలాంటి సమయంలో భారతీయ జనతాపార్టీ ఎన్నికల కోసమని మండల్ కమిషన్ సిఫార్సుల మేరకు బిసిలకు 27 శాతం రిజర్వేషన్స్ కల్పిస్తామని ప్రకటించింది. కానీ దీన్ని ప్రజలెవరు విశ్వసించలేదు. ఇదిలా ఉండగా, దేశవ్యాప్తంగా పెరుగుతున్న బిసిల ఒత్తిడి తీవ్ర రూపం దాల్చింది.

ఇలాంటి సమయంలో 1989 పార్లమెంటు ఎన్నికల సందర్భంగా జనతాదళ్ పార్టీ మండల్ కమిషన్ సిఫార్సులను అమలు చేస్తామని వాగ్దానం చేసింది. ఎన్నికల్లో జనతాదళ్ ప్రభుత్వం గెలిచింది. వి.పి. సింగ్ ప్రధానమంత్రి అయ్యాడు. వి.పి. సింగ్ నేతృత్వంలోని నేషనల్ ఫ్రంట్ సర్కారు 1990 ఆగస్ట్ 17న మండల్ కమిషన్ సిఫార్సులను అమలు చేస్తూ బిసిలకు 27 శాతం రిజర్వేషన్లను అమలు చేసింది.

ఈ ప్రకటన వెంటనే దేశంలోని అగ్రకులాలంతా పార్టీలకతీతంగా సమీకృతమై రోడ్ల మీదికొచ్చారు. రాస్తారోకోలు, బంద్‌లు, ఆత్మాహుతి లాంటి ఆందోళనా కార్యక్రమాలు నిర్వహించి, రిజర్వేషన్లను అడ్డుకోవాలని ప్రయత్నించారు. రాజ్యాంగంలో సమానత్వానికి గొడ్డలి పెట్టన్నారు. ఇవేమి చెల్లకపోవడంతో గతంలో కోర్టులు ఇచ్చిన తీర్పులాధారంగా రిజర్వేషన్లు 50 శాతం మించరాదని ఒక నిబంధన పెట్టారు.

మండల్ కమిషన్ అమలుకంటే ముందుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రంలో వెనుకబడిన సామాజిక పరిస్థితులపై 1982 జనవరి 22న ఎస్.కె. మురళీధరరావు ఏకసభ్య కమిషన్ వేసింది. ఈ కమిషన్ 1982 ఆగస్ట్ 31న ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. ఇంతలో ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. ఈ కమిషన్ నివేదికలో బిసిలకు విద్యారంగం, ఉపాధి రంగాల్లో జరుగుతున్న అన్యాయాలు తీసుకోవల్సిన జాగ్రత్తలు, అమలు చేయాల్సిన పథకాలన్నింటిని వివరించింది.

దీన్ని కాంగ్రెస్ ప్రభుత్వం బిసిలను తమవైపు ఆకర్షించేందుకు మురళీధరరావు నివేదిక అమలు చేయాలని ఆందోళన చేపట్టింది. దీంతో రామారావు ప్రభుత్వం నివేదిక ఆధారంగా 44 శాతం ఉద్యోగాలు బిసిలకు రిజర్వేషన్లు కల్పిస్తూ జిఒ జారీ చేసింది. ఈ మేరకు శాసనసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. అగ్రకులస్థులు బెంబేలెత్తారు. కాంగ్రెస్, తెలుగుదేశం అన్న పార్టీ భేదం లేకుండా అన్ని పార్టీల్లోని అగ్రకులాల వారందరూ ఏకమై దాదాపు 4-5 నెలలు ప్రభుత్వాన్ని స్తంభింపచేశారు. చివరికి అన్ని పార్టీలలో ఉన్న అగ్రకులాలు ఏకమై రిజర్వేషన్లు వ్యతిరేక ఉద్యమాన్ని నిర్వహించడమేకాక హైకోర్టుకు వెళ్లి పెంచిన రిజర్వేషన్లను రద్దు చేయించే వరకు నిద్రపోలేదు.

అనేక ఉద్యమాలు కొనసాగి చివరికి భారతదేశం మొత్తమ్మీద 1993లో సుప్రీంకోర్టు తీర్పుననుసరించి బిసిలకు 27 శాతం రిజర్వేషన్స్ కల్పించడమైంది. (అది కూడా ఎస్‌సి, ఎస్‌టి, లకెవరికి లేని క్రిమిలేయర్‌ను అవలంభించడం) బిసిల జాబితా, బిసిలుగా పరిగణించే బాధ్యతను రాష్ట్రాలకే బదలాయించింది. ఈ కోర్టు తీర్పులో భాగంగానే 1993 ఏప్రిల్‌లో తొలి జాతీయ వెనుకబడిన తరగతుల కమిషన్ ఏర్పాటు చేసింది.

పైన వివరించినట్లు విద్య, ఉపాధి రంగాల్లో బిసిలకు రిజర్వేషన్స్ కల్పించినట్లే రాజకీయంగా ఎదగడానికి ఎస్‌సి, ఎస్‌టిల మాదిరిగా రిజర్వ్‌డ్ స్థానాలను కల్పించలేదు. అంతేగాక అనేక పోరాటాల ఫలితంగా బిసిలకు రిజర్వేషన్స్ కల్పించే నాటికే (1993) భారతదేశంలో ఆర్థిక సరళీకృత విధానాలు, గ్లోబలైజేషన్, ప్రైవేటీకరణ మొదలైనవి ప్రవేశించి బిసిల మనుగడను సామాజికంగా, సాంఘికంగా దెబ్బతీయడం మొదలైంది. రాజ్యాధికారం లేకపోవడంతో, సాంఘిక వెనుకబాటుకు గురవ్వాల్సి వచ్చింది.

బిసిలందరూ సమిష్టి నాయకత్వంలో సామాజిక, రాజకీయ బిసి ఉద్యమ నిర్మాణ ధ్యేయంతో 'స్వాభిమానం – సామాజిక న్యాయం – రాజ్యాధికారం' అనే నినాదాలతో 1995 తర్వాత స్వతంత్ర్య ప్రత్యామ్నాయ బిసి సంఘాలను స్థాపించడం జరిగింది. బిసి సంఘాల నేతలతో 1999 గుంటూరు మహాసభలో 'బిసి మహాజన సభ' అనే బిసి కులాల సమాఖ్యను స్థాపించడం జరిగింది. ఇదే సభలో ఉ. సాంబశివరావు 'బిసి ప్రణాళిక'ను రూపొందించడం జరిగింది. ఇదే సమయంలో ఎస్‌సి, ఎస్‌టి, మైనారిటీ సంఘాలన్నింటిని కలిపి బిసి ఐడెంటిటీ సంఘంగా ఏర్పడి 'బిసి మహాజన సమితి'ని 'మహాజన సంఘర్షణ సమితి'గా దళిత బహుజన సామాజిక సంకీర్ణ సమితిగా ఏర్పడింది.

ఈ సంకీర్ణ సమితి ఆధ్వర్యంలో 1999 జూలై నెలలో మహాజన ఫ్రంట్‌ను స్థాపించి, దళిత బహుజనులతో నిజాం కాలేజ్ గ్రౌండ్స్‌లో ప్రత్యామ్నాయ రాజకీయశక్తి ప్రదర్శన చేయడం జరిగింది. ఈ ఫ్రంట్‌లో క్రిష్ణమాదిగ సారథ్యంలోని మాదిగ దండోరా సంఘం, ఎం. సుబ్బారావు, తేజావత్ బెల్లయ్య నాయక్, వలిగి ప్రభాకర్ సారథ్యంలోని తుడుందెబ్బ, గిరిజన హక్కుల సంఘాలు, ఎం.రఫి సారథ్యంలోని ముస్లిం రైట్స్‌ఫోరం, ఎర్రాజాన్సన్ సారథ్యంలోని దళిత బహుజన మహాసభ, కొరివి వినయ్ కుమార్ సారథ్యంలోని దళిత బహుజన ఫ్రంట్, జె. గౌతమ్ సారథ్యంలోని బహుజన రిపబ్లికన్ పార్టీ, 50 శాతం ఓంకార్, బి.ఎస్. రెడ్డి సారథ్యంలోని మార్కిస్టు కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా మొదలైన పార్టీలు ఏకమై 'రాయితీలు మాకు! రాజ్యాధికారం మీకా? ఓట్లు మావి! సీట్లు మీకా – మావెన్ని ఓట్లో మాకన్ని సీట్లు' అనే నినాదాలతో ముందుకెళ్లినప్పటికీ స్వల్పకాలంలోనే ఈ సమితిలో విభేదాలు వచ్చి ఎవరికి వారుగా వేరుపడ్డారు.

తిరిగి 2001లో కె. కొండలరావు, గుంటూరు లక్ష్మి సరసయ్య, విన్నకోట భాస్కరరావు తదితరుల సారథ్యంలో 'బిసి మిత్రుల వేదిక' ఏర్పడి సమగ్ర బిసి ఉద్యమ అవగాహన సదస్సులు నిర్వహించింది. ఇది కూడా బిసిలకు ఎటువంటి ప్రయోజనాలను కల్పించలేకపోయింది. అనంతరం 2002 ఏప్రిల్ 14న హైదరాబాద్‌లో మహాజన పార్టీని స్థాపించారు. ఈ పార్టీ 'బిసిలు సగం – బిసిలకు సగం' అన్న నినాదంతో రాజకీయాల్లో అడుగుపెట్టింది. మరోవైపు నారగోని స్థాపించిన 'బిసి ఫ్రంట్', 'బిసి ఐక్యఫ్రంట్'గా తర్వాత కాలంలో 'బిసి ఐక్య సంఘర్షణ సమితి'గా రూపాంతరం చెందింది.

మహాజన పార్టీ 2004 ఎన్నికల్లో సోషల్ జస్టిస్ ఫ్రంట్‌గా అభ్యర్థుల్ని నిలబెట్టింది. అనంతరం 2006లో '93 బిసి కులాల ఐక్యవేదిక'ను స్థాపించిన జ్ఞానేశ్వర్ తర్వాత కాలంలో మహాజన పార్టీగా ఆవిర్భావం చెంది అంతరించింది. బిసి వెల్ఫేర్ అసోసియేషన్‌గా ఉన్న ఆర్. క్రిష్ణయ్య బిసి విద్యార్థులకు సంబంధించిన ఉపకార వేతనాలు, ఉపాధి అవకాశాలు కల్పించాలని నిరంతరం ప్రభుత్వాన్ని కోరడమైంది. కొంత వరకు బిసి కులాల వారిని, తన వర్గం కులం కాని వారిని ఏకం చేయడంలో విఫలమయ్యారు.

దీంతో ఆర్. క్రిష్ణయ్య చేస్తున్న పోరాటం ఉద్యమరూపం తీసుకోవడంలో విఫలమైంది. ప్రస్తుతం ఆర్. క్రిష్ణయ్య ఒక ప్రాంతీయ పార్టీలో చేరి అగ్రకులాల సరసన చేరిపోయారు. బిసి ఉద్యమం, పోరాటం, బిసి వెల్ఫేర్ లాంటివన్నీ కూడా ఏదో ఒక అగ్రకుల రాజకీయ పార్టీల్లోకి గా భావిస్తున్నారు. ఇటువంటి విపరీత పరిణామాల దృష్ట్యా రాజకీయాల నుండి బిసిలు కొంత కనువిప్పుతో ఉండాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

బిసిలకు రిజర్వేషన్లు కల్పించిన తర్వాత విద్యా, ఉపాధి రంగాల్లో కొంతమేరకు అభివృద్ధి చెందినప్పటికీ బిసి ఐడెంటిటీ ఉద్యమ రూపం తీసుకోకపోవడానికి అనేక కారణాలు ఉన్నాయి. అవి

1. ప్రధానంగా బిసి ఉద్యమానికి రాష్ట్రంలో నాయకత్వం లోపం ప్రస్ఫుటంగా కన్పిస్తోంది.

2. దళితులు అంబేద్కర్ సిద్ధాంతాన్ని స్వీకరించి సిద్ధాంతపరంగా అభివృద్ధి చెందితే, బిసిలు అటు పూలే ఇటు అంబేద్కర్, లోహియా, పెరియార్ సిద్ధాంతాలను అనుసరిస్తూ బిసి పోరాటలను ఉద్యమంగా, సిద్ధాంతంగా రూపొందించడంలో విఫలమవ్వడం.

3. బిసి వర్గంలో ఉన్న అనేక కులాలు ఒకే విభజన కిందికి తీసుకురావడంవల్ల వీరందరిని ఏకం చేయడంలో బిసి నాయకత్వం విఫలమవ్వడం.

4. బిసిలలో ఇప్పటికీ కొంతవరకు అభివృద్ధి చెందిన కులాలు కొన్ని ప్రత్యేక కుల సంఘాలు ఏర్పర్చుకొని ఉద్యమించడం.

5. బిసిలలో అనేక కులాలు నేటికి సంచార జీవులుగా, బిసిలలో మైనార్టీ కులాలైన బాలసంతు, బహురూపి, బందు, దొమ్మర, జంగమ, జోగి, కాటిపాపల, మొండిబండ, బొంద, పాముల, తలారి, పెరిక, వంజర, ఉప్పర, జక్కుల మొదలైన దాదాపు 85 కులాలకుపైగా పూర్తిగా వెనుకబాటుకు గురైన సంచార కులాలు ఉండటం మరొక కారణం. బిసిలలో ఉన్న అనేక కులాలకు అనేక సామాజిక సంప్రదాయాలు ఆచారాలు కట్టుబడి ఉన్నాయి. బిసిల ఉద్యమానికి వీ.వా. పార్టీలు దూరంగా ఉండి అవి కూడా అగ్రకులస్థుల రాజకీయ పార్టీల కంటే భిన్నంగా లేదనిపిస్తుంది.

6. బిసిలలో కొంతమేర అభివృద్ధి చెందిన కులాల్లోని వారికే నాయకత్వ లోపం ఉంటే మిగిలిన మైనారిటీ బిసి కులాల వారి పరిస్థితి చెప్పనవసరం లేదు. వీరికి ఆర్థిక వెనుకబాటు అధికం.

7. బిసిలను సమగ్రంగా చూస్తే జనాభాలో 50 శాతం కన్పిస్తారు. కానీ ఒక్కొక్క కులంగా చూస్తే కేవలం 10–15 కులాల జనాభా దామాషా మాత్రమే అధికం ఉంటుంది. మిగిలిన కులాలు జనాభా అత్యల్పం. దీనివల్ల కూడా బిసి ఉద్యమం బలపడడం లేదు.

8. బిసిల జాబితాలోకి ఎప్పటికప్పుడు కొత్త కులాలు చేరిక.

9. బిసి కులాలకు రాజకీయ సీట్లు రిజర్వేషన్స్ లేకపోవడంవల్ల రాష్ట్రంలోను, దేశంలోను ఉన్న అగ్రకులాల రాజకీయాల పార్టీలు బిసి కులాల వారికి ప్రాధాన్యత ఇవ్వకుండా ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా ఎదగనీయకుండా చేస్తున్నాయి.

పై కారణాలే కాకుండా అనేక ఇతర కారణాలవల్ల బిసిలు వెనుకబాటుకు గురవుతున్నారు. ఇక మీదటైనా బిసి కులాలు అన్నీ ఏకమై బిసిల జనాభా దామాషాగా అటు రాజకీయంగా, ఆర్థికంగా ఎదుగుదలకు ఉద్యమం రూపొందించాల్సిన అవసరం ఎంతైన ఉంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్ తెలుగుశాఖ, రాయలసీమ విశ్వవిద్యాలయం)*

వీ

# గ్రంథాలయాలెక్కడ?

***జ్ఞాన, విజ్ఞానాలకు కేంద్రాలైన గ్రంథాలయాలను ఏర్పాటు చేయాల్సిన బాధ్యత ప్రభుత్వాలదేననీ, సమాజ శ్రేయస్సుకు, ముఖ్యంగా యువత, నిరుద్యోగులకు ఎంతో అవసరమనీ అంటున్నారు డా. పోలం సైదులు***

గ్రంథాలయం ఒక విజ్ఞాన కేంద్రం. స్వాతంత్ర్యం పూర్వం అసఫ్ జాహీల పాలనలో వారిని, వారి పాలనను వ్యతిరేకించడానికి కారణం మన భాష తెలుగు, మన నిరక్ష్యరాస్యతే కారణం. అతి తక్కువ శాతంలో అక్షరాస్యత కల్గినవారు తెలుగును రాతపూర్వకంగా ఉపయోగించి ఎన్నో ఈసడింపులకు, వివక్షతకు గురైనట్లు చరిత్ర చెబుతుంది. ఆ తర్వాత నిజాం పాలనలో ఉన్నా చదువుకున్న వాళ్లు, సమాజ శ్రేయస్సుకు పాల్పడేవారు, ప్రజల సమస్యలను రూపుమాపుటకు ఉద్యమం చేసేవారు, ఎందరో అక్షరాస్యత లేకపోవడం అని గ్రహించి, గ్రంథాలయ ఉద్యమాన్ని లేవదీయడంలో మొదటగా అడుగు వేసింది సురవరం ప్రతాపరెడ్డి గారు. ఆ తర్వాత మన ప్రాంతంలో ప్రజలకు, కులాలకు అతీతంగా చదువునేర్పి, జరుగుతున్న విషయాలను తెలుసుకోవడానికి గ్రంథాలయ స్థాపనకు పూనుకొని ఎన్నో ఉద్యమాలు చేశారు. వాటిని పరిశీలిస్తే–

- 1901లో హైదరాబాద్‌లోని కోఠీ సమీపంలో శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం
- 1904లో హన్మకొండలో రాజనాయిని వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావు, కొమర్రాజు లక్ష్మణరావు మొదలగువారు శ్రీ రాజరాజా నరేంద్ర ఆంధ్రా భాషా నిలయం స్థాపించి ఎన్నో రకాల పుస్తకాలను తమ సొంత ఖర్చుతో సమకూర్చారు.
- 1906లో శంషాబాద్‌లో ఆంధ్ర సంవర్ధిని గ్రంథాలయం ఏర్పాటు.
- 1908లో వరంగల్‌లో శబ్దానుశాషాణాంధ్ర భాషా నిలయం ఏర్పాటు.
- 1910లో ఖమ్మంలో ఆంధ్రభాషానిలయం ఏర్పాటు.
- 1918లో నల్గొండలో ఆంధ్ర సరస్వతి గ్రంథాలయం ఏర్పాటు.
- 1918లో సూర్యాపేటలో ఆంధ్ర విజ్ఞాన ప్రకాశిని గ్రంథాలయం ఏర్పాటు.
- 1918లో మందానిలో వేమన ఆంధ్ర భాషా నిలయం ఏర్పాటు.
- 1939లో కరీంనగర్‌లో "విద్యాభివర్ధిని గ్రంథాలయం"' ఏర్పాటు.
- 1946లో పరకాలలో చెన్నకేశవ ఆంధ్ర భాషా నిలయం ఏర్పాటు.
- 1946లో అలంపురంలో సరస్వతి వచనాలయం ఏర్పాటు.

ఇలా గ్రంథాలయాలను ఏర్పాటుచేసి, వారికీ ప్రత్యేకమైన పాఠశాలలు స్థాపించి, రాత్రి వేళలో, సమయం ఉన్నప్పుడుచదువు నేర్చుకునే, పుస్తకాలను చదివే వీలు కల్పించడం జరిగింది.

భాగ్యరెడ్డివర్మ ఆది ఆంధ్ర దళిత ఉద్యమం స్థాపించి, ప్రభుత్వ పాఠశాలను స్థాపించి, అక్షరాస్యులుగా మార్చారు. పుస్తకాలు చదివి జ్ఞానం పొంది సమాజంలో జరుగుతున్న అసమానతను, అన్యాయాన్నీ తెలుసుకునేలా చేయడానికి దోహద పడింది.

మాడపాటి హనుమంతరావు, వారి అనుచరులతో ఆంధ్ర మహాసభను ఏర్పాటు చేసి నిజాంకు వ్యతిరేకంగా పోరాడటానికి, తెలుగువారికి జ్ఞానం కల్పించడానికి కేవలం గ్రంథాలయాలపై ఆధారపడటం, వాటి ప్రత్యేకతను తెలియజేస్తుంది.

ఇలాంటి గ్రంథాలయంలో మనపై జరుగుతున్న దోపిడిని వివరించే పుస్తకాలతో పాటు మన పూర్వకవులు సంస్కృతి, ప్రాకృతిక భాషలలో రచించిన పుస్తకాలను సైతం అందుబాటులో ఉంచారు. వాటిని పరిశీలిస్తే–

- ప్రతాపరుద్ర యశోభూషణం – విద్యనాథ.
- క్రీడాభిరామము – వినుకొండ వల్లభరామ.
- నిర్వచనోత్తర రామాయణం – తిక్కన.
- శివయోగసారం – కొలను గణపతిదేవ.
- సోమదేవరాజీయం – కూచిమంచి జగ్గకవి.
- సకలనీతి సమ్మతం – మడికి సింగన్న.
- ద్విపదకావ్యం ప్రతాప చరిత్ర – కాసె సర్వప్ప.

ఇలాంటి పుస్తకాలతో పాటు మరెన్నో పోరాటాల వీరుల చరిత్ర, ఉత్తేజభరితమైన కథలు ఉండే పుస్తకాలను గ్రంథాలయంలో పెట్టి, నేడు మనం అనుభవిస్తున్న స్వేచ్ఛకు కారకులయ్యారనేది వాస్తవం. ఇదియేగాకుండా 19వ శతాబ్దపు అర్ధభాగంలో విదేశాలలో చదువుతున్న మన భారతీయులు కేవలం అక్కడ ఉండే గ్రంథాలయాలను ఉపయోగించి మన దేశ స్థితిని తెలుసుకున్నారనడంలో అసత్యం లేదు. దానితో ఊరుకోకుండా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవడానికి, యావత్తు భారతదేశాన్ని ఏకం చేయడానికి, పరాయిపాలనలో పడుతున్న సమస్యలను తెలియజేయడానికి, భవిష్యత్‌కు భరోసానివ్వడానికి ఎంతగా దోహదం చేసిందో మాటల్లో చెప్పలేం.

1911లో ఆంగ్లేయుల పాలనలో మనదేశంలో గల నిరక్షరాస్యతను చూసి, కలతచెంది దాదాబాయి నౌరోజీ ఆంగ్లేయ అధికారుల వద్దకు కొంత మందితో వెళ్లి, నా దేశంలో మీరు ఎన్ని ఆచారాలకు పాల్పడిన మేము ఏమనం కానీ మీరు ఉచిత నిర్బంధ విద్యను ప్రవేశపెట్టాలని కోరారు. కానీ ఏం జరిగింది. వీరికి విద్యనేర్పితే జ్ఞానం పొంది, మన మీదికే ఎదురు తిరుగుతారని బ్రిటిషువాళ్లు ఆనాడే కొట్టిపారేశారు. ఇంకా దురదృష్టం ఏమిటంటే స్వాతంత్ర్యం పొందిన తర్వాత కూడా ఆ అదృష్టం దక్కలేదు మనకు. దాదాపు శతాబ్దం వేచి చూడాల్సిన పరిస్థితి ఏర్పడింది.

2009 నుండి కేంద్ర ప్రభుత్వం 6 నుండి 14 వయసు బాల, బాలికలకు ఉచిత నిర్బంధ విద్యను ప్రవేశపెట్టారు. దీన్ని బట్టి చూస్తే మధ్యలో ఏం జరిగిందో కారణాలేంటో ఇప్పుడు చర్చ చేసిన అనవసర

# విద్య ద్వారానే విప్లవాత్మక మార్పులు

*రాష్ట్రంలో విద్యారంగ ప్రమాణాలు పెంచి, మౌలిక వసతులు కల్పించాలనీ, ఉన్నతమైన విద్యను అందించడం ద్వారానే సమాజంలో సమగ్రమైన మార్పులను తీసుకురావచ్చనీ అంటున్నారు* **బోరెడ్డి మధుసూదన్ రెడ్డి**

సమాజంలో మనిషి ఒక భాగంగా మనుగడ సాగిస్తున్నాడు. సమాజం సమగ్రాభివృద్ధి చెందాలంటే విద్యారంగాన్ని అభివృద్ధి చేయాలి. విద్య మనిషికి వివేకాన్ని, విజ్ఞానాన్ని, విచక్షణ జ్ఞానాన్ని, విలువలను అందిస్తుంది. కాబట్టి సామాజిక మార్పు జరగడానికి విద్య ఎంతో దోహదపడుతుంది. ఈనాటి సమాజం, ప్రజాజీవనం బాగా లేదని, ప్రజల సమస్యలు పరిష్కారం కావాలంటే ఈ సమాజ మార్పు అనివార్యమని ఎందరో అంటున్నారు. మొత్తంగా మాత్రం సమాజం మారక తప్పదని అందరూ అంగీకరిస్తారు. సమాజం మారాలంటే, మార్చాలంటే ఆ మార్పు ఎలా జరగాలనే విషయంలో అభిప్రాయాలు వేరువేరుగా ఉంటాయి. సమాజం అంటే ఏమిటో సరైన నిర్వచనం చెప్పాలంటే 'మనుషులు సమిష్టిగా ప్రకృతితో కలిసి, ప్రకృతిలో పోరాటం సాగిస్తూ ఉత్పత్తి, పునరుత్పత్తి ప్రక్రియలను సాగించే మానవ సంబంధాల సమాహారం' అని మార్క్సిజం నిర్వచిస్తుంది. ఈ నిర్వచనంలో మనుషుల పాత్ర, ప్రకృతి పాత్ర ఉంది. పంచభూతాలను, ప్రకృతిని ఉపయోగించుకొని మనిషి జీవించడానికి అవసరమైన ఉత్పత్తిని పొందడం ఉంది. ఈ మనుషుల మధ్య సంబంధాలు ఏర్పడడం, ఆ సంబంధాల్లో ఘర్షణ, ఐక్యత ఉన్నాయనే అవగాహన ఉంది. మనిషి మనుగడ కోసం చేసే పోరాటంలో విద్య ఒక ముఖ్యమైన కారకం. విద్య సామాజిక మార్పుకు దోహదం చేస్తుంది. కాబట్టి ఈనాటి విద్యా రంగాన్ని అవగాహన చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

తెలంగాణలో పాఠశాలల పరిస్థితిని పరిశీలించినట్లయితే ప్రాథమిక పాఠశాలలు 21,947. ఇందులో నమోదైన విద్యార్థులు 14,31,438. ప్రాథమిక ఉన్నత పాఠశాలలు 7,311. ఇందులో చదువుతున్న విద్యార్థులు 9,39,109. తరువాత ఉన్నత పాఠశాలలు 11,803 ఉంటే ఇందులో చదువుతున్న విద్యార్థులు 36,89,461 మంది ఉన్నారు.

రాష్ట్రంలో మొత్తంగా పాఠశాలలు 41,061 ఉంటే వీటిలో చదువుతున్న విద్యార్థులు 60,6,0008 మంది ఉన్నారు. అదే విధంగా జూనియర్, డిగ్రీ కళాశాలలు 3,733 ఉంటే ఈ రెండింటిలో మొత్తం సీట్లు కలిపి 4,26,964 ఉన్నాయి. రాష్ట్ర ప్రభుత్వం ఈ ఏడాది ప్రవేశపెట్టిన బడ్జెట్‌ను పరిశీలించినట్లయితే విద్యారంగానికి కొంతవరకు నిరాశ తప్పలేదు. గత ఏడాదితో పోల్చితే అత్తెసరు పెంపుతో ప్రభుత్వం సరిపెట్టింది. కేవలం రు. 573 కోట్లే అదనంగా కేటాయించింది. 2018-19 బడ్జెట్‌లో విద్యారంగానికి రు. 13,278 కోట్లు కేటాయించింది. ఇందులో పాఠశాలల విద్యాశాఖ వాటా రు. 10,830 కోట్లు, ఉన్నత విద్యకు దక్కింది రు. 2,448 కోట్లు. దీనిలో నిర్వహణ పద్దు కింద రు. 10,710 కోట్లుగా, ప్రగతి పద్దు కింద రు. 2,567 కోట్లుగా చూపారు. నిర్వహణ పద్దు కింద ఉద్యోగుల వేతనాలు, భత్యాలు వస్తాయి. అభివృద్ధి పనుల కోసం చేసే ఖర్చంతా ప్రగతి పద్దు పరిధిలోకి వస్తుంది.

2017-18 బడ్జెట్‌లో విద్యాశాఖకు రు. 12,705 కోట్లు కేటాయించింది. ఇందులో నిర్వహణ పద్దు రు. 10,023 కోట్లు, ప్రగతి

---

విషయమవుతుంది. ఇలాంటి ప్రత్యేకత సంతరించుకున్న గ్రంథాలయాల జాడెక్కడో తెలియని పరిస్థితి నెలకొందంటే ఆశ్చర్య పోనవసరంలేదు.

నేడున్న పరిస్థితులలో శాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధించిన ప్రగతి కారణంగా, దినపత్రికలలో వార్తలను సైతం పేపర్ తీసుకోకుండా స్మార్ట్‌ఫోన్‌లో హెడ్‌లైన్స్ చూసి తిప్పేసే పరిస్థితిలో ఉన్న యువత గ్రంథాలయాలున్నా పట్టించుకునే స్థితిలో లేదనే అభిప్రాయం కొంత మందిలో ఉన్నా, చాలామంది నిరుపేద యువత, గత చరిత్ర గురించి తెలుసుకోవాలనుకునే వారికి మాత్రం అందుబాటులో అలాంటి వనరులు లేదన్నది వాస్తవం. నిరుద్యోగంతో బాధపడే నిరుపేద యువత సైతం వివిధ పుస్తకాలు, సమాచారాలను తెలుసుకునే, సౌకర్యాలను కొనలేని పరిస్థితిలో ఉంది. కావున ఆధునిక గ్రంథాలయాలను మొదలుపెట్టి అన్ని ఉద్యోగావకాశాలకు సంబంధించిన పుస్తకాలను అందుబాటులో ఉంచి, వీటితోపాటు, స్వాతంత్ర్య సమరయోధుల జీవిత చరిత్రలు, సంఘ సంస్కర్తల గురించి, నేడున్న సమాజంలో నిస్వార్థంగా సమాజ శ్రేయస్సుకు సంబంధించిన వివిధ స్వచ్ఛంధ సంస్థలను నడిపే మహనీయుల చరిత్రను, జీవితంపై భరోసానిచ్చే పుస్తకాలను, సామాజిక సమస్యలపై వచ్చే వ్యాసాలు, వాటి రచయిత అనుభవాలను తెలిపే పుస్తకాలను ప్రచురించి, యువతకు ఒక గ్రంథాలయాన్ని ఏర్పాటు చేయాలి. నవసమాజ నిర్మాణాన్నీ అందరికి తెలిసే విధంగా, వాటిపై జ్ఞానం పొంది ఆలోచించి సలహాలను, సూచనలిచ్చే విధంగా, తమ జ్ఞానంతో తమ జీవితాలను చక్క దిద్దుకునేలా నేటి యువతలో మార్పు తేవాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉన్నది. కావున వీటి అమలు కేవలం ప్రభుత్వం పైననే ఉందనడంలో ఎలాంటి అవాస్తవం లేదు. అందుకే దీన్ని గురించి ఆలోచించి సత్వరమే ఈ విషయం ఆలోచించి, నిర్ణయం తీసుకొని అమలు పరచాల్సిన అవసరం ఉన్నది. గ్రంథాలయాలను ప్రోత్సహిద్దాం-జ్ఞానాన్ని పెంచుకుందాం.

*(రచయిత తెలంగాణ సామాజిక రచయితల సంఘం నాగర్‌కర్నూల్ జిల్లా కన్వీనర్)*

వీ

పద్దు రు. 2,682 కోట్లు. గత ఏడాదితో పోల్చితే ఈసారి నిర్వహణ పద్దుకు కేటాయింపులు రు. 687 కోట్లు పెరిగాయి. ప్రగతి పద్దుకు రు. 115 కోట్లు తగ్గినాయి. నిధుల కేటాయింపులు తగ్గడంవల్ల విద్యాభివృద్ధిపై ప్రభావం చూపుతుందని నిపుణులు అంటున్నారు. ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా ప్రకటించిన పథకం కెజి టు పిజి. ఈ పథకానికి బడ్జెట్‌లో సరిపోయే నిధులు కేటాయించకపోవడం, ఎలాంటి ప్రస్తావన చేయకపోవడం వల్ల విద్యారంగానికి ఎలాంటి ప్రయోజనం లేదని మేధావులు, విద్యారంగ నిపుణులు అభిప్రాయ పడుతున్నారు.

రాష్ట్రంలోని యూనివర్సిటీలకు కూడా తాజా బడ్జెట్‌లో నిరాశ తప్పలేదు. యూనివర్సిటీలు నిధుల కోసం వెంపర్లాడవలసిన పరిస్థితి ఏర్పడింది. యూనివర్సిటీలకు రు. 695 కోట్లు కేటాయించారు. ఇందులో నిర్వహణ పద్దు రు. 485 కోట్లు, ప్రగతి పద్దు రు. 210 కోట్లు. గత ఏడాదితో పోల్చితే ఈసారి రు.148 కోట్లు తక్కువ కేటాయించారు. గత బడ్జెట్‌లో యూనివర్సిటీలకు కేటాయించింది రు. 843 కోట్లు, ఇంటర్మీడియట్ విద్యకు మాత్రం బడ్జెట్ కేటాయింపు పెరగడం ఊరట కలుగచేసే అంశం. 2018-19 బడ్జెట్‌లో ఇంటర్మీడియట్ విద్యకు రు. 716.03 కోట్లు కేటాయించారు. విద్యారంగానికి కేటాయించిన బడ్జెట్ కంటే వైద్య, ఆరోగ్య రంగానికి కేటాయించిన బడ్జెట్‌కు పెద్దపీట వేయడం జరిగింది. 2017-18లో వైద్య, ఆరోగ్య రంగానికి రు. 5,976 కోట్లు కేటాయించగా, 2018-19 బడ్జెట్‌లో రు. 7,375 కోట్లు కేటాయించారు. గత బడ్జెట్ కంటే రు. 1,399 కోట్లు అదనంగా కేటాయించారు. వైద్య, ఆరోగ్యరంగానికి కేటాయించినట్లుగానే, విద్యారంగ సమగ్ర అభివృద్ధికి తోడ్పడే విధంగా బడ్జెట్‌ను పెంచవలసిన అవసరం ఉంది. దీనికోసం ముఖ్యమంత్రి విచక్షణ అధికారాన్ని ఉపయోగించి విద్యారంగానికి 'ప్రత్యేక అభివృద్ధి నిధి' (ఎస్‌డిఎఫ్) నుండి కొంతబడ్జెట్‌ను కేటాయించి విద్యాభివృద్ధికి అండగా ఉంటారని ఆశిద్దాం.

1964లో డి.ఎస్. కొఠారీ అధ్యక్షతన ప్రభుత్వం జాతీయ విద్యా విధానాన్ని రూపొందించడానికి ఒక కమిషన్‌ను ఏర్పాటు చేసింది. కమిషన్ సమాజంలోని అన్ని వర్గాలను, విద్యారంగ నిపుణులను, ప్రజా ప్రతినిధులను, మేధావులను సంప్రదించి వారి నుండి సలహాలు, సూచనలు తీసుకొని 1966లో కొఠారీ కమిషన్ తన నివేదికను అప్పటి విద్యా శాఖా మంత్రికి సమర్పించింది. కమిషన్ తన మొదటి అధ్యాయమే 'భారతదేశం భవిష్యత్తు తరగతి గదిలో రూపుదిద్దుకుంటుంది' అనే వాక్యంతోనే మొదలవుతుంది. విద్యా విధానంలో విప్లవాత్మకమైన మార్పులు రావాలని, కుల, మత, పేద, ధనిక, భాష, ప్రాంతాల భేదాలు లేకుండా బాల, బాలికలకు అందరికీ సమాన విద్యా అవకాశాలు అందాలని, ప్రజా జీవితంలో ఒక మౌలికమైన మార్పుకు విద్యనే ఏకైక సాధనమని కమిషన్ తన నివేదికలో స్పష్టం చేసింది.

2011 గణాంకాల ప్రకారం మనదేశంలో ఉన్న 121 కోట్ల జనాభాకు 44 కోట్ల 70 లక్షల మంది నిరక్షరాసులుగా ఉన్నారు. 20 కోట్ల ఎస్‌సి జనాభాకు 8 కోట్ల 76 లక్షల మంది, 10 కోట్ల ఎస్‌టి జనాభాకు 5 కోట్ల 27 లక్షల మంది నిరక్షరాస్యులుగా ఉన్నారు. సమాజంలోని అసమానతలను రూపుమాపాలంటే విద్యారంగానికి ప్రభుత్వం నిధుల కేటాయింపు చాలా అవసరం. విద్యను మారుమూల ప్రాంతాల ప్రజలకు అందుబాటులోకి తేవడానికి, నాణ్యమైన విద్యను అందించడానికి ఆర్థిక వనరులు చాలా అవసరం. కొఠారీ కమిషన్ కూడా విద్యకు జాతీయ ఆదాయంలో తగిన నిధులు కేటాయించాలని తన నివేదికలో స్పష్టం చేసి దిశానిర్దేశం చేసింది.

అందరికి విద్యను అందించాలనే స్ఫూర్తితో 2009లో విద్యా హక్కు చట్టం ద్వారా విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించారు. 6-14 ఏళ్ల బాల బాలికలకు ఉచిత, నిర్బంధ విద్య అందించాలని, ప్రైవేట్ విద్యా రంగాన్ని నియంత్రించాలని, శిక్షణ పొందిన ఉపాధ్యాయులు మాత్రమే బోధించాలని తదితర ఉన్నత ఆశయాలతో ఈ చట్టాన్ని రూపొందించారు. ఇప్పటికీ ఆశయాన్ని సాధించడానికి, గమ్యాన్ని చేరుకోవడానికి కాలంతో పాటు పరుగెడుతూనే ఉన్నాం.

అనేక ఆశలతో, ఆశయాలతో పాఠశాలలకు తమ పిల్లలను పంపిన తల్లిదండ్రులు పాఠశాలల్లో మౌలిక సదుపాయాలు, కనీస వసతులు అయినటువంటి మూత్రశాలలు, తరగతి గదులు, మంచినీటి సౌకర్యం సరిగ్గా లేకపోవడం, వీటితో పాటు ఉపాధ్యాయుల కొరత, ఉన్న ఉపాధ్యాయులు శ్రద్ధతో పాఠాలు చెప్పలేకపోవడం, చెప్పినా అవి పిల్లలకు అర్థం అయినవా లేదా అనేది మూల్యాంకనం చేయడంలేదు. అందువల్ల బడికి పంపినా తమ పిల్లలకు చదువు రావడం లేదనే భావంతో పిల్లలు బడి నుండి దూరం అవుతున్నారని గమనించాలి. గత రెండు దశాబ్దాలుగా దేశంలో విద్యారంగంలో ప్రైవేటీకరణ క్రమంగా పెరుగుతూ వచ్చింది.

గత కొంతకాలంగా ప్రభుత్వాలు గ్రామాలలో పాఠశాలలు ఏర్పాటు చేసి విద్యార్థులకు విద్యను అందుబాటులోకి తెచ్చినప్పటికీ రోజు రోజుకు పాఠశాలలో విద్యార్థుల సంఖ్య తగ్గిపోవడం మనం చూస్తూనే ఉన్నాం. అంతే కాకుండా గ్రామాలలో ఉన్న విద్యార్థులు ఆటోలలో, బస్సులలో చదువు కోసం నగరాలలో, పట్టణాలలో ఉన్న పాఠశాలలకు వెళుతుంటే, మన ప్రభుత్వ ఉపాధ్యాయులు నగరాల నుండి, పట్టణాల నుండి గ్రామాలలో ఉన్న బడులకు బండ్ల మీద, బస్సులలో, కార్లలో వెళ్లడం ప్రతిరోజు చూస్తూనే ఉన్నాం. మన రాష్ట్రంలోని పాఠశాలల్లో 100 మంది కన్న తక్కువ పిల్లలున్న పాఠశాలలు అధిక సంఖ్యలోనే ఉన్నాయి. ఈ విధంగా అవసరం ఉన్న పాఠశాలల్లో టీచర్లు లేకపోవడం, అవసరం లేని పాఠశాలల్లో ఉపాధ్యాయులు ఎక్కువ ఉండడం కూడా మనం చూస్తున్నాం.

కొన్ని పాఠశాలల్లో శిక్షణ పొందని ఉపాధ్యాయులను (వాలంటీర్లు) నియమించడం, టీచర్ల బోధన, వారి హాజరును పర్యవేక్షించడానికి అధికారులు లేకపోవడం, ఉపాధ్యాయ సర్వీస్‌రూల్స్ సమస్య పరిష్కరించడంలో కాలయాపన, ఖాళీలను భర్తీ చేయకపోవడం తదితర లోపాలవల్ల విద్యార్థులకు నాణ్యమైన విద్య అందడం లేదు. ఉపాధ్యాయుల బదిలీలు, పదోన్నతులు, ఖాళీల భర్తీ ప్రక్రియను వేసవి సెలవులలో నిర్వహించకుండా ప్రభుత్వం ఒక నిర్దిష్టమైన ప్రణాళికను రూపొందించకపోవడం వల్ల విద్యాబోధనకు ఆటంకం ఏర్పడి పాఠశాలలు మూతపడే ప్రమాదం ఉంది. రాష్ట్రంలో సుమారు 1800 ప్రభుత్వ పాఠశాలలు ఉపాధ్యాయులులేక మూతపడ్డాయని ఎంవి ఫౌండెషన్ సంస్థ తన వ్యాజ్యంలో హైకోర్టుకు తెలిపింది. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వం విద్యారంగ సమస్యలను సాలోతనతో పరిశీలించి పరిష్కరించ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# తెలుగు ముఖ్యమంత్రుల సామాజిక ద్రోహం

*రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు కుల రాజకీయాలు, కుటుంబ పాలన సాగిస్తున్నారనీ, వీరిని అన్ని అణగారిన వర్గాలు ఐక్యంగా అడ్డుకోవాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* **డా. కత్తి పద్మారావు**

తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఇద్దరు కుల, కుటుంబ, పుత్రవ్యామోహం ఊబిలో మునిగిపోయి ఉన్నారు. చంద్రబాబు కులతత్వం గురించి ప్రపంచ కీర్తినార్జించారు. తన కులం కోసమే బతికే అంకితభావం ఆయనది. వేరే కులం మంత్రులను కన్నెత్తి చూడని అసహనం ఆయనది. ఆయన పుత్రవ్యామోహం సొంతపార్టీ వారికే వెగటు కలిగించేంతగా విజృంభించింది. పుత్రవ్యామోహం అధికార పతనానికి దారితీస్తుందని ఆయన తెలుసుకోలేక పోతున్నారు.

ఇక కె.సి.ఆర్.కు వస్తే ఆయన కుమారుడు కె.తారక రామారావు ఏకంగా ఐటి, మున్సిపల్ అడ్మినిస్ట్రేషన్, అర్బన్ డెవలప్‌మెంట్, ఇండస్ట్రీస్ అండ్ కామర్స్, పబ్లిక్ ఎంటర్‌ప్రైజెస్, షుగర్, మైన్స్ అండ్ జియాజిలో, ఎన్.ఆర్.ఐ. శాఖలు నిర్వహిస్తున్నారు. స్వయానా మేనల్లుడు టి.హరీష్‌రావు నీటిపారుదల శాఖ, మార్కెటింగ్ లెజిస్లేటీవ్ శాఖలు నిర్వహిస్తున్నాడు. తన కుమార్తె కవిత పార్లమెంట్ ఎం.పి.గా ఎక్కడెక్కడ భూములు ఉన్నాయో చూసి తన సొంతం చేసుకుంటున్నారు.

కె.సి.ఆర్. ముఖ్యమంత్రిగా మైనారిటీ వెల్‌ఫేర్, కోల్‌ను, పరిపాలనా విభాగం, కమర్షియల్ ట్యాక్స్, రూరల్ వాటర్ సప్లైని నిర్వహిస్తున్నారు. అనేకమైన కీలకమైన పదవులు తన దగ్గర పెట్టుకొని బడ్జెట్ మీద పెత్తనం చేస్తూ రాష్ట్ర బడ్జెట్‌ను తన కుటుంబ ఆస్తిగా మార్చుకుంటూ, పార్టీ ఫండ్‌గా కన్వర్ట్ చేస్తూ, తన సొంత కులంవాడైన జూపల్లి కృష్ణారావుకు పంచాయితీ రాజ్ శాఖ పదవి ఇచ్చి మొత్తం పరిపాలనను కుల కుటుంబ ఆధిపత్య రాజకీయాలుగా నడుపుతున్నాడు.

ఇక చంద్రబాబు అయితే ఆయన కులోన్మాదం తారాస్థాయికి వెళ్లి అమెరికాలో తన కులం వారిని తాను కలవడానికి వెళ్లితే, చైనాలో తన కులం వారిని కలవడానికి కొడుకు వెళ్లాడు. ఎటూ రేపు ఎన్నికల్లో ఓడిపోతామని తెలిసి ప్రపంచవ్యాప్తంగా తన కులం వారు ఎక్కడెక్కడ ఉన్నారో డేటాలు తీసి వారందరిని కలుస్తూ పార్టీ ఫండ్ పేరుతో వందల కోట్లు వసూలు చేసుకొంటూ, అవినీతి రాజకీయాలను సార్వత్రికం చేయాలనే పెద్ద ప్రయత్నంలో ఉన్నారు తండ్రి కొడుకులు.

ఇక తన సొంత కులం వాడైన కోడెల శివప్రసాద్‌కు స్పీకర్ పదవి ఇచ్చి కుల పంచాయితీని నిర్వహించి ప్రతిపక్షాల్ని, విపక్షాల్ని అసెంబ్లీకి రాకుండా చేసి, భూస్వామ్య వ్యవస్థలో ఉన్న కులాధిపత్యంతో స్పీకర్ తమ పార్టీలోకి ఇతర పార్టీల నుండి వచ్చి చేరిన 26 మంది రాజీనామా చేయకుండా మంత్రి పదవులను కొనసాగింప చేశాడు చంద్రబాబు. తన కొడుకు తనతో పాటు జలవనరుల శాఖా మంత్రి ఉమామహేశ్వర రావును పెట్టుకొని తీవ్రమైన అవినీతిని కొనసాగిస్తున్నాడు.

కాగ్ నివేదికలో అవినీతి బయటపడినా బోకరిస్తూ ముందుకు వెళ్తున్నవాడు చంద్రబాబు. కాగ్ నివేదికలో చంద్రబాబు అవినీతిని వివరాలు – పోలవరం పనుల వేగం పెంచేందుకు రాయితీలన్నీ ఇచ్చామని ప్రభుత్వం చెబుతున్నా జలవనరుల శాఖ నిర్దేశించిన మైలురాళ్ల ప్రకారం 76 శాతం పని పూర్తి కావాల్సి ఉండగా 2017 జూన్ వరకు కేవలం 31 శాతం మాత్రమే పని చేశారు.

పోలవరం కుడి కాలువ పనుల్లో 1,2,4,5,6,7 ప్యాకేజీల్లో ప్రజోపయోగ నిర్మాణాలు తరలించే పేరుతో గుత్తేదారుల తరపున రు.38.12 కోట్లు ప్రభుత్వమే చెల్లించింది. వివిధ రూపాల్లో గుత్తేదారుకి రు.1853 కోట్ల మేర అనుచిత లబ్ధి చేకూరింది. పోలవరం ప్రాజెక్టును కేంద్రం జాతీయ ప్రాజెక్టుగా ప్రకటించి మూడేళ్లయినా ఇప్పటికీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య అవగాహన ఒప్పందం కుదరలేదు.

2017 మార్చి వరకు ఉన్న లెక్కల ప్రకారం పోలవరంపై రాష్ట్రం ఖర్చు చేసిన మొత్తంలో కేంద్రం ఇందుకే రు.3,249 కోట్లు తిరిగి చెల్లించలేదు. భూసేకరణ, పునరావాసాలకు సంబంధించి రాష్ట్రం ఖర్చు చేసిన రు.1,407.64 కోట్ల ఖర్చు వివరాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పోలవరం ప్రాజెక్టు అథారిటీకి (పీపీఏ) సమర్పించలేదు. అవినీతి చేయడానికి చంద్రబాబు భయపడరు. ఎన్నోసార్లు కాగ్ నివేదికల్లో అవినీతిపరుడని నిగ్గు తేలింది.

చంద్రబాబు వ్యవసాయానికి వ్యతిరేకి. రెండు కోట్ల ఎకరాలను ఎండబెట్టిన ఘనుడాయన. ఈ నాలుగేళ్లలో రైతులు, రైతు కూలీలు, ఎందరో ఆత్మహత్యలు చేసుకున్నారు.

ఇకపోతే ఒకప్పుడు ప్రభుత్వ, ఎయిడెడ్, జూనియర్ కళాశాలల్లో సీట్ల కోసం వరసకట్టే పరిస్థితి ఉండేది. నేడు వీటిల్లో చదువుతున్న విద్యార్థుల సంఖ్య క్రమంగా తగ్గిపోతుంది. ఇక్కడ చదువుతున్న వారిలోనూ ఎక్కువ మంది ఎస్సీ, ఓబీసీ వారే ఉంటున్నారు. ప్రైవేటు,కార్పొరేట్ కళాశాలతో పోటీ పడలేక పోవడం మౌలిక సదుపాయాలు, అధ్యాపకుల కొరత కారణంగా ఇవి ఉనికి కోల్పోతున్నాయి. ప్రభుత్వ ఎయిడెడ్‌లో జూనియర్ కళాశాలలో చదువుతున్న వారిలో 26.11 శాతం ఎస్‌సిలు, 54.26 శాతం ఒబిసిలు ఉండగా, ఒసిలు 11.88 శాతంమే ఉన్నారు. ప్రభుత్వ ఎయిడెడ్ జూనియర్ కళాశాలల్లో చదువుతున్న వారిలో ఒబిసిల తర్వాత ఎస్‌సిలే అధికంగా ఉంటున్నారు. అధికారిక గణాంకాల ప్రకారం 2015లో 1,71,683 మంది విద్యార్థులు ఉండగా 2018 వచ్చే సరికి 10,591 ప్రవేశాలు తగ్గాయి. మొత్తం విద్యార్థుల్లో 2015లో ఓసీలు 13.4 శాతం ఉండగా ఎస్సీలు 25.74 శాతం ఓబీసీలు 53.55 శాతంగా ఉన్నారు. 2017లో ఓసీల సంఖ్య 12.58 శాతం నికి తగ్గగా ఎస్సీలు 26.17 శాతం ఓబీసీలు 53.62 శాతంనికి పెరిగింది. 2016లో మొదటి

ఏడాది 89,208 మంది ప్రవేశాలు పొందితే 2017లో వీరి సంఖ్య 75,082కు తగ్గిపోయింది. 14,126 మంది మధ్యలోనే చదువుకు స్వస్తిచెప్పారు. ఇది 16 శాతంగా నమోదైంది. చంద్రబాబుకు దళితులు బహుజనుల విద్యపై తీవ్రమైన వ్యతిరేకత ఉంది. అందుకే ఆయన జూనియర్ కాలేజీలను హాస్టళ్లను రద్దుచేశాడు. ఆయన తన మనుషులతో అందరూ చదువుకొంటే, కూలి పనులు ఎవరు చేస్తారని మాట్లాడుతూ ఉంటారు.

వ్యవసాయాన్ని, విద్యను సర్వనాశనం చేయడానికి కంకణ బద్ధుడు కావడానికి కారణం తన వర్గంవారు కార్పొరేట్ ప్రపంచంలోకి అడుగు పెట్టడమే. ఆ కార్పొరేట్ వ్యవస్థలకు దళితుల భూమి గుంజి ఇచ్చి, దళితుల పిల్లల విద్యను నాశనం చేసి, రాజకీయ అధికారాన్ని తమ గుప్పెట్లో పెట్టుకొని కుల, కుటుంబ పుత్రవ్యామోహాన్ని బహిర్గతంగా అనుసరిస్తున్న దుర్వ్యాపకునిగా పాలన చేస్తున్నాడు చంద్రబాబు.

ఇక కె. చంద్రశేఖర్ రావు దళితుణ్ణి ముఖ్యమంత్రి చేస్తానని ఎన్నికలయ్యే వరకు వాగ్దానాలు చేశాడు. ఎన్నికలు అయ్యాక తానే ముఖ్యమంత్రిగా పీఠమెక్కాడు. కుటుంబపాలన ప్రారంభించాడు. ఎవ్వరూ నోరెత్తకుండా ధర్నాచౌక్ ఎత్తివేశాడు. యజ్ఞాలు, యాగాలు చేశాడు. హిందూ మతవాదిగా ముందుకు వచ్చాడు. వెలమ సామ్రాజ్యాన్ని తిప్పి కట్టాడు. రాష్ట్రంలో తాగుడు, జూదం పెంచాడు. నగరాన్ని మురికికూపం చేశాడు. ఎన్నికల మ్యానిఫెస్టోలో మూడు ఎకరాల పొలం దళితులకు ఇస్తానని ఇవ్వకుండా మొండి చెయ్యి చూపించాడు.

బి.సి.లకు సీట్లు ఇస్తానని అగ్రకులాలను నెత్తిన ఎత్తుకున్నాడు. నడిరోడ్లో స్త్రీలను అవమానిస్తున్నా చర్యలు తీసుకోలేదు. హైద్రాబాదు నిండా మందు షాపులు, పబ్బులు, క్లబ్బులు, కాలుష్యంతో మహానగరాన్ని కల్మష పూరితం చేశాడు. నాలుగు బొట్లు చినుకులు పడితే నాలుగు నదులు పొంగినట్లు అవుతుంది హైద్రాబాదు. అటు గ్రామాన్ని శిథిలం చేస్తున్నాడు, ఇటు పట్టణాన్ని శిథిలం చేస్తున్నాడు.

ఇక కె.సి.ఆర్. అబద్ధాలకు పెట్టని కోట. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు అయ్యే సమయంలో తన పార్టీని కాంగ్రెస్‌లో కలుపుతానని సోనియా గాంధీకి హామీ ఇచ్చాడు. ఇప్పుడేమో మోడీతో చెయ్యి కలిపి ముందస్తు ఎన్నికలకు దూకాడు. మోడీ హిందూ మత చర్యను సమర్థించాడు. జి.ఎస్.టి.ని, నోట్ల రద్దును సమర్థించాడు. కె.సి.ఆర్. మాటలో నిలకడ లేదని ప్రతి ఒక్కరికీ తెలుసు. ఆయన విందు చిందుల మనస్తత్వం కూడా అందరికీ తెలుసు. ఆయన సాంకేతిక, వైజ్ఞానిక, సాంస్కృతిక వ్యవస్థలకు వ్యతిరేకి.

ఆదిలాబాద్ జిల్లాలోని గడిగూడ, నార్నూర్ మండలాలలోని పిప్రీ, కుండీ, సుంగపూర్ గ్రామాలలో నీటి సమస్యతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఆదిమ గోండులు, కోలం, అంధులు ఈ గ్రామాల్లో నివశిస్తున్నారు. శతాబ్దాల చరిత్ర కలిగిన ఈ గిరిజన జాతుల జీవితాల్లో ఎటువంటి మార్పు లేదు. బంగారు తెలంగాణ అంటూ ఊదరగొట్టిన తెరాస ప్రభుత్వం కూడా తెలంగాణాలోని గిరిజన జాతులకు చేసిందేమీ లేదని సామాజిక శాస్త్రవేత్తలు చెబుతున్నారు. నల్గొండ జిల్లాలోని ఫ్లోరైడ్ ప్రభావిత ప్రాంతాల ప్రజల విషాదం అంతా ఇంతా కాదు. దశాబ్దాలుగా ఈ ప్రాంత ప్రజలు ఫ్లోరైడ్ బాధిత పీడితులే. కృష్ణానది ఈ జిల్లా గుండా పారుతున్నా ఈ ప్రాంత ప్రజలకు కృష్ణా నది నీరు అందడం లేదు. దశాబ్దాలుగా ఫ్లోరైడ్ బారిన పడుతున్న ప్రజలు అంగవైకల్యంతో బాధపడుతున్నారు. చిన్న వయస్సులోనే ముసలివారై పోతున్నారు.

ఎన్నికల ముందు ఈ సమస్యలు తీరుస్తానని కె.సి.ఆర్. చెప్పారు. ఆ తరువాత అటువైపు చూడలేదు. కె.సి.ఆర్.గారు కోస్తాకి సంబంధించిన ఏ సామాజిక ఆర్థిక దోపిడీ శక్తులు తెలంగాణాను దోచుకొంటున్నాయని తెలంగాణా పోరాటంలో చెప్పారో ఆ సామాజిక ఆర్థిక శక్తులతోనే తెలంగాణా వచ్చాక చేయిగలిపారు. భూస్వామ్య పెట్టుబడిదారీ అగ్రకుల సమ్మేళనం ఆయనకు ఇష్టం. చంద్రబాబు కుమారుడు లోకేష్, కె.సి.ఆర్. కుమారుడు కె.టి.ఆర్‌లు ఐ.టి. శాఖలు నిర్వహిస్తున్నారు. ఇద్దరూ వ్యాపారాభిలాషులే.

రెండు తెలుగు రాష్ట్రాలు తాగుడుతో మునిగితేలుతూ, దోమలతో జ్వరాలతో కొట్టుమిట్టాడుతున్నాయి. కాంగ్రెస్ చంద్రబాబుతో చేయి కలపడంతో దాని అవకాశ వాదం మరొకసారి బట్టబయలు అయ్యింది. నిజానికి కె.సి.ఆర్. ఓటమి తథ్యం. ఈ సమయంలో తెలంగాణ పోరాట శక్తులకే ప్రభుత్వం రావడం అవసరం. మోడీకి వ్యతిరేకంగా నిలబడిన రాహుల్ గాంధీ బి.సి.లకు రావలసిన సీట్లను అగ్రకులాలకే ఎందుకు ఇస్తున్నారో చెప్పాల్సి ఉంది. రెండు రాష్ట్రాల్లోను బి.సి.లకు, యస్.సి.లకు రావాల్సిన రాజ్యాధికారాన్ని, కుల, పుత్ర, కుటుంబ అనువంశికం చేస్తున్నారు.

తెలంగాణలో సీట్లు 119లో బి.సి.లకు 19 సీట్లే కేటాయించడం సామాజిక రాజకీయ ద్రోహం. చంద్రబాబు కూడా అంతే శాతం ఇస్తారు. కాంగ్రెస్ మొదటి నుండి ఆయా రాష్ట్రాల్లో కులాధిపత్య శక్తులకే అధికారం ఇస్తూ వచ్చింది. దళిత బహుజన మైనార్టీలను నిర్లక్ష్యం చేసింది. ఈ దశలో సామాజిక, సామ్యవాద, లౌకిక రాజకీయ శక్తులు రెండు రాష్ట్రాల్లోను రాజకీయ ఐక్యశక్తిగా రూపొందాల్సిన అవసరం వుంది.

చంద్రబాబును, కె.సి.ఆర్‌ను ప్రభుత్వం నుండి దించడం ఒక ప్రజాస్వామ్య కర్తవ్యం. ప్రత్యామ్నాయ విధానాలతో బి.సి.లకు, దళితులకు, మైనార్టీలకు సమతుల్య ప్రాధాన్యతతో కూడిన రాజ్యాధికారం రావాల్సి ఉంది. అప్పుడే భూస్వామ్య, పెట్టుబడిదారీ అనువంశిక ప్రభుత్వాల పతనం. అప్పుడే పూలే, అంబేద్కర్ భావాలతో కూడిన ప్రత్యామ్నాయ ప్రభుత్వ నిర్మాణం జరుగుతుంది. సంపద అందరికీ పంపిణీ అవుతుంది. నియంతలను పతనం చేయడమే చరిత్ర లక్ష్యం. పునరుజ్జీవన సంస్కృతికి పతాకలెత్తడమే రాబోయే చరిత్రకు గమ్యం..

*(రచయిత సామాజిక తత్వవేత్త,*
*వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)* వీ

*మానవ ఆలోచన భౌతిక సత్యాన్ని గ్రహించగలదా అనేది సైద్ధాంతిక ప్రశ్న కాదు. అది ఆచరణలో తేలే ప్రశ్న. సత్యాన్ని, అంటే, తన ఆలోచనకు సంబంధించిన వాస్తవికతనూ, శక్తినీ, తాను చూసే పార్శ్వాన్నీ మనిషి ఆచరణలోనే రుజువు చేయవలసి ఉంటుంది. ఆలోచన వాస్తవికమైనదా, అవాస్తవికమైనదా అనే వివాదాన్ని ఆచరణ నుంచి వేరు చేస్తే అది కేవలం పండిత చర్చే అవుతుంది.*

**– కార్ల్ మార్క్స్**

# లేబర్ అడ్డాలో మా అనుభవాలు

*గ్రామాల నుండి నగరాల్లో అడ్డాకూలీలుగా మారిన అట్టడుగు ప్రజల జీవితాల్లోని విభిన్న కోణాలను, వారి అనుభవాలను వారి మాటల్లోనే మనకు అందిస్తున్నారు* **బి. కావేరి, పి.శశికుమార్, ఎం. నాగరాజు**

తరగతి గదిలో జరిగిన చర్చ మమ్మల్ని హన్మకొండ పబ్లిక్ గార్డెన్ లేబర్ అడ్డా వైపు నడిపించింది. ఒక విధంగా చెప్పాలంటే మాకు ఇది ఒక కొత్త అనుభవమే. సామాజిక శాస్త్రాలు చదువుతున్నామనే కానీ సమాజంతోని పెద్దగా సంబంధం లేకుండానే మా చదువులు సాగుతున్నాయి. పరీక్షల కోణంలో చదవడం, మంచి మార్కులు సంపాదించుకోవడం ఇదే విద్యార్థి జీవితంగా స్థిరపడిన కాలంలో లేబర్ అడ్డా కూలీల జీవితాలు మాకు సమాజ జీవితాన్ని అర్థం చేయించాయి. భూమి ఉండీ కూడా నీళ్లు లేక పంటలు పండక బతుకు కోసం లేబర్ అడ్డామీదికి వచ్చింది కొందరయితే పేదరికం వల్ల ఇంట్లో గొడవలు పడలేక లేబర్ అడ్డామీదికి వచ్చింది మరికొందరు. ఆంధ్ర వలస పాలకుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా పోరాడి తెచ్చుకున్న తెలంగాణలో బతకలేక లేబర్ అడ్డా మీద నిలబడ్డ ఆంధ్ర కూలీ కనిపించాడు. పాలకులు ఎవరైనా కూలీల జీవితాలలో మార్పులేదని అవగతమయింది. ఉన్నత చదువులు చదివి కూడా బతుకుతెరువు కోసం లేబర్ అడ్డా మీద నిలబడ్డ విద్యావంతులను చూస్తే ఈ దేశ విద్యావిధానం ఎంత పనికి మాలినదో అర్థమైంది.

లేబర్ అడ్డా మీదకు వెళ్లిన మరుక్షణమే ఏం పని ఉందని దాదాపు 50మంది మమ్మల్ని చుట్టుముట్టారు. ఏం పనిలేదని, మీతో మాట్లాడ డానికి వచ్చామని, మీ జీవితాలు ఎలా ఉన్నాయో తెలుసు కుందామని వచ్చామని, మేం విద్యార్థులమని, కాకతీయ ప్రభుత్వ కళాశాలలో చదువుకుంటున్నామని చెప్పగానే వారు నిరుత్సాహపడి వెళ్లిపోవడం చాలా బాధ కలిగించింది. మీతో మాట్లాడితే ఏం వస్తుందని కొందరు, పనిలేక వచ్చారని కొందరు, ఎవరికి తోచిన రీతిగా వారు మాట్లాడారు. కొందరు పేర్లు చెప్పడానికి ఇష్టపడలేదు. కొందరు ఊరి పేర్లు చెప్పడానికి ఇష్టపడలేదు. అయితేనేం హన్మకొండ లేబర్ అడ్డా మాకు బోలేడు అనుభవాలు మిగిల్చింది. తరగతిగదికి వాస్తవిక జీవితానికి మధ్య ఎంత వ్యత్యాసం ఉందో గమనించాం. మేము సమగ్ర విశ్లేషణ చేయకపోవచ్చు కాని తరగతి గదికి వాస్తవిక సామాజిక జీవితానికి సంబంధం లేదని మా చిన్న పరిశీలనలో అర్థమైంది. మేము నిర్దిష్టమైన ప్రశ్నావళితో వెళ్లలేదు. అప్పటికప్పుడు వేసిన ప్రశ్నలే, వాటి ద్వారానే వచ్చిన సమాచారం ఇది. మరొకసారి నిర్థిష్టంగా వెళ్లితే సామాజిక జీవితాల్లోని విభిన్న కోణాలు అనుభవం లోకి రావొచ్చనుకున్నాం. లేబర్ అడ్డా కూలీల అనుభవాలు వారి మాటల్లోనే

నా పేరు రాములు. మాది పాలకుర్తి. అక్కడ పని లేదు. అందుకే పని కోసం ఇక్కడికి వచ్చిన. పార పని చేస్త. మాలు అందివ్వడం చేస్త. కూలీ దొరికిననాడు రోజుకు 400 నుండి 600 రూపాయల వరకు వస్తయి. నాకు ఇద్దరు కొడుకులు. అందరం కూలీ పని చేసుకుంటూ బతుకుతం. ఇరవై గుంటల భూమి ఉంది. నీళ్లు లేక పండటం లేదు.

మాది మాచిన పల్లి, జమ్మికుంట మండలం. నేను మాలు పనికి పోత. కూలీ దొరికిన నాడు 400 నుండి 500 రూపాయల వరకు గిట్టుతుంది. మా ఆయన హాస్పిటల్‌లో వాచ్‌మన్‌గా చేస్తడు. నెలకు 4500 ఇస్తరు. వాళ్లిచ్చిన రూంలోనే ఉంటాం. మేము మాదిగోళ్లం. ఇద్దరు కొడుకులు. మా కోడలు గొడవ పెడుతుంది అందుకని ఇక్కడికి వచ్చినం. (పేరు చెప్పడానికి ఇష్టపడలేదు)

మాది భూపాలపల్లి. మాదిగలం. మూడు ఎకరాలు ఉంది. కెసిఆర్, మాకు భూమి ఇవ్వలేదు. ఉన్నోళ్లకు ఇచ్చిండు. మా వాళ్లకు, లేని వాళ్లకు రావాలని గొడవ కూడా చేసాను. అయితే ఏమయితది? ఏం కాలే. పొలాన్ని మా తల్లిదండ్రులు, నా భార్య చూసుకుంటరు. రైతు బంధు పథకం కింద పైసలు అచ్చినయి. మేం ముగ్గురం అన్నదమ్ములం. మా తల్లిదండ్రులను చూసుకుంటం. రోజుకు 400 నుండి 600 రూపాయలు దొరుకుతయి. కూలీ కోసం భూపాలపల్లి నుండి రోజూ బస్సుకు వచ్చి బస్సుకు పోత. కూలీలో ఖర్చులు పోనూ 300 మిగులుతయి. అది కూడా పని దొరికిన్నాడే. లేకపోతే కిరాయిలు నష్టం. పండుగ గిట్లా వస్తే అవి కూడా మిగలవు. పిల్లలకు ఏమన్నా తీసుకెల్లితే కూడా మిగలవు. ఏదైనా జబ్బు చేస్తే అప్పు చేయాల్సిందే. నెలకు మూడు వేలు చిట్టీ వేస్తా. దానికి డబ్బులు కావాలి. కడుపు చంపుకొని పోగు చేస్తే చిట్టికి సరిపోతయి. నాకు ఓ కొడుకు, ఓ బిడ్డ. చదువుకుంటున్నరు.

నా పేరు వెంకట్రాజం. మాది ఆంధ్ర. అక్కడ ఐదు ఎకరాలు ఉంది. గత మూడు సంవత్సరాల నుండి పండడం లేదు. 1982లో వచ్చాను. ఇక్కడ కిరాయికి ఉంటాను. ఖర్చులకు ఎల్తలేదు. అందుకని వచ్చిన. నా కొడుకు నిజామాబాదులో ఉంటాడు. కూలీ పని చేసుకుంటాడు. మా పండుగలకు ఆంధ్రాకు వెళ్తాం. ఒక రోజు ఉంటే ఒక రోజు ఉండది. పని ఉన్నరోజు ఉంటే తిన్నట్టు. లేదంటే లేదు.

మాది హుజురాబాద్. మేం లంబడోళ్లం. మా ఆయన లేడు, చనిపోయి ఎనమిది సంవత్సరాలు అయ్యింది. అటోడ్రైవర్. అక్సిడెంటల్ లో చనిపోయాడు. ఒక అమ్మాయి డిగ్రీ చదువుతుంది పింగిలి కాలేజీలో. ఒక అబ్బాయి పదవ తరగతి. ఒక ఎకురం భూమి ఉంది. నాకు చేయడం రాదు. మా అత్తమామ చేస్తరు. ఊరిలో పని దొరకక ఇక్కడికి వచ్చిన. కూలీ ఖర్చులకు సరిపోవడం లేదు. దొరికిన రోజు దొరుకుతది. లేని రోజు లేదు. (పేరు చెప్పడానికి ఇష్టపడలేదు)

నా పేరు కుమార్. మాది ఇక్కడే వరంగల్. కిరాయికి ఉంటున్నం. గుత్తపని, మాలు కలిపిత్త, ఇసుక, కంకర, ఇటుకలను పై అంతస్థులకు మోస్తా. ఇక్కడికి పనికోసం చాలా మంది వస్తరు. అందరికి దొరకదు. పని దొరకనోళ్లు 12 గంటల దాక చూస్తరు. పని దొరుకు తుందేమోనన్న ఆశతో ఇక్కడ ఎండలో నిల్చుంటాం. దాహం వేస్తే నీళ్లు కూడా లేవు. కిరాణా షాపులో కొనుక్కుని తాగుతం. ఐదు రూపాయలకు లీటర్ నీళ్లు. తొమ్మిదవ తరగతి వరకు చదువుకున్న. ఏడవ తరగతిలో ఉన్నప్పుడే

# ప్రమాదకరమీ పెట్టుబడిదారీ భాష!

***సాధారణ భాషగా మారిపోయిన పెట్టుబడిదారీ పదజాలాన్ని నిర్విచక్షణగా వాడితే అది ఏ ప్రమాదకర అవగాహనలకు దారితీస్తుందో వివరించిన పుస్తకాన్ని పరిచయం చేస్తున్నారు రెబెక్కా స్టోనర్***

**థాం**క్స్ గివింగ్ డే (నవంబర్ నాలుగో గురువారం రోజున అమెరికన్లు జరుపుకునే సాంప్రదాయిక ఉత్సవం) గడిచిన కొద్దిరోజులకే జనరల్ మోటర్స్ ఆరువేల మంది కార్మికులను పని నుంచి తొలగించిందనే వార్త వినగానే 'కీ వర్డ్స్ : ది న్యూ లాంగ్వేజ్ ఆఫ్ కాపిటలిజం' అనే తాజా పుస్తక రచయిత పాట్రిక్ లెరీ ఒక సందేశం ట్వీట్ చేశారు. "మేం ఇవాళ తీసుకున్న చర్యలు మా సంస్థను మరింత చురుకుగా, మరింత హుషారుగా, మరింత లాభదాయకంగా తయారు చేయడానికి, భవిష్యత్తు కోసం మదుపు చేయడంలో మరింత సౌలభ్యం కలిగించడానికీ ఉద్దేశించినవి" అని జనరల్ మోటర్స్ సిఇవో మేరీ బర్రా చేసిన ప్రకటనలోని భాగాన్ని ఉటంకిస్తూ, తన వ్యాఖ్యగా లెరీ మరొక వాక్యం కలిపారు. "ఈ సందర్భంలో భాష అనేది హతమైపోయిందని ప్రకటిస్తున్నారు" అని!

'ఇటీవలి పెట్టుబడిదారీ విధానం'లో క్రమబద్ధంగా పురావృతమయ్యే "అంతరాయాల" గురించి వివరించడానికి, సమర్థించుకోవడానికి పెట్టుబడిదారులు వాడే ప్రత్యేకమైన పదాల గురించి మనం ఇంత శ్రద్ధగా ఎందుకు పట్టించుకోవాలి?

ఈ 'ఇటీవలి పెట్టుబడిదారీ విధానపు' పాలనలోని భాషను పరిశోధించడానికి ప్రయత్నిస్తుంది హేమార్కెట్ బుక్స్ ప్రచురించిన, లెరీ రాసిన 'కీ వర్డ్స్' పుస్తకం. కార్పొరేట్ ప్రపంచంలో, వాణిజ్య పత్రికలలో మనకు ఎక్కడ చూస్తే అక్కడ కనబడే ఆధునిక పదాలనూ పదబంధాలనూ తీసుకుని ఈ పుస్తక రచయిత ఆ పదాలు ఏ విధంగా కార్పొరేషన్లకు అనుకూలమైన విలువలను చలామణీలోకి తెస్తాయో చూపారు. నిచ్చెనమెట్ల వ్యవస్థ, పోటీ తత్వం, కొత్త సాంకేతిక విధానాలను ఎటువంటి ప్రశ్నలు లేకుండా ఆమోదించడం వంటివి ఆ విలువలు. ఈ భాష ప్రచారం చేసే విలువలు ప్రజాస్వామ్యం, సంఘీభావం, ప్రజల మీద, భూగోళం మీద కొత్త సాంకేతిక విధానాలకు ఉండగల ప్రభావాన్ని నిశితంగా పరీక్షించడం వంటి మానవానుకూల విలువల కన్న పైస్థానంలో నిలబెట్టే ప్రయత్నం జరుగుతుంది.

ఈ పదాలు మన భావనాత్మక పరిధిని సంకుచితం చేస్తాయనీ, అవి "మన ఊహాశక్తికి సంకెళ్లు వేస్తాయ"నీ లెరీ అంటున్నారు. ఈ పదాలు మన ఆర్థిక వ్యవస్థనూ సమాజాన్నీ నిర్వహించడానికి ప్రత్యామ్నాయ మార్గాలు ఉన్నాయని ఆలోచించడం కూడ కష్టమైపోయే

---

మా నాయన చనిపోయిండు. తర్వాత రెండు సంవత్సరాలు గవర్నమెంటు బడిలో చదివా. తర్వాత ఇంట్లో పరిస్థితి బాగా లేక చదువు ఆపేసి పనికి వస్తున్న. నాకు అన్న ఉన్నడు. అమ్మ ఇంట్లోనే ఉంటది. ఆరు నెలలు నేను, ఆరు నెలలు మా అన్న చూసుకుంటం. ఈ పని నచ్చిందా అంటే ఏమని చెప్పాలి. నేను ఈ పని చేస్తుంటే నువ్వు ఈ పని చేసుడేంది అని అడుగుతున్నరు. (తోలు లేచిన చేతులు చూపిస్తూ) ఏం పని చేసినా మనం చేతనయినంత వరకే చేయాలి. పదిరోజుల పని ఈరోజే చేస్తె మన ఆరోగ్యం దెబ్బతింటది. నీకు పెట్టేవాడు ఎవరూ ఉండరు. ఏం చేస్తం. నా తలరాత ఇంతేనేమో. దేవుడు నా బతుకు ఇలా రాసాడేమో అనుకుంటున్న.

నా పేరు మొగిలి. మాది దామెర. చదువుకున్న. నాది పి.జి. ఎం.ఎ (పొలిటికల్ సైన్స్), ఎం.ఎ.(తెలుగు), బి.ఇడి చేసిన. ఇప్పుడు కాకతీయ విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్ చేస్తున్న. ఇక్కడ నేనొక్కడినే కాదు చాలామంది ఉన్నరు చదువుకున్నవారు. డిగ్రీ, పి.జి., బి.ఇడి., ఇంటర్ చదివినవాళ్లు వంద మందికి పైగా ఉన్నారు. ప్రభుత్వ ఉద్యోగం లేదు. ప్రైవేటు ఉద్యోగం చేద్దామంటే వాళ్లు పొద్దునే కాలేజికి రమ్మని, సాయంత్రం ఐదు నుండి ఆరు గంటలకు ఇంటికి పంపిస్తున్నారు. పోనీ, అయితమాయే చేద్దాం అనుకుంటే జీతం ఆరు నుండి ఏడువేల వరకు ఇస్తున్నారు. అవి ఇంట్లకు సరిపోవు. పిల్లల చదువులు, పండుగలు, రూం రెంట్లకు సరిపోవు. ప్రైవేటు విద్యా సంస్థలో మహబూబాబాదులో చేశాను. ఇక్కడ రోజుకు 700 నుండి 1000 రూపాయలు దొరుకుతయి. మేము గోవాలు వేయడం, గుత్తపని పట్టుకుంటా. పని అయిపోగానే కాళ్లుచేతులు కడుక్కొని ఇక్కడికి వచ్చి (లైబ్రరికి) కాంపిటేటివ్ ఎగ్జామ్‌కు కూడా ప్రిపేరవుతా. అదీ కూడా పని తొందరగా అయిపోతేనే లేకపోతే లేదు. నా వెంట బ్యాగులో ఒక పుస్తకం, ఒక న్యూస్ పేపర్ తెచ్చుకుంటా. అమ్మాయి డిగ్రీ, అబ్బాయి పదవ తరగతి చదువుతున్నాడు. దామెర రోజూ వెళ్లొస్తా. ఇక్కడ పని రోజూ దొరకది. చూస్తాంద్రు కదా ఇక్కడ ఎంతమంది ఉన్నరో. ఇప్పుడు వీళ్లందరికి ఈ రోజు పనిలేదు. వ్యవసాయ భూమి ఉంది. వర్షాలు లేక పంటలు పండుతలేవు. ఈ సంవత్సరం ఆగస్టులోనే వర్షం కొట్టింది. గంతే, ఇప్పటి వరకు లేదు. బోర్లు వేస్తే నీళ్లు పడుతలేవు. వస్తే అనావృష్టి లేకపోతే అతివృష్టి. ఇక్కడ వర్షాలు లేవు అంటే అక్కడ కేరళకు వరదలు వచ్చాయి. దేవుడు కూడా మనతో చదరంగం ఆడిస్తున్నడు. నన్ను సార్ అనకండి. అన్నా అనండి. చక్కగా చదువుకోండి. మంచి సబ్జెక్టు మీరు తీసుకుంది. మీకు మంచి ఫ్యూచర్ ఉంది.

'అడిగే చేతులకు పని ఇవ్వనివాడు ప్రశ్నించే చేతులకు ఏం పని ఇస్తాడు' అనే ఎవరో కవి అన్న మాటలు తరగతి గదిలో కవిత్వం గురించి వచ్చిన సందర్భంలో విన్న మాటలు చెవులలో గింగురు మంటున్నాయి.

*(బిఎ(జర్నలిజం) రెండవ సంవత్సరం విద్యార్థులు,*
*కాకతీయ ప్రభుత్వ కళాశాల, హన్మకొండ)*

వీ

స్థితి కల్పిస్తాయని ఆయనన్నారు. ఈ భాషే సామాన్య లోకజ్ఞానపు భాష అనీ, అదే "సాధారణ వాస్తవికత" అనీ మనను నమ్మించడానికి శక్తిమంతులైన "ఆలోచనా నాయకులూ" కార్పొరేట్ యజమానులూ ప్రోత్సహిస్తారు. మనం ఆ భాషను అర్థం చేసుకుని, మన సొంత జీవితాలను వర్ణించడానికి ఆ భాషనే ఉపయోగించినప్పుడు, మనను మంచి పనివాళ్లుగా, నిపుణులుగా గుర్తిస్తారు. ఆ భాషను ఉపయోగించక పోతే, మనం ఈ ఆర్థిక వ్యవస్థలో పనికిరానివాళ్లమైపోతామని నర్మగర్భమైన బెదిరింపులుంటాయి. నిజమే కదా, "ఆవిష్కరణల"తో, "మిలాఖత్తుల"తో మీకు సత్సంబంధాలు లేకపోతే ఈ సాహసిక నవీన ఆర్థిక వ్యవస్థలో బతికి బట్టకడతామని ఎలా ఊహించుకోగలరు?

వేన్ స్టేట్ యూనివర్సిటీలో ఇంగ్లిష్ ప్రొఫెసర్‌గా ఉన్న లెరీ ఈ భాషాపరమైన పరీక్షకు విద్యాసంబంధమైన సునిశిత విశ్లేషణ జతచేశారు. "ఇటీవలి పెట్టుబడిదారీ విధానం" అని చాలమంది ఎటువంటి లోతూ లేకుండా యథాలాపంగా వాడే మాటను ఆయన మన జీవితాలు ఈ దుస్థితిలో ఎందుకు ఉన్నాయో వివరించే ఒక సకల సమన్వితమైన వివరణగా వాడారు. ఆయన ఆ మాటను నిర్వచించి, ఆ మాటనే తాను ఎందుకు ఎంపిక చేసుకున్నారో కూడ వివరించారు. మన ప్రస్తుత ఆర్థిక వ్యవస్థను "ఇటీవలి పెట్టుబడిదారీ విధానం" అని పిలవడమంటే, ఎన్నెన్ని మిరుమిట్లు గొలిపే మాటలూ, సాంకేతిక విధానాలూ మన చుట్టూ చెలరేగుతున్నప్పటికీ, వాస్తవంగా మనం జీవిస్తున్నది అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానం అనే పాత వ్యవస్థకు మరొక అవతారం మాత్రమే అని అర్థం. మరో మాటల్లో చెప్పాలంటే, లెరీ రాసినట్టు, "ఉత్సాహం తెచ్చుకోండి, పరిస్థితులు ఎప్పుడూ ఇంత ఘోరంగానే ఉన్నాయి" అని అర్థం. మరి కొత్త అంశమేమంటే, మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్త ఎర్నెస్ట్ మాండెల్‌ను ఉటంకిస్తూ, లెరీ రాసినట్టు, నిపుణులూ, "సాంకేతిక విధానమూ సర్వజ్ఞులని" మనలో వ్యక్తమవుతున్న విశ్వాసం మాత్రమే. ఇంతవరకూ సరుకీకరణకు గురికాని భౌగోళిక, సాంస్కృతిక, మానసిక ప్రపంచాల్లోకి కూడ పెట్టుబడిదారీ విధానం కనీవినీ ఎరగని వేగంతో విస్తరిస్తున్నదని కూడ ఆయన అంటారు.

ఈ 'కీ వర్డ్స్' అనే పుస్తకానికి ప్రేరణ ఇదే పేరుతో గతంలో వెలువడిన మరొక పుస్తకం. వేల్స్‌కు చెందిన మార్క్సిస్టు సిద్ధాంతకర్త రేమండ్ విలియమ్స్ 1976లో 'కీ వర్డ్స్ : ఎ వొకాబులరీ ఆఫ్ కల్చర్ అండ్ సొసైటీ' అనే పుస్తకం రాశారు. లెరీ లాగనే రేమండ్ విలియమ్స్ లక్ష్యం కూడ "చైతన్యవంతులైన, విమర్శనాత్మకంగా ఆలోచించే" పాఠకులనూ శ్రోతలనూ మన దైనందిన జీవితంలో వినియోగించే భాష గురించి నిశితంగా ఆలోచించడానికి ప్రోత్సహించడం. మనం అనునిత్యం ఉపయోగిస్తున్న భాష "నేర్చుకోవలసిన సంప్రదాయం, ఆమోదించవలసిన ఏకాభిప్రాయం" మాత్రమే కాదనీ, అది "మనం మన సొంత చరిత్రనూ భాషనూ నిర్మిస్తూ వెళుతున్నప్పుడు వినియోగించే పదజాలంగా, మన సొంతదారులు కనిపెట్టవలసినదిగా, అవసరమైతే మార్చవలసినదిగా" చూడాలని రేమండ్ విలియమ్స్ ప్రతిపాదించారు. పదాలకు వాటి శక్తి కేవలం మాట్లాడుతున్నవారి వర్గ స్థానం వల్ల మాత్రమే రాదని, వినేవారి ఆమోదం మీద కూడ అది ఆధారపడి ఉంటుందని ఆయన అన్నారు. ఈ ప్రతిపాదనలోని రెండో సగం మీద కేంద్రీకరించి లెరీ తన విశ్లేషణ చేశారు. వినేవారి ఆమోదానికి, సమ్మోహకత్వానికి దారితీసి, అంతిమంగా పాలకవర్గాలకు సేవచేసే భాషా లక్షణాన్ని బద్దలు కొట్టడానికి ప్రయత్నించారు. "ఈ పదాలను ఇంకా మెరుగ్గా అర్థం చేసుకుంటే బహుశా మనం వాటి ఆకర్షణాశక్తిని బద్దలుకొట్టగలం" అని లెరీ అన్నారు.

అలా అర్థం చేయించే, బద్దలు కొట్టే లక్ష్యంతో లెరీ 'ఇటీవలి పెట్టుబడిదారీ విధానా'నికి చెందిన దాదాపు 40 ప్రధాన పదాలను సేకరించి వాటిని విశ్లేషించారు. ఈ పదాలు అకౌంటబిలిటీ (జవాబుదారీతనం)తో ప్రారంభమై వెల్ నెస్ (రోగం లేని స్థితి) వరకూ ఉన్నాయి. వీటిలో జీవితానికీ శ్రమకూ కూడ సంబంధించిన 'కోచ్' (శిక్షణ) వంటి పదాలూ ఉన్నాయి. ఆక్స్ ఫర్డ్ ఇంగ్లిష్ డిక్షనరీ, గూగుల్ ఎన్ గ్రామ్ డాటాబేస్, వాణిజ్య, ఆర్థిక విషయాల ప్రచారసాధనాల వార్తలు వంటి సాధారణ వనరుల నుంచి సేకరించిన పదాలతో, ప్రతి కీలక పదమూ 'ఇటీవలి పెట్టుబడిదారీ విధానా'నికి సంబంధించి మౌలికంగా సమర్థించడానికి వీలులేని భావాన్ని, అర్థవంతమైనదిగా, తటస్థమైనదిగా, చివరికి ఉపయోగకరమైనదిగా చూపుతుందని లెరీ వాదించారు.

ఉదాహరణకు గ్రిట్ (దృఢత్వం, పట్టుదల) అనే మాటనే తీసుకోండి. స్వతంత్ర పాఠశాలల యాజమాన్యాలు, అత్యున్నత కార్పొరేట్ అధికారులు, టెడ్ ఉపన్యాసకులు (విద్యా, వ్యాపార, సామాజిక నిపుణులు) అతి ఎక్కువగా ఈ మాటను వాడుతుంటారు. పైపైన చూస్తే ఈ మాటలో అభ్యంతరపెట్టవలసిందేమీ కనబడదు. ఎన్ని సవాళ్లు, వైఫల్యాలు, ప్రతికూలతలు ఎదురైనా కష్టపడి పనిచేస్తే విజయం చేకూరుతుంది అని నొక్కి చెప్పడాన్ని ఎందుకు తప్పు పట్టాలని అనిపిస్తుంది. నిజానికి అది ఒక ఆకర్షణీయమైన భావనలాగ కూడ కనబడుతుంది. 'గ్రిట్ : ది పవర్ ఆఫ్ పాషన్ అండ్ పర్సివియరెన్స్' రచయిత ఆంజెలా డక్ వర్త్ రాసినట్టు విజయం అనేది "మన అంతర్గత ప్రతిభ మీద కన్నా మన తీవ్ర ఉద్వేగం మీదా, మన పట్టుదల మీదా ఆధారపడి ఉంటుంది" అనడాన్ని ఎవరు కాదంటారు? లేదా అది మనం పుట్టిన జాతి మీదనో, మన తల్లిదండ్రుల ఆదాయం మీదనో కూడ ఆధారపడదు గదా?

కాని ఈ పట్టుదల గురించిన చర్చలన్నీ చాల తెలివిగా ఒక విషయాన్ని దాటవేస్తుంటాయని లెరీ రాస్తారు. అలా దాటవేసిన విషయం "ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన కీలక వాస్తవమైన పేదరికం" అని ఆయన అంటారు. డక్ వర్త్ గాని, పట్టుదల గురించి నొక్కి చెప్పే ఇతరులు గాని పేదరికంలో జీవిస్తున్నవారికి దొరికే అవకాశాల పరిధికి పరిమితులు ఉన్నాయని గుర్తిస్తారు, కాని "ఇబ్బందుల్ని అధిగమించడంలో" ప్రజలకు పట్టుదల ఉపయోగ పడుతుందని అంటారు. దాని అంతరార్థం ఏమంటే, ఆ పట్టుదలను ఉపయోగించడంలో చాలమంది విఫలమం అవుతారని వాళ్లు ఒప్పుకుంటారు, కాని కష్టపడి పనిచేసేవారికి, తగినవారికి, అందరి కంటె ఎక్కువ పట్టుదల ఉన్నవారికి ఉన్నతస్థాయి దొరుకుతుందని అంటారు. అంటే అతి కొద్దిమందికే విజయం దక్కుతుందని అంటారన్నమాట.

"పట్టుదల అనేది యథాస్థితికి ఒక వివరణ మాత్రమే. ఉన్నస్థితి కన్న భిన్నమైనది ఉండగలదని ఊహించడానికి అవసరమైన పనిముట్లను అది మనకు అందించదు" అని లెరీ అంటారు. "పట్టుదల" అవసరమైన పరిస్థితుల మీద విమర్శ సాగించే బదులు, ఈ పట్టుదల సమర్థకులు మహిళలనూ, రంగు జాతి ప్రజలనూ, పేదలనూ వారు ఉన్న అన్యాయమైన ప్రపంచం కోసమే మరింత ఎక్కువ పరిహారం చెల్లించమని కోరుతారు. ఈ "పట్టుదల" అవసరం గురించి పట్టణప్రాంతాల పాఠశాల

విద్యార్థులకూ, పేదరికంలో ఉన్న ప్రజలకూ చాల తరచుగా బోధిస్తుంటారు. కాని ఈ "పట్టుదల" ప్రవచనాలకు "నిజమైన శ్రోతలు" మన నిచ్చెనమెట్ల వ్యవస్థలో అత్యున్నత స్థానాలలో కూచున్నవాళ్లు మాత్రమే అంటారు లెరీ. ఆ స్థానాల నుంచి చూసినప్పుడు పేదరికం ఎంత కష్టభరితమైనదో తెలియనే తెలియదు.

లెరీ ఎంచుకున్న కీలక పదాలను నాలుగు స్థూలమైన తరగతులుగా విభజించారు. మొదటిది "ఇటీవలి పెట్టుబడిదారీ విధానపు శరీరభాష". కార్పొరేట్ ప్రపంచం వినియోగించే ఈ భాష మానవశరీరానికి కొన్ని లక్షణాలను ఆపాదిస్తుంది. చురుకుదనం, ఒదుగుబాటు వంటి లక్షణాలవి. ఏ మానవ శరీరాల శ్రమ వల్లనైతే పెట్టుబడిదారులకు లాభాలు దక్కుతాయో ఆ వాస్తవ మానవ శరీరాల లక్షణాల నుంచి మన దృష్టిని మళ్లించే ప్రయత్నమిది. "ఇటీవలి పెట్టుబడిదారీ విధానపు భాషలో అత్యధిక భాగం పనిస్థలాలను అత్యధికంగా శ్రమించే, తక్కువ వేతనాలు పొందే కార్మికుల సమూహాలుగా తప్ప మిగిలిన అన్ని రకాలుగానూ సంబోధిస్తుంది" అంటారు లెరీ.

అ తర్వాతి తరగతి, "ఇటీవలి పెట్టుబడిదారీ విధానపు నైతిక పరిభాష". ఇది సాధారణంగా పదజాలాన్ని దాని పాత, మత అర్థాలలో వినియోగిస్తుంది. జీసస్ ను "ఆలోచనా నాయకుడు"గా అభివర్ణించిన ఒక పందొమిదో శతాబ్ది కవితను లెరీ ఇక్కడ ఉటంకించారు. ఈ నైతిక విలువలు సాధారణంగా ఆర్థిక విలువలతో విడదీయరాని విధంగా కలగలిసి ఉంటాయి. ఉదాహరణకు పాషన్ (తీవ్ర ఉద్వేగం) అనే మాట ఉంది. ఆ మాటలో మీ యజమానికి అందించే విలువకే ప్రాధాన్యత ఉంది. మీరు చేసే పనిని మీరు ఎంత తీవ్రంగా ప్రేమిస్తే, అంత కష్టపడి పనిచేస్తారు. అంత తక్కువ ప్రతిఫలం కోరుతారు.

తాము చేసే పని సార్థకత గురించీ, తమ స్వతంత్రత గురించీ కార్మికులకు స్పృహ కలిగించడంలో పెట్టుబడిదారీ విధానం విఫలమయిందనే విమర్శను జీర్ణించుకున్నట్టుగా ధ్వనించే "చేతివృత్తుల నిపుణులు" వంటి మాటల తరగతి కూడ ఒకటుంది.

ఇక చివరిగా, కొత్త సాంకేతిక విధానాల అవకాశాల గురించి తమకు తామే స్వోత్కర్ష చేసుకునే స్మార్ట్ (తెలివైన), స్మార్ట్ ఫ్రిడ్జ్, స్మార్ట్ టోస్టర్, స్మార్ట్ టాయిలెట్ వంటి తరగతికి చెందిన మాటలూ ఉన్నాయి.

ఈ కీలక పదాలన్నీ కూడ ఆధిపత్య వర్గపు ప్రయోజనాలను ప్రతిఫలిస్తున్నాయనీ, వాటిని బలోపేతం చేస్తాయనీ లెరీ నిరూపిస్తారు. సిలికాన్ వాలీ సాంకేతిక పరిజ్ఞానపు మహాప్రభువుల దృష్టిలో ఆంత్రప్రెన్యూర్ (ఔత్సాహిక పారిశ్రామిక, వ్యాపారవేత్త) అనే మాటకు అర్థం కొత్తను అన్వేషించే, సమర్థమైన, "వేగంగా కదిలి, విజయం సాధించే వ్యక్తి" అని. ఈ ఆంత్రప్రెన్యూరే తన కంపెనీకి అపారమైన సంపదను సమకూర్చుకుంటాడట. ఆ సంపదను సృష్టించేది కార్మికులు కారట. ఆ కంపెనీ అమ్మే ఆవిష్కరణలకు అవసరమైన మదుపును అందించే పన్ను చెల్లింపుదార్ల నిధులూ కావట. నిజంగా ఇటువంటి ఎన్నో కొత్త ఆవిష్కరణల కంపెనీలకు అవసరమైన నిధులను ప్రభుత్వాలే పన్ను చెల్లింపుదార్ల సొమ్ము నుంచే అందజేశాయి. ఉదాహరణకు ఇటీవలి కాలంలో ఎన్నో కొత్త లాభదాయక కంపెనీలను స్థాపించిన ఎలాన్ మస్క్‌కు ప్రభుత్వ సబ్సిడీల ద్వారా దాదాపు యాభై లక్షల డాలర్ల సొమ్ము ముట్టింది. ఈ ఆంత్రప్రెన్యూర్ అనేది కోటీశ్వరులకు చాల ఉపయోగకరమైన భావన. పన్నుల ద్వారా, హెచ్చు వేతనాల ద్వారా పోగుపడిన సంపదను ఆ సంపద సృష్టించని వారికి (కార్మికులకు, పన్ను చెల్లించే ప్రజలకు) ఎందుకు పంపిణీ చేయాలి అని వారు సహజంగానే ప్రశ్నిస్తారు.

ఆధిపత్యవర్గపు లక్ష్యం "భావజాల చిహ్నానికి ఒక శాశ్వత స్వభావాన్ని సంతరింపజేయడమే. ఆ చిహ్నంలో ఇమిడి ఉండే సామాజిక విలువల నిర్ధారణల మధ్య ఘర్షణను రద్దు చేయడమే, లేదా ఆ ఘర్షణను లోలోపల కప్పేయడమే" అని సోవియట్ భాషా శాస్త్రవేత్త వాలెంటిన్ వొలొషినొవ్ చేసిన వాదనను లెరీ తిరస్కరించారు. ఒక్కొక్క పదం గురించీ రాసిన ఈ చిన్న చిన్న వ్యాసాలలో ప్రతి పదం కూడ సామాజిక నిర్ధారణల మధ్య ఘర్షణ ఎంత ఎక్కువగా ఉన్నదో వ్యక్తం చేస్తున్నదని లెరీ చూపారు.

ఆంత్రప్రెన్యూర్ అనే మాటను మొట్టమొదట ఫ్రెంచి ఆర్థికవేత్త జీన్ బాప్టిస్ట్ సే 1800 లో నిర్వచించారు. "ఆర్థిక వనరులను... ఎక్కువ ఉత్పాదకమైన, ఇతోధిక ప్రతిఫలం ఇచ్చే రంగానికి తరలించేవారు" అనేది ఆయన నిర్వచనం. కాని ఈ పదానికి ఆ తర్వాతి రాజకీయార్థికవేత్త జోసెఫ్ షుంపిటర్ నాటకీయంగా భిన్నమైన అర్థాన్ని ప్రకటించారు. మనం ప్రస్తుతం వాడుతున్న ఆ మాట షుంపిటర్ నిర్వచనానికి కొనసాగింపే అని లెరీ అంటారు. షుంపిటర్ చేసిన నిర్వచనం ప్రకారం ఆంత్రప్రెన్యూర్ అంటే "పెట్టుబడిదారీ విధానపు సృజనాత్మకమైన, కొత్త ప్రపంచ కల్లోలాన్ని నిర్మించే చారిత్రక ప్రతినిధి". ఈ ఆంత్రప్రెన్యూర్ అనే మాటను మనం ఏ మాత్రం విమర్శ లేకుండా ఆమోదించి వాడుతున్నామంటే, మనం షుంపిటర్ అభిప్రాయాన్ని ఆంగీకరిస్తున్నామన్నమాటే. అంటే సంపద అనేది బూర్జువా వర్గం దోపిడీ ద్వారా కొల్లగొట్టేది మాత్రమే అనే మార్క్స్ భావనకు భిన్నంగా, ఆంత్రప్రెన్యూర్లు ఆవిష్కరణల, సృజనాత్మక విధ్వంసాల ద్వారా సంపదను సృష్టిస్తున్నారని ఆమోదించడమే అవుతుంది.

ఇటువంటి కీలక పదాల అర్థాలు ఎంత నాటకీయంగా పరిణామం చెందాయో చూపడం ద్వారా లెరీ ఈ మాటలు ఇక ముందు కూడ మరింతగా మారవచ్చునని సూచిస్తారు. అంటే పాలకవర్గాలు ఇవాళ ప్రకటిస్తున్న నిర్వచనాలు శాశ్వతమైనవో, నిస్సందేహాస్పదమైనవో కాదని చూపుతారు. మన భాష ఎలా ఉండేదో, ఇప్పుడు అది ఎంత వికార స్వరూపాన్ని నిక్షిప్తం చేసుకున్నదో అన్వేషించడం ద్వారా లెరీ మనను మన భాష ఏమి నొక్కి చెపుతుందో, ఏ విలువలను ప్రతిఫలిస్తుందో ఊహించడానికి పురికొల్పుతారు. "వెసులుబాటు" కోసం కాదు, "స్వేచ్ఛా సమయం" కోసం, "రోగం లేకుండా ఉండడం" కోసం కాదు, ఉచిత ఆరోగ్య సంరక్షణ కోసం, "భావాల విపణి" కోసం కాదు, ఉచిత విశ్వవిద్యాలయాల కోసం మన పోరాటాన్ని ఎక్కుపెడితే ఎలా ఉంటుంది?

లెరీ పుస్తకం మనకు ఈ కీలక పదాల వెనుక దాగిన ప్రత్యామ్నాయాలను గుర్తు చేస్తుంది. మన యజమానులు మనను "మానవ పెట్టుబడి" అని పిలవవచ్చు, కాని మనం కార్మికులం కూడ. మనం ప్రజలం కూడ. "భాష అనేది విషయాలను ఉన్నవి ఉన్నట్టుగా గ్రహించే నిష్క్రియాపర ప్రతిఫలనం కాదు, అది విషయాలు ఎలా ఉండగలవో ఊహించడానికీ, అలా మార్చడానికీ ఉపయోగపడే సాధనం కూడ" అంటారు లెరీ.

*(రచయిత షికాగోకు చెందిన స్వతంత్ర పత్రికా రచయిత. ఈ వ్యాసం మొదట https://theoutline.com అనే స్వతంత్ర వెబ్ సైట్ మీద డిసెంబర్ 7న వెలువడింది. దాన్ని ప్రతిష్ఠాత్మక మంత్లీ రివ్యూ వెబ్ సైట్ (https://mronline.org) డిసెంబర్ 22న పునర్ముద్రించింది.)* వీ

# ఒక చరిత్రాత్మక విప్లవ గాథ

***క్యూబా విప్లవక్రమంలో సుప్రసిద్ధమైన మోంకాడా ఆయుధస్థావరం మీద దాడికి ప్రణాళిక రచించడంలో భాగమైన సామాన్యుల సాహసపు ఉజ్వల గాథను వివరిస్తున్నారు* నురియా బార్బోసా లియోన్**

రెండు గదులు. ఒకటి ఇటు అతిథులు వస్తే కూచునే గదిగానూ, భోజనాల గదిగానూ ఉపయోగపడేది. మరొకటి పడకగది. వాటిని ఆనుకుని ఒక చిన్న స్నానాలగది, అంతే కొలతల వంటగది. హవానా శివార్లలోని వెదాదో లో ఓ వీథికీ ఇన్ఫాంటాకూ మధ్యన 25వ వీథిలో 164 నంబర్ భవనంలో 603 అపార్ట్ మెంట్. 1953 జూలై 26న జరిగిన చరిత్రాత్మక సాయుధ చర్యల ప్రణాళిక ఆ ఇంట్లోనే జరిగింది.

క్యూబాలో ఫుల్జెన్సియో బటిస్టా నియంతృత్వ ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరుపుతున్న పోరాటాన్ని కొనసాగించడానికి అవసరమైన ఆయుధాలు స్వాధీనం చేసుకునే లక్ష్యంతో, ద్వీపంలో తూర్పున ఉన్న శాంటియాగోలోని మోంకాడా ఆయుధ స్థావరం మీద, బయమో లోని కార్లోస్ మాన్యుల్ డి సెస్పెడెస్ ఆయుధాగారం మీద తిరుగుబాటుదారులు ఆ రోజునే దాడులు చేశారు.

ఒక కార్ల అమ్మకపు సంస్థలో పనిచేస్తూ ఆ ఉద్యమంలో చేరిన యువకుడు ఎబెల్ శాంటామరియా కువాడ్రాదో ఈ ఇంట్లో నివసిస్తుండేవాడు. ఆయన ఆ ఇంట్లో 1952 జనవరిలో అద్దెకు దిగాడు. ఆ ఇల్లు ఆయన పనిచేసే కంపెనీకి దగ్గర్లో ఉండేది. ఆ ఇంట్లో ఆయన తన చెల్లెలు హేడీతో కలిసి ఉంటుండేవాడు.

ప్రస్తుతం కాసా ఎబెల్ శాంటామరియా మ్యూజియం పేరుతో ఉన్న ఆ ఇంట్లో ఈ దేశభక్త యువకుడి చరిత్రనూ, విప్లవభావాలనూ పరిశోధించిన చరిత్రకారిణి సెరియోషా మోరా కాండెబాట్ ఈ చరిత్రను వివరిస్తుంది.

ఆ యువకుడు విల్లా క్లారా ప్రాంతంలో ఎన్ క్రుసియాదా మునిసిపాలిటీలో 1927 అక్టోబర్ 20న పుట్టాడు. ఏదో ఒక వృత్తి నైపుణ్యం నేర్చుకోవాలనే కోరికతో 1947లో రాజధానీ నగరం చేరాడు. ఒక వ్యాపార పాఠశాలలో చేరడానికి ఉపకారవేతనం గెలుచుకుని, అదే సమయంలో సాధారణ విద్య కొనసాగించడానికి ఒక ఉన్నత పాఠశాలలో చేరాడు. మొదట అరిగువానాబో టెక్స్ టైల్స్ లో కార్యాలయ గుమస్తాగా చేరాడు. అ తర్వాత పోంటియాక్ కార్ల పంపిణీదారు దగ్గర డబ్బు లెక్కలు చూసే గుమస్తాగా చేరాడు. అప్పుడే తన రాజకీయాభిప్రాయాలను బట్టి ఆర్థడాక్స్ పార్టీ సభ్యత్వం తీసుకున్నాడు. 1952 మార్చ్ 10న బటిస్టా సైనిక కుట్ర జరగకపోయి ఉంటే ఈ ఆర్థడాక్స్ పార్టీ ఎన్నికల్లో అధికారానికి వచ్చి ఉండేది.

ఆ కాలపు అనేక మంది యువకులలాగే ఎబెల్ శాంటామరియా కూడ ఆ చట్టవ్యతిరేక అక్రమ చర్యల పట్ల ఆగ్రహాన్ని ప్రకటించాడు. ఆ ఆగ్రహం వల్లనే, తన నిబద్ధతను ఆచరణగా మార్చే అవకాశం కోసం వెతుకుతూ, యువ న్యాయవాది ఫిడెల్ కాస్ట్రోను కలుసుకున్నాడు.

అది 1952 మే 1. నయావలస రిపబ్లిక్ పాలన సాగుతున్నప్పుడు అసాధారణ పాత్ర నిర్వహించిన క్యూబన్ విప్లవ నాయకుడు కార్లోస్ రోడ్రిగ్స్ అంత్య క్రియల తర్వాత ఆ కోలోన్ శ్మశానంలోనే ఈ ఇద్దరు యువకులూ కలుసుకున్నారు. క్యూబాలో సామాజిక పరివర్తనకు నిబద్ధులైన ఈ ఇద్దరూ అతి త్వరలోనే ప్రాణమిత్రులైపోయారు.

తర్వాతి రోజుల్లో ఫిడెల్ ఈ అపార్ట్ మెంట్ కు ఎన్నోసార్లు వచ్చాడు. ఆ గదుల్లో చర్చల్లోనే ఒక ఉద్యమ నిర్మాణం పురుడు పోసుకుంది. ఆ ఉద్యమం జూలై 26 ఉద్యమంగా (ఎం-26-7గా) సుప్రసిద్ధమయింది. ఈ సమావేశాలలో జరిగిన చర్చల, విశ్లేషణల, భిన్న ప్రతిపాదనల ప్రాతిపదికపై, పర్యవసానంగా బటిస్టాను కూలదోయడానికి ఆయుధాలు చేపట్టక తప్పదని అంగీకారం కుదిరింది. హింస ద్వారా అధికారానికి వచ్చిన బటిస్టాను కూల్చడానికి ఆయుధం అనివార్యం అనే తీర్మానం జరిగింది.

"ఈ భవనం ఎవరి దృష్టిలోనూ పడకుండా మారుమూలన ఉండడం ఫిడెల్ కు నచ్చింది. అప్పుడు ఇక్కడంతా నిశ్శబ్దంగా ఉండేది. పరిసర ప్రాంతాలు కూడ ప్రశాంతంగా ఉండేవి. అంతే కాకుండా, ఇది చాల సురక్షితమైన స్థలం. ఈ భవనంలోకి వెళ్లడానికీ, రావడానికీ రెండు ద్వారాలుండేవి. ఒకటి 25వ వీథిలోకి వెళ్లేది. మరొకటి ఓ వీథికి దారి తీసేది. అందువల్ల ఇక్కడ సమావేశాలు పెట్టుకోవడానికీ, మిత్రులను కలుసుకోవడానికీ, రహస్య సమాలోచనలు జరపడానికీ వీలయ్యేది. జీసస్ మోంటానే ఒరొపెసా, మెల్బా హెర్నాండెజ్, రౌల్ మార్టినెజ్ అరారా, నికో లోపెజ్, బోరిస్ లూయీ శాంటాకొలొమా, రౌల్ గోమెజ్ గర్షియా వంటి ఎందరో ఇక్కడికి తరచుగా వస్తుండేవాళ్లు. అలాగే పినార్ డెల్ రియో నుంచీ, అర్టెమిసా నుంచీ కూడ యువకులెందరో వస్తుండేవారు. వారందరూ ఆ తర్వాత శాంటియాగోలో జరిగిన పోరాటాల్లో ప్రాణత్యాగం చేశారు" అని చరిత్రకారిణి చెపుతుంది.

ఆ రోజుల్లోనే తూర్పు ప్రాంతమైన హోల్గ్విన్ లోని బిరాన్ లో కాస్ట్రో పూర్వీకుల స్వగృహానికి వెళ్లినప్పుడు ఫిడెల్, ఎబెల్ లు సాయుధ చర్య గురించి ఆలోచనలు చేశారు. శాంటియాగో డి క్యూబా లో దేశపు తూర్పు ప్రాంతంలోకెల్లా అతి ముఖ్యమైన సైనిక బలగానికి చెందిన 909 మంది సైనికులతో కూడిన సైనిక ఆయుధాగారం మీద దాడి చేయాలని అప్పుడే నిర్ణయించుకున్నారు. దాడిలో పాల్గొనే తిరుగుబాటుదారుల సంఖ్య 160 మాత్రమే. అందులో ఇద్దరు మహిళలు - మెల్బా హెర్నాండెజ్, హేడీ శాంటామరియా- కూడ ఉన్నారు.

"ఆ దాడికి ముందు రోజుల్లో హవానా అపార్ట్ మెంట్ చాల నిశ్శబ్దంగా ఉండిపోయింది. అక్కడి సమావేశాలు కూడ తగ్గిపోయాయి.

నియంతృత్వపు నిఘా అధికారులను బోల్తా కొట్టించాలంటే తగిన జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. జూలై 7న ఎబెల్ ను శాంటియాగో పంపాడు ఫిడెల్. సిబోనే వ్యవసాయ క్షేత్రంలో విల్లా బ్లాంకా ఇంట్లో శాంటియాగన్ రెనాటో గిటార్ తో కలిసి తుది ప్రయత్నాలకు రూపు దిద్దడం ఎబెల్ బాధ్యత. అక్కడి నుంచే వాళ్లు తమ సైనిక కర్తవ్యం నిర్వహించడానికి జూలై 25 రాత్రి బయల్దేరి వెళ్లాలి. జూలై 26 తొలివేకువ జామున దాడికి దిగాలి" అని చరిత్రకారిణి చెప్పారు.

అప్పటికే నగరంలో ఇతర సమావేశ స్థలాలన్నిటినీ ఖరారు చేశారు. మెల్బా హెర్నాండెజ్ ఇల్లు అయిన జోవెల్లార్ 107 ఒక స్థలం. ఇన్ఫాంటా, 23వ వీధి కలిసే చౌరస్తాలో ఉన్న మి టియో బార్ మరొక స్థలం. మారియానౌ మునిసిపాలిటీలో ఒక ఇల్లు ఇంకొక స్థలం. నటాలియా రెవ్యూల్టా నివసించే 11వ వీధిలోని 910 భవనం అతి ఎక్కువగా వినియోగించిన స్థలం. విజయం సాధించగానే ఆ సమాచారాన్ని ప్రపంచానికి తెలియజెప్పే బాధ్యత ఉత్తమ కార్యకర్త నటాలియాది.

1953 జూలై 24 రాత్రి 25వ వీధి వైపు అపార్ట్ మెంట్ కు తాళం వేసి చరిత్ర రచించడానికి బయలుదేరాడు ఫిడెల్.

ఆ దాడి విఫలమయింది. ఎబెల్ శాంటామరియాను పట్టుకుని శాంటియాగోలోని సాటుర్నినో లోరా ఆస్పత్రిలో ఖైదీగా నిర్బంధించి అతి భయంకరమైన చిత్రహింసలకు గురిచేశారు. చంపేసి, కళ్లు పీకేసి తీసుకొచ్చి ఆయన చెల్లెలు హేడీకి చూపెట్టారు. అవి చూసి అయినా గుండెపగిలి ఆమె రహస్యాలు కక్కేస్తుందని పోలీసులు భావించారు. దాడి జరిగిన కొద్దిరోజుల్లోనే నియంతృత్వ నిఘా విభాగపు సైనికులు అపార్ట్ మెంట్ మీద దాడి చేశారు. ఏమైనా సాక్ష్యాధారాలు దొరుకుతాయా అని వెతికారు. ఏమీ దొరకలేదు.

ఆగస్ట్ లో ఎబెల్ తల్లి జొవాక్వినా కువాడ్రాడో, ఆమె చెల్లెలు ఐదా అపార్ట్ మెంట్ కు వచ్చి ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోయారు. ఆ ఇంటి యజమానులు ఇంటిని మరెవరికో అద్దెకు ఇచ్చారు.

ఆరు సంవత్సరాల తర్వాత 1959లో విప్లవం విజయవంతమయ్యాక హేడీ, కాసా డి లాస్ అమెరికాస్ అనే సాంస్కృతిక సంస్థకు డైరెక్టర్ అయింది. ఒకరోజు ఆమె కళాకారులతో, మేధావులతో మాట్లాడుతూ తన అన్నా తానూ కలిసి ఉండిన ఆ అపార్ట్ మెంట్ గురించి, అక్కడ జరిగిన విప్లవ ప్రయత్నాల గురించి ప్రస్తావించింది. అక్కడికక్కడే ఆ అపార్ట్ మెంట్ ను ఒక స్మారక చిహ్నంగా, ప్రదర్శనశాలగా మారిస్తే బాగుంటుందనే ఆలోచన వచ్చింది.

1973 జూన్ 9న ఆ అపార్ట్ మెంట్ ను జాతీయ సాంస్కృతిక మండలికి అనుబంధ సంస్థగా ఆవిష్కరించారు. ఆ తర్వాత ఆ మండలి సాంస్కృతిక మంత్రిత్వ శాఖగా మారింది. క్యూబా విప్లవ చరిత్రలో ఈ ఇంటికి ఉన్న ప్రాధాన్యత దృష్ట్యా 1980లో దాన్ని జాతీయ స్మారక చిహ్నంగా ప్రకటించారు. ఇవాళ అది క్యూబా విప్లవ చరిత్ర గురించి, మోంకాడా ఆయుధాగారం మీద దాడి గురించి ఆసక్తి ఉన్నవారందరూ సందర్శించే స్థలంగా మారింది.

మోంకాడా ఆయుధాగారం మీద దాడి జరగడానికి ముందు రోజు, జూలై 24న జోస్ రామోన్ మార్టినెజ్ అల్వారెజ్ తల్లిని ముద్దు పెట్టుకుని తాను వరదెరో సముద్రతీరానికి వెళ్తున్నానని వీడ్కోలు పలికాడు. హవానా నైరుతి ప్రాంతంలోని ఆర్టెమిసాలో ఎందరో యువకులు కూడ అలాగే తమ కుటుంబాలకు ఏదో ఒక కారణం చెప్పి వీడ్కోలు పలికి శాంటియాగో డి క్యూబాకు చేరుకున్నారు.

ఆర్టెమిసాలో జూలై 26 ఉద్యమాన్ని ప్రారంభించే బాధ్యతను ఫిడెల్ ఆర్థడాక్స్ పార్టీ జాతీయ నాయకులలో ఒకరైన హోస్ సువారెజ్ బ్లాంకో (పెపె) కు అప్పగించాడు. ఆ ప్రాంతంలో ఎంతోకాలంగా పనిచేస్తున్న హోస్ సులభంగా అవసరమైన నిధులు సమీకరించగలిగాడు, తగిన వ్యక్తులను ఎంపిక చేశాడు. విజయం సాధించిన తర్వాత ఏమేమి చేస్తే బాగుంటుందో ఆలోచించడం మొదలుపెట్టాడు. ఈ బృందంతో జరిపిన ఒక సమావేశంలో స్వయంగా ఫిడెల్ కాస్ట్రోనే క్యూబాలో అవసరమైన మౌలిక మార్పులలో ప్రధానాంశాలేమిటో వివరించాడు. ఆ ప్రధానాంశాలలో భూసంస్కరణలు, పారిశ్రామికీకరణ, గృహనిర్మాణం, ఉద్యోగకల్పన, విద్యా, వైద్య సౌకర్యాల కల్పన వంటివి ఉన్నాయి.

ఆ ఉద్యమం సంఘటితమైనకొద్దీ, సాయుధ చర్యల అనివార్యత మరింతగా స్పష్టమవుతూ వచ్చింది. సమీపంలోని పొలాల్లో తుపాకి కాల్పుల శిక్షణ పెరిగింది. సమావేశాలు మరింత రహస్యంగా జరగడం పెరిగింది. ఇళ్ల దగ్గరలో ఉన్న గుహల్లో ఆయుధాలు దాచిపెట్టడం పెరిగింది. కాలం గడిచినకొద్దీ ఆర్టెమిసా బృందపు పని మరింత నిర్మాణయుతంగా, క్రమశిక్షణాయుతంగా మారుతూ వచ్చింది. అలా శాంటియాగో దాడిలో వారి భాగస్వామ్యానికి అవకాశం దక్కింది.

విప్లవ కమాండర్ రామిరో వాల్డెస్ మెనెడెజ్ తో సహా ఆర్టెమిసా బృందానికి చెందిన 28 మంది యువకులు తమ సొంత పట్టణాన్ని వదిలి మోంకాడాకు తరలివెళ్లారు.

“మేం పిడికెడు మందిమే. కాని ప్రజా ఆకాంక్షల స్ఫూర్తి మాతో ఉంది. మేమందరమూ మార్టి ఇచ్చిన పిలుపుతో ప్రేరణ పొందాం. ఎటువైపు హాయిగా జీవితం గడుస్తుందో అటు చూడకు, నీ కర్తవ్యం ఎటువైపు ఉందో అటు చూడు అని మార్టి అన్నాడు” అని ఆ చరిత్రాత్మక దాడి స్మారక ఉత్సవం జరుపుకుంటున్నప్పుడు 2014లో రామిరో వాల్డెస్ అన్నాడు.

తిరుగుబాటుదారులు హవానా వదిలి వేరువేరు మార్గాల్లో, కొందరు రైలులో, మరి కొందరు బస్సుల్లో, మరి కొందరు కార్లలో తమ గమ్యస్థానం చేరుకున్నారు. సరిగ్గా 25వ తేదీన అక్కడ ఒక జాతర జరుగుతున్నది. ఆ జాతర సంరంభంలో కలగలిసిపోయి వాళ్లందరూ చిన్న చిన్న బృందాలుగా సిబోనే వ్యవసాయ క్షేత్రానికి చేరుకున్నారు.

స్పానిష్ జర్నలిస్టు, ‘ఎ హండ్రెడ్ అవర్స్ విత్ ఫిడెల్’ రాసిన ఇగ్నేసియో రామోనె తో ఫిడెల్, జూలై 26న జరిగిన ఘటనలను గుర్తు చేసుకుంటూ, “చిట్టచివరికి నన్ను ఒక కారు రక్షించింది. ఎట్లా వచ్చిందో, ఎందుకు వచ్చిందో నాకు తెలియదు గాని నావైపు ఒక కారు దూసుకొచ్చింది. నేను నిలబడి ఉన్నచోటికి వచ్చి, నన్ను లోపలికి లాక్కున్నారు. ఆ కారును ఆర్టెమిసా నుంచి వచ్చిన ఒక పిల్లవాడు నడుపుతున్నాడు. కారులోపల చాల మంది కంపెనీరోస్ (సహచరులు) ఉన్నారు. వారిలో నన్నూ చేర్చుకున్నారు. అలా నాకు రక్షణ దొరికింది... నేనా కుర్రవాడితో మాట్లాడాలని, అంత భీకర సమరం మధ్యలోకి అతను ఎలా వచ్చాడో తెలుసుకోవాలని ఎప్పుడూ అనుకుంటాను” అన్నాడు.

జూలై 26 ఘటనల్లో ఆర్టెమిసాకు చెందిన పద్నాలుగు మంది యువకులు ప్రాణ త్యాగం చేశారు. మిగిలిన ఆర్టెమిసా యువకులు ఆ

తర్వాత సాగిన సుదీర్ఘ పథంలో కొనసాగారు. గ్రాన్మా నౌకలో పాల్గొన్నారు. సియెర్రా మయెస్ట్రా పోరాటంలో పాల్గొన్నారు. ఆర్టెమిసా యువకులందరినీ అక్కడి అమరవీరుల స్మారక కేంద్రంలో గౌరవించడం జరిగింది.

ఈ స్మారక కేంద్రాన్ని 1977 జూలై 16న ప్రారంభించి ఆర్టెమిసాలోని ఈ శతాబ్ది యువకుల తరానికి అంకితం చేశారు. విప్లవ లక్ష్యం కోసం ఈ నగర యువకులు సమర్పించిన వీరత్వాన్ని అర్థం చేసుకోదలచిన వారందరూ ఇవాళ ఈ స్మారక కేంద్రాన్ని సందర్శిస్తున్నారు.

ఈ స్మారక కేంద్రంలో ఒరిగిన వీరుల మృతదేహాలుంచిన సమాధులతో పాటు, వారి వస్తువులలో, ఫొటోలలో కొన్ని కూడ ప్రదర్శనకు పెట్టారు. అలాగే ఆ నాటి దాడిలో ప్రాణాలు కోల్పోయిన వారితో పాటు, మోంకాడా దాడిలో పాల్గొని విప్లవ విజయం తర్వాత మరణించిన తిరుగుబాటుదారులను కూడ 2000 నుంచి ఈ కేంద్రంలోనే ఖననం చేస్తున్నారు.

'చరిత్ర నన్ను నిరపరాధి అని నిర్ధారిస్తుంది' అని ఫిడెల్ చేసిన సుప్రసిద్ధ హృదయపూర్వక ప్రకటన నుంచి కొన్ని వాక్యాలను ఈ స్మారక కేంద్రం ముఖద్వారం దగ్గర ప్రదర్శిస్తున్నారు. "అన్నిటికీ మించి నా కామ్రేడ్స్ ను ప్రపంచం  మరచిపోలేదు, వారు మరణించలేదు. వారు ఎప్పటికంటే ఎక్కువగా ఇవాళ సజీవంగా ఉన్నారు. వారి భావాల అపరాజిత భూతం వారి మృతదేహాల నుంచి ఎట్లా లేచి విస్తరిస్తున్నదో చూసి వారి హంతకులు భయంతో వణికిపోతుంటారు" అనేవి ఆ వాక్యాలు.

జూలై 26 వేకువ జామున శాంటియాగో డి క్యూబా బైట సిబోనే వ్యవసాయక్షేత్రంలో రౌల్ గోమెజ్ గర్షియా రాసిన 'మోంకాడా ప్రణాళిక'ను బిగ్గరగా చదివి వినిపించారు. జాతీయ గీతం ఆలపించారు. అప్పుడు సాయుధ తిరుగుబాటుదారులు చిన్న చిన్న బృందాలుగా శాంటియాగో నగరంలోని మోంకాడా ఆయుధ స్థావరం మీద, న్యాయస్థానం మీద, శాటుర్నినో లోరా ఆస్పత్రి మీద దాడికి కదిలారు. అదే సమయానికి, బయమో లో మరొక బృందం కార్లోస్ మాన్యుయెల్ డి సెస్పెడెస్ ఆయుధాగారం మీద దాడికి కదిలింది.

దాడి జరపబోయేముందు ఫిడెల్ తన కామ్రేడ్స్ ను ఉద్దేశించి చిన్న ఉపన్యాసం చేశాడు: "మరి కొన్ని గంటల్లో మీరు గెలవవచ్చు, లేదా ఓడిపోవచ్చు. ఏది ఎట్లా జరిగినా, సహచరులారా, జాగ్రత్తగా వినండి, ఏది ఎట్లా జరిగినా, మన ఉద్యమం విజయం సాధిస్తుంది. మనం రేపు గెలిస్తే, మార్టి కన్న కలలు త్వరలోనే నిజమవుతాయి. ఒకవేళ మన గెలుపు సాధ్యం కాకపోతే, ఈ ప్రయత్నం క్యూబా ప్రజలకు ఒక ఉదాహరణగా ఉపయోగపడుతుంది. వారు ఈ పతాకను చేబూని పురోగమిస్తారు. ఈ ఓరియెంటె ప్రాంతంలోనూ, మొత్తంగా ద్వీపమంతా ప్రజలు మనను సమర్థిస్తున్నారు. మనం స్వర్గరాజ్యపు దూతలమైన యువకులం. 1868లో, 1895లో ఇచ్చినట్టుగానే ఈ ఓరియెంటె లో మనం స్వాతంత్ర్యమో, మృత్యువో అని నినదిస్తున్నాం. మన ప్రణాళిక లక్ష్యాలు ఏమిటో మీకు తెలుసు. లక్ష్యాలేవైనా ఈ పని ప్రమాదకరమైనది. ఇవాళ రాత్రి నాతోపాటు కదిలేవాళ్లందరూ స్వచ్ఛందంగానే వస్తున్నామని నిర్ధారించుకోండి. రాదలచుకోకపోతే మీకింకా నిర్ణయించుకోవడానికి వ్యవధి ఉంది. అయితే ఎట్లాగూ మనదగ్గర తగినన్ని ఆయుధాలు లేవు గనుక కొందరు రాకుండా వెనకే ఉండిపోవలసి వస్తుంది. ఏమైనా సరే వెళ్లడానికే నిశ్చయించుకున్నవాళ్లు ఒక అడుగు ముందుకు వేయండి. మన ఉద్దేశం అవతలివాళ్లను చంపడం కాదు. కాని చిట్టచివరి అవకాశంగా అదీ తప్పదు."

బటిస్టా సైనికులు ధరించే యూనిఫారాల లాంటివే ధరించిన 131 మంది సాయుధ ప్రజా సైనికులను మూడు బృందాలుగా విభజించారు. మొదటి బృందం మోంకాడా ఆయుధాగారపు ప్రధాన భవనం మీద నేరుగా దాడి చేస్తుంది. ఎబెల్ శాంటామరియా, రౌల్ కాస్ట్రో నాయకత్వం వహించే మిగిలిన రెండు బృందాలూ ఒకటి ఆస్పత్రినీ, మరొకటి న్యాయస్థానాన్నీ స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నిస్తాయి.

ప్రజాసైనిక చర్య ప్రారంభమయింది. ఫిడెల్ నాయకత్వంలోని మొదటి బృందం అనుకున్న ప్రకారమే తన గమ్యస్థానాన్ని చేరుకున్నది. కాని అనుకోకుండా ఒక ప్రభుత్వ సైనిక బలగాల పెట్రోల్ కారు ఎదురువచ్చింది. అందువల్ల తిరుగుబాటు దళాలు అనుకున్నదానికంటె ముందే కాల్పులు ప్రారంభించవలసి వచ్చింది. ఆ కాల్పుల చప్పుడు విని, ఆయుధాగారం లోపల ఉన్న సైనికులు అప్రమత్తమయ్యారు. అప్పటికే ఎబెల్, రౌల్ తమ లక్ష్యాల దగ్గరికి చేరుకున్నారు గాని ఎక్కువ ఆయుధ శక్తీ, మానవశక్తీ ఉన్న శత్రువు వారి దాడులను తిప్పి కొట్టగలిగాడు.

బయమో లో కూడ దాదాపు ఇలాగే జరిగింది. అక్కడ ఆయుధాగారపు అధికారులకు బాగా పరిచితుడైన ఒక స్థానికుడు తిరుగుబాటు దళాల నాయకుడికి తోడు ఉంటాడనీ, ఆయనను చూసి వీరిని లోపలికి అనుమతిస్తారనీ పథకం తయారు చేశారు. లోపలికి వెళ్లాక అక్కడి భద్రతా సిబ్బందిని నిరాయుధం చేసి, వారిచేతనే సింహద్వారం తెరిపిస్తే అప్పటికే ఎదురుచూస్తున్న తిరుగుబాటు దళం లోపలికి ప్రవేశిస్తుందని అనుకున్నారు. కాని తోడు ఉండవలసిన వ్యక్తి సమయానికి రాలేదు. అప్పటికప్పుడు ఒక ప్రత్యామ్నాయ వ్యూహం ప్రయత్నించవలసి వచ్చింది. పథకంలో ఏదీ అనుకున్నట్టుగా ముందుకు సాగలేదు.

అలా ఆ రోజున ప్రణాళిక రచించినట్టుగా రెండు దాడులలోనూ విజయం చేజిక్కలేదు. కాని ఆ ఘటనలే మొత్తంగా అమెరికా అనుకూల జనరల్ ఫుల్జెన్సియో బటిస్టా నియంతృత్వ పాలనకు వ్యతిరేక విప్లవ పోరాటంలో ఒక కొత్త దశను ప్రారంభించే లక్ష్యాన్ని సాధించాయి.

ఫిడెల్ కాస్ట్రో రుజ్ నాయకత్వంలో జరిగిన ఈ చర్యలు విజయానికి మార్గం సాయుధ పోరాటమేనని క్యూబన్ ప్రజలకు చూపాయి. ఆ తర్వాత గ్రాన్మా నౌకాయానం జరిగి, ఆ నౌక 1956 డిసెంబర్ 2న తీరం చేరి, సియెర్రా మయెస్ట్రాలో ఒక కొత్త గెరిల్లా యుద్ధరంగాన్ని తెరవడానికి దారి తీసింది.

చివరికి 1959 జనవరి 1న నియంతృత్వం ఓడిపోయి, విప్లవ తిరుగుబాటు విజయం సాధించి రాజకీయాధికారాన్ని చేపట్టింది. గతంలో మోంకాడా ఆయుధాగారంగా ఉన్న భవనంలో ప్రస్తుతం సియుడాడ్ ఎస్కోలార్ 26 డి జూలియో అనే పాఠశాల ఉంది. ఈ సాహసకృత్యాలను ప్రజలు ఎన్నటికీ మరచిపోగూడదనే లక్ష్యంతో ఆ భవనంలోని కొంతభాగాన్ని ఒక ప్రదర్శన శాలగా మార్చారు.

*(కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ క్యూబా సెంట్రల్ కమిటీ అధికారిక వెబ్ సైట్ గ్రాన్మా మీద జూలై 26 స్మృతిలో 2018 జూలై 23న ప్రచురితమైన వ్యాసానికి అనువాదం)*

*http://en.granma.cu/cuba/2018-07-23/an-event-that-changed-the-course-of-history*

వీ

# మార్క్సిజం-మానవాళి విముక్తికి మార్గం

***వర్గపోరాటం ద్వారా వర్గరహిత సమాజ సాధనే మానవజాతికి విముక్తి మార్గమన్న కార్ల్‌మార్క్స్ స్ఫూర్తి మన ఆచరణ కావాలని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**కా**ర్ల్‌మార్క్స్ మహోనీయుడు తన జీవిత కాలమంతా ఈ ప్రపంచ మానవాళిని, అన్ని రకాల పీడనల నుండి విముక్తి కలిగించడానికి తయారు చేసిన సిద్ధాంత – ఆచరణనే మార్క్సిజం అనవచ్చు. గతితార్కిక చారిత్రక భౌతికవాదం భూమికగా ఉన్న తాత్వికతనే మార్క్సిస్ట్ అవగాహన. 'ప్రపంచ పురోగతి అంతా శ్రమ జీవుడి నెత్తుటి బొట్టులో ఇమిడి ఉంది' అని సూత్రీకరించిన మేధావి కార్ల్‌మార్క్స్. ఏంగిల్స్‌తో కలిసి రచించిన కమ్యూనిస్ట్ మేనిఫెస్టో ఇప్పటికి 170 సంవత్సరాలైంది. (1848 ఫిబ్రవరిలో విడుదలైంది) ఇప్పటికీ అనుసర ణీయమే. దాని సిద్ధాంత పునాదిగానే ప్రపంచ వ్యాప్తంగా ఉన్న కార్మికవర్గం అంతా కమ్యూనిస్ట్ మేనిఫెస్టోను అవగతం చేసుకొని తమ తమ పోరాటాలను నిర్మించుకుంటున్నారు. అందులో మొట్ట మొదట ఆయన అన్నది 'మానవ సమాజాల చరిత్రంతా వర్గ పోరాటాలే'. అనగా ఇప్పటి వరకూ ఈ ప్రపంచ చరిత్రలోని అన్ని సంఘటనలు కూడా ఒక వర్గం మరొక వర్గంతో జరిపిన పోరాటమేనని సూత్రీకరించాడు. అనగా ప్రపంచం రెండు వర్గాలుగా విభజించు కోవచ్చును. 1) పీడకులు. 2) పీడితులు. ఈ ప్రపంచ చరిత్రలో వీరి మధ్య నిరంతరం ఏదో రకమైన సంఘర్షణ, పోరాటం ఉంటున్నాయనేది ఆయన భావన.

'చరిత్ర తొలి యుగాల్లో దాదాపు ప్రతిచోటా మానవ సమాజం, వివిధ తరగతులుగా, తరతమ భేదాలు గల అనేక సాంఘిక అంతస్థులుగా, క్లిష్టమైన పద్ధతులలో విభజింపబడి ఉండేది. పురాతన రోమ్‌లో పాలక ప్రభువులు, యోధులు, సామాన్యులు, బానిసలు ఉన్నారు. మధ్య యుగాల్లో ఫ్యూడల్ ప్రభువులు, సామంతులు, వృత్తి సంఘ యజమానులు, చేతివృత్తి పనివారు, పని నేర్చుకొనేవారు, అర్ధ బానిసలు ఉన్నారు. దాదాపు ప్రతి వర్గంలోనూ మళ్లీ తరతమ భేదాలున్నాయి'. ఈ విధంగా మార్క్స్ చరిత్రను అవగతం చేసుకున్నాడు. 'ప్రపంచాన్ని ఇంతవరకు తత్వవేత్తలు ఎన్నో విధాలుగా విశ్లేషించారు, వర్ణించారు, అయితే ఈ ప్రపంచాన్ని మార్చేది ఏట్లా?' అనేది మన ముందున్న కర్తవ్యం – అంటూ వ్యవస్థ మార్పు కోసం పోరాడాలని మార్గ నిర్దేశంనం చేసిన వ్యక్తి మార్క్స్.

కమ్యూనిస్ట్ మేనిఫెస్టోలో చివరగా 'కమ్యూనిస్టులకు తమ అభిప్రాయా లను, లక్ష్యాలను దాచుకోవడం అంటే అసహ్యం. సమస్త వర్తమాన సాంఘిక పరిస్థితులను బలవంతంగా కూలదోయడం ద్వారానే తమ లక్ష్యాలు సిద్ధించగల పనివాళ్లు బహిరంగంగానే ప్రకటిస్తారు. కమ్యూనిస్ట్ విప్లవమంటే పాలక వర్గాలు గజగజ వణకని, కార్మికులు పోగొట్టుకొనేది ఏమీ లేదు. తమ శృంఖలాలు తప్ప వాళ్లు పొందవలసినది ఎంతైనా ఉంది. సకల దేశాల కార్మికులంతా ఏకం కండి!' అంటూ ఎలుగెత్తి చాటాడు. ఇది నేటికీ అంతర్జాతీయ నినాదంగా పిలవబడుతూనే ఉంది.

మార్క్స్ కోరినదంతా వర్గ సమాజ నిర్మూలన కోసం, ఆయా ప్రాంతాలలో, ఆయా పరిస్థితులకు అనుగుణంగా, నిర్ధిష్టంగా వర్గ పోరాటాలను నిర్మించడమే. వర్గ పోరాటం అంటే దోపిడీ చేసే వర్గాన్ని దోపిడీ చేయబడే వర్గం కూలదోయడమే. దోపిడీ చేయబడే వర్గం అంటే అన్ని రకాల పీడనల నుండి విముక్తి కోరుకునేవారు. ఇది నిరంతర ప్రక్రియ. ఇది ప్రతి వ్యవస్థలోనూ జరగాలనేది మార్క్స్ భావన.

మానవ సమాజ తత్వ శాస్త్రాల అధ్యయనంలో మార్క్సిస్ట్ ప్రాపంచిక దృక్పథ పరిణామం ఒక విప్లవాన్ని సృష్టించింది. మార్క్సిస్ట్ ప్రాపంచిక దృక్పథం పరిణామ క్రమంలో 1843 – 1845 సంవత్సరాల మధ్య కాలం ఒక సహజమైన హద్దుగా ఉంది. ఈ దృక్పథాన్ని సూత్రీకరించడంలో మేధోపరంగా వివిధ స్థాయిల్లో మార్క్స్ ఈ కాలంలోనే పరివర్తన చెందారు. ఇలా బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం నుండి శ్రామిక వర్గ విప్లవం వైపుగా హెగెల్ ప్రభావం నుండి చారిత్రక భౌతికవాద దిశగా, తత్వశాస్త్రం నుండి రాజకీయ అర్థశాస్త్రం వైపుగా తన ఆలోచనలను సాగించాడు. 1843లోనే న్యాయంపై హెగెల్ తాత్విక సిద్ధాంతాన్ని విశ్లేషించి ఒక ముఖ్యమైన ముగింపును అందించాడు. న్యాయ సంబంధాలు, రాజకీయ వ్యవస్థా రూపాలు వాటంతట అవిగా అర్థం కావు. మానవుని మనుసు సాధారణ అభివృద్ధి ద్వారా కూడా అర్థం కావు. తద్విరుద్ధంగా అటువంటి సంబంధాలు, రూపాలు జవితం భౌతిక పరిస్థితుల నుండి ఆవిర్భవిస్తాయి. దీనిని పౌర సమాజం (సివిల్ సొసైటి) అనే అంశంగా హెగెల్ భావించాడు. ఈ పౌర సమాజం ఆంగిక నిర్మాణాన్ని రాజకీయ అర్థ శాస్త్రం రూపంలో మార్క్స్ వివరించాడు.

మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు రావలసిన విప్లవం మనసులో కాదు, జీవిత భౌతిక పరిస్థితులలో రావాలంటాడు మార్క్స్ మహాశయుడు. రాజకీయ అర్థశాస్త్ర అధ్యయనానికి 1843లో మార్క్స్ పారిస్ వెళ్లారు. దీని ఫలితంగానే 1844 ఆర్థిక తాత్విక ప్రతులు సామాజిక విజ్ఞాన శాస్త్రాల విశాల రంగాన్ని స్పృశించాయి. రాజకీయ అర్థశాస్త్ర విమర్శలో మార్క్స్ చెప్పిన భావాలకు, ఊహలకు పునాదులు ఇక్కడనే ప్రారంభమయ్యాయి. ఈ భావాలను తన పెట్టుబడి గ్రంథంలో పూర్తిగా వివరించారు.

మార్క్స్ ప్రాపంచిక దృక్పథం, విప్లవాత్మక తాత్విక భావజాలల ఆవిర్భావం, పరిణామాల మూలం 1844 ఆర్థిక తాత్విక రాత ప్రతులలో ఉంది. గతితార్కిక భౌతికవాదం ప్రారంభ బిందువు నుండి కమ్యూనిజంపై తుది తీర్పులకు చేరిన మార్క్స్, బూర్జువా సామాజిక ఆర్థిక నిర్మాణంపై విమర్శనాత్మక పరిశీలన తొలి ప్రయత్నం ఈ గ్రంథంలోనే చేశాడు

మార్క్స్. ఇక్కడే మొదటి సారిగా సామాజిక ప్రక్రియలో ఉత్పత్తి నిర్ణయాత్మక పాత్రను నొక్కి వక్కాణించడం జరిగింది. మిగతా రచనలలో మరికొంత విపులంగా చర్చించడం జరిగింది. మొట్ల మొదట వర్గ విభజిత సమాజం ఆవిర్భవానికి వ్యక్తిగత ఆస్తి, శ్రమ విభజన పాదార్థిక మూలమని మార్క్స్ నిర్ధారించాడు. మానవ ఉత్పాదక శ్రమ ప్రభావం, తద్వారా సైన్స్ నుండి సంస్కృతి వరకు అన్ని రంగాలలోనూ వచ్చిన సామాజిక సంబంధాలను 1844 ఆర్థిక, తాత్విక రాత ప్రతులలో వివరించడం జరిగింది.

పెట్టుబడిదారీ విధానంలోని శ్రమ పరాయీకరణ శాస్త్రీయ మూలాన్ని మొదటి సారిగా వివరించడం జరిగింది. ప్రజల జీవితంలోను, శ్రమలోను ఒక ప్రత్యేకమైన సామాజిక సంబంధాలను పెట్టుబడిదారీ విధానం సృష్టించింది. అయితే ఈ సామాజిక సంబంధాలు, ఈ శ్రమే ప్రజలకు అన్యమైన శతృత్వ శక్తులుగా ఎదురుగా నిలబడతాయి. వ్యక్తిగత ఆస్తి ఆధిపత్యాన్ని, అది సృష్టించిన సామాజిక విధానాన్ని, మార్క్స్ అనుసంధానం చేశాడు. అందుచేతనే పరాయికరణ పోవాలంటే వ్యక్తిగత ఆస్తిని రద్దు చేయడం అనివార్యం. మానవ సమాజాన్ని పరస్పర వైరుధ్య వర్గాలుగా విభజించి వ్యక్తిగత ఆస్తి సంచయాన్ని సంవర్ధనం గావిస్తున్న ఈ వ్యవస్థను నిర్మూలించడంలోనే మావనజాతి విముక్తికి భౌతిక ఆధారం ఉంది. ఈ భౌతిక ప్రపంచ దృక్పథాన్ని, దాని విప్లవాత్మక తత్వశాస్త్రాన్ని కొంత చిర్చుద్దాం.

ప్రకృతి, మానవుల మధ్య అనునిత్య పరస్పర చర్యలలో అంటే మానవుని ప్రకృతి అనుభోగం అంటే ప్రకృతి – మానవుల గతి తర్కంపై మనవజాతి నాగరికత నిర్మాణమైందని చారిత్రక భౌతికవాదం రుజువు చేసింది. మరో మాటలో చెప్పాలంటే మానవుల ఉత్పాదకమైన వారి భౌతిక జీవనాన్ని గురించి జర్మన్ ఐడియాలజీలో మార్క్స్, ఏంగెల్స్‌లు ఇలా చెప్పారు. 'వ్యక్తులు వారి జీవితాన్ని ఎలా వ్యక్తం చేస్తారో, అలాగా ఉంటారు. వారు చేసిన ఉత్పత్తిలోనే వారు వ్యక్తమవుతారు. వారు ఏది ఏ విధంగా ఉత్పత్తి చేశారో వారలాగే కనబడతారు. అందుకనే వ్యక్తులు ఎలా ఉంటారనేది ఉత్పత్తి భౌతిక పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది'. మార్క్స్ ఉత్పత్తిని సామాజిక ఉత్పత్తిగా అభివర్ణించాడు. ప్రకృతి అనుభోగ ప్రక్రియలో మానవుడు తనకు, ప్రకృతికి మధ్య ఉత్పత్తి సాధనాలైన పని ముట్లను, సాంకేతిక పరికరాలను ప్రవేశపెడతాడు. ఒకానొక సామాజిక ప్రత్యేక పరిస్థితులలో ఈ ప్రక్రియ నిత్యం కొనసాగుతూనే ఉంటుంది.

ప్రకృతిని వినియోగించుకునే ప్రక్రియే ఆస్తి. వాస్తవానికి భాష, ఆస్తి వినియోగం మూలం ఒక్కటే. ఆస్తిలేని ఉత్పత్తి లేదు. వినియోగం సామాజిక ఆస్తి రూపాలు, బానిస ఆస్తి, భూస్వామ్య ఆస్తి, పెట్టుబడిదారీ ఆస్తి, సామ్యవాద ఆస్తి. వాస్తవానికి మార్క్స్ ప్రకారం ఉత్పత్తిలో ఆస్తి కలిసే ఉంటుంది. ప్రకృతి, మానవుల గతితర్క చలనంలో, పదార్థాన్ని మార్పుచేస్తూ, ప్రకృతి నియమాలను అర్థం చేసుకుంటూ మానవుడు తనకు తాను మార్పుకు లోనవుతాడు. ప్రకృతిపై అధికమైన ఆధిపత్యాన్ని సాధిస్తూ ఉన్నతమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని, ఉన్నత ప్రమాణం గల పనిముట్లను మానవుడు ప్రవేశపెడతాడు. ఫలితంగా ఉత్పత్తి శక్తులు అభివృద్ధి చెందుతాయి. సామాజిక ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు కలిసి ఉత్పత్తి విధానమవుతుంది. ఇది ఒకానొక సామాజికార్థిక నిర్మాణానికి ప్రాతిపదిక. దీనిపైననే ఉపరి నిర్మాణాలు తయారవుతాయి.

ఉత్పత్తి శక్తులు అనునిత్యం అభివృద్ధి చెందే క్రమంలో ఉత్పత్తి విధానంలో ఒక ప్రత్యేకమైన పరిస్థితి ఏర్పడుతుంది. ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి గుదిబండలవుతాయి. ఘర్షణ ప్రారంభమవుతుంది. వర్గ పోరాటం అంతకంతకూ ఉధృతమయ్యే పరిస్థితి విప్లవ పరిస్థితి. అంతిమంగా అస్తిత్వంలో ఉన్న సామాజిక నిబంధనలు నాశనం చేయబడతాయి. రాజకీయ అర్థశాస్త్ర విమర్శకు ముందు మాటలో చెప్పినట్లు ఒక నూతన సమాజం నిర్మాణం అవుతుంది. అయితే సంఘర్షణ, సంక్షోభాలు గల అన్ని సందర్భాలలోను విప్లవం రాకపోవచ్చు. ఉత్పత్తి శక్తులలోని కొంత భాగాన్ని నిర్ణీత సమయాల్లో నాశనం చేస్తూ పెట్టుబడిదారీ విధానం సంక్షోభాలను అధిగమిస్తుంది. సంఘర్షణ, విప్లవ సంరంభంగా మారుతుందా లేదా అనే విషయం వర్గ పోరాటాల ఉధృతిపైన, పెట్టుబడిదారీ విధానంలోని పీడితవర్గ చైతన్యయుత నిర్మాణం సంసిద్ధతపైన ఆధారపడి ఉంది. అస్తిత్వంలో ఉన్న సామాజిక క్రమాన్ని కూలదోసే శక్తి శ్రామిక వర్గానికి మాత్రమే ఉంటుంది. నిశ్చయాత్మక యాంత్రిక భౌతికవాద వ్యాఖ్యల ఎరల భారిన చారిత్రక భౌతికవాదం పడకుండా అప్రమత్తులై ఉండాలి.

మానవ అస్తిత్వ భౌతిక పునాదిని శాస్త్రీయంగా అధ్యయనం చేసిన ప్రథమ ప్రయత్నం 1844 ఆర్థిక తాత్విక రాత ప్రతులలో ఉంది. అంతే కాకుండా భావ భౌతిక వాదాల మధ్య జరుగుతున్న అవిరామ తాత్విక ఘర్షణలో అది విజయం సాధించింది. 'నేను ఆలోచిస్తున్నాను కనుక నేను ఉన్నాను' అన్న డీకార్టే మాటలకు 'నేను ఉన్నాను కనుక నేను ఆలోచిస్తున్నాను'. (నా అస్తిత్వమే నా చైతన్యానికి పునాది) మార్క్స్ జవాబునివ్వడం – మార్క్స్ ప్రాపంచిక దృక్పథం నుండే పుట్టింది. మార్క్సిజం ఒక విప్లవ విజ్ఞాన శాస్త్రం. విప్లవం దాని విధానం. లెనిన్ ఒక సందర్భంలో ఇలా అన్నాడు – 'వాస్తవ పరిస్థితుల యదార్థ విశ్లేషణ, మారుతున్న వాస్తవాలపై లోపాలతో కూడిన విలువలు కడితే విశ్లేషణ అవుతుంది. మారుతున్న పరిస్థితులపై విశ్లేషణ తప్పయితే మారుతున్న వాస్తవాల విలువలు సరిగానే ఉన్నా, అప్పుడు కూడా విప్లవోద్యమం గాడితప్పే ప్రమాదం ఉంది'. అని లెనిన్ అన్నాడు.

'సిద్ధాంతంలో ఉన్న వ్యతిరేకించ శక్యం గాని ఆకర్షణ, ప్రపంచ దేశాల సోషలిస్టులను తనలో కలుపుకుంది. వాస్తవంలో దాని గుణంలో ఉన్న ఖచ్చితతత్వం, అత్యున్నత శాస్త్రీయతకు, విప్లవాత్మకతను జోడించింది. ఇది యాదృచ్ఛికం కాదు. ఈ సిద్ధాంత ఆవిష్కర్త వ్యక్తిత్వంలోనే శాస్త్రవేత్త, విప్లవకారుల గణాలు సమ్మిళితమై ఉన్నాయి'. అని మార్క్సిజం గురించి లెనిన్ వివరించాడు.

మార్క్స్ తనకు ముందున్న ఆడమ్ స్మిత్, డేవిడ్ రికార్డోల సిద్ధాంతాలను విశ్లేషించి అదనపు విలు పేరుతో సిద్ధాంత రచన చేశారు. ఈ గ్రంథంలో ఒక వస్తువు విలువ, అదనపు విలువ, దోపిడీ సిద్ధాంతాలను మార్క్స్ ప్రతిపాదించాడు. 1864లో ఏర్పడిన అంతర్జాతీయ కమ్యూనిస్ట్ సంస్థ జనరల్ కౌన్సిల్‌కు మార్క్స్ ఎన్నికయ్యాడు. ఈ సంస్థ కార్యాలయం 1872లో లండన్ నుండి న్యూయార్క్‌కు మారింది. ఈ కాలంలోనే జరిగిన అతి ముఖ్యమైన సంఘటన పారిస్ కమ్యూన్ (1871). ప్రభుత్వంపై పారిస్ ప్రజలు తిరుగుబాటు చేశారు. విప్లవకారుల చేతుల్లో పారిస్ రెండు నెలలు ఉండింది. తరువాత ప్రభుత్వం క్రూరమైన అణిచివేతకు బలైపోయింది. దీనిని ఫ్రాన్‌లో అంతర్యుద్ధం పేరుతో విశిష్టమైన రచన చేశారు.

# సామ్రాజ్యవాదం ఉన్నంతవరకు యుద్ధం అనివార్యం

***సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాలు తమ స్వార్థ మార్కెట్ ప్రయోజనాల కోసం ప్రపంచ దేశాలపై యుద్ధం అనే భయాన్ని ఎల్లప్పుడూ నిలిపి ఉంచుతాయనీ, సామ్రాజ్యవాదం సమసిపోతేనే ప్రపంచ శాంతి నెలకొంటుందనీ అంటున్నారు సత్యం***

**1914** ఆగస్టులో ప్రారంభమైన మొదటి ప్రపంచ యుద్ధం 1918 నవంబర్ 11న అమెరికా, జర్మనీపై వర్సెయిల్స్ రుద్దిన ఒప్పందంతో ముగిసింది. వందేళ్లు ముగిసిన సందర్భంగా అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్ ఇతర 70 దేశాల ప్రతినిధులు ఫ్రాన్స్‌లో సంస్మరణ సభలను నిర్వహించారు. సామ్రాజ్యవాద అగ్రరాజ్యం, ఇతర సామ్రాజ్యవాద దేశాలు నిర్వహించిన ఆ సమావేశం ప్రపంచ శాంతి కోసం యుద్ధాలను అణిచి వేయాలని తీర్మానించాయి, పిలుపునిచ్చాయి. 'మోసపూరిత శాంతి దూతలు వెనక్కి వెళ్లండి' అని నినదిస్తూ అమెరికా అధ్యక్షుడు ట్రంప్ పెరేడ్‌ను అడ్డుకున్న ముగ్గురు నిరసనకారులను ఫ్రాన్స్ పోలీసులు అరెస్ట్ చేశారు.

'ప్రపంచ శాంతి' కోసం సామ్రాజ్యవాదులు వెంపర్లాడడం చరిత్రలో కొత్తేమీ కాదు. ప్రపంచ ప్రజలను, మూడవ ప్రపంచ దేశాలను అణిచివేసే 'ప్రపంచాధిపత్యం శాంతి' వారికి కావాల్సింది. మొదటి ప్రపంచ యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమే తప్ప ప్రజల ప్రయోజనాలకు సంబంధించిన యుద్ధం కాదనేది చారిత్రక వాస్తవం. మొదటి ప్రపంచ యుద్ధం ఆ వెన్వెంటనే రష్యాలో జయప్రదమైన బోల్షివిక్ విప్లవం, కొన్ని దేశాలలో జరిగిన అంతర్యుద్ధాలు ప్రపంచం తమ ఆధిపత్యం కింద ఉండాలనే సామ్రాజ్యవాదుల పన్నాగాలు కొనసాగవని ప్రజలు తిప్పికొడతారని నిరూపించాయి.

### మొదటి ప్రపంచ యుద్ధ పూర్వాపరాలు

సామ్రాజ్యవాదం ఉనికిలో ఉన్నంత కాలం యుద్ధాలు అనివార్యం. పెట్టుబడిదారీ అగ్రశక్తుల మధ్య వైరుధ్యాలు బద్ధలైన కారణంగానే మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. పెట్టుబడిదారీ వ్యవస్థ లాభాలు సంపాదించడం ఎంత సహజమో యుద్ధాలు రావడం కూడా అంతే సహజం. 1914లో ప్రారంభమైన ఈ యుద్ధం యూరప్‌ను రక్తపుటేరుల్లో ముంచింది. మానవజాతి చరిత్రలో వినాశకరమైన యుద్ధమిది.. యూరప్‌లో 50 ఏండ్ల ముందు నుంచే ఉద్రిక్తతలు క్రమేణా పెరుగుతూ వచ్చాయి. అయితే పెద్ద సంఘర్షణ పశ్చిమ దేశాల మధ్య నెలకొనలేదు. 1870-71 ఫ్రాంక్ ప్రష్యన్ యుద్ధం (పారిస్ కమ్యూన్) తరువాత నుండి పెద్ద రాజ్యాలు తమ ఆయుధ సంపత్తిని పెంపొందించుకోవడం మొదలైంది. ఈ పరిణామం ఒక కల్లోల పరిస్థితిని సృష్టించింది. 1914 జూన్ 28న సెర్బియాకు చెందిన సారయెవోలో ఆస్ట్రియా సింహాసనానికి వారసుడు ఆర్చ్‌డ్యూక్ ఫెర్నినాండ్, అతని భార్య హత్యకు గురయ్యారు. ఈ సంఘటన యుద్ధోద్రిక్తలకు ఆజ్యం పోసింది. ఒక సెర్బియన్ జాతీయవాది ఈ హత్య చేశాడు. ఏ చిన్న ఘటన అయినా యుద్ధాన్ని రగల్చగల పరిస్థితి ఆనాడుంది. ఈ యుద్ధంలో చిక్కుకున్న దేశాలన్నీ తాము పవిత్రంగా ఉన్నట్లూ తమ జాతి ఆత్మరక్షణకు తాము యుద్ధంలోకి తప్పనిసరై దిగవలసి వచ్చినట్లూ చెప్పుకున్నారు.

వాస్తవంగా యుద్ధం దరిచేరకముందే, దశాబ్దం క్రితమే లెనిన్, బోల్షివిక్కులు యుద్ధం తప్పదని గ్రహించారు. ఏంగెల్స్ కూడా లెనిన్ కంటే ముందుగానే యుద్ధంపై అంచనా వేశారు. యుద్ధం తటస్థించిన పక్షంలో సోషలిస్టుల విప్లవ వైఖరిని నిర్ణయించడానికి లెనిన్ కొన్ని సూచనలు అంతర్జాతీయ సోషలిస్టు కాంగ్రెస్‌లో తెలియజేశారు.

పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించుకునే యుద్ధం అనివార్యంగా ఉంటుందని లెనిన్ తెలియజేశారు. విదేశీ భూమిని దోచుకోవడం, వలస రాజ్యాలను వశపరుచుకొని దోపిడీ చేయడం, కొత్త మార్కెట్లను వశపరుచుకోవడం, ఇవే అనేకసార్లు పెట్టుబడిదారీ ప్రభుత్వాలు చేసే దురాక్రమణ, యుద్ధాలకు కారణమయ్యాయి. పెట్టుబడిదారీ దేశాల దృష్టిలో కార్మిక వర్గాన్ని దోచుకోవడం, లాభాలను సంపాదించడం, ఎంత సహజమైన, న్యాయమైన విషయమో యుద్ధం కూడా అంత సహజమైన, న్యాయమైన విషయమే.

---

మార్క్స్ తన కాలపు విమర్శనాత్మక మత ధార్మిక పండితులు (బ్రూనో బాయర్), హెగెల్ గతితర్క, సాధారణ తత్వశాస్త్రాలపై విమర్శనాత్మక విశ్లేషణ రాస్తూ 'సమస్యల మూలాలను మత ధార్మిక పండితులు పట్టుకోలేరు, ఎంత నిష్ణాతుడైనా మత ధార్మికుడు మత ధార్మికుడే. ఎందువల్లంటే అతడు మన మతతత్వ సిద్ధాంతాలు సాధికారమైనవని ముందు భావన ఏర్పరచుకుంటాడు. ఈ క్రమంలో ఇతరుల సిద్ధాంత ఆవిష్కరణలు తన ముందుకు వస్తే వాటిని అనుమానిస్తాడు. పిరికివాడిలా తిరస్కరిస్తాడు. అందుకు కారణాలు చెప్పలేదు. వాటి సారాన్ని గ్రహిస్తాడు. వాటిపట్ల నిశ్చేష్టతను ప్రదర్శిస్తాడు. ఈ నిశ్చేష్టతలోని తిరస్కారం-వ్యతిరేకార్థ, చైతన్యరహిత పెడ మార్గం పట్టించేదిగా ఉంటుంది.' అన్నాడు.

మత ధర్మశాస్త్రంను లోతుగా పరిశీలిస్తే ప్రారంభంలో అభివృద్ధి కరమైదిగా కనబడుతుంది. అంతిమంగా అది పురాతన తత్వశాస్త్రంతో సంగమించి, దాని కొనసాగింపుగా ఉంటుంది. హెగెల్ తత్వశాస్త్రంలోని అధిగమించడం అనే భావన వికృతించిన మత ధర్మశాస్త్రం వ్యంగ్య చిత్రం. ఇది మత ధర్మశాస్త్రాన్ని కృంగదీస్తున్న కర్మఫల దేవత. ఇది తత్వశాస్త్రం విషాదం.

మార్క్స్ మానవ చరిత్రను లోతుగా పరిశీలించాడు. వర్గ పోరాటం ద్వారా వర్గ రహిత సమాజ సాధనే సర్వమానవ జాతికి విముక్తి దాయకం అని చాటి చెప్పడమే మార్క్స్‌కు మనమిచ్చే నివాళి!

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

19వ శతాబ్దం చివరలోనూ, 20వ శతాబ్దం ప్రారంభంలోనూ పెట్టుబడిదారీ విధానం, నిశ్చితంగా తన అభివృద్ధి ఉన్నత దశలో ప్రవేశించింది. ఇది దాని అంతిమదశ. సామ్రాజ్యవాద దశ. అలాంట ప్పుడు ముఖ్యంగా యుద్ధాలు అనివార్యమయ్యాయి. సామ్రాజ్యవాదం కింద, శక్తివంతమైన పెట్టుబడిదారీ సంస్థలు (మోనోపలీలు అంటే గుత్త వ్యాపారసంస్థలు) బ్యాంకులు, పెట్టుబడిదారీ ప్రభుత్వాల జీవితంతో ప్రాబల్యమైన స్థానాన్ని ఆక్రమించాయి. పెట్టుబడిదారీ దేశాల్లో ఫైనాన్స్ పెట్టుబడి యజమాని అయింది. ఫైనాన్స్ పెట్టుబడికి మార్కెట్లు కావాలి. కొత్త వలస దేశాలు కావాలి. పెట్టుబడిని ఎగుమతి చేయడానికి కొత్త రంగాలు, ముడి పదార్థాలు దొరికే ప్రదేశాలు కావాలి.

19వ శతాబ్దం చివరికి ప్రపంచమంతా అప్పటికే పెట్టుబడిదారీ ప్రభుత్వాల మధ్య విభజింపబడి ఉంది. అయినప్పటికీ సామ్రాజ్యవాద శకంలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి అసమానంగానూ, గంతులు వేస్తూ కొనసాగుతుంది. పెట్టుబడిదారీ విధాన అసమానాభివృద్ధి సూత్రమది. ఇంతకు పూర్వం అత్యంత అగ్రస్థానంలో ఉన్న కొన్ని దేశాలు, ఇప్పుడు పూర్వంతో పోల్చి చూసినప్పుడు చాలా నెమ్మదిగా తమ పరిశ్రమలను అభివృద్ధి చేసుకుంటున్నాయి. ఇదివరలో వెనకబడి ఉన్న మరికొన్ని దేశాలుపై వాటిని అతిక్రమించి త్వరితగతిన గంతులువేస్తూ మించిపోయి, తమ పరిశ్రమలను వృద్ధి చేసుకున్నాయి. లెనిన్ ఈ విషయాన్ని స్పష్టం చేశారు. ఉదాహరణకు 1960లో ఇంగ్లండు బొగ్గు, దుక్క ఇనుము ఉత్పత్తి మొత్తం ప్రపంచ ఉత్పత్తిలో సగానికి ఉంటే 1913 వచ్చేనాటికి అవి 22 శాతం, 13 శాతానికి పడిపోయాయి. అదే కాలంలో బ్రిటన్‌కు ప్రత్యర్థులైన జర్మనీ, అమెరికాలలో విపరీతంగా పారిశ్రామికాభివృద్ధి జరిగింది.

1899-1913 మధ్య యునైటెడ్ స్టేట్స్, జర్మనీలలో ఉక్కు ఉత్పత్తి 3 రెట్లు పెరిగితే, బ్రిటిష్ ఉక్కు ఉత్పత్తి ఇదే కాలంలో 50 శాతం మాత్రమే పెరిగింది. 1913 నాటికి అమెరికాయే ప్రధాన పారిశ్రామిక శక్తి అయింది.

అలాగే సామ్రాజ్యవాద ప్రభుత్వాల పరస్పర ఆర్థిక సైనిక బలాలలో మార్పు వస్తోంది. ప్రపంచాన్ని తిరిగి విభజించుకోవాలనే ప్రయత్నం ప్రారంభమైంది. ఈ పునర్విభజనకో సాగే పోరాటం యుద్ధం అనివార్య మైనట్లు చేసింది. 1914 యుద్ధం ప్రపంచాన్ని తిరిగి పంచుకోవడానికి, కొన్ని ప్రాంతాలపై పెత్తనం సంపాదించుకోవడానికి జరిగిన యుద్ధమే. సామ్రాజ్యవాద ప్రభుత్వాలన్నీ దాని కోసం చాలా కాలం నుండి సన్నాహం చేస్తున్నాయి. ఈ అగ్ర దేశాలన్నీ యుద్ధ నేరస్తులే, బాధ్యులే - రెండు యుద్ధ కూటాలను ఏర్పర్చుకున్నారు. జర్మనీ, ఆస్ట్రియా, హంగేరీ, బల్గేరియా, టర్కీ, ఇటలీ ఒక కూటమి (ట్రిపుల్ అలయెన్స్). గ్రేట్ బ్రిటన్, రష్యా, ఫ్రాన్స్, యునైటెడ్ స్టేట్స్ జపాన్ మరొక కూటమి (ట్రిపుల్ ఎంటిటీ). కాని యుద్ధం ప్రారంభమయ్యాక ఇటలీ పైముఠాను విడిచి ట్రిపుల్ అలయెన్స్‌లో చేరింది. జర్మన్ నౌకా బలాలు పెరగడం చూసి బ్రిటన్ భయపడింది.

బ్రిటన్, ఫ్రాన్స్ నుండి వలస రాజ్యాలను, రష్యా నుండి ఉక్రెయిన్, పోలెండు, బాల్టిక్ రాష్ట్రాలను కాజేయాలనే ఉద్దేశంతో (పశ్చిమాసియా ఖండంలో) బ్రిటన్ పెత్తనానికి, జర్మనీ ప్రమాదం ముప్పు తెచ్చిపెట్టింది. జారిస్టు రష్యానేమో టర్కీని విభజించి, నల్ల సముద్రం నుండి మధ్యధర సముద్రం వరకున్న ప్రాంతాలు-డార్డినెల్స్ వరకూ కావాలని తాపత్రాయం. ఆస్ట్రియా, హంగరీలలో భాగమైన 'గనీషియా' కూడా రష్యాకు కావాలి. బ్రిటన్‌కు ధన సరుకులను ప్రపంచ మార్కెట్టు నుండి తన ప్రమాదకరమైన ప్రత్యర్థి అయిన జర్మనీని నాశనం చేయడం అవసరం. ఇంకా టర్కీకి చెందిన మెసపటోమియా, పాలిస్టయిన్‌లను కాజేసి ఈజిప్టులో తిష్టవేయా లని బ్రిటన్ దుర్బుద్ధి. ఫ్రెంచి పెట్టుబడి దారులకు జర్మనీ నుండి దోచేసిన, ఐరన్‌రిచ్ ఆల్సెయిస్ - లాయిన్‌లను కాజేయాలి. పెద్ద శక్తి అమెరికాకు ఏం కావాలి? ఈ యుద్ధాన్ని అవకాశంగా తీసుకుని ప్రపంచాధిపత్యం సంపాదించాలని దాని ఎత్తు.

1914 జూన్ 28న యుద్ధం ప్రారంభమైంది. ఆస్ట్రియా, సెర్బియాపై దాడి చేసింది. ఆ తరువాత రష్యా బయలుదేరింది. రష్యాకు వ్యతిరేకంగా ఆగస్టు 1న యుద్ధం ప్రకటించింది. ఫ్రాన్స్ 3న రంగంలోకి దిగింది. మరొక్క రోజు ఆలస్యంగా బ్రిటన్ ప్రవేశించింది. అటు తరువాత తక్కిన దేశాలన్నీ దిగాయి. అమెరికా మాత్రం జాగ్రత్తగా బయటి ఉండి యుద్ధంలో మునిగి ఉన్న తన మిత్రులందరికీ ఆయుధాలు అమ్మి లాభాలు సంపాదిస్తోంది. కాని తన మిత్ర మండలి ఓడిపోతున్న సమయంలో 1917 ఆగస్టు 16న తానూ ఆత్మరక్షణకేనంటూ రంగంలోకి దిగింది. జపాన్ కూడా యుద్ధంలోకి దిగింది. ఈ యుద్ధం ప్రపంచ యుద్ధంగా మారింది. సామ్రాజ్యవాద యుద్ధ ప్రయత్నాలను గురించి ప్రపంచ ప్రజలకు తమ దేశాల ప్రజలకు ఏమీ తెలియకుండానే పెట్టుబడిదారులు అతి రహస్యంగా ఉంచారు. యుద్ధం ప్రారంభం కాగానే ప్రతి సామ్రాజ్యవాద ప్రభుత్వమూ, తాను తన పొరుగు దేశాలపై దాడి చేయలేదని, తనపైనే అవి దాడి చేశాయని రుజువు చేయడానికి ప్రయత్నించింది. నిజమైన యుద్ధ లక్ష్యాలను కప్పిపుచ్చుతూ, దాని సామ్రాజ్యవాద దురాక్రమణ స్వభావాన్ని కప్పిపుచ్చుతూ, పెట్టుబడిదారులు వారికి ప్రాతినిధ్యం వహించే ప్రభుత్వాలు ప్రజలను మోసగించాయి. తన దేశ రక్షణ కోసమే తాను యుద్ధం చేస్తున్నానని ప్రతి సామ్రాజ్యవాద ప్రభుత్వమూ ప్రకటించింది.

ఈ సామ్రాజ్యవాద ప్రభుత్వాలు 2,70,000,000,000 డాలర్లు (ప్రజా ధనమే) ఖర్చుపెట్టి 1565 రోజులు యుద్ధాన్ని కొనసాగించాయి. కోటి మంది చనిపోయారు. రెండు కోట్ల మంది వికలాంగులయ్యారు. 50 లక్షల మంది భర్త హీనులైనారు. కోటి మంది బాల బాలికలు తల్లిదండ్రులను కోల్పోయారు. మారణ హోమం జరిగిపోయింది.

16వ శతాబ్దంలో అనుకుంటాను పశ్చిమ దేశాల మానవాళిని ముంచెత్తిన 'బ్లాక్ డెత్' తరువాత జరిగిన వినాశనకర విపత్తయింది. ప్రకృతి వైపరీత్యాల కంటే సామ్రాజ్యవాద ప్రభుత్వాల లాభాల వేట ప్రపంచ మానవాళికి చాలా ప్రమాదకరమైందని ఈ యుద్ధం రుజువు చేసింది.

చివరికి జర్మనీ ఏకాకి అయింది. తిరుగుబాటు జరిగి జర్మనీ ఎంపరర్ పదవీ భ్రష్టుడయ్యాడు. కొత్త పాలకుడు విల్సన్ (యుఎస్ఎ అధ్యక్షుడు) 14 అంశాల ఒప్పందాన్ని అంగీకరించాడు. 1918 నవంబర్‌లో యుద్ధం ఆగిపోయింది. రవి అస్తమించని సామ్రాజ్యవాదం బ్రిటన్ మొదటి సారిగా పెద్ద దెబ్బతిన్నది..

'విజేతలయిన' అమెరికా అధ్యక్షుడు విల్సన్, లాయిడ్ జార్జ్ (బ్రిటన్), క్లెమెన్సీ (ఫ్రాన్స్), ఆర్‌లాంజో (ఇటలీ) ఈ నలుగురు నిర్ణయాలు తీసుకునే బాధ్యయత తీసుకున్నారు. యుద్ధానంతర శాంతి పట్ల అమెరికా అగ్ర శక్తికి మిగిలిన యూరప్ అగ్ర శక్తులకు మధ్య విబేధాలున్నాయి..

చివరికి 1919 జూన్ 28న వార్సెయిల్స్ ఒప్పందం జరిగింది.

ఇతర 4 ఒప్పందాలు కూడా జరిగాయి. వర్సెయిల్స్ ఒప్పందం గురించి సుప్రసిద్ధ చరిత్రకారుడు ఇ.ఎచ్. కార్ ఇలా చెప్పారు.

'వర్సెయిల్స్ ఒప్పందం అనేది పై నుండి రుద్దబడిన శాంతి. యుద్ధాన్ని అంతం చేసే ప్రతి ఒప్పందం దాదాపుగా పై నుండి రుద్దబడిన (డిక్టేటర్) శాంతే. ఎందుకంటే ఓడించబడిన శక్తి ఏదీ తన ఓటమి ఫలితాలను ఉన్నదూ ఇష్టపూర్వకంగా ఒప్పుకోదు. ఈ వాస్తవం ఆధునిక కాలంలో కుదిరిన ఏ శాంతి ఒప్పందం కంటే కూడా వార్సెయిల్స్ విషయంలో స్పష్టంగా తెలుస్తుంది'.

జర్మనీ ప్రతినిధులు లేకుండా వార్సెయిల్స్ ఒప్పందాన్ని అగ్ర దేశాలు రూపొందాయి. మిత్ర రాజ్యాలకు యుద్ధ ఖర్చులు, నష్టపరిహారం చెల్లించడంపై వారెసయిల్స్ ఒప్పందంలో ఒక క్లాజు పెట్టారు. భూ భాగం, సముద్రం, ఎయిర్‌లను నష్టపరిహారంగా తమ అధీనంలోకి తీసుకున్నారు. అయితే 1932లో ఈ క్లాజులో కొన్ని అంశాలను రద్దు చేశారు.

ఇక మిలటరీపరంగా – ఒకలక్ష కంటే సైన్యం ఎక్కువగా ఉండకూడదు. ఆధునిక ఆయుధాలు ఏవీ ఉండకూడదు. 6 యుద్ధ నౌకలు మాత్రమే ఉండాలి. 6 లైట్ క్రూయిజర్స్, 12 డెస్ట్రాయర్స్, 12 టార్పిడో బోట్స్ మాత్రమే ఉండాలి. అలాగే యుద్ధ విమానాలను రద్దు చేశారు. ఆయుధాలు, మందుగుండు సామాగ్రిలపై నిషేధం విధించబడింది.

ఇది అవమానకరమైన ఒప్పందమే. అగ్ర దేశాల చేత ఈ 'రుద్దబడిన వార్సెయిల్స్ శాంతి ఒప్పందం' ఒక విధంగా రెండవ ప్రపంచ యుద్ధానికి బీజాలు నాటింది. ప్రపంచ రాజకీయ చిత్రపటం మారిపోయింది.

జర్మనీ సోషల్ డెమోక్రటిక్ పార్టీ నాయకత్వంలోని రెండవ ఇంటర్నేషనల్ 'ఫాదర్‌లాండ్' రక్షణ పేరుతో పెట్టుబడిదారీ పాలక వర్గాల పాద సేవ చేసింది. ఒకవేళ లెనిన్ మహాశయుడు ప్రబోధించిన 'ఇది సామ్రాజ్యవాద యుద్ధమే' 'కార్మికులకు మాతృ దేశం లేదు' 'కార్మికవర్గ అంతర్జాతీయత' – 'యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చండి' అనే ఉపదేశాలను బాస్లే ప్రణాళికను అనుసరించి ఉంటే జర్మనీ పాలక వర్గాల దూకుడును జర్మన్ ప్రజలే అదుపు చేసేవాళ్లు. యూరోపియన్ దేశాల్లోని దాదాపు 90 శాతం సోషల్ డెమోక్రటిక్ పార్టీలు పెట్టుబడిదారీ అగ్ర దేశాలలోని పాలక వర్గాలను తుంగలో తొక్కి విప్లవాలను విజయ ప్రదం చేయగలిగిన పరిస్థితి ఆనాడుంది. అయితే ఆ పార్టీలు పెట్టుబడిదారీ దేశాల జాతీయ పాద దురహంకారంలో కొట్టుకుని పోయాయి. కార్మికవర్గం ఉద్యమంలోని కార్మిక ప్రభువర్గం అవకాశవాదం జాతీయవాద దురహంకార రూపాన్ని సంతరించుకుంది. 'ఫాదర్‌లాండ్' రక్షణ అనే నినాదాన్ని చేపట్టి ఆయా దేశాల పాలక వర్గాలకు దన్నుగా నిలబడ్డాయి. ఒక రష్యాలో మాత్రమే లెనిన్ నేతృత్వంలో కార్మికవర్గ విప్లవం జయప్రదమయింది. యుద్ధకాలంలో ఆ విప్లవాన్ని, కార్మికవర్గ రాజకీయాధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం జర్మనీతో బ్రెస్టోలివిస్కీ ఒప్పందాన్ని కుదుర్చుకోవాల్సి వచ్చింది. కొంత ఊపిరి, విశ్రాంతి తీసుకున్న లెనిన్ కార్మిక వర్గనియంతృత్వాన్ని సంఘటితపర్చాడు.

వ్యాస విస్తరణకు నేను ఆ వివరాలకు వెళ్లదల్చుకోలేదు.

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత లీగ్ ఆఫ్ నేషన్స్ ఏర్పడింది. సామ్రాజ్యవాద దేశాల తగువులను తీర్చే అంతర్జాతీయ సంస్థ అది.

**'సామ్రాజ్యవాదం ఉనికిలో ఉన్నంతవరకు యుద్ధం అనివార్యం'**

కమ్యూనిజం వ్యతిరేకతను పెట్టుబడిదారీ దేశాలు బాహాటంగానే ప్రకటించాయి. అవి ప్రజాస్వామ్య దేశాలని తమని తాము ప్రకటించుకున్నాయి. అవి సారాంశంలో బూర్జువా ప్రజాస్వామిక దేశాలే. తిరిగి కోలుకున్న జర్మనీ కమ్యూనిస్టు వ్యతిరేకత తన విధానమని ప్రకటించింది. పశ్చిమ దేశాలు అమెరికా – జర్మనీని సంతృప్తి పరిచే (అప్పిజ్‌మెంట్ పాలసీ) విధానాన్ని అవలంభించాయి. జర్మనీకి దన్నుగా నిలబడ్డాయి. స్టాలిన్ నాయకత్వంలోని మూడవ ఇంటర్నేషనల్ అనుసరించిన విధానాలు జర్మనీని కట్టడి చేశాయి.

తిరిగి ప్రపంచాధిపత్యం కోసం సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దేశాల రెండవ ప్రపంచ యుద్ధం జరిగింది. మొదటి ప్రపంచ యుద్ధం కంటే అతి వినాశకర మారణ హోమంతో ఆ యుద్ధం జరిగింది. మళ్లీ యూరప్ రక్తసిక్తమయింది.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత రవి అస్తమించని సామ్రాజ్యవాదం బ్రిటన్ కుప్పకూలింది. స్టాలిన్ నాయకత్వంలో రష్యా సోషలిస్టు మార్గంలో ప్రయాణించింది. మావో నాయకత్వంలో చైనా విముక్తమయింది. ప్రపంచ సోషలిస్టు శిబిరం ఏర్పడింది. ఈ పరిణామంతో (మూడవ ప్రపంచ దేశాలు) అలీన దేశాల సదస్సు బాంటుంగ్ (1955 ఇండోనేషియా) లో జరిగింది. చైనా తాను మూడవ ప్రపంచ దేశమేనని ప్రకటించుకుంది. బాంటుంగ్ సమావేశానికి చైనా ప్రధాని చెఎన్.లై, భారత ప్రధాని నెహ్రూ, ఈజిప్ట్ ప్రధాని నాజర్ తదితరులు హాజరయ్యారు. అమెరికా, రష్యాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం (కోల్డ్‌వార్) ప్రారంభమైంది. స్టాలిన్ మరణానంతరం రష్యాలో తిరిగి పెట్టుబడిదారీ విధానం క్రమేణా పునరుద్ధరించబడింది. మావో నాయకత్వంలో చైనా కృశ్చేవ్ నాయకత్వంలో రష్యా సిద్ధాంత పోరాటం బృహత్తర చర్చగా (గ్రేట్ డిబేట్) కొనసాగింది. గ్రేట్ డిబేట్ సారాంశం 'కార్మికవర్గ నియంతృత్వాన్ని సుసంఘటితం చేసుకుని ప్రపంచ విప్లవాన్ని ముందుకు తీసుకెళ్లాలా? లేదా? అనేదే'. మావో కార్మిక వర్గ సిద్ధాంత పోరాటంలో ముందు నిలిచారు. లెనిన్ 'కార్మికవర్గ నియంతృత్వమంటే నూతన తరహాలో వర్గ పోరాటాన్ని కొనసాగించడమే' అని అన్నారు. కృశ్చేవ్ రివిజనిజం లెనిన్, స్టాలిన్‌ల బోధనలను నిరాకరించి బెర్న్‌స్టీన్ ఆర్థివాదానికి దాసోహం చేసింది. సోషలిజంలో కార్మిక వర్గ నియంతృత్వానికి తిలోదకాలు వదిలి కార్మికవర్గ రాజకీయాల స్థానే ఆర్థికవాదంలోకి కొట్టుకెళ్లి రష్యాను సామ్రాజ్యవాద అగ్ర రాజ్యంగా రూపొందించింది. తూర్పు యూరప్ దేశాలలో పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరించబడింది.

కమ్యూనిజం వ్యతిరేకత, జాతీయ విముక్తి పోరాటాలను అణిచి వేసేందుకు అమెరికా అగ్రరాజ్యం ముందుకు వచ్చింది. వియత్నం యుద్ధంలో చావుతప్పి బయటపడింది.

కార్మికవర్గ నియంతృత్వమంటే నూతన తరహాలో వర్గ పోరాటాన్ని కొనసాగించడమేనని మావో నాయకత్వాన జరిగిన మహత్తర సాంస్కృతిక విప్లవం మరోసారి తేల్చి చెప్పింది. మావో మరణానంతరం చైనాలో జరిగిన ఒక దశాబ్ది పరిణామాలు, డెంగ్ విధానాలు బెర్న్‌స్టీన్ ఆర్థిక విధానానికి కొట్టుకెళ్లాయి. సాంస్కృతిక విప్లవాన్ని చైనా జాతి కల్లోలంగా డెంగ్ అభివర్ణించాడు. అక్కడ క్రమేణా పెట్టుబడిదారీ విధానం చోటు చేసుకున్నది.

లెనిన్ ఇలా అన్నారు – *కార్మికవర్గ స్థావర ప్రాంతాలన్నీ కూలిపోయి తిరిగి ప్రపంచ విప్లవం ప్రారంభమవుతుంది.*

మావో ఇలా అన్నారు – *'యుద్ధం వచ్చి విప్లవాలు ఆరంభం కావచ్చు లేదా విప్లవాలు వచ్చి యుద్ధం నివారించబడొచ్చు. ఏది ఏమైనా ఇది విప్లవాల యుగం'.*

# మొక్కుబడి కటోవిస్ వాతావరణ ఒప్పందం

***పర్యావరణ ఒప్పందాలు చేసుకుంటూనే లాభాలే లక్ష్యంగా పెట్టుబడిదారీ దేశాలు, మూడవ ప్రపంచ దేశాలపై పర్యావరణ నిబంధనలు విధిస్తూ, ప్రతిరోజు వదులుతున్న ఉద్గారాల వల్ల మానవాళి మనుగడకే ప్రమాదముందని అంటున్నారు సంతోష్***

వాతావరణ మార్పుల సవాళ్లను ప్రపంచ దేశాలు ఉమ్మడిగా ఎదుర్కొనే లక్ష్య సాధనలో భాగంగా పారిస్ వాతావరణ ఒప్పందాన్ని అమలులోకి తీసుకువచ్చే ఆచరణాత్మక ప్రణాళికల్ని రూపొందించే లక్ష్యంతో 2018 డిసెంబర్ 3 నుంచి 15 వరకు పోలండ్‌లోని కటోవిస్ నగరం వేదికగా కాప్-24 సమావేశాలు జరిగాయి. 'మానవాళి మనుగడపై తీవ్ర ప్రభావం చూపే వాతావరణ ప్రమాదం నుండి బయట పడడానికి ఇప్పటికీ మనం చేయాల్సినంత చేయడం లేదు. చేయాల్సినంత వేగంతోనూ చేయడం లేదు'. పోలెండ్‌లోని కటోవిస్‌లో జరుగుతున్న వాతావరణ సదస్సులో ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ఆంటోనియో గుటేరస్ వ్యక్తం చేసిన ఆవేదన ఇది! నిజానికి ఈ ప్రమాద ఘంటికలు కొత్తవేమీ కాదు! కొన్ని దశాబ్దాలుగా పర్యావరణ నిపుణులు, శాస్త్రవేత్తలు చెబుతున్నవే! వాతావరణ మార్పులపై భాగస్వామ్య దేశాల 24వ సదస్సు (సిఒపి-24) పోలెండ్‌లోని కటోవిస్‌లో వివిధ అంశాలపై కుస్తీ పడుతుంటే, దానికి సమాంతరంగా వాతావరణ మార్పుల పట్ల అగ్ర దేశాలు, ముఖ్యంగా అమెరికా అనుసరిస్తున్న ఏకపక్ష, నిర్లక్ష్య వైఖరిపై ఆగ్రహం వ్యక్తం చేస్తూ పలు నగరాల్లో ప్రజలు నిరసన ప్రదర్శనలకు దిగారు. బెర్లిన్, లండన్, బ్రసెల్స్‌లో ఈ తరహా ప్రదర్శనలు జరిగాయి.

**ముందుకెళ్లని ప్యారిస్ ఒప్పందం కార్యాచరణ**

వాతావరణ మార్పులో ఎవరి వాటా ఎంత అన్నది ఇప్పటికీ తేలని అంశం. దీనికి సబంధించి చారిత్రక బాధ్యతలను గుర్తించేది లేదని అమెరికా ఇప్పటికే తెగేసి చెప్పిన విషయం తెలిసిందే. పర్యావరణానికి ఎవరు ఎంత హాని చేశారో, అంతమేర కాలుష్యాన్ని తగ్గించు కునేందుకు సిద్ధపడాలి. ప్యారిస్ ఒప్పందం సైతం గుర్తించిన వాటాల ప్రాతిపదికను కూడా అంగీకరించడానికి అభివృద్ధి చెందిన దేశాలు సిద్ధంగా లేవు. జాతీయ లక్ష్యాల నుండి, ఆర్థిక వనరుల వరకు ప్రతి అంశంలోనూ వాటాల మేరకు వ్యవహరించాల్సి రావడం, నిధులు కేటాయించాల్సి ఉండడంతో అభివృద్ధి చెందిన దేశాలు ఈ ప్రతిపాదనకు ససేమిరా అంటున్నాయి. వాతావరణ మార్పుల దుష్ప్రభావాలపై ఏటికేడు ప్రపంచ వ్యాప్తంగా ఆందోళన పెరుగుతుండడానికి తోడు, పెద్ద దేశాల భిన్న వైఖరుల నేపథ్యంలో తాజా సదస్సు ప్రత్యేకతను సంతరించుకుంది. భూతాపం మహమ్మారిని నియంత్రించడంపై దశాబ్దాలపాటు జరిగిన చర్చల తరవాత మూడేళ్ల క్రితం (2015) పారిస్‌లో 196 దేశాలు ఒకే గొడుగు కిందకు వచ్చాయి.

భౌగోళికంగా, ఆర్థికంగా, జనాభా పరంగా, వనరుల పరంగా చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా భూతాపాన్ని నిలువరించేందుకు సదరు దేశాలన్నీ వాతావరణ మార్పుల ఒప్పందంపై సంతకాలు చేశాయి. భూతాపాన్ని రెండు డిగ్రీలకు తగ్గించడం, కర్బన ఉద్గారాల నియంత్రణలో పేద, అభివృద్ధి చెందుతున్న దేశాలకు సంపన్న దేశాలు ఆర్థిక చేయూత అందించడం వంటి కీలకాంశాలతో చారిత్రాత్మక పారిస్ ఒప్పందం

---

రెండవ ప్రపంచ యుద్ధానంతరం పశ్చిమాసియా రావణాసురుడి కాష్టంలా రూపొందింది. ఇది అమెరికా చలవే. అప్పటి నుండి నేటి వరకూ మూడవ ప్రపంచ యుద్ధం అని పేరుపెట్టి పిలవలేం గాని అంతకు సరిసమానంగా సామ్రాజ్యవాదులు రెచ్చగొట్టే ప్రాంతీయ యుద్ధాలు దాదాపు 150 వరకు జరిగాయి. ఇంకా జరుగుతున్నాయి. ఇప్పుడు అరబ్బు దేశాలు రణరంగంలో ఉన్నాయి. టెర్రరిజాన్ని అణిచివేసే పేరుతో అమెరికా ఆయా దేశాలలో కొనసాగుతున్న ప్రజా యుద్ధాల పైన, ప్రజా పోరాటాల పైన ఆ దేశాల పాలకవర్గాలకు అనుకూలంగా నిలుస్తోంది. ప్రపంచ శాంతి గురించి పేర్కొంటోంది.

'మాటలు ఊరికే రావు'. వాటి వెనుక వర్గ ప్రయోజనాలు ఉంటాయి. ప్రపంచ శాంతి గురించి పెట్టుబడిదారీ అగ్ర శక్తులు మాట్లాడుతున్నాయి. అంటే... 'తన లాభాల పేరుతో ఉత్పత్తి శక్తులను మరింత విస్తృతంగా అభివృద్ధి చేయడానికి, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాల ఆధిక్యతను బలపరిచి మరింత విస్తరింపచేయడానికి పెట్టుబడిదారీ వర్గం బలవంతంగా నెట్టబడుతోంది'. 'సరుకుల ఉత్పత్తి ప్రాతిపదికపై ఆవిర్భవించిన పెట్టుబడిదారీ సమాజం స్వాభావిక లక్షణమది'. కనుక వర్గ ప్రయోజనాలను నెరవేర్చుకునే మాటల పట్ల కార్మికవర్గ ప్రజలు అప్రమత్తంగా ఉండాలి. ఉంటారు కూడా.

ఫ్రాన్సులో అమెరికా, రష్యా, బ్రిటన్ అగ్ర దేశాలు 2018 నవంబర్ 11న సమావేశాన్ని నిర్వహించాయి. 'ప్రపంచ శాంతిని నెలకొల్పడానికి యుద్ధాలను అణిచివేయాలని' తీర్మానించాయి. 'సామ్రాజ్యవాదం ఉనికిలో ఉన్నంత వరకు యుద్ధాలు అనివార్యం'. సూత్రీకరణ అక్షరాలా వాస్తవమని నేటి పరిస్థితులు నిరూపిస్తున్నాయి.

మానవుడి విజ్ఞానం పెరుగుతోంది. ప్రజల చైతన్యం, అప్రమత్తత పెరుగుతున్నాయి. అమెరికా ప్రజలు యుద్ధాన్ని కాంక్షించడం లేదు. యూరప్ ప్రజలు కూడా. ప్రపంచ ప్రజలు కూడా. మరి యుద్ధాలు ఎలా జరుగుతున్నాయి? ఎవరు కారకులు? సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ అగ్ర శక్తులతో ఆ దేశాల పాలక వర్గాలే యుద్ధాలను కొనసాగిస్తున్నాయి. ప్రాంతీయ యుద్ధాలను రెచ్చగొడుతున్నాయి. సామ్రాజ్యవాదం సమసిపోతే గానీ ప్రపంచ శాంతి నెలకొదు. మొదటి ప్రపంచ యుద్ధం నుండి నేటి వరకు చరిత్ర రుజువు చేస్తున్న వాస్తవం అదే.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

ముడిపడి ఉంది. పారిస్ సమావేశంలోనే భూతాపం 1.5సి పెరుగుదల దుష్ఫలితాలను అధ్యయనం చేసి 2018 నాటికి నివేదిక తయారు చేయమని అంతర్జాతీయ వాతావరణ మార్పుల వేదిక (ఐపిసిసి)ని కోరారు. 2018 అక్టోబర్ 8న ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో పనిచేసే అంతర్జాతీయ శాస్త్రవేత్తల బృందం ఐపిసిసి కొత్త నివేదిక "భూతాపం 1.5సి"ని విడుదల చేసింది. ఈ నివేదిక 40 దేశాలకు చెందిన 91 మంది శాస్త్రవేత్తలు మూడేళ్లుగా శ్రమించి, 6000 పరిశోధనా పత్రాలను ఆకళింపు చేసుకుని, ఏకాభిప్రాయమనే నిబంధన పాటించి, వివిధ ప్రభుత్వాల నుండి, సంస్థల నుండి వచ్చిన 43,000 వ్యాఖ్యలను, విమర్శలను, అభ్యంతరాలను గమనంలోకి తీసుకుని, పొందుపరచి, సవరణలు చేసి తయారు చేసినది. పారిస్ శిఖరాగ్ర సదస్సు నిర్దేశించుకున్న లక్ష్యాలను మించి ఆలోచించాల్సిన అవసరం ఉన్నదని ఐక్యరాజ్య సమితి వాతావరణ అధ్యయన బృందం తేల్చి చెప్పింది.

పారిస్ ఒడంబడిక 'భూతాపాన్ని 2 డిగ్రీల సెల్సియస్ కన్నా తక్కువ స్థాయికి పరిమితం చేయాలని' పిలుపునిస్తే, సమితి బృందం దీన్ని స్పష్టంగా 1.5 డిగ్రీల సెల్సియస్ వద్ద నిలిపితేనే ముంచుకొస్తున్న ముప్పును నివారించగలమని స్పష్టంగా పేర్కొంది. లేనట్టయితే వాతావరణ మార్పులు ఊహించని స్థితిలో ఉత్పాతాన్ని తీసుకొస్తాయని హెచ్చరించింది. పారిశ్రామికీకరణ కాలం (1850-1900)తో పోల్చితే గడచిన శతాబ్ద కాలానికి భూతాపం ఒక డిగ్రీ సెల్సియస్ అధికమైంది. అది భారత్‌లో 1.2 డిగ్రీలుగా నమోదైంది. భూతాపం మరో 0.5 సె. డిగ్రీలు పెరిగితే ఎదురయ్యే విపరిణామాలు మరింత ఘోరంగా ఉంటాయని ఐపిసిసి నివేదిక ప్రమాదఘంటిక మోగించింది. అయినా అగ్ర దేశాల నేతలలో స్పందన కరువైంది.

పారిశ్రామిక విప్లవకాలం నాటి భూతాపం కన్నా 1.5 డిగ్రీలకు మించని విధంగా భూమి ఉష్ణోగ్రత పెరుగుదలను కట్టడి చేయాలంటే 2050 కన్నా ముందు కాలుష్యాల విడుదల అస్సలు లేకుండా చేయాలి. లేకపోతే భూతాపాన్ని కట్టడి చేయలేము. కాలుష్యాల విడుదల లేకుండా చేయాలంటే శిలాజ ఇంధనాల వాడకం ఆగిపోవాలి. కాని ఇది జరిగేలా కనబడడం లేదు. 2050 నాటికి బొగ్గుపులుసు వాయువు విడుదల పూర్తిగా శూన్యస్థాయికి చేరుకోవడం చాలా అవసరమని శాస్త్రవేత్తలు ఏకాభిప్రాయంతో ఉన్నారు. కాని 2050 కన్నా ముందే అంటే 2035 నాటికే ఈ లక్ష్యాన్ని సాధిస్తే తప్ప భూతాపాన్ని 1.5 డిగ్రీల సెంటిగ్రేడ్ పరిధిలో ఉంచడం సాధ్యపడదు. అందువల్ల కాలుష్య వ్యతిరేక సాంకేతిక పరిజ్ఞానంపై ఆధారపడాలని భావిస్తున్నారు. ఇందులో కార్బన్ కాప్చర్ అండ్ స్టోరేజ్ ఒకటి. ఈ సాంకేతిక పరిజ్ఞానం ప్రకారం బొగ్గుపులుసు వాయువును గాలి నుంచి పీల్చుకుని భూగర్భంలో నిల్వ ఉంచాలి.

పారిస్ ఒడంబడిక అమలుకు రూపొందించుకోవాల్సిన నియమ నిబంధనలపై గత రెండేళ్లుగా చర్చలు కొనసాగుతున్నాయి. నిర్దేశిత లక్ష్యాలను అందుకోలేని దేశాలపైనా, దాన్ని ఉల్లంఘిస్తున్న దేశాలపైనా తీసుకునే చర్యలు, దీన్నంతటినీ పర్యవేక్షించాల్సిన యంత్రాంగం స్వరూప స్వభావాలు నియమనిబంధనల్లో పొందుపర్చాల్సి ఉంది. అలాగే సభ్య దేశాలకు ఎప్పటికప్పుడు ఇవ్వాల్సిన మార్గదర్శకాలు తయారు చేయాల్సి ఉంది. వాటితో పాటు ఉద్గారాలను కొలిచే ప్రమాణాలను, పర్యవేక్షక యంత్రాంగానికి అవసరమైన వనరుల కల్పనను కూడా ఏర్పాటు చేసుకోవాలి.

**ప్రపంచాన్ని వణికిస్తున్న భూతాపం**

పుడమితల్లి బాగుంటే జీవరాశులకు సజావైన మనుగడ ఉంటుంది. ప్రస్తుతం భూమి ఆపదలో ఉన్న విషయాన్ని అనేక అంతర్జాతీయ పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. ప్రపంచ వాతావరణ సంస్థ తాజా నివేదికల ప్రకారం సుదీర్ఘంగా నమోదవుతున్న భూతాపం ఉష్ణోగ్రతలు 2018లోనూ ప్రమాదకర స్థితికి చేరుకున్నాయి. గడచిన నాలుగేళ్లలో అత్యధిక ఉష్ణోగ్రతలు నమోదయ్యాయి. వాతావరణ మార్పువల్ల ధృవాల వద్ద మంచు కరిగి సముద్రాల నీటిమట్టమూ పెరుగుతోంది. ప్రపంచవ్యాప్తంగా జనవరి-జూలై మాసాల మధ్య సముద్రమట్టం గతేడాదితో పోల్చితే 2 నుంచి 3 మి.మీ. ఎత్తు పెరిగింది. సముద్ర ఉష్ణోగ్రతలూ పెరుగుతున్నాయి. అనేక జీవరాశులు అంతరించి పోతున్నాయి. భూగోళంపై వనరుల వెలికితీత విచ్చలవిడిగా సాగుతుండడంతో భూతలం విపరీత మార్పులకు లోనవుతోంది. పచ్చని అడవులు, సున్నితమైన సముద్రతీర వ్యవస్థల విధ్వంసం, పర్యావరణ సమతుల్యతను దెబ్బతీస్తోంది. దీంతో భూకంపాలు, సునామీలు, కరవులు, వర్షాభావ పరిస్థితులు, తీర ప్రాంతాల కోతలు వంటి ప్రకృతి విపత్తులు పడగ విప్పుతున్నాయి.

భూతాపం దుష్ప్రభావాల వల్ల ఐరోపా, చైనా దేశాల్లోని అనేక ప్రాంతాల్లో వేడిగాలులు వీస్తున్నాయి. కరవు ఏర్పడింది. అమెరికాలోని కాలిఫోర్నియా అటవీ ప్రాంతాలను కార్చిచ్చులు ఆహుతి చేశాయి. అగ్నిగోళంలా భగభగలాడే సహారా ఎడారిపై మంచుదుప్పటి పరచుకోవడం, ఆస్ట్రేలియా వంటిచోట్ల ఏడెనిమిది దశాబ్దాలుగా కనీవినీ ఎరుగనంత అధిక ఉష్ణోగ్రతలు నమోదు కావడం, అమెరికాలో మైనస్ నలభై డిగ్రీలకు ఉష్ణోగ్రతలు పడిపోవడం, ఇవన్నీ భూతాపంలో వృద్ధి తాలూకు అనర్థాలే. మనదేశంలోని ముంబాయి, ఢిల్లీ, కేరళ సహా అనేక రాష్ట్రాల్లో వరదలు, తుఫాన్లు, వాయు కాలుష్యం విరుచుకుపడ్డాయి. బొగ్గు, మరికొన్ని శిలాజ ఇంధనాల వినియోగాన్ని నియంత్రించు కోనట్టయితే కర్బన ఉద్గారాల కారణంగా పర్యావరణ వ్యవస్థ ధ్వంసమయ్యే ప్రమాదమున్నదని చాన్నాళ్లుగా శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. వాతావరణ మార్పుల వల్ల ఇప్పటికే 75 శాతం పగడపు దిబ్బలు, సముద్ర అంతర్భాగం లోని అరుదైన జీవజాతులు ప్రమాదంలో పడ్డాయి. అర డిగ్రీ భూతాపం పెరిగితే 90 శాతం మేర పగడపు దిబ్బలు కనుమరుగయ్యే అవకాశాలున్నాయి. స్వయంకృతాపరాధాలే ఇందుకు కారణమని తెలిసినా, దిద్దుబాటు చర్యలు తీసుకోవడంలో ప్రపంచ దేశాలు వెనకబడే ఉంటున్నాయి.

ప్రపంచ వ్యాప్తంగా ఏటా 40 బిలియన్ టన్నుల బొగ్గుపులుసు వాయువు విడుదలవుతోంది. కాబట్టి 2050 నాటికి వాతావరణంలో బొగ్గుపులుసు వాయువు అసలు లేకుండా శూన్యస్థాయికి చేర్చాలంటే వాతావరణం నుంచి బొగ్గు పులుసు వాయువును తొలగించడం కూడా ఈ స్థాయిలో జరగాలి. కానీ వాతావరణ కాలుష్యాలకు ఇదొక్కటే కారణం కాదు. ఇతర గ్రీన్ హౌస్ వాయువులు కూడా ఉన్నాయి. మిథేన్, నైట్రస్ ఆక్సయిడ్, క్లోరోఫ్లోరో కార్బన్లు కూడా ఉన్నాయి. పారిస్‌లో తీసుకున్న 1.5 డిగ్రీల సెంటీగ్రేడ్‌లోపు నియంత్రణ లక్ష్యాన్ని సాధించాలంటే ఐక్యరాజ్యసమితి గట్టి చర్యలు తీసుకోవాలి. శిలాజ ఇంధనాల విడుదలను తగ్గించాలి. వాతావరణంలో కార్బన్‌ను తొలగించడానికి తక్షణం చర్యలు తీసుకోవాలి. కార్బన్ డై ఆక్సయిడ్ కాకుండా ఇతర గ్రీన్ హౌస్ వాయువులను తగ్గించడానికి ప్రణాళికలు చేపట్టాలి. మిథేన్, నైట్రస్

ఆక్సయిడ్, క్లోరోఫ్లోరో కార్బన్లను తగ్గించాలి. జియో ఇంజనీరింగ్, సోలార్ ఎనర్జీ, రేడియేషన్ మేనేజిమెంట్ వంటి పద్ధతులను పరిశోధించి కొత్త మార్గాలు కనిపెట్టాలి. ఈ చర్యలన్నీ తీసుకుంటేనే భవిష్యత్తులో ప్రమాదాన్ని తప్పించగలం.

మిథేన్ వాయువు బొగ్గుపులుసు వాయువు కన్నా 84 రెట్లు ప్రమాదకరమైనది. పశువులు, చమురు బావులు, బొగ్గు గనుల నుంచి మిథేన్ వాతావరణంలో కలుస్తుంది. ఆర్కిటిక్ ప్రాంతంలో పర్మా ఫ్రాస్ట్ కరుగుతున్నప్పుడు కూడా విడుదల అవుతుంది. అలాగే నైట్రస్ ఆక్సయిడ్ బొగ్గుపులుసు వాయువు కన్నా 300 రెట్లు ప్రమాదకరమైనది. ఆధునిక వ్యవసాయ పద్ధతుల వల్ల నైట్రస్ ఆక్సయిడ్ కూడా ఎక్కువగానే విడుదలవుతోంది. రిఫ్రిజిరేషన్ వాయువులు, క్లోరోఫ్లోరో కార్బన్లు బొగ్గుపులుసు వాయువు కన్నా వేలాది రెట్లు ప్రమాదకరమైనవి. ఇవి కూడా పెరుగుతున్నాయి. కాబట్టి కేవలం బొగ్గుపులుసు వాయువు విడుదలను మాత్రమే అడ్డుకోవడం, లేదా తొలగించడం వల్ల లాభం లేదు. ఈ ఇతర గ్రీన్ హౌస్ వాయువులపై కూడా దృష్టిపెట్టడం అవసరం. ఈ ఇతర గ్రీన్ హౌస్ వాయువుల విడుదల ప్రస్తుతం ఉన్న స్థాయిలో అదుపు చేయగలిగితే చాలా వరకు విజయం సాధించినట్లే. కాని అది కూడా సాధ్యమయ్యేలా కనబడడం లేదు. భూ మండలం పట్ల వినాశకర నిర్లక్ష్యం ఇలాగే కొనసాగితే ఇంకో ఆరువందల సంవత్సరాల్లో యావత్ మానవజాతి తుడిచి పెట్టుకుపోతుందన్న విఖ్యాత ఖగోళ భౌతిక శాస్త్రవేత్త స్టీఫెన్ హాకింగ్ హెచ్చరికను పరిగణలోకి తీసుకోవాలి. ఇది భూగోళ భవితను ప్రశ్నార్థకం చేసే సమస్య.

**హెచ్చరిస్తున్న శాస్త్రవేత్తల అధ్యయనాలు**

ఇటీవల అమెరికాలోని 'యుఎస్ గ్లోబల్ చేంజ్ రీసర్చ్ ప్రోగ్రామ్' నుంచి వెలువడిన నివేదికను వాతావరణ పరిశోధనలో ప్రావీణ్యతగల 300 మంది శాస్త్రవేత్తలు, 13 ఫెడరల్ ఏజన్సీలు తయారు చేశాయి. వర్తమాన ఉష్ణోగ్రతల ధోరణులు 'మానవ కార్యకలాపాల వల్ల ముఖ్యంగా భూతాపాన్ని వృద్ధి చేసే ఉద్గారాల విడుదల'తో ప్రభావితమవుతున్నాయి. పారిశ్రామిక విప్లవం తరువాత సాంకేతిక పరిజ్ఞానం ప్రపంచ వ్యాప్తమవడంతో స్థాపించబడిన పరిశ్రమలు విడుదల చేసే ఉద్గారాల కారణంగాను, అడవుల విస్తీర్ణం తగ్గిపోవడం వల్లనూ వాతావరణంలో మార్పులు సంభవిస్తున్నాయి. వాతావరణంలో మార్పుకు గల వ్యవస్థీకృత వనరు పెట్టుబడిదారీ వ్యవస్థే అనే వాస్తవాన్ని పెట్టుబడిదారీ వర్గాలు ఉద్దేశపూర్వకంగా కప్పిపుచ్చుతున్నాయి. పెట్టుబడిదారుల అపరిమిత లాభాపేక్ష వల్ల పరిశ్రమల నుంచి విడుదలవుతున్న ఉద్గారాల కారణంగానే భూతాపం పెరుగుతుంది. వీరికి ప్రజల ఆరోగ్యం కానీ, సంక్షేమం కానీ పట్టదు. పర్యావరణ వ్యవస్థ మొత్తంగా నాశనమవుతున్నా వీరు పట్టించుకోరు.

ఆగష్టు నెలలో 18 మంది ప్రముఖ శాస్త్రవేత్తలు ఉష్ణోగ్రత పెరిగి భూమి ఉష్ణ గృహంగా మారే ప్రమాదంపై విడుదల చేసిన పరిశోధనా వ్యాసంలో, ఈ శతాబ్దంలోనే మానవజాతి అంతరించి పోయే ప్రమాదముందని 1.5సి హద్దు సాధ్యమా?: ఐపిసిసి కొత్త రిపోర్ట్ ప్రకారం పారిస్ ఒప్పందానికి 2 సి బదులు 1.5 సి కొత్త హద్దు కావాలి. 2 సి ఆమోదయోగ్యం కాదు. ఈ నివేదిక సారాంశం 1.5 సి సాధ్యం. అది చావుకీ బతుక్కీ మధ్య ఎర్ర గీత. బొగ్గు, చమురు లాంటి శిలాజ ఇంధనాల వినియోగానికి వెంటనే ముగింపు పలకాలి. ఉష్ణోగ్రత వృద్ధి 1.5సి దాటకుండా కట్టడి చేయడానికి ఐపిసిసి నాలుగు భిన్న మార్గాలను ఎంచుకుంది. వాటి ప్రకారం 2030 నాటికి బొగ్గు నుండి విద్యుత్ ఉత్పత్తి చేయడంలో విడుదలయ్యే బొగ్గు పులుసు వాయువుని 59-78 శాతం తగ్గించాలి. మొత్తం కర్బన ఉద్గారాలని 2010తో పోలిస్తే 2030 నాటికి 45 శాతం తగ్గించాలి. అది 2050 నాటికి నికర శూన్యస్థాయికి చేరాలి. నికర శూన్యమంటే సాంకేతికత ద్వారా వాతావరణంలో విడుదలయ్యే బొగ్గుపులుసు వాయువుని తొలగిస్తూ శూన్యత సాధించడం.

కార్బన్ బ్రీఫ్ సంస్థ అంచనాల మేరకు 2017లో భారత కర్బన ఉద్గారాలు 4.6 శాతం పెరిగాయి. సగటున ప్రపంచ ఉద్గారాలు 2 శాతం. ఈ నేపథ్యంలో ఐపిసిసి ప్రతిపాదనలు సాధ్యం చేయడానికి మార్పులు యుద్ధ ప్రాతిపదికన జరగాలి. యధావిధి వ్యాపారం ధోరణి కుదరదు. ఈ విషయంపై స్పందిస్తూ ప్రొ. గోవింద స్వామి బాల (ఐఐఎస్సి, బెంగళూరు) ఇప్పుడు 2 శాతం పెరుగుతున్న కర్బన విడుదలని 2 శాతం తగ్గింపుగా మార్చినా మొత్తం విడుదలని 50 శాతం తగ్గించడానికి 35 సంవత్సరాలు పడుతుంది. ఈ లెక్కన 2030 నాటికి 45 శాతం తగ్గించడం సాధ్యమా అన్నారు. ఈ రిపోర్టుపై వ్యాఖ్యానిస్తూ ప్రముఖ బ్రిటిష్ వాతావరణ శాస్త్రవేత్త కెవిన్ అండర్సన్ ఉద్గారాలు ఎంత తగ్గించాలో చెప్పారుగాని ఎలా తగ్గించాలో చెప్పలేదన్నారు. అది వినియోగ అసమానతలకు సంబంధించిన విషయం.

కేవలం 10 శాతం సంపన్న ప్రజలు 50 శాతం కర్బన ఉద్గారాల విడుదలకు బాధ్యులు కాగా, పై 20 శాతం సంపన్న వర్గ ప్రజలు 70 శాతం ఉద్గారాలు విడుదల చేస్తున్నారు. సంపన్న 10 శాతం ప్రజలు సగటు ఐరోపా ప్రజల స్థాయికి తమ ఉద్గారాలు తగ్గించుకుంటే ఒక ఏడాది కాలంలోనే మొత్తం ఉద్గారాలను మూడింట ఒక వంతు తగ్గించవచ్చంటారు అడర్సన్. తీవ్రమైన సామాజిక అసమానతలను గుర్తించకుండా ఇప్పుడు సిద్దంగా లేని సాంకేతిక సమాధానాలు ప్రతిపాదించడం తప్పనీ, భావి తరాలకు సమస్యని బదిలీ చేయడమేననీ ఆయన వాదన. నోబెల్ పురస్కార గ్రహీత మరియో మోలిన మరో ఇద్దరు ప్రముఖ శాస్త్రవేత్తలు కలిసి ఐపిసిసి నివేదికపై రాసిన వ్యాఖ్యానంలో ఇది ఇతర నివేదికలతో పోలిస్తే పెద్ద ముందడుగైనా కొన్ని ముఖ్యమైన విపత్తులను ప్రస్తావించకుండా వదిలేసిందని ఆరోపించారు.

పర్యావరణ విధ్వంసం, పెరుగుతున్న ఉష్ణోగ్రతలతో అనర్థాలు అంచనాలను మించిపోతున్నాయి. భవిష్యత్తులో జరుగుతాయనుకున్న మార్పులు ఇప్పుడే చోటుచేసుకుంటున్నాయి. ఈ ఉష్ణోగ్రత పెరుగుదల ఫలితంగానే వాతావరణంలో తీవ్రమైన మార్పులు, ధ్రువాల వద్ద మంచు దిబ్బలు కరగడం, సముద్ర మట్టాల పెరుగుదల, తుఫాన్లు, వరదలు, కరవు తాకిడి పెరిగిందని శాస్త్రవేత్తలు చెబుతున్నారు. 2016లో మొరాకోలోని మర్రకేష్‌లో కాప్-22 సదస్సు జరిగినప్పుడు 2018 కల్లా నియమ నిబంధనలు ఖరారు కావాలని నిర్ణయించారు. అయితే కటోవిస్ సదస్సు ముగింట్లోకొచ్చినా చర్చల పరంపర పూర్తికాలేదు. అంతర్జాతీయ ఒడంబడికల్ని అమలు చేసి తీరాలని వెనకబడిన దేశాలను ఒప్పించడం చాలా సులభం. కానీ సంపన్న దేశాలపై ఇలా ఒత్తిడి తీసుకురావడం ఓ పట్టాన సాధ్యం కాదు. అలాగే వెనుకబడిన దేశాలకు అవసరమైన ఆర్థిక సాయాన్ని, సాంకేతికతను అందించమని వాటికి నచ్చజెప్పి ఒప్పించడం కూడా కష్టం. ఈ రెండేళ్లలోనూ నిర్వాహకులకు అది బాగా అర్థమైంది.

**కటోవిస్ వాతావరణ ఒప్పందం**

అత్యంత ప్రమాదకరంగా పరిణమిస్తున్న గ్లోబల్ వార్మింగ్‌ను నివారించేందుకు వీలుగా 2015 నాటి పారిస్ పర్యావరణ ఒప్పందంలో నూతన నిబంధనలు పొందుపరిచేందుకు ప్రపంచ దేశాలు ఒక అంగీకారానికి వచ్చాయి. కటోవీస్ సదస్సులో కాప్ 24 నిర్వాహకులు రూపొందించిన నియమ నిబంధనలన్నిటినీ (రూల్ బుక్) 200 దేశాలకు చెందిన ప్రతినిధులు ఖరారు చేశారు. పారిస్ ఒప్పందం నుంచి వైదొలగాలన్న ట్రంప్ ప్రభుత్వ వైఖరి ఈ సదస్సులో గందరగోళానికి కారణమైంది. షెడ్యూల్ ప్రకారం డిసెంబర్ 14 సాయంత్రానికి ముగియాల్సిన కటోవిస్ వాతావరణ సదస్సు ఒప్పందంపై ఏకాభిప్రాయం సాధించడం కోసం డిసెంబర్ 15 అర్ధరాత్రి వరకు కొనసాగింది. తీవ్ర తర్జనభర్జనల అనంతరం 2015 నాటి పారిస్ ఒప్పందం నిర్దేశించిన విధంగా గ్లోబల్ వార్మింగ్‌ను పారిశ్రామిక విప్లవం ముందున్న స్థాయికి కట్టడి చేసేందుకు భూ ఉష్ణోగ్రతల పెరుగుదలకు 2 డిగ్రీల సెల్సియస్, వీలైతే 1.5 డిగ్రీలకు నియంత్రించాలని కొత్త నిబంధనావళి స్పష్టం చేస్తుంది. అనంతరం ఈ సదస్సుకు అధ్యక్షత వహించిన కాప్-24 అధ్యక్షుడు మైకేల్ కుర్తికా మీడియాతో మాట్లాడుతూ 'పారిస్ ఒప్పందం కార్యాచరణ ప్రణాళికను ఖరారు చేయడం ఒక పెద్ద బాధ్యత' అని వ్యాఖ్యానించారు.

మూడేళ్ల క్రితం కుదిరిన పారిస్ ఒడంబడికను ఇంకో రెండేళ్లలో పట్టాలెక్కించడానికి విధివిధానాలు ఖరారయ్యాయన్న 'సంతృప్తి' ఒకవంక, వాస్తవికావసరాలతో పోలిస్తే ఈ చొరవ అరకొరేనన్న నిరసన ధ్వనులు మరోవైపు వినిపిస్తూనే ఉన్నాయి. భవిష్య ప్రణాళికలో భాగంగా వాతావరణ మార్పులపై అంతర ప్రభుత్వ మండలి (ఐపిసిసి) క్రోడీకరణలకు చోటు ఇవ్వాలన్న మెజారిటీ సభ్యదేశాల అభిప్రాయానికి కటోవీస్ వేదికపై మన్నన దక్కలేదు. 2030 సంవత్సరం నాటికి భూతాపంలో వృద్ధిని ఒకటిన్నర డిగ్రీల సెల్సియస్‌కు కట్టడి చేయాలంటే ప్రస్తుత కర్బన ఉద్గారాలను దాదాపు సగానికి తగ్గించాలన్నది ఐపిసిసి నిర్దేశం. అందుకు అమెరికా, రష్యా, సౌదీ అరేబియా, కువైట్‌లు ససేమిరా అనడంతో ఆ ప్రభావం సహజంగానే పోలండ్ తుదితీర్మానంలో పదాల కూర్పుపై ప్రసరించింది.

2020 నాటికి ఏటా పదివేలకోట్ల డాలర్ల మేర హరిత నిధిని అందుబాటులో ఉంచుతామన్న మునుపటి హామీల్ని సంపన్న రాజ్యాలు ఏ మేరకు నిలబెట్టుకోనున్నాయో నేటికీ స్పష్టత లేదు. కర్బన ఉద్గారాల నియంత్రణలో సంపన్న రాజ్యాలు, వర్ధమాన దేశాలు నిర్వర్తించాల్సిన బాధ్యతలపైనా భేదాభిప్రాయాలు ఇప్పటికీ సమసిపోలేదు.

అంతర్జాతీయ పర్యావరణ కమిషన్ (ఐ.పి.సి.సి. సింథసిస్ రిపోర్టు 2015) అంచనాల ప్రకారం 2050వ సంవత్సరానికి వాతావరణం 1136 గిగాటన్నుల కార్బన్‌డయాక్సైడ్‌ను కలిగి భూమండల ఉష్ణోగ్రత మరో 2 డిగ్రీలకు పెరుగుతుంది. ప్రస్తుతం పెరిగిన 0.8 డిగ్రీల ఉష్ణోగ్రత కారణంగానే 667 గిగాటన్నుల కార్బన్‌డయాక్సైడ్ వాయువు వాతావరణంలో ప్రవేశించింది. మిగిలిన 550 గిగాటన్నుల విషవాయువు చేరి భూమి వేడెక్కితే ఆహారోత్పత్తి సగానికి పడిపోతుందని, వెన్నెముక గల జంతువులు 50 శాతం వరకు నశిస్తాయి. ఉద్గారాల విడుదల భారాన్ని అభివృద్ధి చెందుతున్న ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలోని అభివృద్ధి చెందుతున్న దేశాలు భరించాలని పోలెండులో జరిగిన వాతావరణ సదస్సు రూపొందించిన నియమావళి (రూల్ బుక్) కోరుతోంది.

**ముగింపు**

పర్యావరణ దిద్దుబాటు చర్యల వేగాన్ని రెండు మూడింతలు పెంచాల్సిన బాధ్యతను అందిపుచ్చుకోవడంలో సంపన్న దేశాల నిరాసక్తత, హరిత పర్యావరణ నిధికి చెల్లింపుల్లో నిర్లక్ష్యం-పారిస్ ఒడంబడిక భవితవ్యాన్ని ప్రశ్నార్థకం చేసేశాయి. అటువంటిదిప్పుడు, ప్రపంచ పర్యావరణ పోరు ఆరంభమైందని ఐరాస ప్రధాన కార్యదర్శి ఆంటోనియో గుటెహెష్ అధికారికంగా ధ్రువీకరిస్తున్నా ఎన్నో సందేహాలు రేకెత్తుతున్నాయి. కర్బన ఉద్గారాల తగ్గుదల క్రమాన్ని ఎవరు ఎలా పర్యవేక్షిస్తారు, హామీ కట్టుబాట్లను నిగ్గుతేల్చేదెవరు. నిధుల క్రమబద్ధ ప్రవాహాన్ని సమన్వయీకరించేదెవరన్న ప్రశ్నలకు ఇదమిత్థమైన సమాధానాలు కొరవడుతున్నాయి. మరోవైపు అమెరికా మూతపడ్డ బొగ్గు ఆధారిత కర్మాగారాలను తిరిగి పనిచేయించడం ప్రారంభించింది. మరోపక్క వచ్చే ఏడాది జరగాల్సిన కాప్-25 సదస్సుకు లోగడ ఇచ్చిన అంగీకారాన్ని బ్రెజిల్ ఉపసంహరించుకుంది. దీంతో కాప్-25 సదస్సు చిలీలో జరపాలని నిర్ణయించారు.

భూతాపంతో వాతావరణ మార్పుకు సామాజిక విస్ఫోటక స్వభావం ఉంటుంది. వాతావరణంలో జరిగే మార్పుల ప్రభావం దేశాలపై, సమాజాలపై సమంగా పంపిణీ కాదు. అల్పాదాయ వర్గాలకు చెందిన వారికి, ఉపాంతీకరింపబడిన సామాజిక వర్గాలకు చెందిన ప్రజలకు తీవ్ర వాతావరణ మార్పుల ప్రభావంతో ఏర్పడే సంక్షోభాలను తట్టుకునే సామర్థ్యం ఉండదు. ఇంకా చెప్పాలంటే వరదలు, కరువుకాటకాలు, రోగాలను తట్టుకునే శక్తి సామర్థ్యాలు లేనివారే ఎక్కువగా క్షోభ అనుభవిస్తారు. కాబట్టి భూతాపం నియంత్రణలో ఉండాలంటే అందుకు సంబంధించిన ప్రయత్నాలు కూడా అంతర్జాతీయ స్థాయిలోనే ఉండాలి. అయితే భూతాపాన్ని నియంత్రించడం కోసం అంతర్జాతీయంగా జరుగుతున్న ప్రయత్నాలకు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు సహకరించటం లేదు. పేదరికం, పెరుగుతున్న సామాజిక అసమానత, ఫాసిజం, ప్రజాస్వామిక హక్కులపై దాడులు, సామ్రాజ్యవాద యుద్ధాలతో పాటుగా వాతావరణ మార్పు కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన వర్గ సమస్యగానే గుర్తించాలి.

నూట యాభై ఏళ్ల క్రితమే కార్ల్‌మార్క్స్ 'మితిమీరిన వస్తూత్పత్తి, లాభాల వేటలో పర్యావరణ విధ్వంసాన్ని సృష్టిస్తుందని' పేర్కొనడం గమనార్హం. అలాగే ఐక్యరాజ్య సమితి నియమించిన శాస్త్రవేత్తల కమిటీ సైతం పర్యావరణ విధ్వంసాన్ని పెట్టుబడిదారీ పారిశ్రామిక విధానం కట్టడి చేయలేదని, దీనికి పరిష్కారం పెట్టుబడిదారీ యేతర వ్యవస్థ చొరవతో మాత్రమే సాధ్యమని పేర్కొనటం గమనించాలి. ఈ నేపథ్యంలో పర్యావరణ పరిరక్షణకు వర్ధమాన దేశాలు ఐక్యంగా నిల్చి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ నీతికి వ్యతిరేకంగా పోరాడి, ప్రజాస్వామికమైన, ప్రకృతికి హాని చేయని పారిశ్రామిక వస్తూత్పత్తిని చేబట్టి ప్రస్తుత పర్యావరణ విధ్వంసం నుండి బయటపడడం తప్ప వేరే మార్గం కనిపించడం లేదు. ఈ సమస్యకు పరిష్కారం దానిని సృష్టించిన వ్యవస్థ అంతంలోనే ఉందన్న సత్యాన్ని గుర్తించటంపైనే మానవాళి భవిత ఆధారపడి ఉంది. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

# చైతన్యంతోనే సురక్షితమైన భవిష్యత్తు

*వ్యవసాయ రంగంలో అధికంగా పురుగు మందుల వాడకం వల్ల ఎన్నో అనారోగ్య సమస్యలు తలెత్తుతున్నాయనీ, సరైన శాస్త్రీయ పద్ధతులు అవలంబించకపోవడం దీనికి కారణమంటూ, ప్రజలు చైతన్యంతో వీటిని అరికట్టాల్సిన అవసరం ఉందని అంటున్నారు* **ఆర్. లక్ష్మి**

**తో**టమాలిగా పనిచేస్తున్న జాన్సన్‌కు 'నాన్ హార్డ్‌కిన్ లింఫోమా' అనే వ్యాధి సోకినట్లు 2014లో వైద్య పరీక్షలలో వెల్లడైంది. కలుపుమొక్కల నివారణకు వినియోగించే రౌండప్ అనే మందును 'రెంజర్ ప్రో'ను వినియోగించడం వలననే అతనికి ఆ వ్యాధి సోకిందని, అందువలన అతనికి రు. 2000 కోట్లు నష్టపరిహారంగా చెల్లించాలని అమెరికాలోని ఒక కోర్టు ఆ మందుల తయారీ సంస్థ 'మోన్‌శాంటో'ను ఆదేశించింది. క్యాన్సర్ కారణమన్న హెచ్చరిక లేకుండా ఆ మందులను మార్కెట్‌లోకి వదిలిన కారణంగానే వినియోగదారులు విషప్రభావానికి గురై అనారోగ్యం పాలవుతున్నారు. పరిశీలనలో ఉన్న, విచారణలో ఉన్నవి మరో నాలుగు వేల కేసుల వరకూ ఉన్నాయంటే మోన్‌శాంటో నిర్లక్ష్య వైఖరి తెలుస్తోంది.

రౌండప్‌లోని గ్లైఫోసైట్ క్యాన్సర్ కారకమని 2015లోనే ప్రపంచ ఆరోగ్య సంస్థ వెల్లడించింది. గ్లైఫోసైట్ క్యాన్సర్ కారకమన్న విషయం మోన్‌శాంటోకు దశాబ్దాల కిందటే తెలుసునన్న సంగతి శాన్‌ఫ్రాన్సిస్కో కోర్టు విచారణలో వెల్లడికావడం మరింత దిగ్భ్రాంతికరమైన విషయం. ఆ నిజాన్ని దాచిపెట్టి ఇన్ని సంవత్సరాలుగా తప్పుడు ప్రచారాలతో మార్కెట్లను ఆ పురుగుల మందులతో ముంచెత్తడం మరింత ఘోరం. ఎండోసల్ఫన్ మితిమీరిన వాడకం కరణంగా పంజాబ్‌లోని రైతుల జీవితాలు ఎలా ఛిద్రమైనవో తెలిసినదే. హరిత విప్లవం కారణంగా చక్కని దిగుబడులతో సుభిక్షమైన అభివృద్ధి సాధించిన పంజాబ్ అనంతర కాలంలో దుష్పరిణామాలకు బలైన రాష్ట్రాలలోనూ ముందు వరుసలోనే ఉండడం మరింత బాధాకరం అక్కడ ఒక జిల్లాలో అత్యధిక సంఖ్యలో క్యాన్సర్ కేసులు నమోదు కాగా, దేశ రాజధానికి చికిత్స కోసం వెళ్లేవారిలో అత్యధిక శాతం క్యాన్సర్ పీడితులే కాగా ఆ రైలుకు ఏకంగా 'క్యాన్సర్ బండి' అనే పేరు వచ్చింది. నిజానికి ఇది చాలా పాత సంగతి.

అదక్కడితో ఆగలేదు. ఎండో సల్ఫాన్ మితిమీరిన వాడకం కారణంగా కేరళలో 500 మంది రోగగ్రస్తులుగా మారి మంచం పట్టారు. బీహార్‌లో మోనో క్రోసోఫాట్ అవశేషాలు ఉన్న కారణంగా తాము తిన్న ఆహారం కారణంగానే పాతిక మంది విద్యార్థులు చనిపోయారు. క్రిమి సంహారకాలను పంటలపై చల్లుతూ వాటిలో ఉన్న విష రసాయనాల కారణంగా మహారాష్ట్రలోని యావత్మల్ జిల్లాలో సుమారు 60 మంది ప్రాణాలు కోల్పోయారు. ముందో వెనుకో ఏ రాష్ట్రంలో ఏ పెనువిపత్తు జరిగినా నాలుగు రోజుల్లో పాతబడిపోయి అమ్మకాలు, వాడకం యథేచ్ఛగా సాగిపోవడం – దుష్పరిణామాలు షరా మామూలైపోయింది. పొలాలలో పనిచేసే వారికే కాదు ఆ ఉత్పత్తులను వినియోగించేవారికీ అవి హానికారకాలే. ఇంకిపోయిన రసాయనాలు కడిగినంతలో పోవు. తీసుకునే ఆహారం కారణంగా కొంచెం కొంచెంగా శరీరంలో చేరుతూ ఉండే రసాయనాలు ఒకస్థాయిని దాటాక తీవ్రమైన అనారోగ్య సమస్యలకు దారితీస్తాయి. హార్మోన్‌ల అసమతుల్యం, క్యాన్సర్లు, పునరుత్పత్తి దోషాలు వంటివి మచ్చుకు కొన్ని. భారతదేశపు వ్యవసాయ పరిశోధనా మండలి దేశంలో వినియోగంలో ఉన్న అన్ని రకాల ఆహార ఉత్పత్తులలోనూ ప్రమాదకర స్థాయిలో పురుగు మందుల అవశేషాలు ఉన్నట్లు 90లలోనే వెల్లడించింది. తల్లి పాలలో సైతం డి.డి.టి. అవశేషాలు కనిపించాయంటే అంతకన్న ప్రమాదమేముంది? పరిశోధనలు, ఫలితాల వెల్లడి, కొన్ని రోజులు ఆర్భాటం అంతే. యథాతథ స్థితిమాత్రం కొనసాగుతుంటుంది. 2017లో ఐక్యరాజ్య సమితి నిజనిర్ధారణ కమిటీ క్రిమిసంహారకాల కారణంగా ఏటా 2 లక్షల మంది ప్రాణాలు కోల్పోతున్నారని తేల్చి చెప్పింది. అధిక దిగుబడుల మాట నాస్తి సరే గర్భస్థ శిశువులకు వీటి వలన హాని జరుగుతోందని నిష్కర్షగా వెల్లడించింది.

మనదేశంలో – పురుగు మందుల దిగుమతి, నమోదు, తయారీ, అమ్మకం, రవాణా, పంపిణీ, వాడకం, నియంత్రణ మొదలైన అంశాలకు సంబంధించి అమలులో ఉన్న చట్టం 1968 నాటిది. 2008లో ప్రతిపాదించబడిన మరొక బిల్లు ప్రతిపాదన దశలోనే ఉండిపోయింది. దేశంలో ఎక్కడైనా 'జాతీయ పంటల పరిరక్షణ సంస్థ' సంచాలకులు నిర్దేశించిన మోతాదును మించి పురుగు మందులను వాడడం నిషేధం. ఈ సంస్థ ఫరీదాబాద్‌లో ఉంది.

మనదేశంలో ఏటా 66,000 టన్నుల పురుగు మందులు వినియోగించదుతున్నాయి. రౌండప్, రెంజర్‌ప్రోలను టీ తోటలలో తప్ప వినియోగించరాదని కేంద్ర ప్రభుత్వపు ఆదేశాలు ఉన్నాయి. అయినా అనుమతిలేని అమ్మకాలు యథేచ్ఛగా సాగిపోతూనే ఉన్నాయి. ఇక ముందట అనుమతిలేని అమ్మకాలకు కఠిన చర్యలు తప్పవని వ్యవసాయ శాఖ ముఖ్య కార్యదర్శి పార్థ సారథి హెచ్చరించారు. ఆహార భద్రత – ప్రమాణాల సంస్థ నిర్దేశాలను ఉల్లంఘిస్తూ అనేక దేశాలు తమ ఆహార ఉత్పత్తులను మన దేశంలోకి వెల్లువెత్తుతున్నాయి. అవే దేశాలు పురుగు మందుల అవశేషాలు ఉన్నాయంటూ మన ఉత్పత్తుల ఎగుమతులను సమర్థవంతంగా అడ్డుకుంటున్నాయి.

మనదేశంలో ఈ నాటికీ సగానికి పైగా ప్రజలకు జీవనోపాధి వ్యవసాయమే. తరాల తరబడి వ్యవసాయంలో ఉన్న కారణంగా వారికి సంబంధిత పరిజ్ఞానమూ ఎక్కువే. జనాభా విస్పోటనం, తిండి గింజల కొరత వంటి పరిణామాల కారణంగానే ఆధునిక సేద్య విధానాలను అవలంబిచక తప్పని పరిస్థితి ఒకప్పుడు ఉండేది. ఆహార కొరతను

# పెట్టుబడిదారీ ఉత్పత్తి-శ్రమదోపిడీ-మార్కెట్ సంక్షోభం - 4

***పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో శ్రమదోపిడీ జరిగే పద్ధతిని వివరిస్తున్నారు* రమేష్ పట్నాయక్**

*(గత సంచిక తరువాయి భాగం...)*

**ఇం**గ్లాండులో లేదా పశ్చిమ ఐరోపాలో అన్నివర్గాల ఆస్తి పెట్టుబడిగా మారడం, సమాజంలో అన్ని వర్గాలు తుడిచిపెట్టుకుపోయి పెట్టుబడిదారీ, కార్మిక వర్గాలు పుట్టి పెరగడం గమనించాం. ఇంగ్లాండులో సదరు ప్రక్రియ పూర్తికాకముందే వలస విధానం ప్రారంభమైంది. ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియాలలో దుర్మార్గాలు జరిగాయి. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే ఇతర దేశాల మార్కెట్‌ను ఆక్రమించకుండా, ఇతర దేశాల ముడి సరుకులను దోచుకోకుండా, ఇతర దేశాలలో శ్రామికులను దోపిడీ చేయకుండా ఇంగ్లాండులో, పశ్చిమ ఐరోపాలో, ఆ తరువాత కాలంలో అమెరికా, జపాన్, ఆస్ట్రేలియా దేశాలలో విస్తృత పారిశ్రామికీకరణ సాధ్యమయ్యేదే కాదు. అయితే మన గణన సౌలభ్యం కొరకు ఇంగ్లాండులో పెట్టుబడి ప్రక్రియ పూర్తి అయిన తరువాతనే అంటే సమస్త ప్రజల ఆస్తి పెట్టుబడిదారుల పరమై, పెట్టుబడిగా మారిన తరువాతనే సరుకులు, పెట్టుబడి, ఇతర దేశాలకు వెళ్లాయని అనుకుందాం. చారిత్రకంగా అంటే వాస్తవంగా అలా జరగలేదు కాని సూత్రీకరణ అవసరాల కొరకు అలా ఊహిస్తున్నాం. అయితే అలా జరగవలసి వచ్చి ఉంటే ఇంగ్లాండులో పారిశ్రామీకీకరణ–విదేశీ మార్కెట్లు పెద్దగా అందుబాటులో లేనందున ఇప్పుడు భారతదేశంలో జరుగుతూ ఉన్నట్లు–చాలా నెమ్మదిగా జరిగి ఉండేది. ఈ వాస్తవాన్ని గ్రహించనివారు, భారతదేశం ఇంకా అర్ధవలసగా ఉండడం వలననే వ్యవసాయక మరియు పారిశ్రామిక రంగంలో తక్కువ వృద్ధిరేటు నమోదవుతుందని అంటున్నారు. ఆ విషయాన్ని పక్కన పెడదాం.

ఇంగ్లాండులో పెట్టుబడి ప్రక్రియ పూర్తయ్యేసరికి అంటే భూమితో సహా ఉత్పత్తి సాధనాలన్నీ పెట్టుబడిదారుల హస్తగతమయి, పెట్టుబడిగా మారిపోయిన నాటికి పెట్టుబడి ఒక 100 బిలియన్ పౌండులకు చేరిందనుకుందాం. ఇప్పుడు పట్టణాలలో, గ్రామాలలో పెట్టుబడిదారులు, కార్మికులు మాత్రమే ఉన్నారు. గనుల అధిపతులు, పరిశ్రమాధిపతులను, వ్యవసాయ పెట్టుబడిదారులు, వ్యాపారులను, బ్యాంకర్లను కలిపే మనం ఇక్కడ పెట్టుబడిదారులంటున్నాం. 100 బిలియన్ పౌండుల మొత్తం పెట్టుబడిలో 50 బిలియన్ పౌండులు స్థావర పెట్టుబడి, ప్రతినెలా 50 బిలియన్ పౌండులు టర్నోవర్ పెట్టుబడితో ఇప్పుడు పెట్టుబడి ఉత్పత్తి ప్రక్రియ ప్రారంభమైంది. టర్నోవర్ పెట్టుబడిలో 45 బిలియన్ పౌండులు ముడి సరుకులు తదితర ఖర్చులు కాగా, 5 బిలియన్ పౌండులు కార్మికుల వేతనాలు. 5 బిలియన్ పౌండుల వేతనాలు తీసుకునే కార్మికులు 10 బిలియన్ పౌండుల విలువలను ఉత్పత్తి చేస్తారు. ఫలితంగా ప్రతినెలా 5 బిలియన్ పౌండులు, సంవత్సరానికి 60 బిలియన్ పౌండులు విలువగల సరుకులు అదనపు విలువగా ఉత్పత్తి అవుతాయి. దీనిలో పెట్టుబడిదారుల, వ్యాపారుల, బ్యాంకర్ల వ్యష్ఠి ఉపయోగం బ్యాంకు ఉద్యోగుల ధార్మిక సంస్థల వాడకం, ప్రభుత్వ యంత్రాంగ కొనుగోళ్లు తరువాత కూడా ఇంతకుముందు గణించిన పద్ధతిలో నెలకు 3 బిలియన్ పౌండులు సంవత్సరానికి 36 బిలియన్ పౌండుల విలువగల సరుకులు అమ్ముడు పోకుండా మిగిలిపోతాయి. ఈ సరుకులు కొనడానికి దేశంలో ఇంకా ఏ ఇతర వర్గం కూడా లేదు! ఇప్పుడు కొత్తగా దివాళా తీయడానికి వృతికారులు, రైతులు, భూస్వాములు లేరుకదా. ఈ సరుకును విదేశాలలో అమ్మవలసిందే. అంటే పెట్టుబడి అభివృద్ధి నుండి అనివార్యంగా వలస విధానం పుట్టుకువస్తుంది. అయితే, అంతకు ముందే చెప్పుకున్నట్లు ఇంగ్లాండులో ఈ ప్రక్రియ పూర్తికాకముందే, పెట్టుబడి అధిక లాభాల కొరకు, విదేశీ మార్కెట్ల ఆక్రమణ, వలసల స్థాపన జరిగిపోయింది. అది చరిత్ర. నిజానికి ఇంగ్లాండులో పెట్టుబడి ప్రక్రియ పూర్తి అయ్యేవరకు వలసలు స్థాపించబడలేదని గణన సౌలభ్యం కొరకు మనం అనుకున్నా అనంతరమైనా–సరుకులు అమ్ముకోవడానికి–ఇంగ్లాండు, యూరప్‌ల పెట్టుబడి వలసవాదానికి దారితీసి ఉండేదే. పెట్టుబడి, ముందు వెనకలుగా, తప్పక వలసవాదానికి దారితీస్తుందన్న విషయం గుర్తించడమే ఇక్కడ ప్రధాన విషయం. వలస విధానం పెట్టుబడి విధాన ఫలితం కాదని, ఆయా కాలాలలో అధికారంలో ఉండిన పార్టీల లేదా నాయకుల విధానం అని వారించిన లేదా వాదిస్తున్న వారికి ఇది సమాధానం కాగలదు.

పారిశ్రామిక దేశాలు మొదట్లో తమ మిగులు ఉత్పత్తులను అమ్ముకోవడానికి, కారుచౌకగా ముడి సరుకులను సంపాదించడానికి వలసలను వాడుకున్నారు. కాని అనంతర కాలంలో వలసలలో వివిధ స్థాయిల పరిశ్రమలను ఏర్పాటు చేసి ప్రకృతి దోపిడీతో పాటు శ్రమదోపిడీని ప్రారంభించారు. అయితే ప్రధానంగా లాభాలను దేశం బయటికి తరలించారు. ఇంకా ప్రధానంగా ఫైనాన్స్ పెట్టుబడి ఏర్పడిన తరువాత వెనుకబడిన దేశాలకు ఫైనాన్స్ పెట్టుబడి ఎగుమతి చేసి

---

అధిగమించడానికై అధిక దిగుబడులను సాధించేటందుకు ఆధునిక విధానాలను స్వాగతించకతప్పని పరిస్థితి అది. అదీగాక దాని తాలుకు దుష్ప్రభావాలూ ఉంటాయని అంచనా వేయలేని స్థితి. ఇప్పుడు పరిస్థితులు మారాయి. మిగులును సాధించడంతో పాటు భద్రత దిశగా అడుగులు పడుతున్న తరుణమిది. ఎందరో యువ శాస్త్రవేత్తలు సేంద్రీయ వ్యవసాయం వైపు ఆకర్షితులవుతున్నారు. పాతతరాల దేశవాళీ వ్యవసాయ పరిజ్ఞానాన్ని కొత్తతరం ఆధునిక భావజాలం, సాంకేతిక పరిజ్ఞానాలతో మేళవించగలిగితే ఆరోగ్యకరమైన సాగు విధానాలతోనూ ఆహారభద్రత సాధించవచ్చు. అంతేకాదు అద్భుతాలు సైతం ఆవిష్కరించబడతాయి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

పెట్టుబడి దోపిడీని విస్తరించారు. దీనినే లెనిన్ సామ్రాజ్యవాదం అన్నాడు. ముడి సరుకుల సమీకరణ కొరకు, తయారీ సరుకుల అమ్మకం కొరకు ఇతర దేశాలను ఆక్రమించడం వలసవాదంగా చెప్తారు. ఫైనాన్స్ పెట్టుబడిని ఎగుమతి చేసి దోపిడీ చేయడం సామ్రాజ్యవాదంగా చెప్తారు. ఫైనాన్స్ పెట్టుబడి ఎగుమతి ప్రతిసారీ పరిశ్రమల స్థాపనకు దారితీయదు. కాని లాభాలలో వాటాను అధికాధికంగా స్వంతం చేసుకుంటుంది. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాలలో భూస్వాములు, రైతులు, వృత్తికారుల చేతులలో ఉన్న భూమి, ఇతర ఉత్పత్తి సాధనాలు, అన్నీ, కార్పొరేట్ సంస్థల హస్తగతం అయ్యే దిశలో పెట్టుబడి దోపిడీ విస్తరిస్తుంది. ప్రస్తుతం అమలు జరుగుతున్న సామ్రాజ్యవాద రూపమైన నయా సరళీకరణ విధానంలో కూడా పెట్టుబడి ఎగుమతి ఉంటుంది కాని, అది ఉద్యోగ రహిత ఎదుగుదలకు దారితీస్తుంది. విదేశీ పెట్టుబడులు వివిధ దేశాలలో కార్మికుల ఉద్యోగాలు ఊడగొడుతున్నాయి, సంఘటిత రంగాలను అసంఘటిత రంగాలుగా మార్చివేస్తున్నాయి. వివిధ దేశాలకు పెట్టుబడిని ఎగుమతి చేయడం, లాభాలను ఆ రెండవ దేశం నుండి ఉపసంహరించడం, అవసరమనుకుంటే పెట్టుబడులను ఉప సంహరించడం వంటి చర్యలకు ఎటువంటి ఆటంకం ఉండకూడదని ఇప్పుడు కార్పొరేట్ శక్తులు కోరుకుంటున్నాయి. పెట్టుబడి, సరుకులు వివిధ దేశాల సరిహద్దుల మధ్య ప్రవహించడానికి ఎటువంటి అడ్డంకులు ఉండకూడదని కార్పొరేట్ సంస్థలు ఒత్తిడి తెస్తున్నాయి. అందుకు ఏ దేశమైనా వ్యతిరేకిస్తే వాటిపై ఏదో ఒక సాకు చూపి యుద్ధాన్ని రుద్దుతున్నాయి. ఈ విధంగా ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడి విస్తరిస్తూనే ఉంది, దాని దోపిడీ విజృంభిస్తూనే ఉంది.

అయితే పెట్టుబడి ప్రయాణం, విస్తరణ సజావుగా ఏమీ సాగలేదు. కారల్ మార్క్స్ ప్రతి పది సంవత్సరాలకి వాణిజ్య సంక్షోభం వస్తుందని చెప్పాడు. 19వ శతాబ్దం రెండవ అర్థభాగం మరియు 20 శతాబ్దాలలో పెట్టుబడి గమనం సంక్షోభాలతోటే సాగింది. 1879లో ఫ్రాన్స్‌లో పారిస్ విప్లవం జరిగింది. 70 రోజులలో ఈ విప్లవం వీగిపోయినా సమాజానికి భవిష్యత్ మార్గం చూపించింది. 1917లో ఇప్పటికి 100 సంవత్సరాల క్రితం అప్పటి రష్యాలో జార్ చక్రవర్తికి వ్యతిరేకంగా ఫిబ్రవరి విప్లవం, అలాగే పెట్టుబడికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మహా అక్టోబరు విప్లవంగా పేరుగాంచిన కార్మికవర్గ విప్లవం జరిగి సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం పెద్ద పెద్ద అంగలతో ముందుకు సాగింది, సామ్రాజ్యవాదుల ఒత్తిడిని ఎదుర్కొంటూ ఈ వ్యవస్థ ఏడు దశాబ్దాలు నిలదొక్కుకుంది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో తూర్పు యూరప్‌లో అనేక దేశాలు పెట్టుబడికి వ్యతిరేకంగా కార్మికవర్గ నాయకత్వాన నూతన ప్రజాస్వామిక వ్యవస్థలు ఏర్పాటు చేసుకున్నాయి. 1949 చైనాలో నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతమయింది, పెట్టుబడికి వ్యతిరేకంగా జనచైనా ఏర్పడింది. వియత్నాం (1945), నార్త్ కొరియా (1945) క్యూబా (1959) లలో విజయవంతంగా విప్లవాలు జరిగి నూతన ప్రజాస్వామిక వ్యవస్థలు ఏర్పడ్డాయి. అనేక దేశాలలో సోషలిస్టు వ్యవస్థలు, నూతన ప్రజాస్వామిక వ్యవస్థలు, పెట్టుబడియేతర వ్యవస్థలు నిలదొక్కుకోలేకపోయినా ఈ తిరుగుబాట్లు, విప్లవాలు, ప్రత్యామ్నాయ వ్యవస్థలు అన్నీ పెట్టుబడి వ్యవస్థ సంక్షోభాలకు ఫలితంగానూ, ప్రత్యామ్నాయ వ్యవస్థలుగానూ వచ్చినవే. అయితే అదే క్రమంలో భారతదేశంతో సహా వివిధ ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలు భూస్వామ్య ఉత్పత్తి విధానాల నుండి బయటపడుతూ, పెట్టుబడిదారీ దేశాలుగా మారుతూ ఉన్నాయి. ఆ దేశాలలో కూడా శ్రమదోపిడీ కారణంగా ఉత్పత్తుల విలువకంటె ప్రజల కొనుగోలు శక్తి తక్కువగానే ఉంది. అక్కడ కూడా సరుకులు అమ్ముకోలేక పోవడం అనే సమస్య తలెత్తింది. ప్రపంచ వాణిజ్య సంస్థ ద్వారా, ఇతర సాంప్రదాయ, వినూత్న పద్ధతుల ద్వారా సామ్రాజ్యవాద దేశాలు వెనుకబడిన దేశాల మార్కెట్లను కబళిస్తూనే ఉన్నాయి. ముడి సరుకులను, శ్రమశక్తిని దోచుకుంటూనే ఉన్నాయి. మేధోసంపత్తి హక్కులు మరొక పెద్ద దోపిడీ రంగం అయింది. ఎన్నిదారులు వెదికినా ప్రపంచంలో సామ్రాజ్యవాద దేశాలతో సహా అత్యధిక దేశాలు ప్రస్తుతం ఈ మార్కెట్ సంక్షోభం అనే సమస్యను ఎదుర్కొంటున్నాయి. 2008 అమెరికా సబ్ ప్రైమ్ సంక్షోభం తాజా ఉదాహరణ.

తాత్కాలికంగా కార్మికవర్గ విప్లవాలు వెనుకపట్టు పట్టినా, పెట్టుబడి వ్యవస్థ సృష్టిస్తున్న మార్కెట్ సంక్షోభం, అదే ఉత్పత్తి అయిన సరకులు అమ్ముకోలేక పోవడమనే సంక్షోభం మరింత విస్తృతంగా, మరింత బలంగా, మరింత విధ్వంసకంగా ముందుకు వస్తుంది. అది వివిధ దేశాలలోనూ, ప్రపంచ స్థాయిలోనూ విప్లవానికి కావలసిన పరిస్థితులను కల్పిస్తూ ఉంది. ఈ మధ్యనే 2008లో జరిగిన ఉదాహరణను పరిశీలిస్తే అమెరికా బ్యాంకులు కుంచించుకుపోతున్న ప్రజల కొనుగోలు శక్తిని, ఫలితంగా పెట్టుబడిదారులు సరుకులు అమ్ముకోలేని పరిస్థితి 'ఆవిష్కరించడానికి' వ్యక్తుల ఆదాయ స్తోమతలకన్నా ఎక్కువ అప్పులిచ్చాయి. వీటినే సబ్ ప్రైమ్ రుణాలు అన్నారు. ఇదే సబ్ ప్రైమ్ సంక్షోభానికి దారితీసింది. తక్కువ వేతనాలు లేదా ఆదాయాల కారణంగా వారు వాయిదాలు కట్టలేకపోయారు లేదా వారు కట్టిన వాయిదాలు వడ్డీకి, అప్పు రీసర్వీసింగ్‌కి జమచేసుకుంటూ, వారు అప్పుతో కొనుగోలు చేసిన ఇండ్లను బ్యాంకులు జప్తుచేస్తాయి. ప్రజలు రోడ్డున పడ్డారు. వట్టిపోయిన బ్యాంకులను నింపడానికి ప్రభుత్వం అదనంగా డాలర్లు ముద్రించింది. రియల్ ఎస్టేట్ వారికి బ్యాంకుల డబ్బులు వచ్చాయి, బ్యాంకులకు ప్రభుత్వం డబ్బులు వచ్చాయి, ప్రజలు మాత్రం రోడ్డున పడ్డారు. ప్రభుత్వ వాయిదాలు కట్టలేని పౌరులకు సహాయం చేయలేదు, ఇళ్లను జప్తుచేసిన బ్యాంకులకు మద్దతు ఇచ్చింది. ఈ సందర్భంగా పెట్టుబడి సంక్షోభం, ప్రభుత్వ దోపిడీవర్గ లక్షణం రెండూ బయటపడ్డాయి.

మన చర్చ మేరకు చెప్పుకోవలసిన విషయమేమంటే, పెట్టుబడిదారీ వ్యవస్థ మార్కెట్ సంక్షోభాన్ని అంటే తయారైన సరుకులను అమ్ముకోలేని సంక్షోభాన్ని నిరంతరం సృష్టిస్తూ ఉంటుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో దీనికి పరిష్కారం లేదు. సోషలిస్టు వ్యవస్థ కొనసాగినన్నాళ్లు రష్యాలో ఈ మార్కెట్ సంక్షోభం కనిపించలేదు. భూస్వామ్య వ్యవస్థ కాలంలో కూడా ఇతర తీవ్ర సమస్యలున్నా మార్కెట్ సంక్షోభం మాత్రం లేకుండంది. ఈ మార్కెట్ సంక్షోభం పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రత్యేక లక్షణం. అయితే పెట్టుబడిదారీ వ్యవస్థ మార్కెట్ సంక్షోభాన్నే కాదు, ఒకవైపు ప్రకృతి సంక్షోభాన్ని, రెండవ వైపు మానవ సంబంధాలలో, కుటుంబ సంబంధాలలో సంక్షోభాన్ని సృష్టిస్తుంది. అసలు అధికాధికంగా వ్యక్తులను మానసిక సంక్షోభంలోనికి నెట్టివేస్తుంది. మనుషులు శారీరకంగా, మానసికంగా రోగగ్రస్తులవుతున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఇప్పుడు పెట్టుబడి తన నియోలిబరల్ రూపంలో విధ్వంసకర అభివృద్ధిని సాగిస్తుంది. ప్రకృతిని, సమాజాన్ని, వ్యక్తిని విధ్వంసం చేస్తుంది. పెట్టుబడిని పాలించే నైతిక హక్కు ఎంతమాత్రం లేదు. అయితే ఈ విషయాలు మన చర్చ పరిధిలో లేనందున ఇక్కడితో విడిచిపెడదాం. మన చర్చమేరకు అసలు ఈ మార్కెట్ సంక్షోభం ఎందుకు వస్తుంది, ఎలా పరిష్కారం అవుతుంది అన్న విషయాల పరిశీలనను మాత్రమే కొనసాగిద్దాం.

చర్చలో కాస్త వెనకకు వెళ్లి గుర్తుచేసుకుంటే ఇంగ్లండులో ఒక

సంవత్సర కాలంలో 36 వేల కోట్ల పౌండుల విలువగల సరుకులు అమ్ముడుపోకుండా మిగిలిపోవడం గమనిస్తాం. ఆ దేశంలో అదనంగా కార్మికులుంటే ఈ 36 వేల కోట్ల పౌండులు విలువగల సరుకులతో మరిన్ని పరిశ్రమలు పెట్టవచుచ. వేజ్ గూడ్స్‌ను వారికి వేతనాలుగా ఇచ్చి క్యాపిటల్ గూడ్స్‌తో అదనంగా పరిశ్రమలు పెట్టి నడుపవచ్చు. కాని, దేశంలో అదనంగా కార్మికులు లేరు. ఇన్న జనాభా అంతా కార్మికులుగా మారిపోయారు. కొత్త కార్మికులుగా మారడానికి ఎవరూ లేరు. అంతేకాదు, పెట్టుబడిదారీ వ్యవస్థ కొద్దిమంది కార్మికులను నిరుద్యోగులుగా కొనసాగిస్తుంది, వారి మధ్య పోటీ ఉండాలి కదా. కార్మికుల మధ్య పోటీ లేకపోతే వారి ఉద్యమాలు పెరుగుతాయి, దోపిడీ తగ్గించవలసి ఉంటుంది. అందుకే పెట్టుబడిదారీ ప్రభుత్వాలు 100 శాతం ఉద్యోగితను ఎప్పుడూ కల్పించవు. అనేక సందర్భాలలో కల్పించాలనుకున్నా కల్పించలేవు. ఆ విషయాన్ని అలా ఉంచితే, మన ఉదాహరణలో ఇంగ్లండు దేశంలో అదనంగా కార్మికులు లేరు కావున కార్మికుల కొరకు వేరే దేశానికి వెళ్లాలి. దీనర్థం ఏమిటంటే అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశం కొనుగోలుదారుల కొరకు గాని లేదా కార్మికుల కొరకు గాని వేరే దేశంపైకి వెళ్లవలసి ఉంటుంది. ఒక అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశం కార్మికుల కొరతను అధిగమించడానికి పరిశ్రమలను ఆటోమేషన్ చేయడం ఒక మార్గం. అంటే మిగిలిన 36 బిలియన్ పౌండులను కేపిటల్ గూడ్స్ పైనే ఖర్చు చేయాలి. అందులో సమస్య ఏమీలేదు. గత సంవత్సరం ఉత్పత్తిలోనే కేపిటల్ గూడ్స్ ఉత్పత్తి వాటా పెంచవచ్చు. అంటే కొత్త కార్మికుల అవసరాన్ని ఆధునికీకరణ ద్వారా తాత్కాలికంగా పరిష్కరించవచ్చు. దానికి మొదటి షరతు సాంకేతికత పెరగడం. ఆ షరతు తీరినా కొన్ని సమస్యలున్నాయి. ఈ పద్ధతిలో కార్మికులు పెరగరు, ఉత్పత్తి పెరుగుతుంది. పెరిగిన ఉత్పత్తిని స్వదేశంలో అమ్ముకోవడం మరలా సమస్యగానే పరిణమిస్తుంది. ఫలితంగా జరిగినదేమిటి? కార్మికుల కొరత అనే సంక్షోభాన్ని అమ్మకాల సంక్షోభంగా బదలాయించడం జరిగింది. సరుకుల అమ్మకాలకు విదేశీ మార్కెట్లు అందుబాటులో ఉన్నన్నాళ్లూ అభివృద్ధి చెందిన దేశాలలో కేపిటల్ ఇన్‌టెన్సిఫికేషన్ వివిధ స్థాయిలో జరుగుతూనే వచ్చింది. అవి మరింత అభివృద్ధి దేశాలుగా మారుతూ వచ్చాయి. అయితే ఇదే క్రమంలో స్వదేశంలో ఆధునికీకరణ చెపట్టాలా లేక కాలనీలలో పరిశ్రమలు పెట్టాలా అనే సమస్య కూడా వస్తుంది. పెట్టుబడిదారులకు స్వదేశం అనేది ఉండదు. ఏది ఎక్కువ లాభం అయితే ఆ పనే చేస్తారు. విదేశాలలో కారుచౌక పరిశ్రమ కొల్లగొట్టడానికి వారు అనేక సందర్భాలలో పెట్టుడిని విదేశాలకు తరలించారు. అంటే తొలి దశలో సరుకుల ఎగుమతి కొరకు, మలిదశలో పెట్టుబడి ఎగుమతి కొరకు పెట్టుబడిదారులు వలసలు కోరుకుంటారు. ప్రపంచంలో దేశాలన్నీ పెట్టుబడిదారీ దేశాలైనప్పుడు 'విదేశీ పరిష్కార' అనేది కూడా ఉండదు కదా! కాబట్టి పెట్టుబడిదారీ వ్యవస్థ పరిష్కారం లేని వ్యవస్థ.

ప్రతి దేశం పెట్టుబడిదారీ దేశంగా మారేవరకు, ప్రతి దేశంలో వ్యసాయంతో సహా అన్ని రంగాలు పెట్టుబడి పెత్తనం కిందకు వచ్చేవరకు ఆర్థిక విశ్లేషణ రీత్యా పెట్టుబడిదారీ వ్యవస్థకు భవిష్యత్ ఉంది. అయితే, వ్యష్టి పెట్టుబడిదారుల మధ్య లాభాల కొరకు జరిగే పెనుగులాటలో వారు చాలా ఆతురతతో వ్యవహరిస్తారు, ఒక పథకం ప్రకారం మార్కెట్‌ను పంచుకోవడం వారికి సాధ్యం కాదు. అందుకై వారు రెండు ప్రపంచ యుద్ధాలను చేయడమే గాక, నిరంతరం ప్రపంచంలో ఏదో ఒక మూల యుద్ధం చేస్తూ ఉంటారు. ఉత్పత్తిలో అరాచకం ఉంటుంది. అందుకే ఈ వ్యవస్థ అనేక మార్కెట్ సంక్షోభాలకు దారితీస్తుంది. ఈ మధ్య కలంలో పెట్టుబడిదారీ వ్యవస్థ విద్య, వైద్యం వంటి ప్రభుత్వ బాధ్యతలను అలాగే అనేక పరస్పర సహకార రంగాలను వ్యాపారం చేయదగ్గ సేవలుగా మార్చివేసి తన జీవిత కాలాన్ని పొడిగించుకుంటుంది. విద్య, వైద్యం వ్యాపారాత్మకం కావడంతో సమాజం సర్వ భ్రష్టత్వం వైపు నడుస్తుంది. అధిక లాభాల వేటలో పెట్టుబడి అస్థవ్యస్థంగా వ్యవహరిస్తుంది. బాధ్యతా రహితంగానే కాదు, హంతక ప్రవృత్తితో వ్యవహరిస్తుంది. ఒకవైపు మార్కెట్ సంక్షోభంలో పడిపోతున్న పెట్టుబడి, రెండవ వైపు ఊహించలేని స్థాయిలో తన దోపిడీ క్షేత్రాలను విస్తరిస్తుంది. అందుకే పెట్టుబడిదారీ వ్యవస్థ దానికదే కూలిపోదు, కాని అది ఎంతకాలం కొనసాగితే మానవ జాతి అంతగా దిగజారిపోతుంది, ప్రకృతి అంతగా విధ్వంసం అవుతుంది. పెట్టుబడికి శ్రమకి మధ్య ప్రారంభమైన వైరుధ్యం ఈ స్థితిలో ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల మధ్య వైరుధ్యంగా మారుతుంది. ఒకనాడు ఉత్పత్తి శక్తుల–అంటే వ్యావసాయంతో సహా పరిశ్రమల అభివృద్ధికి, కార్మికుల ఉత్పాదకత అభివృద్ధికి, వారి నాగరికత అభివృద్ధికి, మొత్తం సమాజం ఆర్థిక, రాజకీయ, సామాజిక అభివృద్ధికి–చోదశక్తిగా నిలిచిన పెట్టుబడి, ఈనాడు వాటి మరింత అభివృద్ధికి ఆటంకంగా నిలుస్తుంది, ఇంకా చెప్పాలంటే వారి విధ్వంసానికి దారి తీస్తుంది. ఈ స్థితిలో పెట్టుబడిదారీ వ్యవస్థను రద్దుచేయడం ఒక్కటే ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఏకైక మార్గం. శ్రమ–పెట్టుబడి అనే ఉత్పత్తి సంబంధం, అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ రద్దు మాత్రమే మానవజాతి ముందున్న మార్గం.

**మార్కెట్ సంక్షోభానికి పరిష్కారం:** చివరగా మనం పరిశీలించిన ఉదాహరణను తిరిగి పరిశీలిద్దాం. ఈ ఉదాహరణ సందర్భం నాటికి ఇంగ్లాండులో కార్మికులు, పెట్టుబడిదారులు, ప్రభుత్వ ఉద్యోగులు మాత్రమే ఉన్నారు. మిగిలిన వర్గాలన్నీ నశించిపోయాయి. ఇంగ్లాండులో మొత్తం పెట్టుబడి 100 బిలియన్ పౌండులు. అందులో స్థావర పెట్టుబడి 50 బిలియన్ పౌండులు, టర్నోవర్ పెట్టుబడి 50 బిలియన్ పౌండులు. టర్నోవర్ పెట్టుబడిలో 45 బిలియన్ పౌండుల ముడి సరుకులను, యంత్రాల తరుగుదలను ఉపయోగించి 55 బిలియన్ పౌండుల విలువైన సరుకులను కార్మికులు ఉత్పత్తి చేస్తారు. అంటే వారు 10 బిలియన్ పౌండుల విలువైన శ్రమచేస్తారు. అయితే వారికివ్వబడిన వేతనం 5 బిలియన్ పౌండులు మాత్రమే. మిగిలిన 5 బిలియన్ పౌండులు భూమికి బాటకంగా, పెట్టుబడికి వడ్డీగా, ప్రభుత్వానికి పన్నుగా వ్యవస్థాపకునికి లాభంగా పంచబడడం మనం గమనించాం. అయితే ప్రభుత్వం తప్ప మిగిలిన వర్గాలు వాటిని ఖర్చు పెట్టలేకపోయాయి. మార్కెట్ సంక్షోభం వచ్చింది. ఈ 10 బిలియన్ పౌండులు కార్మికులు శ్రమశక్తి ఉత్పాదితాలే. అవి కార్మికులకే చెందాలి. ఈ 10 బిలియన్ పౌండులు కార్మికులకు వేతనాలుగా చెల్లిస్తే అందులో కొంత భాగం వారు ప్రభుత్వానికి పన్నులు కూడా చెల్లిస్తారు. కార్మిక వర్గం, ప్రభుత్వం కలిసి ఉత్పత్తి అయిన వస్తువులను మొత్తంగా కొనుగోలు చేయగలుగుతారు. మార్కెట్ సంక్షోభం అనేదే తలెత్తదు. అయితే ఇటువంటి ప్రతిపాదన పెట్టుబడిదారులు సంహజంగానే అంగీకరించరు. వారిమాట పక్కన పెట్టినా మధ్యతరగతి వారు కూడా ఒప్పుకోరు. వారు అనేక ప్రశ్నలు లేవనెత్తుతారు. కార్మికులకు కూడా కొన్ని ప్రశ్నలు వస్తాయి. ప్రధానమైన ప్రశ్నలను వరుసగా క్లుప్తంగా పరిశీలిద్దాం.

**1) భూమికి భాటకం ఇవ్వవచ్చా?** భూమి ప్రకృతి సిద్దమైనది. చరిత్రలో ఏనాడో జరిగిన దుర్మార్గాల వలన భూమి వ్యక్తిగత ఆస్తిగా మారిపోయింది. తిరిగి దానిని సామాజిక ఆస్తిగా మర్చవచ్చు. భూమికి

భాటకాన్ని రద్దుచేయవచ్చు. పంటలు పండించేవారు భూమిని ఉపయోగించవచ్చు, పరిశ్రమలు పెట్టేవారు కూడా భూమిని ఉపయోగించవచ్చు. ఎటువంటి భాటకం చెల్లించవలసిన అవసరం లేకుండా చట్టం చేయవచ్చు.

**2) బ్యాంకులకు వడ్డీ ఇవ్వవద్దా?** డబ్బులు ఎవరూ అప్పు తీసుకోకపోతే బ్యాంకులలో డబ్బులు పిల్లలను కనలేవు. అక్కడ ఉత్పాదక శ్రమ అంటూ ఏమీ ఉండదు. బ్యాంకులను వ్యాపార సంస్థలుగా కాకుండా, పబ్లిక్ సంస్థలుగా నిర్వహించవచ్చు, లాభ నష్టాలు లేకుండా నిర్వహించవచ్చు. వ్యక్తులు, సంస్థలు, ప్రభుత్వాల మధ్య ఆర్థిక లావాదేవీలను నిర్వహించే సంస్థలుగా వాటిని నడుపవచ్చు. అందులో ఉద్యోగులకు ప్రభుత్వం జీతాలు ఇవ్వవచ్చు.

**3) ప్రభుత్వానికి పన్నులు చెల్లించవచ్చా?** ప్రభుత్వానికి-అది పెట్టుబడిదారీ వర్గ ప్రభుత్వమైనా, కార్మికవర్గ ప్రభుత్వమైనా-నిధులు అవసరమవుతాయి, అందుకు పన్నులు వసూలు చేయడం అవసరం. ప్రతి పరిశ్రమ పన్నులు చెల్లించవలసి ఉంటుంది. పరిశ్రమలు పెట్టుబడిదారుల యాజమాన్యంలో ఉంటే పెట్టుబడిదారులు తమ స్థూల లాభాలలో కొంత భాగాన్ని పన్నులుగా చెల్లిస్తారు. పరిశ్రమలు కార్మిక సంఘాల యాజమాన్యంలో ఉంటే (సోషలిస్టు వ్యవస్థలో) ఆ సంఘాలే పరిశ్రమ ఉత్పత్తి చేసిన విలువలో కొంత భాగాన్ని పన్నులుగా చెల్లిస్తాయి.

**4) పెట్టుబడిదారునికి లాభం?** పెట్టుబడిదారుడు పెట్టుబడి పెడుతున్నాడు కాబట్టి పెట్టుబడిదారునికి లాభం అందాలి అనేది ఒక బలమైన, ప్రధానమైన వాదనగా ఉంది. పెట్టుబడిదారుల పెట్టుబడి ప్రతి మూడు సంవత్సరాలకి రెండు రెట్లు కావడాన్ని మనం గణించాం. గతంలో చెప్పుకున్న నాలుగుల అంశాలు (పరిశ్రమల సంఖ్యను లేదా సామర్థ్యాన్ని పెంచగలగడం, అధికాధికంగా ముడిసరుకులు, కార్మికులు, కొనుగోలుదారులు అందుబాటులో ఉండడం) అనుకూలంగానే ఉంటే పెట్టుబడి ఆ విధంగా పెరుగుతుంది. మనం శ్రద్ధగా పరిశీలిస్తే, పెట్టుబడి పెరగడానికి ఏదైతే కారణంగా ఉందో పెట్టుబడి పుట్టడానికి కూడా అదే కారణమని తెలుస్తుంది. పెట్టుబడి పుట్టుక, పెరుగుదల అన్నీ కార్మికుల శ్రమ దోపిడీతోనే సాధ్యమయిందని గ్రహించాలి. కొన్నిమార్లు ఇది రైతుల భూముల కబ్జా ద్వారా కూడా జరిగింది. ప్రభుత్వ వనరులను అంటే ప్రజల వనరులను రాయితీలుగా పొందడం వలన కూడా పెట్టుబడి పెరిగింది. చరిత్రలో సముద్ర దొంగతనాల ద్వారా కూడా పెట్టుబడి పుట్టుకువచ్చింది. పెట్టుబడి తరతరాల శ్రమజీవుల సంచిత శ్రమ మాత్రమే. దానిని కార్మికవర్గం స్వాధీనం చేసుకుని నిర్వహిస్తే వచ్చిన సమస్య ఏమిటి? అంతకు మించి ఇప్పుడది ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి తప్పనిసరి అవసరం, చారిత్రక అవసరం.

మనం మాట్లాడుతున్నది గృహ పరిశ్రమల యజమాని గురించి కాదు, గృహ పరిశ్రమలను దివాలా తీయించిన పెద్ద పెట్టుబడిదారుల గురించి. పెద్ద పెద్ద పరిశ్రమల పెట్టుబడిదారులకు ఉత్పత్తి నిర్వహణతో కూడా ఎటువంటి సంబంధం ఉండదు. ముడిసరుకుల కొనుగోలుచ తయారీ సరుకుల అమ్మకాలు వంటి వాణిజ్య నిర్ణయాలను మాత్రమే వీరు చేస్తారు. మరో విధంగా చెప్పాలంటే, ఇతర పెట్టుబడిదారుల నుండి, వ్యాపారుల నుండి తమ లాభాలను కాపాడుకోవడానికి సంబంధించిన విషయాలపై అలాగే వీలైతే ఇతర పెట్టుబడిదారుల, వ్యాపారుల లాభాల నుండి కొంత వాటాని కబళించడానికి సంబంధించిన విషయాలపై మాత్రమే వీరు దృష్టిపెడతారు. వారిలో (పెట్టుబడిదారులు, వ్యాపారులు, బ్యాంకర్లు) వారిమధ్య లాభాల పునఃపంపిణీకి సంబంధించిన విషయాలకే వారి కార్యాచరణ పరిమితం అన్నమాట. లేదా ప్రభుత్వం నుండి ఆయాచితంగా రాయితీలు పొందడం, ప్రభుత్వ ఆస్తులను చట్టవిహితంగా లేదా చట్ట విరుద్ధంగా ఆక్రమించడం వంటి పనులలో వీరు నిమగ్నమై ఉంటారు. పరిశ్రమ నిర్వహణలో పెట్టుబడిదారుల పాత్ర పరిమితంగానే ఉంటుంది. కాబట్టే వారు లేకపోయినా మేనేజర్ అనే ఉద్యోగి పరిశ్రమ నడపగలుగుతాడు. వారు పెట్టిన పెట్టుబడి సంవత్సరాల తరబడి జరిగిన శ్రమ దోపిడీ ఫలితమే, వారి కార్యాచరణ ఉత్పత్తిలో సంబంధంలేని వ్యవహారమే. పెట్టుబడిదారులు పెట్టుబడిగా చెప్పబడుతున్నది వారి శ్రమ ఫలితం కాదు, వారి శ్రమ సామాజిక విలువలనేవి సృష్టించడం లేదు. ఒక్కమాటలో చెప్పాలంటే సంచిత సామాజిక శ్రమ అయిన పెట్టుబడిని సమాజపరం చేయడంలో ఎటువంటి అన్యాయం లేదు. పెట్టుబడి సమాజపరం అయిన తర్వాత పెట్టుబడిదారునికి లాభం అన్నమాటకు అర్థమే ఉండదు కదా! కార్మిక సంఘమే వ్యవహారాలు నిర్వహిస్తుంది. 10 బిలియన్ పౌండులు కార్మికులకు వేతనాలుగా చెల్లించవచ్చు. పెరిగిన వేతనాలలో కార్మికులు తమ జీవితాలను మెరుగుపరుచుకోవడమే గాక, తమ పరిశ్రమ అభివృద్ధికి ఖర్చు చేయడమే గాక, వివిధ స్థాయిల ప్రభుత్వాలకు పన్నులు చెల్లిస్తారు. ఫలితంగా, నిరంతరాయంగా, కార్మికులు అభివృద్ధి చెందుతారు, వారి పరిశ్రమలు, ప్రభుత్వాల అభివృద్ధి, సంక్షేమ చర్యలు విస్తరిస్తాయి. సమాజం, కొరత నంచి అందరి వాస్తవ అవసరాలలో సమృద్ధి సాధించేవైపు ముందుకు వెళుతుంది. కార్మిక వర్గం రాజ్యాధికారం చేపట్టడం, ఉత్పత్తి సాధనాలను స్వాధీనం చేసుకోవడం, సోషలిస్టు వ్యవస్థలను, నూతన ప్రజాస్వామిక వ్యవస్థలను నిర్మించడమే ప్రస్తుత చారిత్రక కర్తవ్యం.

పెట్టుబడిదారీ వ్యవస్థ వర్తమానంలో అభివృద్ధి నిరోధక పాత్ర పోషిస్తున్నప్పటికీ, పెట్టుబడిదారీ వ్యవస్థకు, పెట్టుబడిదారీ వర్గానికి చరిత్రలో ఒక స్థానం ఉంది. జడత్వంతో కూడుకున్న భూస్వామ్య ఆస్తిని చైతన్యవంతమైన పెట్టుబడిగా మార్చడం ఈ వర్గం నిర్వహించిన గొప్ప చారిత్రక పాత్ర. భూస్వామ్య ఆర్థిక, రాజ్యాధికార వ్యవస్థలు వచ్ఛిన్నం చేయబడిన తర్వాత పెట్టుబడి ప్రగతిశీల పాత్ర పూర్తి అవుతుంది. తర్వాత అది ప్రగతి నిరోధక పాత్ర పోషిస్తుంది. స్వేచ్ఛా విఫణిదశ దాటి, ఏకస్వామ్య దశ (మోనోపలిదశ), దానితో వచ్చే ఫైనాన్స్ పెట్టుబడి దశ, నేటి నయా సరళీకరణ దశలలో దేశాల మధ్య యుద్ధాలు సృష్టిస్తూ, జాతుల మధ్య కలహాలు సృష్టిస్తూ, ప్రకృతిని విధ్వంసం చేస్తూ, మానవ సంబంధాలను పచ్చి వ్యాపార సంబంధాలుగా దిగజారుస్తూ చివరికి మానవుని శారీరక, మానసిక ఆరోగ్యాన్ని కూడా దిగజారుస్తూ మానవుని అస్తిత్వాన్ని విధ్వంసం చేస్తుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే పెట్టుబడి అభివృద్ధికర పాత్ర పూర్తయింది. ఇప్పుడది అభివృద్ధి నిరోధక పాత్ర మాత్రమే పోషించగలుగుతుంది. మానవ నాగరికత విధ్వంసం నుండి కాపాడబడడానికి, ప్రగతిశీలంగా ముందుకు సాగడానికి పెట్టుబడిదారీ వ్యవస్థను తోసివేయవలసిందే. కార్మికులు, రైతులు సృష్టించే అదనపు శ్రమ పెట్టుబడిదారుల చేతులలో విధ్వంసకర శక్తిగా కాక, కార్మిక-కర్షక రాజ్యం చేతులలో ప్రగతి ప్రాతిపదికగా ఏర్పడవలసిందే.

సంచిత శ్రమ అయిన పెట్టుబడి, సజీవ శ్రమ అయిన కార్మికులను పరిపాలించే పరిస్థితి పోవాలి, వర్తమానంలో సజీవశ్రమ అయిన కార్మిక వర్గం, పెట్టుబడిని సామాజిక ప్రగతికి ఉపయోగించాలి. మార్క్స్ మాటలను సరళంగా చెప్పాలంటే పెట్టుబడిదారీ వ్యవస్థలో గతం (సంచిత శ్రమ అయిన పెట్టుబడి) వర్తమానాన్ని (సజీవ శ్రమ అయిన కార్మికుడిని)

శాసిస్తుంది. కార్మిక రాజ్యంలో వర్తమానం (సజీవ శ్రమ) గతాన్ని (పెట్టుబడిని) శాసిస్తుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడిన క్రమంలో రైతులు, వృత్తికారులు చేసే వ్యష్ఠి ఉత్పత్తి స్థానంలో పరిశ్రమలు వచ్చాయి. పరిశ్రమలలో ఉత్పత్తి సామాజికమైనది, అంటే ఒక ఫ్యాక్టరీలో వందల సంఖ్యలో, వేల సంఖ్యలో కార్మికులు పనిచేస్తారు. అంటే కార్మికులు పెద్ద సంఖ్యలో సమిష్టిగా ఉత్పత్తి చేస్తారు. (వీరందరూ ఒకే కాంపౌండులో ఉండవలసిన అవసరం లేదు) పెట్టుబడిదారీ వ్యవస్థ లక్షణం విస్కృత పనివిభజన. ఒక ఫ్యాక్టరీకి ముడి సరుకులు వేరొక ఫ్యాక్టరీ నుంచి వస్తాయి. అవసరమైన యంత్రాలు మరొక ఫ్యాక్టరీ నుంచి వస్తాయి. ఇక్కడ విస్తృత మానవ సమాజం కొరకు ఉత్పత్తి జరుగుతుంది. అంటే ఉత్పత్తి సామాజికమైనది. కాని, పెట్టుబడి వ్యష్ఠి ఆస్తిగా ఉంటుంది. ఇది ఈ వ్యవస్థలో ప్రధానమైన వైరుధ్యం. పెట్టుబడిని సామాజీకరించడమే దీనికి చారిత్రకంగా అవసరమైన, సాధ్యమైన అనివార్యమైన పరిష్కారం అంటాడు కార్ల్ మార్క్స్. అందుకే పెట్టుబడిదారీ ప్రపంచం ఆయనపై కత్తికట్టింది. అయితే ప్రగతిబాటను చూపిన మార్క్సును మానవాళి విముక్తి ప్రదాతగా భావిస్తుంది. ఈ అనివార్యత వాస్తవీకరణ కార్మికుల, కష్టజీవుల, తొంభై తొమ్మిది శాతం ప్రజానీకం చైతన్యపూర్తి చర్య పైననే ఆధారపడి ఉంటుంది. విప్లవం దానికదేరాదు, చైతన్యవంతంగా నిర్వహించవలసిందే. సమస్యలను సరిగా గుర్తించడం, వాటిపై ప్రజలను సంఘటితపరచడం, ఉద్యమాలను రాజకీయీకరించడం, విప్లవించడం ఒక గొప్ప శాస్త్రం, అది ఒక గొప్ప కళకూడా అంటాడు మహా అక్టోబర్ విప్లవ నిర్మాత లెనిన్.

ప్రతిదేశంలో వ్యవసాయంతో సహా అన్ని రంగాలు పెట్టుబడి పెత్తనం కిందకు వచ్చిన తర్వాత కూడా ప్రతి మానవ కార్యకలాపాన్ని వ్యాపారం చేస్తూ దాని జీవిత కాలాన్ని అది పెంచుకుంటుందని, ప్రతి కొత్త సాంకేతిక ఆవిష్కరణను అది తన జీవితాన్ని పొడిగించుకోవడానికి ఉపయోగ పడుతుందని, పెట్టుబడిదారీ వ్యవస్థ అనంతంగా కొనసాగుతుందనే వాదనాలు ఉన్నాయి. ఈ అనంతత్వ వాదన బలం పెట్టబడి తన జీవన మార్గంలో అలవికాని సంక్షోభాలను సృష్టించుకుంటుందన్న విషయాన్ని గ్రహించకపోవడంలోనే ఉంది. అలాగే అటువంటి సంక్షోభాలను, ఒక సందర్భంలో కాకపోతే మరొక సందర్భంలో విప్లవాలుగా మార్చగలిగే మానవ చైతన్యం పాత్రపై నమ్మకం లేకపోవడంలో ఉంది. కొత్త రక్తాన్ని ఎన్నిమార్లు ఎక్కించుకున్నా పెట్టుబడిదారీ వ్యవస్థ మరణ శయ్యపై ఉన్నది వాస్తవం. జర్మన్ తత్వవేత్త హెగెల్ ప్రష్యన్ రాజ్యం అత్యున్నత దశకు చేరిందని అది శాశ్వతమని చెప్పేవాడట. ప్రష్యన్ రాజ్యం మొదటి ప్రపంచ యుద్ధంలో తునాతునకలైంది. అభివృద్ధికర పాత్ర కోల్పోయి పెట్టుబడి నెట్టివేసే వరకు మాత్రమే అధికారంలో ఉండగలుగుతుంది. ఎన్ని రంగాలలో పెట్టుబడి ప్రవేశిస్తుందో అన్ని రంగాలలో అది సంక్షోభాన్ని సృష్టిస్తుంది. పర్యావరణాన్ని, మానవ సంబంధాలను మనిషిని విధ్వంసం చేస్తున్న పెట్టుబడి మధ్యతరగతి వారిని కూడా శత్రువులుగా చేసుకుంటూ ఉంది. పెట్టుబడి అన్ని రంగాలలో సంక్షోభం సృష్టిస్తుందని తన గోతులను తానే త్వరత్వరగా తవ్వుకుంటుందని గమనించడం అవసరం. ఇప్పుడు కావలసింది లెనిన్ లేదా అంతకంటే గొప్ప నాయకుడు. సమాజం ఇంకా ఒట్టిపోలేదు. లెనిన్‌లు పుడుతూనే ఉంటారు.

**ఉత్పత్తి శక్తుల-ఉత్పత్తి సంబంధాల సూత్రం:** బానిస-బానిస యజమాని అనే ఉత్పత్తి సంబంధం అభివృద్ధి నిరోధకంగా తయారైన తర్వాత, వాటిని బానిసలు, అప్పటి ఉత్పత్తి శక్తులు కూల్చివేశాయి. భూదాసుడు-భూస్వామి ఉత్పత్తి సంబంధం కూలగొట్టడంలో ఇదే చారిత్రక సూత్రం పని చేసింది. శ్రమ-పెట్టుబడి అనే ఉత్పత్తి సంబంధం అభివృద్ధి నిరోధకంగా తయారైన నేటి స్థితిలో పెట్టుబడిదారీ వ్యవస్థకూ అదే సూత్రం వర్తిస్తుంది. అది కూడా కూల్చివేయబడుతుంది.

ఉనికిలో ఉన్న ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకంగా నిలిచిన చారిత్రక దశ వచ్చినప్పుడు అవి ఉత్పత్తి శక్తులచే విప్లవాత్మకంగా రద్దుచేయబడి, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి అనుకూలమైన కొత్త ఉత్పత్తి సంబంధాలు ఏర్పాటు చేసుకుంటాయి. ఆ కొత్త ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి కొంతస్థాయి వరకు సహకరిస్తాయి. అయితే ఉత్పత్తి శక్తుల మరింత అభివృద్ధికి అవి తదనంతర చరిత్ర దశలో ఆటంకపడతాయి. అప్పుడే ఆ ఉత్పత్తి సంబంధాలు అభివృద్ధి నిరోధకంగా తయారయ్యాయని అంటాం. అవి విప్లవాత్మకంగా రద్దు చేయబడి, ఉత్పత్తి శక్తుల మరింత అభివృద్ధికి అనుకూలమైన కొత్త ఉత్పత్తి సంబంధాలు ఏర్పడతాయి. ఇదే చరిత్ర గతితర్కం.

ఒకానొక చారిత్రకదశలో ఎదుగూ బొదుగూలేని భూస్వామ్య వ్యవస్థను బద్దలుకొట్టి, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి కారణమైన 'శ్రమ- పెట్టుబడి' అనే ఉత్పత్తి సంబంధం నేటి స్థితిలో, ఉత్పత్తి శక్తుల మరింత అభివృద్ధికి ఆటంకంగా నిలుస్తుందని చెప్పుకున్నాం. చరిత్ర గతితర్కం ప్రకారం ఈ 'శ్రమ-పెట్టుబడి' అనే పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధం కూడా విప్లవాత్మకంగా తోసివేయబడవలసిందే, తోసివేయబడుతుంది కూడా!

**ఉత్పత్తి శక్తుల అభివృద్ధి:** ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అంటే ఉత్పత్తి సాధనాలలో అభివృద్ధితో పాటు, ఉత్పత్తిదారుల (ఉత్పాదక శ్రమ చేసేవారి) విజ్ఞానం, నైపుణ్యం, సామర్థ్యం, జీవన ప్రమాణాలు, నాగరికత, హక్కుల అభివృద్ధి. ఈ అభివృద్ధి మానవ విలువల అభివృద్ధికి, నేటి కాలంలో పర్యావరణ అభివృద్ధికి కూడా దారితీయాలి. కాని నేటి పరిస్థితి అందుకు విరుద్ధంగా ఉంది. అందుకే ఉత్పత్తి సంబంధాలు అభివృద్ధి నిరోధకంగా తయారయ్యాయని అంటాం.

**సోషలిస్టు వ్యవస్థలో మార్కెట్ సంక్షోభం ఉండదు:** ఇంగ్లాండు ఒక సోషలిస్టు దేశం అయిందనుకుందాం. దేశంలో ఒకానొక సంవత్సరంలో పారిశ్రామిక పెట్టుబడి, గ్రామీణ పెట్టుబడి మొత్తం విలువ వంద బిలియన్ పౌండులనుకుందాం. (గత ఉదాహరణలో ఒక ట్రిలియన్ పౌండులు అనుకున్నాం. సౌలభ్యం కొరకు ఈ ఉదాహరణలో 1000 బిలియన్ పౌండులు అనుకుంటున్నాం) ఇందులో స్థావర పెట్టుబడి 500 బిలియన్ పౌండులు, టర్నోవర్ పెట్టుబడి 500 బిలియన్ పౌండులు అనుకుందాం. ప్రజలందరూ కార్మికులే. కార్మిక సంస్థలే వ్యవసాయంతో సహా అన్ని ఉత్పత్తి సంస్థలను నడుపుతున్నాయి. అట్టి సందర్భంలో అన్ని పరిశ్రమలు ఒక సంవత్సర కాలంలో 445 బిలియన్ పౌండుల ముడి సరుకులు, 5 బిలియన్‌ల తరుగు విలువల నుండి 550 బిలియన్ పౌండుల సరుకులు ఉత్పత్తి చేశాయి. ఆ సంవత్సరపు విలువ ఉత్పత్తి 550-(445+5) = 100 బిలియన్ పౌండులు. ఇదంతా కార్మికులకే చెందుతుంది. దేశ వ్యాప్తంగా ఉన్న ఉత్పత్తి యూనిట్లు 550 బిలియన్ పౌండుల విలువ కలిగిన మొత్తం ఉత్పత్తిని ప్రభుత్వానికి లేదా అది నియమించిన ఒక సొసైటీకి అప్పజెప్పాయనుకుందాం. (గణన సౌలభ్యం కొరకు మనం ఒక సొసైటీని ఊహిస్తున్నాం, అటువంటి సొసైటీ లేకపోయినా వాస్తవంలో తేడా ఏమీ ఉండదు.) ఆ సొసైటీ మొత్తం పరిశ్రమలకు అవసరమైన 450 బిలియన్ పౌండులు విలువ కలిగిన ముడి సరుకులను, తరుగుదల సరుకులను మరుసటి సంవత్సరం కొరకు ఆయా పరిశ్రమలకు అందిస్తుంది. 70 బిలియన్ పౌండుల సరుకులు ఆయా ఉత్పత్తి యూనిట్లలో పనిచేస్తున్న కార్మికులకు వేతనాలుగా, 10 బిలియన్ పౌండుల

సరుకులు ఆయా పరిశ్రమల అభివృద్ధికి, 5 బిలియన్ పౌండుల సరుకులు ఆయా ఉత్పత్తి యూనిట్లు ఉన్న గ్రామాల, పట్టణాల అభివృద్ధికి చెల్లిస్తాయి, మిగిలిన 15 బిలియన్ పౌండుల సరుకులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు కేటాయిస్తాయనుకుందాం. ఈ వాటాల నిర్ణయం వివిధ స్థాయి కార్మిక సంఘాల ద్వారా జరుగుతుంది. సొసైటీ తనకు చేరిన సరుకులనన్నీ ముడి సరుకులుగా, వ్యవసాయ ఉత్పత్తులుగా, తయారీ సరుకులుగా పంచివేయగలుగుతుంది. వ్యాపార సంక్షోభం ఏమీ ఉండదు. పరిశ్రమలు తమకు అదనంగా అందిన సరుకులతో విస్తరణ కార్యక్రమాలు చేపడతాయి. స్థానిక, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు, అభివృద్ధి చర్యలలో భాగంగా, ప్రాధాన్యతా ప్రాతిపదికపై కొత్త పరిశ్రమలు స్థాపిస్తాయి. 100 శాతం ఉద్యోగితను అమలు చేస్తుంది. కార్మికులు అదనంగా అవసరమైతే పరిశ్రమలను ఆధునీకరించడం ద్వారా అంటే క్యాపిటల్ ఇన్‌టెన్సిఫికేషన్ ద్వారా ఆ సమస్యను పరిష్కరిస్తుంది. కార్మికులు మిగులు ఉంటే పనిదినాలు పనిగంటలు తగ్గిస్తుంది. లాభాల రేటు పడిపోయి నందుకు సోషలిస్టు వ్యవస్థ ఎంతమాత్రమూ విచారించదు. లాభాపేక్షలేని ఈ సమాజంలో వ్యక్తి వికాసం, మానవ సంబంధాల అభివృద్ధి, సమాజ అభివృద్ధి, పర్యావరణ పరిరక్షణ లక్ష్యంగా ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అభివృద్ధి సాధ్యమవుతుంది. రష్యాలో, చైనాలో వివిధ దేశాలలో కార్మిక రాజ్యాలు కూలిపోయినందుకు డీలా పడవలసిన అవసరం లేదు. కొత్త వ్యవస్థల నిర్మాణంలో వివిధ స్థాయిల విఫల ప్రయత్నాలు సహజ. భవిష్యత్ ప్రయత్నం మరింత విస్తృతంగా, మరింత ఉధృతంగా మరింత ప్రభావశీలంగా జరుగవచ్చు, అది ప్రపంచాన్నే కుదుపివేయవచ్చు.

సోషలిస్టు వ్యవస్థలో పెట్టుబడిదారులు ఉండరు. మొత్తం ఉత్పత్తి అయిన విలువ ప్రజల వద్ద, వివిధ స్థాయిల ప్రభుత్వాల వద్ద ఉంటుంది. ఒక సంవత్సరంఓ ప్రజల, ప్రభుత్వాల కొనుగోలు శక్తి ఆ సంవత్సరం ఉత్పత్తుల విలువకు సమానంగా ఉంటుంది. కావున సరుకులు అమ్ముడు కాకపోవడం గాని, ఖర్చు కాకపోవడం గాని ఉండదు. వ్యాపార సంక్షోభం రానేరాదు. సరికదా ఒక పథకం ప్రకారం అభివృద్ధి జరుగుతుంది. ఈ వ్యాసం ఉద్దేశం సోషలిజాన్ని వివరించడం గాని, సోషలిజం అనివార్యతను రుజువు చేయడం గాని కాదు. పెట్టుబడిదారీ దేశాలలో వ్యాపార సంక్షోభం లేదా అమ్మకాల సంక్షోభం ఏర్పడుతుందని, వలస విధానం, సామ్రాజ్యవాదం దాని సహజ పరిణామమని వివరించడం. అలాగే, అన్ని దేశాలు లేదా అత్యధిక దేశాలు పెట్టుబడిదారీ దేశాలుగా మారినప్పుడు, వలసవాదం మార్కెట్ సంక్షోభ సమస్యకు పూర్తి పరిష్కారం కాజాలదని, సంక్షోభం ప్రపంచవ్యాప్తం అవుతుందని గుర్తించడం ఇక్కడ ప్రధానం. చివరగా హ్రస్వదృష్టి కలిగిన పెట్టుబడి, శత్రు వైరుధ్యంతో ఉండే పెట్టుబడి వర్గాలు ఒక దీర్ఘకాల పథకాన్ని పాటించలేవని, ముందుగానే అంటే అన్ని దేశాలలో వ్యవసాయిక పారిశ్రామిక రంగాలన్ని పెట్టుబడి ఆధీనంలోకి రాకముందే పెట్టుబడి తన మరణాన్ని కొనితెచ్చుకుంటుదని, ఇంకా అంతకంటే ప్రధానంగా, పెట్టుబడి తదుపరి అడుగులన్నీ సర్వవ్యాప్త విధ్వంసంతో కూడుకుని ఉన్నాయని, పెట్టుబడి తన మౌళిక లక్షణం కారణంగా నిరంతర సంక్షోభాలు సృష్టిస్తుందని, అయితే అదే సందర్భంలో అది తన జీవితాన్ని పొడిగించుకోవడానికి విద్య, వైద్యం వంటి సకల మానవ కార్యకలాపాలను, దాని శక్తియుక్తులను చివరికి జ్ఞాన సంపదను పెట్టుబడి పరిధిలోనికి తీసుకురావడానికి ప్రయత్నిస్తుందని, అది జీవన్మరణ సరిహద్దులలో నడుస్తుందని అది కూలిపోయే అవకాశం ఎంత ఉందో కొనసాగే అవకాశం కూడా అంతే ఉందని సూచించడం ఈ వ్యాసం ఉద్దేశం. పెట్టుబడి పతనం దానికదే జరగదని, శ్రమజీవుల, ప్రజల విస్తృత చైతన్యపూరితమైన సంఘటిత చర్యద్వారానే సాధ్యమని చెప్పడం ఈ వ్యాస ఉద్దేశం. శ్రమ దోపిడీలేని సోషలిస్టు వ్యవస్థ మాత్రమే మార్కెట్ సంక్షోభానికి పరిష్కారమని సూచించడం ఈ వ్యాసం ఉద్దేశం. అయితే ఏ సూచనను పూర్తిగా చర్చించలేదు. ఈ వ్యాసం మేరకు మార్కెట్ సంక్షోభానికి కారణాలు, పరిష్కారాలు పరిశీలించడమే ప్రధానం. ఈ వ్యాసాన్ని రష్యాలో జరిగిన సోషలిస్టు విప్లవం గురించి రెండు మాటలు చెప్పి ముగిద్దాం. ఎందుకంటే విప్లవానంతరం ఏర్పడిన సోవియట్ యూనియన్‌లో సరుకులు అమ్ముకోలేకపోవడం అనే సంక్షోభం తలెత్తనే లేదు. 1929లో ప్రపంచమంతా ఆర్థిక మాంద్యంలో మునిగి పోయింది కాని సోవియట్ యూనియన్ ఎటువంటి మాంద్యమాన్ని ఎదుర్కోలేదు. ఎందుకంటే అక్కడ ఆనాడు పెట్టుబడి దోపిడీ లేదు కాబట్టి.

**రష్యాలో సోషలిస్టు విప్లవం:** నిజానికి పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభంలో కూరుకుపోయినందున అది ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంక పడుతున్నందున అది కూల్చివేయబడాలని, కూల్చివేయబడుతుందని, దాని స్థానంలో తాత్కాలికంగా కార్మికవర్గ నియంతృత్వం ఏర్పడుతుందని, వర్గ అణచివేత సాధనమైన రాజ్యాంగ యంత్రం క్రమంగా దుల్లిపోయి, రాజ్యంలేని, వర్గాలులేని కమ్యూనిస్టు వ్యవస్థ (సమ సమాజం) ఏర్పడుతుందని మార్క్స్ చెప్పాడు. కార్మికవర్గ విప్లవం మార్క్స్ అంచనా వేసినట్లు అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో ముందుగా కాకుండా అవి వాటి సంక్షోభాన్ని సామ్రాజ్యవాద విధానంతో వెనుకబడిన దేశాలపైకి నెట్టివేయడంతో వెనుకబడిన దేశమైన రష్యాలో కార్మికవర్గ విప్లవం రావడం వలన, విప్లవం సంభవించిన దేశంలో వర్గాలు రద్దుకావడానికి దీర్ఘకాలం పట్టే పరిస్థితి వచ్చింది. స్వల్పకాల మధ్యాంతర దశ అనుకున్నది కాస్తా దీర్ఘకాల ప్రత్యేక దశగా పాదుకుంది. ఫలితంగా మార్క్స్ ఎటువంటి పేరూ పెట్టని పరివర్తన దశకు (పెట్టుబడిదారీ వ్యవస్థ నుండి కమ్యూనిస్టు వ్యవస్థకు పరివర్తన జరిగే దశకు) సోషలిస్టు వ్యవస్థ అనే పేరు స్థిరపడిపోయింది, ఇది ఇప్పుడు ఒక చారిత్రక దశగా పేర్కొనబడుతున్నది. దీర్ఘకాలంగా మారిపోయిన 'మధ్యంతర దశ' కాలంలో రెండవ ప్రపంచ యుద్ధం రావడంతో ఆ భారమంతా రష్యన్ కార్మిక వర్గంపై పడడంతో, ఆ యుద్ధాన్ని ఎదుర్కొనే వత్తిడిలో పై నుండి ఆదేశాలు అనే విధానాన్ని అమలు చేసే క్రమంలో రష్యన్ కార్మికవర్గం, బోల్షివిక్ పార్టీ పెట్టుబడిదారీ ఆలోచనా పద్ధతులకు, రీతులకు బలైపోయాయి. అది వ్యవస్థకే ముప్పు తెచ్చింది. మధ్యంతర దశ విజయవంతంగా ముగియకపోవడంతో అక్కడ పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చి కూర్చుంది. కార్మికవర్గం, దాని నాయకత్వ కమ్యూనిస్టు పార్టీ నిరంతర జాగురుకతతో ఉండకపోతే పరివర్తన దశ విజయవంతం కాపోవచ్చని అక్టోబర్ విప్లవనేత లెనిన్ ముందుగానే హెచ్చరించారు. 1952లోఓ జరిగిన బోల్షివిక్ పార్టీ 19వ మహాసభ కూడా కార్మికవర్గం, కమ్యూనిస్టు పార్టీలలో ఒక అధికార స్వామ్యం నెలకొని ఉందని హెచ్చరించింది ఈ మహాసభ స్టాలిన్ నాయకత్వాన్నే జరిగింది. ఈ సభ అనంతరం కొన్ని నెలలలోనే స్టాలిన్ మరణించాడు. అదలా ఉండగా, 19 మహాసభ తీర్మానం చేసిన 'విమర్శ, కింది నుండి విమర్శ కార్యక్రమం' అమలు జరగలేదు. అందుకు లెనిన్ అనంతరం 1953 వరకు పార్టీకి, ప్రభుత్వానికి నాయకత్వం వహించిన స్టాలిన్ కారణమా, తరువాత నాయకత్వం కారణమా? ఈ విషయంపై ఈనాడు విస్తారంగా చర్చ జరుగుతుంది. ఇటువంటి చర్చలు కార్మికవర్గాన్ని సైద్ధాంతికంగా భవిష్యత్ విప్లవాలకు సంసిద్ధం చేయగలుగుతాయి.

*(ఇంకా ఉంది...)*

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

## ప్రజాస్వామికవాదుల నిర్బంధం-నిరసనలు

దళితులు, ఆదివాసులు, ముస్లిం, మైనారిటీల హక్కుల కోసం పోరాడుతున్న విప్లవ రచయితల సంఘం సభ్యులు వరవరరావుతో పాటు దేశ వ్యాప్తంగా జైల్లల్లో నిర్బంధించిన ప్రజాస్వామిక వాదుల్ని విడుదల చేయాలని కోరుతూ బాగ్‌లింగంపల్లిలోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో విరసం ఆధ్వర్యంలో నవంబర్ 28న బహిరంగ సభ నిర్వహించారు. డిసెంబర్ 7న గుంటూరు జిల్లా బ్రాడిపేటలో, పశ్చిమగోదావరి జిల్లా జంగారెడ్డి గూడెంలో డిసెంబర్ 20న బీమా కోరేగాం కమిటీ ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమాలు చేపట్టారు. వక్తలు సమాజాన్ని ప్రభావితం చేసే వ్యక్తుల్ని చూసి ప్రభుత్వాలు భయపడుతున్నాయి. నమ్మిన విశ్వాసాలకోసం నిజాయితీగా నిలవడాన్ని రాజ్యం నేరంగా పరిగణించడాన్ని బాధ్యతగల పౌరులు, ప్రజాస్వామిక వాదులు ప్రశ్నించాలన్నారు.

## కిన్నెర బాలమ్మ మృతి

అరుదైన కిన్నెర వాయిద్య కళాకారిణి దక్కలి బాలమ్మ (90) కన్నుమూశారు. ఆమె స్వగ్రామం వికారాబాద్ జిల్లా పెద్దేముల్ మండలం మంబాపూర్‌లో డిసెంబర్ 8న మృతిచెందారు. బాలమ్మ 15 ఏళ్ల వయస్సులోనే కిన్నెర వాయిద్యాన్ని నేర్చుకుని జీవితాన్ని సాగించారు. భర్త చనిపోవడంతో ఆమె ఊరురా తిరిగి కిన్నెర వాయిద్యం ద్వారా కుటుంబాన్ని పోషించారు. కిన్నెరను వాయించడంతోపాటు పది వీరగాథలు అలవోకగా పాడుతూ ఆమె అందించే పన్నెండు కిన్నెర మెట్ల సంగీతాన్ని తెలంగాణలోని ప్రజలు ఆదరించారు. చివరకు ఆమె కటిక పేదరికంతో అనారోగ్యానికి గురై మరణించారు.

## గుత్తికోయల గుడిసెలను కూల్చొద్దు

తెలంగాణలోని వరంగల్, భద్రాద్రి, కొత్తగూడెం, ఖమ్మం, మహబూబాబాద్, ఆదిలాబాద్ తదితర జిల్లాల్లోని అటవీ ప్రాంతాల్లో నివసిస్తున్న గుత్తికోయల గుడిసెలను కూల్చివేయరాదని డిసెంబర్ 11న హైకోర్టు రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. వారు జీవించడానికి కావాలసిన కనీస సౌకర్యాలను కల్పించాలని తెలిపింది. అక్కడే నివాసం ఉంటున్న వారిని తాత్కాలిక ప్రాతిపదికన వ్యవసాయం చేసుకునేందుకు అనుమతించాలని, ఈ విషయంలో తమ వైఖరిని తెలియజేయా లని కేంద్రాన్ని ఆదేశించింది. గిరిజనులకు ఏ ఏ చట్టాలు వర్తిస్తాయి, వాటి ప్రకారం రావాల్సిన ప్రయోజనాలు ఏమిటి.. వారికి అందాల్సిన పథకాలు ఏమిటి.. తదితర అంశాలపై సమగ్ర అధ్యయనం చేసి నివేదిక ఇవ్వాలని రాష్ట్ర న్యాయ సేవాధికార సంస్థ సభ్య కార్యదర్శిని ఆదేశించింది.

## అరసం 18వ రాష్ట్ర మహాసభలు

అభ్యుదయ రచయితల సంఘం 18వ రాష్ట్ర మహాసభలు గుంటూరులోని వెంకటేశ్వర విజ్ఞాన మందిరంలో డిసెంబర్ 8, 9 తేదీల్లో జరిగాయి. గత నాలుగున్నరేళ్లుగా దేశంలో సాహితివేత్తలు, రచయితలు, కవులపై దాడులు పెరిగాయని, ప్రముఖ పాత్రికేయురాలు గౌరీ లంకేశ్ ఇదే కాలంలో హత్యకు గురయ్యారని వినీత్ తివారీ ఆందోళన వ్యక్తం చేశారు. బిజెపి ప్రభుత్వం హత్యలు, నిర్బంధాలతో వేధిస్తోందని ఆగ్రహం వ్యక్తం చేశారు. అయినా కూడా ప్రజా ప్రతినిధులు అనుకునే వారిలో ఎటువంటి చలనం లేదన్నారు. అభ్యుదయ రచయితల సంఘం నూతన అధ్యక్షునిగా రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి, ప్రధాన కార్యదర్శిగా వల్లూరి శివప్రసాద్‌లను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

## 32వ హైదరాబాద్ బుక్ ఫెయిర్

హైదరాబాద్ బుక్ ఫెయిర్ సొసైటీ ఆధ్వర్యంలో '32వ హైదరాబాద్ బుక్ ఫెయిర్' తెలంగాణ కళాభారతి (ఎన్‌టిఆర్ స్టేడియం) వేదికలో డిసెంబర్ 15 నుండి 25 వరకు నిర్వహించారు. 50 బుక్ స్టాల్‌లతో ప్రారంభమైన బుక్ ఫెయిర్ ఈ సారి 335కి బుక్ స్టాల్స్‌కి చేరింది. ఈ బుక్‌ఫెయిర్‌కు ముఖ్య అతిథిగా ఉపరాష్ట్రపతి వెంకయ్యానాయుడు హాజరయ్యారు. ఇందులో రెండు వేదికలు ఏర్పాటుచేసి ఒకదాంట్లో 84 పుస్తకావిష్కరణలు, మరో దాంట్లో 8 సాహిత్య సదస్సులతో పాటు కళారూపాలను ప్రదర్శింపచేశారు. 8.5 లక్షల మంది సందర్శకులు హాజరయ్యారు.

## కొనసాగుతున్న ఐటి దాడులు

ఐదు రాష్ట్రాల ఎన్నికలు ముగియగానే ఆదాయపు పన్నుశాఖ మళ్లీ ఐటి దాడులు మొదలుపెట్టింది. టిడిపి నేత మాగుంట శ్రీనివాసులరెడ్డికి చెందిన కార్యాలయాల్లో సోదాలు చేశారు. ఎంఎల్‌సి మాగుంట శ్రీనివాసులరెడ్డి కుటుంబానికి చెందిన పలు సంస్థల కార్యాలయాల్లో ఐటి అధికారులు తనిఖీలు చేపట్టారు. చెన్నైలోని టి. నగర్ బుజుల్లా రోడ్డులోని బాలాజీ గ్రూప్ ఆఫీసు, పూందమల్లిలో ఉన్న ఎండ్రికా ఎంటర్ ప్రైజెస్ డిస్టిలరీ ఫ్యాక్టరీ, మాగుంట కుటుంబానికి చెందిన సన్నిహితుల కార్యాలయాలు, ఇలా పలుచోట్ల ఐటి అధికారులు దాడులు కొనసాగిస్తున్నారు.

## తెలంగాణలో ఎన్నికల ఫలితాలు

డిసెంబర్ 7న జరిగిన తెలంగాణ అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 11న విడుదలయ్యాయి. ఈ ఎన్నికల ఫలితాల్లో తెరాస మెజార్టీ సీట్లను గెలుచుకుంది. క్రితం ఎన్నికల కంటే ఈసారి అధికంగా 88 స్థానాల్లో విజయం సాధించింది. కొత్త రాష్ట్రంలో వరుసగా రెండోసారి అధికారాన్ని చేజిక్కించుకుంది. కాంగ్రెస్ 19 స్థానాల్లో గెలుపొందగా, టిడిపి రెండు స్థానాలకే పరిమితమైంది. డిసెంబర్ 13న రాజ్‌భవన్‌లో రాష్ట్ర ముఖ్యమంత్రిగా కెసిఆర్ ప్రమాణస్వీకారం చేశారు. కెసిఆర్‌తో గవర్నర్ నరసింహన్ ప్రమాణస్వీకారం చేయించారు. కెసిఆర్‌తోపాటు మహమూద్ అలీ హోం మంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు.

## విద్యా ప్రైవేటీకరణను వ్యతిరేకిస్తూ నిరసన

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న విద్యార్థి వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ఉద్యమాలు బలోపేతం చేయాలని ఎఐడిఎస్‌ఓ జాతీయ ప్రధాన కార్యదర్శి అశోక్ మిశ్రా డిసెంబర్ 21న పిలుపునిచ్చారు. విద్యను ప్రైవేటీకరణ, కార్పొరేటీకరణ, కాషాయీకరణ చేయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కుట్రపన్నుతున్నాయని తీవ్రంగా విమర్శించారు. శాస్త్రీయ, లౌకిక ప్రజాతంత్ర విద్యకోసం పోరాడుతూ దేశ వ్యాప్తంగా విద్యార్థిలోకాన్ని ఐక్యం చేయడానికి విద్యారంగ సమస్యల పరిష్కారానికి పోరాడాలని పిలుపునిచ్చారు. విద్యార్థి వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా ఎఐడిఎస్‌ఓ రాష్ట్ర శాఖ ఆధ్వర్యంలో డిసెంబర్ 21న హైదరాబాద్‌లోని బాబు జగ్జీవన్‌రామ్ విగ్రహం నుంచి అమరవీరుల స్థూపం మీదుగా నిజాం కళాశాల వరకు ర్యాలీ నిర్వహించారు. ఈ సందర్భంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దిష్టిబొమ్మలను దగ్ధం చేశారు. వీ

### ఆర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ రాజీనామా

**ఆ**ర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ డిసెంబర్ 10న రాజీనామా చేశారు. వ్యక్తిగత కారణాల రీత్యా తన పదవికి రాజీనామా చేస్తున్నట్లు ఆయన ప్రకటించారు. 2016 సెప్టెంబర్ 5న ఆర్‌బిఐ సారథిగా బాధ్యతలు స్వీకరించిన ఉర్జిత్ పటేల్ పదవీకాలానికి ఎనిమిది నెలల ముందుగానే తప్పుకున్నారు. కేంద్ర ప్రభుత్వంతో ఆర్‌బిఐకి విభేదాలు ఏర్పడ్డ నేపథ్యంలో ఉర్జిత్ ఈ నిర్ణయం తీసుకున్నారు. ఉర్జిత్ రాజీనామా ఆందోళనకరమేనని, అది ఒక నిరసనగా భావించాల్సి ఉంటుందని ఆర్‌బిఐ మాజీ గవర్నర్ రఘురాం రాజన్ వ్యాఖ్యానించారు. కాగా, ఉర్జిత్ రాజీనామా తర్వాత 24 గంటల వ్యవధిలోనే ఐఏఎస్ అధికారి శక్తికాంత దాస్‌ను ఆర్‌బిఐ 25వ గవర్నర్‌గా ప్రభుత్వం నియమించింది.

### జమ్మూ కశ్మీర్‌లో రాష్ట్రపతి పాలన

**జ**మ్మూకశ్మీర్‌లో గవర్నర్ పాలన ముగియడంతో డిసెంబర్ 19 అర్ధరాత్రి నుంచి రాష్ట్రపతి పాలన అమల్లోకి వచ్చింది. దీంతో రాష్ట్రంలోని అన్ని విధాన పరమైన నిర్ణయాల్ని తీసుకునే అధికారం కేంద్రం చేతుల్లోకి వచ్చింది. రాష్ట్రంలో కేంద్రపాలన విధించే ప్రకటనపై రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ సంతకం చేశారు. గవర్నర్ సత్యపాల్ మలిక్ పంపిన నివేదికను, ఇతర సమాచారాన్ని రాష్ట్రపతి పరిగణనలోకి తీసుకున్నారని, రాష్ట్రపతి పాలన అవసరమని సంతృప్తి చెందారని డిసెంబర్ 19న జారీచేసిన గెజిట్ ప్రకటనలో పేర్కొన్నారు. ఎన్నికల్ని ప్రకటించకపోతే రాష్ట్రపతి పాలనను మరో ఆరు నెలలు పొడిగించే అవకాశం ఉందంటున్నారు.

### గోరక్షకుల విధ్వంసం

**ఉ**త్తరప్రదేశ్‌లోని బులంద్‌షహర్‌లో డిసెంబర్ 3న గోవధ జరిగిందన్న అనుమానంతో, అక్రమ కబేళాలు నడుస్తున్నాయన్న నెపంతో హిందూ యువవాహిని, బజరంగ్‌దళ్ కార్యకర్తలు చేపట్టిన నిరసన పోలీసులపై దాడులకు, వాహనాల విధ్వంసానికీ, దహనాలకు, ఒక పోలీసు అధికారి హత్యకు దారితీసింది. గోరక్షకుల రాళ్లదాడిలో గాయపడి వారి చేతికి చిక్కిన ఇన్‌స్పెక్టర్ సుబోధ్‌కుమార్ సింగ్ చివరకు బుల్లెట్ దెబ్బకు మరణించినట్లుగా తేలింది. దాద్రి ఘటనలో సుభోద్ విచారణాధికారిగా పనిచేసినందున ఆయన్ను అక్కడి నుండి బదిలీచేయడం ఆ తరువాత ఈ ఘటన జరగడంపై స్థానికులు పలు అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు.

### కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్ మరణాలు

**జ**మ్మూ కశ్మీర్‌లోని శ్రీనగర్–బందీపుర మార్గంలోని ముజ్‌గుండ్ వద్ద డిసెంబర్ 8న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు కశ్మీరీ మిలిటెంట్లు మృతిచెందగా ఇద్దరు భద్రతా సిబ్బందికి గాయాలయ్యాయి. ముజ్‌గుండ్‌లో మిలిటెంట్లు ఉన్నారన్న సమాచారంతో భద్రతా దళాలు అక్కడికి చేరుకొని ఓ ఇంటిని చుట్టుముట్టగా ఇరు పక్షాల మధ్య కాల్పులు జరిగి ఇద్దరు మిలిటెంట్లు మృతిచెందినట్లు పోలీసు అధికారులు తెలిపారు. ఈ నెల 15న పుల్వామా జిల్లాలోని సిర్నూలో భద్రతా దళాలు, మిలిటెంట్లకు మధ్య జరిగిన కాల్పుల్లో ముగ్గురు మిలిటెంట్లు, ఒక జవాను మృతి చెందారు. మృతి చెందిన మిలిటెంట్లలో సిర్నూకి చెందిన వ్యక్తి ఉన్నాడని తెలియడంతో స్థానికులు పెద్దఎత్తున ఆందోళనకు దిగారు. ఆందోళనకారులను చెదరగొట్టేందుకు పోలీసులు పెల్లెట్లను ప్రయోగించడంతో ఏడుగురు పౌరులు మరణించారు.

### నాలుగు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు

**ఈ** ఏడాది చివరిలో జరిగిన ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 11న విడుదలయ్యాయి. హిందీ బెల్ట్ రాష్ట్రాలైన రాజస్థాన్, మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్‌లలో బిజెపి అధికారం కోల్పోగా కాంగ్రెస్ అధికారంలోకి వచ్చింది. మిజోరంలో కాంగ్రెస్ అధికారం కోల్పోయి ఎంఎన్ఎఫ్ అధికారంలోకి వచ్చింది. మధ్యప్రదేశ్ అసెంబ్లీకి 230 స్థానాలుండగా బిజెపి 109 సీట్లు, కాంగ్రెస్ 114 స్థానాల్లో గెలుపొందాయి. రాజస్థాన్‌లో 200 స్థానాలుండగా బిజెపి 73, కాంగ్రెస్ 100 స్థానాల్లో గెలుపొందాయి. ఛత్తీస్‌గఢ్‌లో 90 స్థానాలకుగాను బిజెపి 15, కాంగ్రెస్ 68 స్థానాల్లో గెలిచాయి. మిజోరంలో 40 స్థానాలకు గాను బిజెపికి 1, కాంగ్రెస్ 5, ఎంఎన్ఎఫ్ 26 స్థానాల్లో గెలుపొందాయి. ఎంఎన్ఎఫ్ అధ్యక్షుడు జోరాంథంగాతో మిజోరం సిఎంగా రాజ్‌భవన్‌లో గవర్నర్ కె. రాజశేఖరన్ డిసెంబర్ 15న ప్రమాణ స్వీకారం చేయించారు. డిసెంబర్ 17న మధ్యప్రదేశ్ సిఎంగా కమల్‌నాథ్‌తో గవర్నర్ ఆనందీబెన్ పటేల్ భోపాల్‌లో ప్రమాణస్వీకారం చేయించారు. రాజస్థాన్ సిఎంగా కాంగ్రెస్ నేత అశోక్ గెహ్లాట్‌తో గవర్నర్ కళ్యాణ్‌సింగ్ జైపూర్‌లో ప్రమాణం చేయించారు. ఛత్తీస్‌గఢ్ సిఎంగా కాంగ్రెస్ నేత భూపేశ్ బాఘెల్‌ను గవర్నర్ ఆనందీబెన్ పటేల్ రాయ్‌పూర్‌లో ప్రమాణస్వీకారం చేయించారు.

### సిక్కుల హత్యకేసులో సజ్జన్‌కుమార్‌కు జీవిత ఖైదు

**సి**క్కుల ఊచకోత కేసులో కాంగ్రెస్ సీనియర్ నేత సజ్జన్ కుమార్‌ను ఢిల్లీ హైకోర్టు దోషిగా తేలుస్తూ డిసెంబర్ 17న జీవిత ఖైదు విధించింది. మాజీ ప్రధాని ఇందిరాగాంధీ హత్యానంతరం 1984లో ఢిల్లీలో సిక్కుల సామూహిక హత్యకేసులో సజ్జన్‌కు యావజ్జీవ శిక్షతోపాటు రు. 5 లక్షల జరిమానా కూడా విధించింది. ఆయన్ను విడుదల చేయాలన్న దిగువ కోర్టు తీర్పుకు న్యాయమూర్తులు ఎస్. మురళీధర్, వినోద్ గోయల్‌ల ధర్మాసనం మార్పులు చేసింది. మరోముగ్గురు నిందితులకు విధించిన యావజ్జీవ శిక్షను సమర్థించింది. ఇంకో ఇద్దరికి పదేళ్ల జైలు శిక్ష విధిస్తూ తీర్పునిచ్చింది.

### సందేహాలను మిగిల్చిన సొహ్రాబుద్దీన్ కేసు తీర్పు

**సొ**హ్రాబుద్దీన్ బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో మొత్తం 22 మంది నిందితులూ నిర్దోషులేనని ప్రత్యేక సిబిఐ కోర్టు డిసెంబర్ 21న తీర్పు చెప్పింది. కారణం ఆధారాల్లేవు, ఒక్క సాక్షి కూడా నిజమేంటో చెప్పలేదు. సొహ్రాబుద్దీన్ షేక్, ఆయన భార్య కౌసర్‌బీ, సహచరుడు తులసీరామ్ ప్రజాపతిల ఎన్‌కౌంటర్ బూటకమని చెప్పలేం. నిందితులే చంపారనడానికి ఆధారాల్లేవన్నారు. చనిపోయిన ముగ్గురి కుటుంబాలకు నా క్షమాపణలు వారికి నా సంతాపం తెలియజేస్తున్నాను. నేనేం చెయ్యలేని నిస్సహాయుణ్ణి, కోర్టుకు ఆధారాలు కావాలి. చెప్పుడు మాటలు విని తీర్పులు చెప్పలేమని జడ్జి ఎస్.జె.శర్మ తన తీర్పులో పేర్కొన్నారు. 2005 డిసెంబర్ 20న సొహ్రాబుద్దీన్, కౌసర్‌బీ, తులసీరాం ప్రజాపతిలను మహారాష్ట్రలోని సాంగ్లికి వెళుతున్న క్రమంలో మార్గమధ్యలో పోలీసులు వారిని దింపి రెండు మూడు రోజుల తేడాతో ముగ్గురిని ఎన్‌కౌంటర్ పేరుతో చంపేశారు.

### దేశవ్యాప్త బ్యాంకు ఉద్యోగుల సమ్మె

**ప్ర**భుత్వరంగ బ్యాంకు అధికారుల దేశవ్యాప్త సమ్మెతో డిసెంబర్ 21న బ్యాంకింగ్ రంగం స్తంభించింది. తమ వేతనాలను తక్షణమే సవరించాలని, అట్లాగే బ్యాంక్ ఆఫ్ బరోడా, విజయా బ్యాంక్, దేనా బ్యాంకుల విలీనాన్ని వ్యతిరేకిస్తున్నారు. బ్యాంకుల నిర్వహణ లాభం, ఆస్తులపై వచ్చే రిటర్న్ ఆధారంగా ఉద్యోగులకు చర వేతనాన్ని అమలుచేసే విధానాన్ని కూడా వ్యతిరేకిస్తూ అఖిల భారత బ్యాంక్ ఆఫీసర్ల సమాఖ్య ఈ సమ్మెకు పిలుపునిచ్చింది. ఈ సమ్మెలో దేశ వ్యాప్తంగా ఉన్న ప్రభుత్వ బ్యాంకులకు చెందిన 3.20 లక్షల మంది అధికారులు పాల్గొనట్లు ప్రకటించారు. ఈ మూడు బ్యాంకుల విలీనాన్ని వ్యతిరేకిస్తూ డిసెంబర్ 26న బ్యాంక్ ఉద్యోగులు మరోసారి పెద్దఎత్తున సమ్మెకు దిగారు. దేశవ్యాప్తంగా సుమారు 10 లక్షలకు పైగా ఉద్యోగులు సమ్మెలో పాల్గొన్నారు. తమ డిమాండ్లు నెరవేర్చకుంటే మరోసారి సమ్మెకు దిగుతామని తొమ్మిది యూనియన్లతో కూడిన యునైటెడ్ ఫోరమ్ ఆఫ్ బ్యాంక్ యూనియన్స్ హెచ్చరించింది. వీ

## మధ్య ఆఫ్రికాలో ఆకలి కేకలు

మధ్య ఆఫ్రికా రిపబ్లిక్ (సిఆర్ఎ)లో నిత్యం కరువు, అంతర్యుద్ధాలతో లక్షలాది ప్రజలు, ముఖ్యంగా చిన్నారులు సరైన తిండి, పోషకాహార లోపం చనిపోతున్నారని యూనిసెఫ్ తెలిపింది. యూనిసెఫ్ తాజాగా విడుదల చేసిన నివేదిక ప్రకారం దాదాపు పదిహేను లక్షల మంది చిన్నారుల్లో ఐదేండ్ల లోపు ఉన్నవారు 43 వేల మంది ఉన్నారు. నవజాత శిశువుల మరణాలు కూడా అధికంగా ఉన్నాయి. దీనికి కరువు, అంతర్యుద్ధం, పేదరికం సమస్యల వల్ల సరైన ఆహారం అందక వేలాది సంఖ్యలో చిన్నారులు మరణిస్తున్నారని ఈ నివేదిక తెలిపింది.

## ఫిలిప్పైన్స్‌లో హక్కుల నేత హత్య

ఫిలిప్పైన్స్‌లో ప్రముఖ న్యాయవాది, హక్కుల సంఘం నేత బెన్ రామోస్ దారుణ హత్యకు గురయ్యారు. నవంబర్ 30న ఇద్దరు సాయుధువు రామోస్‌పై దాడిచేశారు. ఫిలిప్పైన్స్‌లో గత రెండేండ్లలో ముప్పై ఐదు మంది న్యాయవాదులు హత్యకు గురయ్యారు. రామోస్ డ్రగ్స్ మాఫియాదారులకు వ్యతిరేకంగా పలు కేసులు వాదించి వారిని జైలుశిక్ష వేయడంలో ప్రముఖంగా పనిచేశారు. భూవివాదాలలో కూడా ప్రజలకు అండగా నిలిచారు. హక్కుల సంఘం నేతగా ప్రజల్లో ఎంతో ఆదరణ పొందారు.

## జి-20 సదస్సు

అర్జెంటీనా రాజధాని బ్యూనస్ ఎయిర్స్‌లో నవంబర్ 30, డిసెంబర్ 1 తేదీల్లో జి-20 సదస్సు జరిగింది. ఈ సదస్సుకు 19 దేశాలకు చెందిన నేతలు, యూరోపియన్ యూనియన్ ప్రతినిదులు పాల్గొన్నారు. తొలిరోజు సదస్సులో అమెరికా, మెక్సికో, కెనడా దేశాల (యుఎస్ఎంసిఎ) మధ్య త్రైపాక్షిక వాణిజ్య ఒప్పందంపై అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్, కెనడా ప్రధాని ట్రూడో, మెక్సికో అధ్యక్షుడు ఎన్రిక్ పెనా నిటో ఒప్పందంపై సంతకాలు చేశారు. రెండోరోజు రష్యా, చైనా, ఇండియా దేశాలు ఇరు దేశాల మధ్య సత్సంబంధాల కోసం కృషి చేయడానికి సహకరించుకోవడానికి ముందడుగు వేయాలని సంకల్పించారు. జి-20 సదస్సును వ్యతిరేకిస్తూ ఆందోళనకారులు నిరసన వ్యక్తం చేశారు. అక్టోబర్‌లో ఇస్తాంబుల్‌లో సౌదీ దౌత్య కార్యాలయంలో జర్నలిస్టు జమాల్ ఖషోగ్గిని సౌదీ యువరాజు హత్య చేయించాడనీ, అతన్ని తప్పించేందుకు అమెరికా అధ్యక్షుడు ప్రయత్నిస్తున్నాడని, ఖషోగ్గిని హత్యచేసిన వారిని కఠినంగా శిక్షించాలని డిమాండ్ చేశారు.

## ఫ్రాన్స్‌లో కొనసాగుతున్న ఎల్లో వెస్ట్ ఉద్యమం

ఫ్రాన్స్‌లో పెరుగుతున్న పన్నులపై ప్రజల నిరసన కొనసాగుతూనే ఉంది. రాజధాని పారిస్‌లో ప్రజలు ఎల్లో వెస్ట్ ధరించి శాంతియుతంగా నిరసన కార్యక్రమాలు చేపట్టారు. డిసెంబర్ 1న వందలాది నిరసనకారులు సెంట్రల్ పారిస్ అవెన్యూ వద్దకు చేరుకుని అధ్యక్షుడు మెక్రాన్‌కు వ్యతిరేకంగా ప్లకార్డులు ప్రదర్శిస్తూ, నినాదాలు చాశారు. నెల రోజులకు పైగా నిరసన తరువాత ఎట్టకేలకు ఫ్రాన్స్ ప్రభుత్వం దిగివచ్చింది. డిసెంబర్ 4న చమురుపై భారీగా పెరిగిన పన్నుల భారాన్ని తగ్గిస్తూ ప్రధాని ఫిలిప్ ప్రకటన చేశారు. ఆరు నెలల వరకు పన్ను పెంచేది లేదని స్పష్టం చేశారు. ఆందోళనలో పాల్గొన్న వారిలో నాలుగు వందలకుపైగా నిరసనకారులను అరెస్టు చేశారు. చమురు ధరలను నియంత్రించడంలో అధ్యక్షుడు ఎమాన్యుయెల్ విఫలమయ్యారంటూ ఆయన తక్షణమే రాజీనామా చేయాలని నిరసనకారులు డిమాండ్ చేశారు.

## ఒపెక్ నుంచి వైదొలిగిన ఖతార్

ఆర్గనైజేషన్ ఆఫ్ ది పెట్రోలియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్ (ఒపిఇసి-ఒపెక్) నుంచి వైదొగులుతున్నట్లు ఖతార్ డిసెంబర్ 3న నిర్ణయం తీసుకుంది. జనవరి 2019 నుంచి తాము ఒపెక్ నుంచి బయటకు వచ్చేస్తామని గల్ఫ్ విద్యుత్ శాఖ మంత్రి సాద్ షరీదా అల్ కాబీ రాజధాని దోహాలో ప్రకటించారు. 1960లో ఇరాన్, ఇరాక్, కువైట్, సౌదీ అరేబియా, వెనిజులా దేశాలు కలిసి ఒపెక్‌ను ఏర్పాటు చేశాయి. దీని ప్రధాన కార్యాలయం ఆస్ట్రియా రాజధాని వియన్నాలో ఉంది. ఒపెక్‌లో ప్రస్తుతం పదిహేను సభ్యదేశాలు ఉన్నాయి. 1961లో ఖతాల్ ఒపెక్‌లో సభ్యదేశంగా చేరింది. లిక్విఫైడ్ నేచరుల్ గ్యాస్ (ఎల్ఎన్‌జి) సరఫరా చేస్తున్న దేశాల్లో ఖతార్ అగ్రస్థానంలో ఉంది. ఈ సందర్భంగా సహజ వాయు ఉత్పత్తిని 70 మిలియన్ టన్నుల నుంచి 110 మిలియన్ టన్నులకు పెంచే దిశలో ప్రణాళికలు చేస్తున్నామని సాద్ షరీదా తెలిపారు.

## పెరూలో అవినీతి నిర్మూలన ఉద్యమం

పెరూలో ప్రజలు అవినీతిపై పోరుబాట పట్టారు. అవినీతి నిర్మూలనకు అనుకూలంగో ఎంతోమంది మద్దతిస్తారో తెలుసుకనేందుకు ప్రభుత్వం ప్రజాభిప్రాయ సేకరణ చేపట్టింది. డిసెంబర్ 9న జరిగిన ఈ రిఫరెండంలో దేశవ్యాప్తంగా ఐదు వేలకు పైగా పోలింగ్ కేంద్రాలలో లక్షలాది మంది తమ ఓటును వినియోగించారు. పెరూ రాజకీయనేతలు, అధికారులు, న్యాయమూర్తులు కూడా అవినీతికి పాల్పడుతున్న ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. ఇటీవల బయటపడిన ఓడ్‌బ్రెచ్ట్ కుంభకోణం లాటిన్ అమెరికాలోనే అతి పెద్దది. ఈ కుంభకోణంలో ప్రముఖ రాజకీయ నేతల పాత్ర బయటపడింది. ఈ అవినీతి ఆరోపణల కారణంగా పెరూ అధ్యక్షుడు పెడ్రో పాబ్లో తన పదవికి రాజీనామా చేయాల్సి వచ్చింది. మరో నేత అలన్ గార్సియా ఓ కంపెనీ నుంచి ముడుపులు స్వీకరించినట్టు తేలడంతో జైలుశిక్ష అనుభవిస్తున్నాడు.

## బ్రిటన్ ప్రధానిపై అవిశ్వాసం

బ్రిటన్ ప్రధాని థెరిసా మే అవిశ్వాస తీర్మానాన్ని జయించారు. వచ్చే ఏడాది మార్చ్ ఆఖరులో యూరోపియన్ యూనియన్ నుంచి (బ్రెగ్జిట్) వెదొలగనుంది. డిసెంబర్ 12న జరిగిన అవిశ్వాస పరీక్షలో కన్జర్వేటివ్ పార్టీ నేతగా థెరిసా మేకు 200 ఓట్లు వచ్చాయి. ఆమె ప్రత్యర్థులకు 117 ఓట్లు మాత్రమే వచ్చాయి. ప్రజలు ఆమోదించిన బ్రెగ్జిట్‌ను అమలు చేసేందుకు తాను సంపూర్ణంగా కట్టుబడి ఉన్నానని ఈ సందర్భంగా మే అన్నారు.

## శ్రీలంకలో రాజకీయ సంక్షోభానికి తెర

శ్రీలంకలో గత రెండు నెలలుగా నెలకొన్న రాజకీయ సంక్షోభం వీడిపోయింది. ప్రధానమంత్రి పదివికి మహింద రాజపక్సే డిసెంబర్ 15న రాజీనామా చేశారు. అక్టోబర్‌లో అధ్యక్షుడు మైత్రిపాల సిరిసేన ప్రధానిగా ఉన్న రణిల్ విక్రమ్‌సింఘేను ఆకస్మికంగా తొలగించి తన మిత్రుడు రాజపక్సేను ప్రధానిగా నియమించారు. దీంతో దేశంలో రాజకీయ సంక్షోభం నెలకొంది. పార్లమెంట్‌లో రెండుసార్లు బలనిరూపించుకోవాల్సి ఉండగా రాజపక్సే రెండుసార్లు అవిశ్వాస తీర్మానంలో ఓడిపోయారు. ఈ తీర్పుపై సుప్రీంకోర్టులో అప్పీలు చేయగా కోర్టు అధ్యక్షుడి ప్రకటనను తిరస్కరించింది. డిసెంబర్ 16న రణిల్ విక్రమ్‌సింఘే మరోమారు ప్రధానిగా పదవీ బాధ్యతలు చేపట్టారు.

## అమెరికా షట్‌డౌన్

అమెరికా-మెక్సికో సరిహద్దులో గోడ నిర్మాణానికి సంబంధించి నిధులు ఇచ్చేందుకు ఉద్దేశించిన తీర్మానానికి కాంగ్రెస్ ఆమోదం లభించలేదు. దీంతో డిసెంబర్ 22 నుంచి అమెరికా ప్రభుత్వం పాక్షికంగా స్తంభించిపోయింది. అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ డెమోక్రాట్ల వల్లే ప్రభుత్వాన్ని స్తంభించాల్సి వచ్చిందని ఆగ్రహం వ్యక్తం చేశారు. ప్రభుత్వ స్తంభనతో ఆర్థిక ఖజానా మూతపడింది.

## ఇండోనేషియాలో భారీ భూకంపం

ఇండోనేషియాలో డిసెంబర్ 23న భారీ భూకంపం సంభవించింది. దక్షిణ సుమత్రా, పశ్చిమ జావాలోని తీరప్రాంతాలలో అలలు ఎగిసిపడడంతో భారీ ప్రాణ, ఆస్తి నష్టం సంభవించింది. ఈ భూకంపంలో నాలుగు వందల మందికి పైగా ప్రాణాలు కోల్పోయారు. వేలాదిగా గల్లంతయ్యారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(నవంబర్ 1 నుండి నవంబర్ 30, 2018 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (874), ఆంధ్రప్రదేశ్‌లోని 11 జిల్లాలలో (657) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1531)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 2 | - | 21 | 19 | 8 | 5 | 6 | 3 | 2 | 2 | 2 | - | 2 | 26 | 29 | - | - | 1 | 3 | 3 |
| హైదరాబాద్ | - | - | - | 14 | 12 | 7 | 8 | 2 | 3 | 4 | 3 | 11 | 7 | 6 | 25 | 12 | - | - | - | - | 2 |
| కరీంనగర్ | - | 3 | 1 | 8 | 9 | 6 | 7 | 2 | 1 | 2 | 1 | 2 | - | 3 | 18 | 12 | - | - | - | - | 1 |
| ఖమ్మం | - | 2 | - | 8 | 20 | 1 | 4 | - | 1 | 3 | - | - | 2 | 3 | 19 | 8 | 1 | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | - | - | 1 | 2 | 4 | 4 | 4 | 3 | 3 | 3 | 5 | 5 | 6 | 6 | 42 | 1 | - | - | - | - | - |
| మెదక్ | 1 | 19 | 2 | 2 | 1 | 3 | 2 | 2 | 2 | 2 | 3 | 4 | 3 | 29 | 17 | 22 | - | - | - | 3 | 1 |
| నల్గొండ | - | 2 | - | 6 | 4 | 2 | 1 | 2 | - | 2 | 1 | 2 | - | 6 | 23 | 16 | - | - | - | - | 2 |
| నిజామాబాద్ | - | 2 | - | 7 | 6 | 3 | 4 | 1 | 1 | 2 | 1 | 1 | 2 | 3 | 17 | 9 | - | - | - | - | 2 |
| వరంగల్ | 1 | 19 | 1 | 3 | 2 | 1 | 4 | 1 | 2 | 2 | 2 | 4 | 1 | 11 | 12 | 22 | - | - | - | 2 | 1 |
| వికారాబాద్ | - | 1 | - | 3 | 4 | 1 | 2 | - | - | 2 | 2 | 3 | 1 | 3 | 14 | 11 | - | - | - | - | - |
| **తెలంగాణ** | **3** | **50** | **5** | **74** | **81** | **36** | **41** | **19** | **16** | **24** | **20** | **34** | **22** | **72** | **213** | **142** | **1** | **-** | **1** | **8** | **12** |
| అనంతపురం | | | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | |
| చిత్తూరు | - | 1 | - | 5 | 7 | 5 | 9 | - | 1 | 2 | 3 | 4 | 6 | 3 | 24 | 6 | - | - | - | - | - |
| కడప | - | - | 1 | 5 | 4 | - | - | - | - | 4 | 1 | - | - | 5 | 18 | 3 | - | - | - | - | - |
| గుంటూరు | - | - | - | 6 | 4 | 4 | 6 | 2 | 3 | 3 | 1 | 3 | - | 3 | 16 | 14 | - | - | - | - | 1 |
| కృష్ణా | - | - | - | 4 | 6 | 7 | 6 | 3 | 2 | 3 | 3 | 4 | 2 | 4 | 17 | 13 | - | - | - | - | 3 |
| కర్నూలు | - | 2 | - | 2 | 3 | 2 | 4 | 2 | 1 | 1 | 2 | 3 | 2 | 4 | 14 | 11 | - | - | - | - | - |
| తూర్పు గోదావరి | - | 1 | - | 1 | 4 | 7 | 6 | 3 | - | 4 | 4 | 2 | 3 | 2 | 24 | 21 | 1 | - | - | 4 | - |
| ప్రకాశం | - | - | - | 3 | 4 | 1 | 2 | 1 | 1 | 2 | 3 | 2 | - | 3 | 14 | 12 | - | - | - | - | 2 |
| శ్రీకాకుళం | - | - | - | 7 | 5 | 2 | 14 | 3 | - | 1 | - | 1 | 4 | 6 | 19 | 11 | - | - | - | - | - |
| పశ్చిమ గోదావరి | - | - | - | 2 | 4 | 3 | 4 | 2 | 1 | 2 | 1 | 1 | - | 3 | 12 | 9 | - | - | - | - | 3 |
| నెల్లూరు | - | - | - | 2 | 3 | 1 | 2 | 1 | 2 | 2 | 1 | 1 | - | 3 | 17 | 9 | - | - | - | - | 1 |
| విజయనగరం | - | - | - | 3 | 2 | 2 | 3 | 2 | 1 | 1 | 1 | 2 | - | 2 | 12 | 8 | - | - | - | - | 3 |
| విశాఖపట్నం | | | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **4** | **1** | **40** | **46** | **34** | **56** | **19** | **12** | **25** | **20** | **23** | **17** | **38** | **187** | **117** | **1** | **-** | **-** | **4** | **13** |